శ్రీరామ శ్శరణం మమ.

# ఆశ్చర్య రామాయణము

## యుద్ధకాండము

(ఆంధ్ర తాత్పర్య సహితము)

ఇయ్యది

శ్రీరామ కథా విశేషములఁ దెలిసికొనఁగోరువారల

కత్యంతోపయుక్త మగునటుల


బెజవాడ పుర నివాసులును. బెజవాడ హిందూ హైస్కూల్ రిటైర్డు

సంస్కృత పండితులును, రామాయణ కేసరీత్యాది

బిరుదాంకితులు నగు

**బ్రహ్మశ్రీ అక్కావఝ్ఝుల వేంకటకృష్ణశాస్త్రిచే**


రచియింపఁబడి పండితులచేఁ బరిష్కరింపఁబడెను.


పబ్లిషర్సు:

**వెంకటరామా అండ్ కో వారు**

ది ౨౬-౨-౧౯౫౦




వెల రు ౫-౦-౦

# కృతిపోషక ప్రశంస

మ. రా. కొల్లు పాపయ్యచౌదరిగారు
భూస్వాములు, శ్రీమంతులు, కృతిపోషకులు.

వీరి నివాసము కృష్ణాజిల్లా మునగాల పరగణా యిలాకా గోపాలపురము (వీరి వంశ క్రమము) వీరి తాతగారు కొల్లు పాపయ్యగారు సుప్రసిద్ధులును గొప్ప భూస్వాములునై యుండిరి. వారి పుత్రరత్నమయిన నరసయ్యగారును వీరి ధర్మపత్ని యయిన అచ్చమాంబగారును ప్రకృత కృతిపోషకులగు పాపయ్యగారికితల్లి దండ్రులై యుండిరి అట్టిసద్వంశమునరత్నముగ జన్మించిన యీ కృతిపోషకులగు పాపయ్యగారు గుంటూరు జిల్లా సత్తెనపల్లె తాలూకా రెంట్లపాళ్ళ గ్రామనివాసియగు బెల్లం సుబ్బయ్యగారికిని వారి సతీమణియగు లచ్చమ్మగారికిని బుత్రికారత్నమయిన వెంకమాంబను పాణిగ్రహణముచేసి కొనిరి. తదాది (అనగా, వెంకమాంబ గృహప్రవేశముచేసినది మొదలు వీరియైశ్వర్యము శతగుణాధికముగ నుండుటయేకాక వీరికీర్తికిఁగూడ వన్నెకలిగెననుటలోఁగూడ సందియములేదు.

"ధర్మోరక్షతిరక్షితః" (అనగా ధర్మమును మనము కాపాడినచో నది మనలను గాపాడును) అనుధర్మము నెరిగిన వారలగుటచే పై దంపతులు సకలదానధర్మములను సమస్త తీర్థ

యాత్రలను జేసికొనుటయే కాక స్వగ్రామమగు వేణుగోపాల పురమునందు గొప్ప దేవాలయమును గట్టించి కోదండ రామ స్వామిని బ్రతిష్ఠచేసి స్వామివారి నిత్యనైవేద్యకైంకర్యోత్స వాదుల నిమిత్తము నూరుయకరముల మెరకపల్లపు భూములను సమర్పించిన పుణ్యాత్ములుగూడనై యుండిరి. మఱియు, బ్రాహ్మ ణుల కనేకులకు వివాహోపనయనాదులను జేయించిరి. స్వగ్రామ ములో సత్రమును గట్టించిరి వానపాముల హైస్కూల్ లోఁ గొన్ని గదులను గట్టించిరి, జగ్గయ్యపేట హాస్పటల్ లో గొంత భాగమును గట్టించిరి. ఇట్టి వీరి దానధర్మములు స్వదేశములోనే కాక విదేశములోగూడ గలవనుటకు హిమాలయ సమీపము నందలి హృషీకేశములో గురుకులాశ్రమమునందు వీరు కట్టిం చిన కట్టడములే నిదర్శనమయి యుండెను. ఇంతయేల? వీరి ధర్మములేని ధర్మసంస్థయే లేదని చెప్పినను నతిశయోక్తి కానే రదు. కాని యీ దంపతులకు సంతానభాగ్యము లేనందున నొక బాలుని దత్తతచేసికొని పెంచి పెద్దచేసి వివాహాది శుభకార్యముల నన్నిటిని నిర్వర్తించిరి. ఆ దత్తత కుమారుడయిన వెంకటరామ నర్సయ్యగారు పెద్దవారయి పుత్రపుత్రికా సంతానవంతులయి వ్యవహారములు నన్నింటిని స్వయముగ నిర్వహించుకొను చుండియుఁ బితృవాక్యమును బరిపాలించుచు వారు చేయు ధర్మ కార్యములకు వీరుకూడ బ్రోత్సాహకులయి యుండుట మహా భాగ్యమని చెప్పవలయును. ఇట్టి సిరిసంపదలలో దులదూగు

చుండిన పాపయ్య చౌదరిగారు సప్త సంతానములలో దేవాల యము, వనము, తటాకము, ధన నిక్షేపము మొదలగు వాటిని లోగడనే చేసి యుండిరి. ఇట్టి స్థితిలో వారి ముఖ్యబంధుగులగు బొజ్జా వెంకటసుబ్బయ్యగారు కృతిసంతానమును గూడ బొంది సప్తసంతాన పూర్తిచేసికొనుమనిపాపయ్యగారిని ప్రోత్సహింపగా నందున కామోదమును దెల్పుచు, పాపయ్యగారు శ్రీ రామ చరిత్రాత్మకమయిన యీ మహా కావ్యమును నాచే రచి యింపం జేసి ముద్రింపించి తాను కృతిపోషకులుగ నుండి తన యిష్టదైవమగు కోదండరామస్వామివారికి కృతిసమర్పణము చేయించి గ్రంథకర్తకు కృతిసన్మానమొనరించి శ్రీ రామచంద్ర కృపాకటాక్ష పాత్రులయిరసి చెప్పుట కవకాశము కలిగినందున మహాసంతోష మయ్యెను. ఇట్టి కృతిపోషకులగు పాపయ్యచౌదరి గారికిని, వారి దారపుత్రపౌత్రాదులకును, వారికుటుంబమునకును పాపయ్యగారికిఁ బ్రోత్సాహకులుగా నుండి యీ మహా కార్య మును నెరవేర్చిన బొజ్జా వెంకటసుబ్బయ్యచౌదరిగారికిని వీరి కుటుంబమునకును శ్రీరామచంద్రమూర్తి సకలాయురారోగ్యైశ్వ ర్యాభివృద్ధుల నిశోధికముగ నిచ్చి సర్వదా రక్షించుగాతయని శ్రీరామచంద్రుని బ్రార్థించుచు విరమించుచుంటిని.

# ఆశీస్సు

తే. గీ. ధర్మమెరిగిన మనసు యథార్థమైన
వాక్కు; మంచి తనమ్ము స్వభావమైన
సాంప్రదాయార్థి కొల్లువంశాబ్ధి చంద్ర
ముండు పాపయ సుగుణాలప్రోవు తాను

తెలుగుం జాతికిఁ బూర్వపుణ్యములు పండెన్ కావ్యకేదారముల్
ఫలియించెన్ గుడిగోపురాల్ పసిడిశోభల్ వట్టె నాంధ్రోర్వియం
చుల దాటెన్ నిజకీర్తి చంద్రికలు సుశ్లోకుండు తానర్థి కో
టుల గాథార్తి నడంచి పాపయ ధనాఢ్యుండిట్లుదారుండు కాన్.

కం. కృతిపోషకులకు, తత్సం
తతికిని కోదండరాము దయచే నగుగా
వుత యాయుర్వృద్ధియు శా
శ్వత సంపద సకలసౌఖ్య సంతానంబుల్

ఇట్లు గ్రంథరచయిత,
**లక్కావఝుల వేంకట కృష్ణశాస్త్రి**

*

# విజ్ఞప్తిః

భో! భో! మహాశయాః ఇతఃపూర్వం సుందర కాండాంతం సంపుట సప్తకం ముద్రాప్య ప్రకాశితా మహా మన్నైషీ మితి భవద్భి ర్విదితపూర్వ మేవ. అధునా శ్రీరామ కృత లంకా నిర్గమనకథారంభకపట్టాభిషేకకథాపర్యంతక మష్టమ సంపుటాత్మక మిమం యుద్ధకాండ మపి ముద్రాప్య భక్తజన సమక్షే సమర్ప్య చాహం కృతార్థోఽభూవ మితి వక్తు మవకాశస్య సంభవేన మహా నానంద స్సమజని. అంతరేఽంతరేత్వనివార్య కారణవశా త్పత్రికా దౌర్లభ్యా దనారోగ్యవశాచ్చ కాలవిలంబో బభూవ. అస్మి న్సంపుటేపి ప్రయోజనీయా ననేకా న్కథావిశేషా న్సంగ్రథ్యాఽంధ్ర తాత్పర్యం చ విలిఖ్య ద్విత్రా న్పరకీయా న్శ్లోకా న్విహాయ సర్వానపి స్వయం కృతా న్శ్లోకా నుపనిబధ్య సులభయా శైల్యా మయా రచితోఽయం గ్రంథ స్సర్వేషా మాదరణీయో భవే దిత్యహ మభిప్రైమి. అస్మి న్సంపుటే ముద్రణప్రమాదా న్మత్ప్రమాదాద్వా పరిదృశ్యమానా న్దోషా న్విధాయ శుద్ధా న్సంపఠ్య చేమం సదాశయ ప్రదానేన మదీయం శ్రమం సఫలం కుర్వంతు దోషజ్ఞాః ఇత్యహ మభ్యర్థయే. కించైతత్కృతి పోషకానాం శ్రీరామచంద్ర ప్రసాదేన సర్వదా సకలాని శ్రేయాంసి సంభవం త్వితి సప్రశ్రయం పట్టాభిరామం సంప్రార్థ్య మయా విరమ్యతే.

ఇత్థం గ్రంథరచయితా.

లక్కావఝ్ఝుల వేంకట కృష్ణశాస్త్రీ.

# విజ్ఞప్తి

ఓ మహాశయులారా! నే నింతకుఁబూర్వము సుందర కాండాంతము 7 సంపుటములను ముద్రింపించి ప్రకటింపజేసిన విషయము మీకు విదితమై యుండెను. ఇపుడు శ్రీరామచంద్రమూర్తి వానర సైన్యముతో లంకకు బయన మగుట మొదలు పట్టాభిషేకాంత కథాపర్యంతముగల యుద్ధకాండాత్మక మగు నెనిమిదవ సంపుటమును గూడ ముద్రింపించి భక్తజన సముఖమున సమర్పించి ధన్యుడనైతినని చెప్పుకొనుట కవకాశము సంభవించుటచే గొప్ప సంతసముగా నుండెను. మధ్య మధ్యను, అనివార్యమయిన కారణముల వలనను, కాగితము దుర్లభమగుట వలనను, శరీరములో ననారోగ్యముగా నుండుట వలనను, ఈ గ్రంథమును ముద్రింపించుటలో నాలస్యమయినది. ఈ సంపుటములోఁ గూడఁ బ్రయోజనకరములయిన యనేక నూతన కథావిశేషములను సమకూర్చి రెండు మూడు శ్లోకములు తప్ప మిగిలిన శ్లోకముల నన్నిటిని స్వయముగ రచించినవానినే చేర్చి యాంధ్ర తాత్పర్యమును గూడ వ్రాసి సులభశైలిచే నాచే రచింపబడిన, ఈ గ్రంథము సహృదయుల కందఱకు నాదరణీయముగా నుండునని యభిప్రాయపడు చుంటిని. ఈ సంపుటమున ముద్రణ ప్రమాదముల వలనగాని, నా ప్రమాదము వలన గాని తప్పు లున్నయెడల వానిని సవరించి యీ గ్రంథమును సాంగముగ జదివి సహృదయు లగు వారలు సదభిప్రాయమునిచ్చి నా శ్రమను సఫలము చేయుదురు గాక యని ప్రార్థింపుచుంటిని. ఇదియునుం గాక యీ కృతిపోషకులగు వారలకు శ్రీరామచంద్రమూర్తి సకల శ్రేయస్సుల నిచ్చు గాక యని పట్టాభిరామునిఁ బ్రార్థించుచు విరమించుచుంటిని.

ఇట్లు గ్రంథ రచయిత

**లక్కావఝ్ఝుల వేంకట కృష్ణశాస్త్రి**



# పండితాభిప్రాయము

మహామహోపాధ్యాయ; కళాప్రపూర్ణ, కవిసార్వభౌమ, ఆంధ్రవ్యాసేత్యాది
బిరుదాంచితులును, ఆంధ్రభారతేత్యాది శతాధిక గ్రంథకర్తలును నగు

బ్రహ్మశ్రీ కవిరాజ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి యభిప్రాయము – లోగడ నేనీ యాశ్చర్య రామాయణము నందలి సుందర కాండముం జదివి దానిపై నా యభిప్రాయము నొసంగితిని. ఇప్పుడు యుద్ధకాండము చాలభాగము విని యుంటిని. శ్రీ వేంకటకృష్ణశాస్త్రిగారి కవిత్వము నాతికఠిన మృదు మధుర శైలినుండి సర్వజనానందకరంబగు నని చెప్పుట సర్వజన సమ్మతము. ఇక్కాలమున శాస్త్రిగారింబోలి సంస్కృత కవిత్వము రచించు వారరిదియని ముమ్మాటికిం జెప్పనొప్పు. ఆశ్చర్యరామాయణమం దనేకాశ్చర్యము లుండి పాఠకులమనంబు లాకర్షించు ననుట సత్యదూరము కాదని విన్నవించుచున్నాను.

రాజమహేంద్రవరము,
28—9—44.

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి

## పండితాశయః

లక్కావఝ్ఝుల మంజువంశతిలకై ర్విశ్వంభరాదైవతైః
శ్రీమద్వేంకట కృష్ణశాస్త్రి విబుధై శ్శ్రీరామ భక్తాగ్రగైః
నానారామ కథాసుధాబ్ధిమథనా త్పీయూష మత్యూర్జితం
ప్రాదుర్భూతమహామహోజ్జ్వల మభూ దాశ్చర్యరామాయణం

ఆశ్చర్య భూతస్వకథాప్రసంగా
దాశ్చర్య రామప్రభు తత్త్వబోధాత్
ఆశ్చర్య కృద్భావ పదార్థబంధా
దాశ్చర్య రామాయణకం బభూవ. ౧

శ్రీరామచంద్ర పదపంకరుహైకభక్తి
ర్విద్వత్ప్రపూజ్యకవితావనితానురక్తిః
ధర్మైకనిష్ఠితమతి ర్ధవళా చ కీర్తి
స్సర్వం కవేస్తు రమణీయతరం చరిత్రమ్. 3

గద్యపద్య రచనాసు విదగ్ధో రామకామగవి రాగవిముగ్ధః
రాజితాఖిలకలో ద్విజరాజః రాజతేఽయ మధికంకవిరాజః. ౪

సానందం విరచయ్య పుస్తకమిదం సర్వార్థచింతామణిం
విద్వా న్వేంకట కృష్ణశాస్త్రి కవిరా డ్విద్యోతతాం సర్వశః
ఆశ్చర్యాత్మ సమర్పణేన పరతా మాశ్చర్యరామాయణ
గ్రంథోయం భువిసర్వదా విజయతాంకల్యాణహేతుస్సతామ్. ౫

మూలుపూరు సుబ్రహ్మణ్య శాస్త్రి
అనంతవరం
హాల్ ముకాం గుడివాడ.



## పండితాభిప్రాయము

మ. అనవద్య ప్రతిభా కవిత్వచణ! మీ యాశ్చర్యరామాయణం
బును ప్రత్యక్షర మింపుసొంపెసఁగ, నామూలాగ్రమున్ జూచి, సం
జనితానందము చెందినారము; మహాశ్చర్యంబుగా రాముపా
వనచారిత్ర మనేక చందములచే వర్ణిల్లునా సత్యమా. ౧

తే. గీ. లలితమైన మువ్వంపు గులాబి పూవు
భాతి మృదు పద భావ సంపదలచేత
సహజ సుందరాలంకార సౌకుమారి
తరుణ మొదవిన మీ కవితాకుమారి.

ఉ. కావున, పండితప్రకర కౌతుకదాయనియై యశేష భా
షా విషయప్రచారముల సల్పుచు, సర్వగృహాంగణంబులన్
భూవలయంబునం దెచట బొల్చు నపూర్వ యశోవిలాసియై
దీవెనపూపు టారతులఁ దీర్చితి మిట్లుసగౌరవంబుగన్. 3

ఇట్లు కవిజన వినతులు,
కోట సుబ్రహ్మణ్య సోదరకవులు,
అష్టావధానులు, కనిగిరి.

---

# పండితాభిప్రాయము

శ్రీమ త్పరదేవతాయై నమః

శ్రీమద్వేంకట కృష్ణశాస్త్రి రచితం చిత్రాతి చిత్రాంచితం
మార్ద్వీక స్థిరపాక రమ్యమధురం ప్రాంచత్కథా బంధురం
నానాగ్రంథ విశేషభావ కలితం జ్ఞానప్రదం కామ్యదం
సాంధ్రం సాంస్కృతికంసదావిజయతా దాశ్చర్యరామాయణం

విద్వాన్
భమిడిపాటి అయ్యప్పశాస్త్రి, శతావధాని
రిటైర్డు సీనియర్ పండిట్, బోర్డు హైస్కూలు,
(కృష్ణా)

# విషయానుక్రమణిక

| సర్గసంఖ్య | విషయము | పుటసంఖ్య |
|---|---|---|

స మా ప్తి

శ్రీరస్తు, శుభమస్తు, అవిఘ్నమస్తు.

శ్రీ రా మ శ్శ ర ణం మ మ

# ఆశ్చర్య రామాయణే

## యుద్ధకాండ ప్రారంభః

---

శ్రీభద్రాచల రామచంద్ర మఖిలాభీష్టార్థసంధాయకం
సీతాలక్ష్మణసంయుతం హనుమతా త్వానమ్య సంసేవితం
పాశ్చార్యాదిపరంపరా మపి విలోక్యానేకకోశా న్నహం
కుర్వే సంప్రతి యుద్ధకాండ మతులం త్వాశ్చర్య రామాయణే ౧

*జానక్యా ప్రహితం పురా పవనజే నాత్మార్థ మత్యుత్తమం
చూడారత్న మథో నిజే కరతలే నిక్షిప్య రామప్రభౌ
పశ్యత్యేవ సముత్పపాత గగనం తద్దివ్యరత్నం కరా
ద్దివ్యం రూప మథాశ్రితా నిజపదం *ప్రాపాఽంగనా రూపిణీ. ౨

* అంగనారూపిణీతి:- చూడామణి సంబంధినీ పౌరాణికీ కథేయ మత్రానుసంధేయా. పురారత్నమాలా నామ కాచన వైకుంఠే విష్టరశ్రవసో దాసీ స్థితా. స్వనియుక్త కార్యాకరణేన తస్యా మతిక్రుద్ధో భగవా నేకదా త్వం శిలారూపిణీ భవే త్యశపత్. సాచ తతః శ్రీహరిం శాపావధిం ప్రార్థయతిస్మ. సచ తామేవ మనుజగాశ్రిహ. శ్రీరామావతార కాలే పునస్త్వం మమ ప్రేమపాత్రీభూతా భవిష్యసీతి. సాచ తతో మనుష్యలోకే భూగర్భే మణిరూపేణ పపాత. సాచ క్రిమా ద్గంగాగర్భతలం

శ్రీరామ! శుభమస్తు.
శ్రీరామ శ్శరణం మమ

# ఆశ్చర్య రామాయణమున
# యుద్ధకాండ ప్రారంభము

౧ సీతాలక్ష్మణులతో గూడ హనుమంతునిచే సేవింపబడుచు భక్తులం గోరిన కోర్కులనొసంగు శ్రీరామచంద్రమూర్తిని నమస్కరించి పిమ్మట శ్రీ మద్రామాయణ గురుపరంపరను (వాల్మీకి, వసిష్ఠ, విశ్వామిత్రాది రచయితలను) నమస్కరించి యనేక రామాయణము లను బరిశీలించి నేనిప్పు డీయాశ్చర్య రామాయణమున యుద్ధకాండ మును నిరుపమానముగా రచించుచున్నాను.

౨ * ఇంతకుముందు సీతాదేవి హనుమంతునిచే తనకంపిన సాటిలేని శిరో రత్నమును శ్రీ రామచంద్రప్రభువు చేతిలోనుంచుకొని చూచు చుండగనే యారత్న మాకసమున కెగిరి దివ్యరూపముగల స్త్రీ రూపమునొంది తనస్థానమును జేరెను.

---

* ఈ చూడామణి వృత్తాంతము బృహన్నారదీయ పురాణమున నిట్లున్నది. పూర్వము రత్నమాల యను దాసి వైకుంఠమున విష్ణు మూర్తి వారికి దాస్యము చేయుచుండెను. ఆమె యొకప్పుడు తన కాజ్ఞాపించిన పనిచేయకునికి కోపించి శిలవు కమ్మని భగవంతుడు శపింపగా, శాపాంతము నామె ప్రార్థించెను. అప్పుడు విష్ణుమూర్తి కనికరించి దాని కిట్లానతిచ్చెను. నేను శ్రీరాముడనై యవతరించి నప్పుడు తిరిగి నాకుఁ బ్రేమాస్పదురాలవు కాగలవని చెప్పెను. పిమ్మట నా దాసి మనుష్యలోకమున భూగర్భమున మణిరూపిణియై పడి క్రమముగా గంగాజలమధ్యమును బ్రవేశించి చాల కాల ముండెను.

పశ్చాన్మారుతనంద నోంబునిధి మప్యుత్తీర్య గోష్పాదవ
ద్విల్పష్ట్వా భూమిసుతా మస్కవనికాం భజ్క్వా చ లంకాపురీం
దగ్ధ్వా స్వాంతిక మాగతో వనిసుతా క్షేమం త్వవాదీచ్చయ
*స్తోతుం తం మనసాన్వితో రవిసుతం ప్రత్యాహ రామ స్తతః. 3

ప్రవిశ్య చిరం స్థితా. అథ కదాచన మత్స్యజీవీ స్వీయజాలం గంగాంభసి ప్రసారయతిస్మ. తత్రదత్నంచతస్మిన్విలగ్న మభూత్. తత స్సోప్యనర్ఘ మిదమితి విజ్ఞాయ రాజ్ఞేజనకాయ పారితోషిక తయా దదౌ. అథ తేన తస్మి న్రత్నపరీక్షకాణాం సందర్శితే తేచ తస్యామూల్యతా మూచుః, తతో రాజా మత్స్యజీవినే తత్సదృశం పారితోషికం వితీర్య తత్స్వకన్యాశిరసి శిరోరత్న భూతం కారయామాస. తదేవాఽద్య భూమిజా రామచ ద్రాయ ప్రత్యయార్థం హనుమతా ప్రేషయామాస. రామచంద్రే ప్యధునా తన్నిజకరే విన్యస్య ప్రేమ్ణా సతి పరిశీలయతి తద్ది వ్యాంగనారూపేణ పరిణతం, సాచ తత స్స్వామికటాక్షపాత్ర భూతా రామనామకృతవతీ నిజపద మగా దితి. ౨

*స్తోతుం త మితి "ప్రత్యక్షే గురవస్స్తుత్యాః పరోక్షే మిత్రబాంధవాః, కర్మాంతే దాసభృత్యాశ్చ, న కదాచన పుత్రకాః" ఇతి వచనా ద్ధనుమత స్సకాశా త్సీతాప్రవృత్తిం నిశమ్యకృతకార్యే భృత్యేస్వామిన ఉచితాః వృత్తిం లోకేభ్య ఉపదేష్టు మేవ పౌనఃపున్యేన హనుమంత మస్తౌషీ ద్రామ ఇతి వేద్యమ్. ౩

3 * ఏ హనుమంతుడు గోష్పాదమునువలె సముద్రమును దాటి సీతాదేవినిఁ జూచి యశోకవనమును భంగపఱిచి లంకను దహించి తన యొద్ద కేతెంచి సీతాదేవియొక్క కుశలవార్తను దెల్పెనో, యా భృత్యాగ్రణి యగు నాంజనేయుని నుతింపఁదలచి శ్రీరామచంద్రమూర్తి పిదప సుగ్రీవునితో నిట్లు పల్కెను.

---

తరువాత నొకప్పుడు చేపలఁబట్టుటకై మత్స్యజీవి (పల్లెవాడు) వలను వేయగా నామణి వలలో పడెను. పిమ్మట నతడు దానినిఁజూచి విలువకల మణి యని తెలిసికొని జనకమహారాజున కా మణిని బహుమానముగా నిచ్చెను. పిమ్మట జనకుడు రత్నపరీక్షకులకుఁ జూపింప నీరత్న మమూల్యమని తెల్ప, దానికిఁ దగు బహుమాన మామత్స్యజీవి కొసంగి పంపి, యారత్నమును తన కన్యారత్నమగు సీతాదేవికి శిరోరత్నముగఁ జేసెను. ఇప్పుడు దానినే సీతాదేవి హనుమంతునిచే నమ్మకము నిమిత్తమై శ్రీరామచంద్రమూర్తివారి కంపెను. దాని నిప్పుడు ప్రేమచే చేతిలో నుంచికొని పరిశీలించు నుండగా నది దివ్యాంగనారూపమునుఁదాల్చి శ్రీరామచంద్రమూర్తివారి కటాక్షమునకుఁ బాత్రమై శ్రీరామనామమునుఁ జేసికొనుచు తన స్థానమున కేగెను,

* శ్రీరాముడు హనుమంతుని నుతింపవచ్చునా ? యని సందేహముండవచ్చు కాని నుతింపవచ్చు నని యీక్రింది కారికవలన గన్పడును. ఎట్లన, "ప్రత్యక్షమున గురువులను, పరోక్షమున మిత్రులను, బంధువులను, తాను చెప్పినపని చేసిన పిమ్మట దాసులను భృత్యులను నుతింపవచ్చును. కాని పుత్రుల నెప్పుడు నుతింపఁగూడ"దని యభియుక్త వచనము, కనుక శ్రీరామచంద్రమూర్తి కార్యాంతమున హనుమంతుని నుతించుట సమంజసమే యని తెలియదగును.

సుగ్రీవాద్య కృతం సమీరణసుతే నానేన కార్యంతు యత్
*న్నో శక్యం మనసాఽపి కర్తు మపరా వన్యేన నోద్వాపరః
లంకాం రావణపాలితాం తు నగరీం కోను ప్రవిష్టః పున
ర్జీవన్ కోను వినిష్క్రమేద్వద సమో నాస్త్యస్య లోకత్రయే. ౪
*నూనం కార్యకృతా సమీకరణకృతే నాలం భవాం స్తోషితః
కించానేన సలక్ష్మణోఽహమపి * మద్వంశోఽపి సంరక్షితః

*నోశక్యం మనసేతి,తస్యాయమాశయః-ప్రథమంసాగర ఏవ నహి తర్తుం శక్యః, తీర్త్వాఽపి లంకా న ప్రవేష్టుం, ప్రవిశ్యాపి న ధర్షయితుం, ధర్షయిత్వాపి న తతో నిర్గంతు మితి భావః. కించ లోకే స్వామినియుక్తకార్యకరణ మేవ భృత్యస్య దుర్లభం. ప్రకృతే నహి కేవలం స్వామియుక్తకార్యకరణేన భృత్యకార్యం నిర్వ్యూఢ మనేన. కిం త్వనియుక్తప్రకృతకార్యా నుకూలకార్యాంతరకరణేనాపీతరదుష్కరం కార్యంహనుమతా కృతమితి తథోక్త మితి వేద్యమ్. అనేన హనుమతస్సూత్తమత్వ ముక్తం భవతి. యస్తుస్వామినియుక్త మేవ నకరోతి సోఽధమ ఇతి. స్వామినియుక్త కార్యమాత్రానుష్ఠాతా మధ్యమ ఇతి. స్వామ్యనియుక్త ప్రకృత కార్యానుకూల కార్యాంతరానుష్ఠాతా తూత్తమ ఇతి శ్రవణా దితి. ౪

*మద్వంశోఽపిసంరక్షిత ఇతి-అస్యాయమాశయః-యది. హనుమతా సీతా న దృశ్యేత, తదాఽహం తావ దాత్మానం జహ్యాం, తతో మద్వియోగ మసహమానా లక్ష్మణాదయోఽపి తథా కుర్యుః, తతో నైవ దేవీదర్శనే నానేనాత్మహననరూపా దధర్మా త్సర్వేఽపి వయం సంరక్షితా ఇతి భావః ॥

౪౫ ♦ ఓ సుగ్రీవా! యిప్పుడీ యాంజనేయుడు చేసిన కార్యమును పృథివిలో మఱొక్కడు మనస్సుచే గూడ చేయజాలడు కదా! ఇందుకు సందేహము లేదు. ఏమన, రావణుడు పాలించు లంకాపురము నెవ్వడు సాహసించి ప్రవేశించగలడు? ప్రవేశించుగాక, ఎవ్వడు బ్రదికి బయటికి తిరిగి రాగలడు? చెప్పుము. ముల్లోకములలో నితనికి సాటియగువాడు లేడు.

౯ ♦ ఓ సుగ్రీవుడా! నీవు చెప్పినపని నెఱవేర్చి హనుమంతుడు నిన్ను సంతోషపెట్టుటయే కాక నన్ను, లక్ష్మణుని, నా వంశమును సంర

---

♦ మఱొక్కనికి మనస్సుచేగూడ చేయ సాధ్యము కాదనుచోట భావమేమనగా—మొదట సముద్రమే దాటనలవికానిది. సముద్రమును దాటినను లంక ప్రవేశించుటకు సాధ్యమా? ప్రవేశించినను గెలువ సాధ్యమా? గెలిచినను నచ్చటినుండి బ్రతికి బయటపడ సాధ్యమా? అని భావము. మఱియు లోకములో భృత్యుడు ప్రభువు చెప్పిన పనినే చేయును. ప్రస్తుతమున హనుమంతుడు ప్రభువు చెప్పిన పని మాత్రము చేసి యూరుకొనలేదు. చెప్పనదైనను ప్రస్తుతోపయుక్తము నితరులకు జేయ నశక్యము నగు కార్యాంతరమును జేసెను. కాన నిత డుత్తము డన దగును. ప్రభువు చెప్పినపని కూడ చేయనివా డధముడు. చెప్పిన పని మాత్రము చేయువాడు మధ్యముడు. చెప్పిన పని జేసి తదనుకూలమగు మఱొక్క పనికూడ సాధించుకొనివచ్చిన భృత్యు డుత్తముడుకదా? అని భావము.

♦ నా వంశమును గూడ రక్షించె ననుట కిది యభిప్రాయము— హనుమంతుడు సీతను గాంచనిచో నేను ప్రాణములను విడువవలసి వచ్చెడిది. నన్ను నెడబాసి యుండలేక లక్ష్మణాదులును నట్లే ప్రాణములనుబాసిన వారయ్యెడివారు కదా. హనుమంతుడు సీతను గాంచి తత్కుశలవార్తను మాకు చెప్పి యోదార్చి మే మందరము నాత్మహత్యను గావించుకొనకుండ నుండునట్లు చేసెనని భావము.

కిం త్వేవం ప్రియవక్తురస్య సదృశం నోయత్కరో మ్యద్య త
న్మానం తస్య ఋణీ భవా మ్యహ మితి ప్రాప్నోమి తాపం
ముహుః. ౫

ఇత్యుక్త్వా పునరేవ మాహ రవిజం ధ్యాత్వా క్షణం రాఘవో
నూనం సుష్ఠు కృతం సమీరతనయేనైతేన తుష్టో౽ భవమ్
కిం త్వేవం శుచ మాస్తవా నహ మలం భూయోంబుధే ర్దుస్తరం
పారం దక్షిణ మద్య వానరచమూః ప్రాప్తా కథం స్యా దితి. ౬

తచ్ఛ్రుత్వా౽౽హ రఘూత్తమం రవిసుత శ్శోకాపనోదం వచః
కింను త్వం పరితాప మేషి భగవ న్నద్ధః ప్రకృత్యా యథా
మైవం భూ స్త్యజ తాప మాశు భువనే మైత్రీం కృతఘ్నో యథా
నోపశ్యామి శుచ పదం రఘుపతే! * విజ్ఞాతవా ర్తస్య తే. ౭

నూనం త్వద్గుణచింతనే౽పి నచ తే శోకావకాశో ధ్రువం
భావిజ్ఞానయుతో౽సి నీతివిదసి ప్రాజ్ఞో౽సి రామప్రభో
ఉత్సాహస్య వినాశినీం త్యజ మతిం యోగీ కుబుద్ధిం యథా
సంతార్యాబ్ధి మిమాం చమూం రిపుపురం ప్రావేశయేయం
ధ్రువం. ౮

తతో రిపుజయ చాపి కారయిత్వా మహీసుతాం
ఆనయిష్యామ్యహం నూనం త్యజ తాపం మహామతే. ౯

---

*విజ్ఞాతవా ర్తస్యేతి అయమాశయః - ఏతావత్పర్యంతం సీతానుపలంభరూపనిమిత్తా శుగాసీత్. ఇదానీంతు తద్వార్తో పలంభా చ్ఛోకో నిమిత్తం నా స్తీతి భావః.



గ్రంథ రచయిత:
రామాయణకేసరి బ్రహ్మశ్రీ
అక్కావఝ్ఝుల వెంకటకృష్ణశాస్త్రి

సంరక్షించెను. ఇట్టి ప్రియవాదియగు నితనికి నేనేమిచ్చినను సరిపోదు. కాన నిశ్చయముగా నితనికి నేను ఋణగ్రస్తుడ నైతినని మాటి మాటికి పరితాప పడుచున్నాను.

౬ ఇట్లు చెప్పి శ్రీరామచంద్రమూర్తి యొకక్షణ మాలోచించి సుగ్రీవునితో మరల నిట్లనియెను. మన హనుమంతుడు నిశ్చయముగా చాల మంచిపనిచేసెను. దీనికి నేనుసంతసించితిని కాని, మన వానర సైన్యము దుస్తరమైన సముద్రమును దాటి దక్షిణతీరమును జేరు టెట్లని తిరిగి చాల దుఃఖించుచుంటిని

౭ ఆ వాక్యమునువిని సుగ్రీవుడు దుఃఖమునుఁబోగొట్టువాక్యము నిటుల బల్కెను. శ్రీరామచంద్రా ! నీవు భగవంతుడవయ్యు ప్రాకృత పురుషునివలెఁ బరితాపబడెద వేమి? కృతఘ్నుడు మైత్రిని విడిచినట్లు నీవు పరితాపమును వేగముగా విడువుము. శ్రీరామా ! సీతాదేవి * కుశలవార్త తెలిసినపిమ్మట కూడ దుఃఖమేల ? యని యోదార్చెను.

౮ రామచంద్రా ! నీ సద్గుణములఁబట్టి విచారించినను నీకు దుఃఖింపః బనిలేదు. నిశ్చయము రాబోవువిషయముల నెఱుంగుదువు. నీతి నెఱుంగుదువు. ప్రాజ్ఞుడవు. యోగి దుర్బుద్ధిని విడచినట్లు నీవుగూడ నుత్సాహనాశకరమగు దుఃఖమును విడువుము. నే నీ వానరసైన్యమును సముద్రమును దాటించి శత్రుపురమును (లంకను) ప్రవేశ పెట్టెదను; నిశ్చయము.

౯ పిమ్మట శత్రువులనుగూడ జయించి భూపుత్రిని నేను తీసికొని వచ్చెదను. నిశ్చయము. ఇంక తాపమేల? విడువుము.

---

* కుశలవార్త తెలిసినపిమ్మటకూడ దుఃఖింపవలసిన కారణము కనుపించదనుచోట భావమేమనగా- ఇదివరకు సీత యెచ్చటనున్న వృత్తాంతము తెలియలేదుగనుక దుఃఖ మనివార్యము. ఇప్పుడు తెలిసినది గనుక దుఃఖింపఁ గారణము లేదని భావము.

కించేదం శృణు రామచంద్ర నితరా ముత్సాహహీనస్య వై
సర్వార్థా విలయం ప్రయాంతి బహవో౽నర్థా స్సమేయుర్విభో
సర్వే౽మీ కపయ స్త్వదర్థ మనలంచాపి ప్రవేష్టుం ధ్రువం
సోత్సాహాస్త దలం సుఖాగ్రహజనై ర్యుష్మత్సు కార్య స్త్వయా. ౧౦

సేతుబంధో౽ధునా కార్య స్తత్కృతే నగరీ రిపోః
దృష్టా భవే త్పురే దృష్టే హతం విద్ధి దశాననం. ౧౧
సేతుబంధ మకృత్వాబ్ధౌ సురై ర్వాపి రఘూత్తమ
నహి సమ్మర్దితుం శక్యా రావణస్య పురీ ధ్రువం. ౧౨

శ్రీరామో౽ంబుధౌ తు సేతుకరణే సైన్యం కపీనాం ద్రుతం
తీర్ణం స్యా దను దేశసైన్యవిహతౌ ప్రత్యూహకే సత్యపి
సర్వే౽మీ కపయో మహాబలయుతా శ్శౌర్యప్రధానా స్తతో
లంకా మానయితుం క్షమా దశముఖాద్వై సాసక ముత్పాట్య తామ్॥ ౧౩

తస్మా దంబుధిలంఘనస్య తు భవా న్నాలోచయే త్సాధనం
పశ్చా త్తత్పదపవృష్టిభి స్తు కపయో విధ్వంసిష్యం త్యరీన్
ఉక్త్వాకం బహుధా భవ ద్రఘుపతే నూనం జయం స్యా త్తథా
పశ్యామ్యద్య నిమిత్తజాలమపి మే స్వాంతం ప్రహృష్టం స్థితం. ౧౪

సుగ్రీవస్య వచో నిశమ్య తు తత స్స రామో౽వద న్మారుతిం
వార్ధే ర్లంఘన మాంజనేయ! తపసా తివ్యోషణే నాథవా
తద్బంధేనచ కర్తు మస్మ్యహమలం శక్తో నహ ద్వాపరో
లంకాయాం కతిసంతి దుర్గపరిఘప్రాకారముఖ్యా వద. ౧౫

౧౦ రామచంద్రా! మఱియొక్క మాట వినుము ఉత్సాహము లేనివానికి, అన్ని పనులును చెడిపోవుటయే కాక యనర్థములు కూడ సంభవించును. ఈ వానరులందఱును నన్ను సంతోషపెట్టుటకై యవసరమైనచో నగ్నిలో దుముకుటకు సైతము నుత్సాహము కల్గియున్నారు నిశ్చయము. కాన దుఃఖమేల? ఊరడిల్లి శత్రుజయమునకై యత్నింపుము.

౧౧ ముందు సేతునిర్మాణము చేసినచో సముద్రమును దాటి శత్రునగరమును గాంచవచ్చును. లంకను జూడగల్గితిమేని రావణుని సంహరించినట్లే యని భావింపుము.

౧౨ సేతువు నిర్మించనిచో దేవతలకైనను లంకాపురిని జయింప నలవి కాదు; నిశ్చయము.

౧౩ ఓ శ్రీరామచంద్రా! సముద్రమున సేతువు కట్టినచో, వానర సైన్యము మార్గమున రాక్షసు లెన్ని విఘ్నములొనర్చినను శీఘ్రముగా దాటగలరు. ఈ వానరులందఱును శౌర్యవంతులు మహాబలులును గాన రావణాదులతోగూడ లంకను పెకలించి తీసికొని కూడ రాగలరు.

౧౪ కనుక నీవు సముద్రమును దాటుటకు సాధన మాలోచింపుము. పిమ్మట మనవానరులు వృక్షములతో శత్రువుల నశింపజేతురు, వేయి మాటలేల. ఇట్లు గావించినచో నీవు తప్పక జయము గాంతువు. ఇప్పుడు మనకు జయించు శుభశకునములు గన్పట్టుచున్నవి, నా మనస్సు సంతోషము కల్గియున్నది. ఇదికూడ శుభశకునమే.

౧౫ శ్రీరామచంద్రమూర్తి సుగ్రీవుని వాక్యమును విని తరువాత హనుమంతునితోనిట్లు పలికెను, హనుమంతా! యీ సముద్రమును తపోబలముచేగాని, లేక దానిని నా బాణములచే నింకింపచేసి గాని, లేక సేతువు కట్టిగాని సముద్రమును దాటగలను. సందేహములేదు. నీవు లంకను చూచివచ్చితివి కదా. అచట దుర్గము లెన్ని యున్నవో, అగడ్త లెన్ని కలవో ప్రాకారము లెన్ని కలవో చెప్పుము.

కించ రాక్షససైన్యస్య పరిమాణంచ రక్షసాం
సదనాని తథా ద్వారసంఖ్యాం గుప్తిక్రియాం వద. ౧౬
కించ లంకాసమృద్ధించ విభాగం తద్బలస్యచ
చతురంగవినిర్దేశం తత్త్వతో మే భవాన్ వదేత్ ౧౭

ఇత్యుక్తః పవనాత్మజో రఘుపతిం ప్రత్యాహ చైవంతతో
లంకా హృష్టజనా ప్రమత్తగజయుక్పూర్ణా రథై ర్వాజిభిః
దుర్గమ్యాచ నగైస్తు తత్ర విపులద్వారాణి చత్వారి వై
తత్రైతేషూపలయంత్రసాధనచయ స్సంస్థో మహాన్రాఘవ! ౧౮

ఆగచ్ఛేద్యది శత్రుసైన్య మసురై ర్యంత్రైస్తు తద్ధన్యతే
ద్వారేష్వప్యధికం కృతా బహుశతఘ్న్యశ్చ ప్యాశరాణాంగణైః
ప్రాకారోఽపి మహాన్ సువర్ణరచితో రత్నాంచితావాంతర
స్తత్రాగాధతమాఃస్థితాశ్చపరిఘా గ్రాహాదిభిస్సంయుతాః. ౧౯

తత్తద్ద్వారసమీపఏవ బహవోఽతిష్ఠన్ దృఢా స్సక్రమా
స్త్రియస్తే రిపుసైనికాగమవిధౌ యంత్రైః పురీం తేఽభితః
తేష్వేకో బలవాన్ దృఢశ్చ నితరాం తేషూత్తరద్వారగ
స్సోఽకంప్యశ్చ తతో బభూవ నిఖిలే ష్వన్యే ర్ధ్రువం రాఘవ!
౨౦

౧౬ మఱియు రాక్షస సైన్యమెంత? రాక్షసుల గృహములెన్ని? వాటికి రక్షణ పద్ధతినెట్లు చేసినారు? చెప్పుము.

౧౭ ఓ హనుమంతుడా! లంకలో నైశ్వర్యవిశేషము లేవో రాక్షస సైన్యము నెట్లువిభాగించిరో చతురంగబలములో నేనుగు లెన్నియో, గుఱ్ఱము లెన్నియో రథము లెన్నియో, కాల్బలము లెన్నియో నీవు యథార్థము చెప్పవలసినది.

౧౮ శ్రీరామచంద్రమూర్తి యిట్లడుగగా హనుమంతు డీరీతిని చెప్పఁదొడంగెను. లంకలో నందఱు సంతోషముతో గూడినవారలై యుండిరి. లంకాపురి రథములతో గుఱ్ఱములతో నిండియున్నది. అచట శత్రువులు చొరలేరు. నాలుగు పెద్ద ద్వారములు నలుదిక్కుల సింహద్వారములుగా నచటనున్నవి. అచట విరోధులను జంపు బాణములు మొదలగు యుద్ధసాధనములుగల యంత్రము లెన్నెన్నియో పెద్దపెద్దవి యున్నవి.

౧౯ శత్రుసైన్య మచటి కేతెంచినచో నచ్చటి రాక్షసు లాయంత్రములతో జంపుదురు. ద్వారములలో ననేకముగా మరపిరంగుల నమర్చియుంచిరి. మధ్యమధ్య రత్నములు కూర్చిన బంగారపు ప్రాకారము. కాన కోటగోడకూడ భేదింప శక్యము కానిది. ఇదియునుంగాక, అచ్చట పట్టణము చుట్టు భయంకరమైన మొసళ్ళు మున్నగు జలజంతువులతో నిండియున్న లోతైన యగడ్తలు గలవు.

౨౦ ఆ నలుదిక్కులనున్న సింహద్వారముల దగ్గర నభేద్యమైన వంతెనలు, అగడ్తలను దాటుటకు యంత్రములతో గట్టిరి. శత్రుసైన్యము లా మార్గమున వచ్చినచో రాక్షసులు యంత్రములతో లంకను గాపాడుచుందురు. వంతెనలు తలుపులవలె నవి యడ్డుపడును. అనగా యంత్రముల మరలు త్రిప్పినచో సింహద్వారము కప్పబడిపోవును. ఉత్తరద్వారమునందున్న వంతెన చాల బలముకలది. ఎవ్వరు దానిని (యంత్రపువంతెనను) గదలింపలేరు.

లంకాయాంతు చతుర్ద్వారో త్తమ మహాదుర్గాణి సంతి క్రమా
న్నాధ్రైకం జలదుర్గమస్య దవన ద్గారి వేయ మన్య ద్వనమ్
అస్య త్వన్యత్రామ మద్రిశృంగసహితా లంకాపురీ శోభతే
నానాయంత్రశతఘ్ని కాశ్చ పరిఘా స్సంశోభయ న్తిస్మ తామ్. ౧౧

పూర్వద్వారగతే యుతం స్థిత మహా త్వగ్రక్షసాం దక్షిణం
ద్వారం త్వై నియుతాన్యథా శరవరా రక్షన్తి నాస్త్రాయుధాః
ద్వారంతు ప్రయుతం నిశాచరవరా రక్షంత్యలం పశ్చిమం
రక్షో న్యర్బుద మత్ర పాతి సతతం ద్వారం తత్రైవో త్తరమ్. ౧౨

మధ్యస్కంధ ముపాశ్రితాని శరచమూస్సంపూర్ణకోటిఃస్థితా
భగ్నా రాఘవ! సంక్రమా అపి మయామాత్రగో త్తమాః కేచన
ప్రాకారా స్త్వవసాదితాశ్చ పరిఘా స్సంపూరితా స్సర్వశో
దగ్ధా తన్నగరీ బలంచ గమితం నాశం మయార్ధాధికం. ౧౩

యేన కేనా ప్యుపాయేన తరేమ యది వారిధిం
లంకా వినాశితైవ స్యా ద్వానరై రితి వేద్యతాం. ౧౪

మైందో౽హం ద్వివిదశ్చ వాలితనయో నీలో నళో జాంబవా
న్విక్రాంతిః పనసశ్చ వారిధి మలం సంప్లావ్య లంకాపురీం
గత్వా తా మచల ప్రతోరణయుతాం ప్రాకారజాలాన్వితాం
నూనం నాశయితుం క్షమా స్తవ బలే నాన్యేన చాలంవిభో. ౧౫

౨౧ ఇంక లంకామాహాత్మ్యము చెప్పెదను, వినుము. ఆ లంకలో వరుసగా నాలుగుదుర్గములు కలవు. 1 జలదుర్గము, రెండవది రాళ్లతో గట్టబడిన కృత్రిమ దుర్గము, మూడవది వనదుర్గము నాల్గవది పర్వతదుర్గము. లంక పర్వతశిఖరములమీద నున్నది. యంత్రములు. ఘిరంగులు. అగడ్తలు మొదలగునవి దాటుటెట్లు? ఇంక సైన్యముల చెప్పెదను.

౨౨ తూర్పు ద్వారమును పదివేలమంది రాక్షసులును, దక్షిణద్వారమును శస్త్రాస్త్రములతో గూడిన లక్ష రాక్షసులును, పశ్చిమద్వారమును పదిలక్షలమంది రాక్షసులును, ఉత్తరద్వారమును కోట్లకొలది రాక్షసులును గాపాడుచుండిరి. కాన దుర్గములు దాటినను ద్వారముల దాటి లోపలికిఁ బ్రవేశించుట కష్టము.

౨౩ లంక మధ్యభాగమున సంపూర్ణముగ కోటి సంఖ్యగల రాక్షసులుండిరి. ఈ లంకాపురము మొదట చూచినప్పు డట్లుండెను. కాని దీనిని నెట్లు జయించగలమని భయపడకుము. నేను పెద్ద పెద్ద వంతెనలు పడగొట్టియు, ప్రాకారములను విరగగొట్టియు, నగడ్తలను బూడ్చియు లంకను దగులబెట్టియు, నందున్న సైన్యములో సగముపైగా సైన్యమును నశింపజేసియు వచ్చితిని.

౨౪ లంక యెట్లయిన నుండుగాక! ఏ యుపాయముచేనైన సముద్రమును దాటితిమేని మన వానరులచే లంక నశింపచేయబడగలదని తలంపుము

౨౫ ఓ రామచంద్రప్రభూ! వానరసేన యంతయు బోవలసిన పనిలేదు. మైందుడు, ద్వివిదుడు, నంగదుడు, నీలుడు, నలుడు, జాంబవంతుడు, పనసుడు, నేను గలిసి సముద్రమును దాటి యా లంకాపురిని ప్రాకారములతో, పురద్వారములతోఁగూడఁ బడగొట్టి నాశనము చేసి రాగలము. ఇంక నీ బలముగాని తక్కిన వానర సైన్యముయొక్క సాహాయ్యముగాని యపేక్షించము. కాన మమ్ములను బంపినఁ జాలును.

మధ్యే కపీనాంతు సుసారభూతాన్
కుర్వంతు చైవం త్వితి రామచంద్ర !
క్షిప్రం సమాజ్ఞాపయ సన్ముహూర్తే
ప్రస్థాన మస్యా శ్వభిరోచయ త్వమ్. -౨౬
ఏవం తేన సమీరితో రఘుపతి స్సంచింత్య సూర్యాత్మజం
ప్రాహాస్మిన్ విజయే ముహూర్తసమయే యానేజయస్సంభవేత్
ప్రస్థానం త్వభిరోచయోఽహ మధునా మధ్యంగతే భాస్కరే
హృత్వా భూమిసుతాం క్వయాస్యతి దశగ్రీవోఽపి జీవన్నసౌ. -౨౭

పీత్వా దుర్విషమాతురా మృతిమాప్స్యత్యేవ సా జానకీ
ప్రస్థానం మమ నైనిశమ్యతు గతా స్యా జ్జీవితాశాం పునః
యానేనాద్య వినా విచారవికలేష్వస్మాసు సా జీవితే
నైరాశ్యంతు గతా భవిష్యతి తత స్సంచోదయేత్వాంచమామ్

* శ్లో॥ కించాఽద్యోత్తరఫల్గునీ జయకరీ తారాపి మే సాధనీ.
ధన్యా న్యద్య సముద్భవంతి శకునా న్యార్థ్యంచ వామాక్షి మే
భూయః ప్రస్ఫురతి ధ్రువంహి విజయో వ్యాహత్య రక్షోధిపం
సీతా మానయితుం క్షమే యది కృతం ప్రస్థాన మర్కాత్మజ. -౨౮

---

* వామాక్షిప్రస్ఫురతీతి - నను పురుషస్య దక్షిణనేత్ర స్ఫురణం శుభకర మితి ప్రతీతే స్సద్భావే తద్విరుద్ధతయాఽత్ర వామాక్షిస్ఫురణం విజయసూచకమితి కథ ముక్తమితిచే దుచ్యతే. సంగరప్రయాణేతరకాలేషు పురుషస్య దక్షిణ నేత్రస్ఫురణస్య శుభసూచకత్వే వ్యాహవప్రయాణకాలే

౨౬ ఓ రామచంద్రా! ఈ వానరులలో బలవంతు లెవరో నిర్ణయించి వారిని శీఘ్రముగా మంచిముహూర్తమున ప్రయాణమున కాయత్తము కండని యాజ్ఞాపించెదవుగాక.

౨౭ ఈ తీరుగా హనుమంతుని పలుకులు విని రామచంద్రమూర్తి యాలోచించి సుగ్రీవునితో నిట్లనెను. సుగ్రీవా! ఈ విజయ ముహూర్తమున ప్రయాణమైనచో దప్పక మనకు విజయము కలుగును. ఇప్పుడు సూర్యు డాకాశమధ్యమున నుండెను. అభిజిన్ముహూర్తము. కాన ప్రయాణమున కాయత్తపడుచుంటిని. రావణుడు సీతాదేవి నెత్తుకొని పోయి బ్రతికి యెక్కడికి పోగలడు? అని మఱియు నిట్లనెను.

౨౮ సుగ్రీవా! నా విరహతాపార్తయగు జానకి నా ప్రయాణవార్తను విన్నచో, విషపానముచే మూర్ఛితురాలగున దాని కమృతస్పర్శమైన చందమున మరల బ్రదుకునందాశ కలదగును మనము ప్రయాణము చేయక యిప్పు డిక్కడనే విచారించుచు నుందుమేని యా సీత బ్రతుకునందు నిరాశురాలగును. గనుక సైన్యమును ప్రయాణమున కాజ్ఞాపింపుము.

౨౯ సుగ్రీవా! మఱియు నీ సమయము నుత్తర నక్షత్రము. జయప్రదమైనది, నాకు సాధనతారయైనది, శుభకరములైన శకునము లగుచున్నవి. నా యెడమకంటిపై మిక్కిలి యదురుచున్నది. జయము తప్పదు. ఈ ప్రయాణ ముహూర్తబలమువలన రావణ సంహారము గావించి సీతాదేవిని తీసికొని రాగలము.

---

* నా యెడమకంటిపై నదురుచున్నది. ఇచ్చట నొక సంశయము కలుగును. ఏమనగా పురుషులకు కుడికన్ను దురుట శుభసూచకమని వాడుకయుండ నిచట నెడమ కన్ను దురుట శుభసూచకముగా శ్రీ రామచంద్రమూర్తి యెట్లు చెప్పెనని యెడి ప్రశ్నకు సమాధాన మిటుల గ్రహింపఁదగినది. యుద్ధప్రయాణమునకంటె నితర కాలములలో కుడికన్ను దురుట మంచిదికాని యుద్ధప్రయాణ సమయములో

ఇత్యుక్త్వా కారయిత్వాచ వానరాన్ గమనోన్ముఖాన్
సౌమిత్రి నారదాభ్యాంశ్చ రామోపి గమనోన్ముఖః. ౩౦

* అష్టత్రింశసహస్రాంత్యమాస విలస చ్ఛ్రీపూర్ణమాస్యాం తదా
సూర్యే మీనగతే కవౌ ఏజగతే జీవేచ సింహంగతే
మందే చాపగతే ధ్వజేచ మహిజే స్వక్షేత్రగే వృశ్చికే
సోమే హస్త్రాంగే స్వశత్రునగరం నిష్క్రాన్తవాన్ రాఘవః. ౩౧

---

వామనేత్రస్ఫురణ మేవ శుభసూచక మితి జ్యోతిశ్శాస్త్రే సందృశ్యతే. తథాహ. శ్లో. నేత్రస్యాధఃస్ఫురణ మసకృత్సంగరే భంగహేతుః, కర్ణోపాంతే హరతి నయనం నేత్రమూలేచ మృత్యుః, నేత్రస్యోర్ధ్వం హరతి సకలం మానసం దుఃఖజాతం వామే చైవం ఫల మవికలం దక్షిణే స్యాద్వైపరీత్యం" ఇతి.

* అత్రేద మనుసంధేయం-శ్రీరామస్య గోచారవశాచ్చంద్ర లగ్నస్య కర్కటకత్వేన తద్రాశేః ధనస్థానే జీవః, భాగ్యస్థానే రవిః రాజ్యస్థానే శుక్రః షష్ఠస్థానే శని కేతూ, తృతీయే చంద్రః, కేంద్రే సప్తమే రాహో రవశ్యస్థేయత్వేన వ్యయే రాహుః. ప్రాయశో రవే ర్బుధస్య పురస్థితత్వనియమా ద్రాజ్యస్థాన ఏవబుధః గోచారవశా దవసన్. ఏతేషు కుజరాహూవినా సర్వేపి శుభప్రదా ఏవ. తత ఏవ రామస్య విజయోఽవశ్యం భావీతి వక్తుం శక్యతే. పంచమే భౌమస్య వ్యయే రాహో శ్చానిష్టఫల

30 శ్రీరాముడు ఇట్లు సుగ్రీవునితోఁ జెప్పి వానర సైన్యమును వెంటనే ప్రయాణమగునట్లు చేసి తాను లక్ష్మణునితోడను సుగ్రీవాదులతోడను వెంటనే ప్రయాణోన్ముఖుఁ డయ్యెను.

31* శ్రీరామచంద్రమూర్తి తనకు ముప్పది యెనిమిదవయేట చివర నెలలో (ఫాల్గుణమాసములో) వచ్చు పూర్ణిమనాఁటి జనగోచారరీత్యా సూర్యుడు మీనరాశి యందును, శుక్రుడు మేషరాశి యందును, బృహస్పతి సింహరాశియందును, శని కేతువులు ధనూరాశి యందును, అంగారకుడు వృశ్చికరాశియందును, చంద్రుడు కన్యారాశియందును ఉండగా లంకాపురమును గూర్చి ప్రయాణమయ్యెను.

---

మాత్రము ఎడమ కన్నదరుట మంచిదని జ్యోతిశ్శాస్త్రమునఁ గన్పడును. ఎట్లన, కంటిక్రింద నదరినచో యుద్ధములో పరాజయమనియు, కంటికి చివర నదరినచో కంటికే హాని యనియు, కంటి మొదట నదరినచో మృత్యువనియు, కంటిమీఁద నదరినచో సమస్తమైన మనోదుఃఖములు పోవుననియు, నిట్లెడమ కన్నదరుటకు ఫలము చెప్పబడినది, మఱియు కుడికన్నదరుటకు ఫలములు విపరీతములని చెప్పబడెను: కాన నెడమకంటిపై నదరుట శుభసూచకమని రామచంద్రమూర్తి వచనము సమంజసమైనదియే యని తెలియదగును.

* ఇచ్చట నీ క్రింది విధముగఁ దెలిసికొనఁదగినది. శ్రీరామచంద్రునకు గోచారమునుబట్టి చంద్రలగ్నము కర్కాటకముగాన, ఆ రాశికి ధనస్థానమున బృహస్పతియు, భాగ్యస్థానమున రవియు, రాజ్యస్థానమున శుక్రుడును. షష్ఠస్థానమున శని కేతువులును. తృతీయమున చంద్రుడును. మఱియు నైదవయింట కుజుడు నున్నట్టుల, దెలియదగును. బుధరాహువుల సంగతి యేమన, బుధుడు సూర్యునకు రెండవ యింట తరచుగ నుండును గాన పదవయింటనే బుధుడున్నట్టులు దెలియబడును. రాహువు తప్పక కేతువునకు నేడవయింటియందుండును గాన పండ్రెండవ యింటిలో నుండినట్లు తెలియగలదు. ఈ నవగ్రహములలో కుజరాహువులు తప్ప మిగిలిన యేడు గ్రహములు శుభస్థానములయందుండుటచే విజయము రామునకుఁ గలుగునని యిందుచే

పశ్చాత్తే కపయోఽపి సూర్యతనయాజ్ఞప్తా యుయుత్సాన్వితాః
కేచి ద్దండశిలాభృతోఽవనిరుహానన్యే వహంతి స్తతః
నిష్క్రమ్యాతిరయా ద్వ్రజన్తి ఇతి తే గర్జంతి రాత్రించరా
హంతవ్యాదశకంధరోఽపి తరసాఽస్మాభిస్తు శాఖామృగైః. ౩౨

క్ష్వేళంతశ్చ ప్లవంత స్తే, గచ్ఛంతః పథి వానరాః
మధూనిచ సుగంధీని, ఫలాని వివిధా న్యలం.
భక్షయంతః పతంతశ్చ, పాతయన్తోఽ పరా న్ముదా
మహోత్సాహయుతా భూమిం, ఖంచావృత్య వ్రజన్తివై. ౩౩–౩౪
మార్గరక్షాకృతే పూర్వం, నియుక్తా రాఘవేణ యే
నీలాదయోఽపరేచాపి, కుముదాద్యా శ్చ వానరాః.
ద్రుత మగ్రే వ్రజంతిస్మ, రామభక్తివశాత్మనః
స్వయమేవ ప్రవృత్తాశ్చ తేషు గచ్ఛంతి కేచన. ౩౫–౩౬
బహుభి ర్వానరై స్సాకం, పురస్తా దృషభో బలీ
నీలశ్చ కుముదశ్చాపి, వ్రజన్తిస్మ మహాబలాః. ౩౭
సుగ్రీవో రాఘవశ్చాపి సౌమిత్రి ర్మధ్యసంస్థితాః
బలిభి ర్బహుభి ర్వీరై ర్వానరై స్సహితా యయుః. ౩౮

పశ్చా చ్ఛతవలి ర్వీర స్సుషేణః కేసరీ తథా
పనసో జాంబవా న్మైందో వేగదర్శీ చ వానరః
నైకకోటి పరీవారా గచ్ఛంతి స్మాంగరక్షకాః ౩౯–౪

ప్రదత్వేనైవ రామస్య నాగాస్త్ర బంధాదిక్లేశోపి సంభవిష్యతీతి వేద్యం.

3౨ పిమ్మట వానరులందఱు సుగ్రీవాజ్ఞ చేకొని యుద్ధముచేయ నుత్సాహముతో బయలు దేరిరి. అందులోఁ గొందఱు వానరులు పెద్ద పెద్ద కొండరాళ్ళను, మఱికొందఱు పెద్ద పెద్ద చెట్లను నాయుధములకు బదులుగాఁ జేతఁ బట్టుకొని బయలుదేరిరి. వీరలందఱు నిట్టుల బయలు దేరి వేగముగాఁ బోవుచు "రావణుని రాక్షసులను వెంటనే వెళ్ళి చంపవలయు నని" పెద్ద కేకలు పెట్టుచు గర్జించుచుఁ బోవుచుండిరి.

33-3౪ ఆ వానరులు గంతులు వైచుచు నెగురుచు మార్గమున నడుచుచు నితర వానరులను సంతోషముతోఁ బడద్రోయుచు మద్యములను ద్రావుచు పండ్ల నారగించుచు నొడ లెరుగక పడుచు లేచుచు నమితోత్సాహముతో భూమ్యాకాశములను వ్యాపించి వెళ్ళుచుండిరి.

3౫-3౬ మార్గశోధనమునకై ముందుగఁ బోవునట్లు శ్రీరామునిచే నాజ్ఞాపింపఁబడిన నీలుడు మొదలగు వానరులును. కుముదుడు మొదలగు వారును వేగముగ ముందు మార్గశోధన చేయుచు నడుచుచుండిరి. కొందఱు వానరులాజ్ఞాపితులు కాకపోయినను గూడ శ్రీరాముని యందుండెడి భక్తి పరవశతచే తమంతట తామే ముందు పరుగులిడు చుండిరి.

3౭ బలవంతుడయిన ఋషభుడు నీలుడు కుముదుడు మొదలగు మహాబలశాలురు విస్తారమయిన వానర సైన్యముతో ముందు బోవుచుండిరి.

3౮ సుగ్రీవుడును శ్రీరామలక్ష్మణులును మధ్యనున్న వారలై బలవంతు లయిన యనేక వానర వీరులతో గూడి వెళ్ళుచుండిరి.

3౯ వారికి వెనుకవైపున శతబలి యను వానరుడును సుషేణుడు, కేసరి, పనసుడు, జాంబవంతుడు, మైందుడు నను వానరు లనేకకోట్లసైన్యముతో నంగ రక్షకులుగా నుండి నడుచుచుండిరి.

---

సూచింపబడుచున్నది, కుజ రాహువులు దోషముగలవారు గనుకనే శ్రీరామునకు నాగాస్త్రబంధాది క్లేశములు గలుగునని యీ రెండు గ్రహముల వలనను సూచితమగుచుండును.

పశ్చా ద్దరీముఖో రంభః ప్రజంఘః ప్రఘస స్తదా
వానరాం స్త్వరయంతస్తే, వ్రజు ర్దక్షిణాం దిశమ్ ౮౦॥
జ్ఞాత్వా రాఘవశాసనం తు కపయస్తే నర్గయిత్వా పురీః
గ్రామాంశ్చాపి సుదూరఏవ మహతా ఘోషేణయుక్తాయయుః
శూరాః పార్శ్వతలే స్థితా రఘుపతే రాశు ప్లవంగో ముదా
గచ్ఛంతిస్మ బలాధికా స్త్వహమికాయుక్తా యయు స్సత్వరమ్.
౮౧॥

శ్రీమన్మారుతనందనేన మహతా సన్నాహ్యమాన స్తదా
శ్రీరామ శ్శుభేఽంగదేన తు తథైవోఢస్సుమిత్రాసుతః
తౌ ద్వౌ సూర్యనిశాకరావివ సుసంస్పృష్టౌ గ్రహాభ్యాం తదా
రేజాతే రవిసూనుపూజితతమౌ ద్వాభ్యాం సమూఢౌ పునః.
౮౨॥

ఏవం. యామ్యదిశం వ్రజంత మనద చ్ఛ్రీరాఘవం లక్ష్మణో
భ్రాతస్తే భవితా జయో ధ్రువ మిదం హత్వాదశాస్యం పునః
వైదేహీం సమవాప్య సిద్ధి మతులాం కార్యస్య సంప్రాప్తవా
న్మానం త్వం భవితాసి కారణ మహం వచ్మి శృణు త్వం
పునః. ౮౩॥

భూమ్యాం ఖేచ నిమిత్త జాల మధునా పశ్యామ్యభీష్టం మహ
త్సేనా మప్యనువాతి వాయు రధునా శీతోఽనుకూలో మృదుః
కించాభా త్యమల స్త్రిశంకు రపి చాభూవ న్ప్రసన్నా దిశ
స్సూర్యోఽభూ ద్విమలో విశాఖభ మలం రారాజతే చాంబరే.
౮౪॥

౪౦ తరువాత దరీముఖుడు; రంభుడు; ప్రజంఘుడు, ప్రఘసుడు, అను వానరులు కపిసైన్యమును తొందరించుచు దక్షిణదిశకు బోవుచుండిరి.

౪౧ ఆ వానరులు శ్రీరామాజ్ఞను దెలిసికొనిన వారలుగాన పురములను గ్రామములను విడిచి చాలదూరముగా నడుచుచు సంతసముతో కిలకిలారావముల జేయుచుఁ బోవుచుండిరి. శ్రీరాముని ప్రక్కనున్న శూరులును వానరులును సంతోషముతో గంతులు వైచుచు వేగముగఁ బోవుచుండిరి. శ్రీరాముని ప్రక్కనున్న వానరులు కాక మఱికొందఱు వానరులును, నేను ముందు నేను ముందని యహమహమికతో వేగముగ సంతసముతోఁ బోవుచుండిరి.

౪౨ హనుమంతుని భుజములమీద శ్రీరామచంద్రమూర్తియును, అంగదుని భుజములమీద లక్ష్మణుడు నెక్కి సుగ్రీవునిచేఁ బూజితులై పోవుచున్న రామలక్ష్మణు లిరువురును గ్రహములచే వహింప బడుచున్న సూర్యచంద్రులవలెఁ బ్రకాశించుచుండిరి.

౪౩ ఈ విధముగ దక్షిణదిశ కభిముఖముగ వెళ్ళుచున్న శ్రీరామునిగాంచి లక్ష్మణు డిటులఁ బలికెను. అన్నా! రామచంద్రా! నీకుఁ దప్పక జయము కలుగగలదు; రావణుని సంహరించి సీతాదేవిని దిరిగి పొందెదవు. కార్యసిద్ధిని నిశ్చయముగఁ బొందగలవు. దీనికిఁ గారణమును జెప్పెదను వినుము.

౪౪ భూమియందు నాకాశమునందును శుభప్రదములగు శకునములు గాన వచ్చుచున్నవి. చల్లగా మెల్లగా ననుకూలమయిన వాయువు వీచుచున్నది. స్వచ్ఛముగ త్రిశంకు నక్షత్రము ప్రకాశించుచున్నది. దిక్కులు ప్రసన్నములుగా నున్నవి. సూర్యుడు ప్రకాశించుచుండెను. ఇక్ష్వాకుల నక్షత్రమయిన విశాఖ నక్షత్రము మిక్కిలి ప్రకాశమానముగ నుండెను.

నక్షత్రం త్వభిపీడ్యతే ధ్వజశనిద్వంద్వేన తద్రక్షసాం
రక్షోనాశ ఉపస్థితో౽పిచ వనానాఢ్యాని పుష్పైః ఫలైః
ఆపశ్చాపి భవంతి నిర్మలతయా సైన్యం కపీనాం త్విదం
తేజశ్శాలిచ దృశ్యతే సుశకునాన్యన్వీక్ష్య తుష్టో భవ. ౪౫॥

ఏవం సౌమిత్రిణా సమ్యక్ప్రోదితో రఘునందనః
నిమిత్తాని నిరీక్ష్యాథ శుభాని ముముదే౽ధికమ్. ౪౬॥

జగ్ము ర్మారుతరంహసో రఘుపతే రథ్రే౽ ర్పిత స్వాశయాః
వీర్యోద్రేక బలాన్వితే కల మిథ స్సందర్శయంతః స్థితాః
కేచి ద్యాంతి రయేన కేచి దపరే తూత్పేతు రన్యే పున
శ్చక్రు స్తే వనగోచరాః కిలకిలా మన్యే బభంజు ర్ద్రుమాన్.
౪౭॥

కేచిత్క్ష్వేళాం ప్రకుర్వంతి కేచి చ్ఛైలాధిరోహణం
కుర్వంతిచ పరే నాదా న్మహతో వ్యముచం స్తదా
కేచి చ్ఛిలాద్రుమై ర్వీరా, విచిక్రీడుశ్చ వానరాః. ౪౮-౪౯
* దేవ్యా త్వంజనయా౽ర్చితో రఘుపతి ర్మార్గే పరీవారయు
క్తస్త్వై భూరివరా న్వితీర్య మహతా సైన్యేన యుక్తస్తతో
నిర్గత్యాశు పురేవ మారుతిభుజస్కంధాధిరూఢో ద్రుతం
యాతిస్మాభ్యధికం కపీశ్వరచమూంప్రోత్సాహవాచో వదన్.
౫౦

---

* అంజనయార్చితో రఘుపతి రితి అంజనాదేవ్యాతిథ్య విషయస్తు వేంకటేశ్వరమాహాత్మ్యే వారాహే ప్రపంచితః.

౪౫. ఇంక, అరిష్టసూచకముగూడ రాక్షసులకుఁ గన్పడుచున్నది. రాక్షసుల నక్షత్రమయిన మూల నక్షత్రము శని కేతువులచే నాక్రమింపబడినందున రాక్షసుల కరిష్టము తప్పదు. ఇంకను మనకు శుభశకునములు గానవచ్చుచున్నవి. వనములు పుష్పములచే ఫలములచే నిండియున్నవి. ఉదకములు నిర్మలములుగా నుండెను. మన కపిసైన్యము సంతోషముతో ప్రకాశముతో నున్నది. ఈ శుభశకునములను గాంచి సంతసింపుము.

౪౬. ఇవ్విధముగ లక్ష్మణునిచే బాగుగబోధింపబడిన రామచంద్రమూర్తియు లక్ష్మణుడు చెప్పిన శుభశకునములనుజూచి మిక్కిలి సంతోషపడెను.

౪౭. ఆ వానరులు వాయువేగముగ బోవుచున్నవారలై రాముని ప్రయోజనమునందే ద్రుఢసంకల్పులై తమ పరాక్రమమును బలమును ఉద్రేకమును పరస్పరము గనబరచుచుండిరి. ఆ వానరులలో గొందఱు వేగముగఁ బోవుచుండిరి. కొందఱు పైకెగురుచుండిరి. మఱి కొందఱు కిలకిలారావములు చేయుచుండిరి. కొందఱు చెట్లను విరుగకొట్టుచుండిరి.

౪౮-౪౯ కొందఱు గర్జించుచుండిరి. మరికొందరు కొండల నెక్కుచుండిరి. ఇంకను కొందఱు సింహనాదములను జేయుచుండిరి. కొందఱు తోఁకలతోను చెట్లతోను నాడుచుండిరి.

౫౦* ఇవ్విధముగ వానరసైన్యముతో శ్రీరామచంద్రమూర్తి వెళ్ళుచు మార్గమధ్యమునం దంజనాదేవిచే సభక్తికముగాఁ బూజింపఁబడెను. ఆమె పూజకు మెచ్చి వరమ్ములిచ్చి ముందటివలెనే హనుమంతుని భుజములపై నధిష్ఠించి వేగముగా గొప్పవానరసైన్యముతో నుత్సాహపఱచు వాక్యముల బలుకుచు వెళ్ళుచుండెను.

---

* అంజనాదేవి రాముని కాతిథ్యము చేసినవిషయము వారాహపురాణమున వేంకటేశ్వర మహాత్మ్యమున విస్తృతముగ గన్పడును. ఆకథ యిచట ననుసంధేయము. (అది యెట్లన) "రావణవధార్థమై ధను

తథాహి. ఏతస్మిన్విషయే వారాహపురాణే వేంకటేశ్వర
మాహాత్మ్య సంస్థితా కథేయ మత్రానుసంధేయా. తథాహి
ఋశ్యమూకాచలా త్తస్మా ద్వానరై ర్బహుభి ర్వృతః,
రావణస్య వధార్థాయ కృతోద్యోగ స్సకార్ముకః, శేషా
చలసమీపే తు యదా రామ స్సమాగతః, తదా సత్యంజనా
దేవీ వాయుసూనో ర్మహాత్మనః, జననీ పురతో గత్వా రామం
రక్తాంతలోచనం, నమస్కృత్య మహాభాగా వచనం
చేద మబ్రవీత్, ప్రతీక్షన్తీ మహాబాహో త్వదాగమన
మద్భుతమ్, తిష్ఠామ్యస్మి న్గిరౌ రామ మునయోఽపిచ
కాననే, తపః కుర్వన్తి సతతం త్వదాగమనకాంక్షయా, తా
న్సర్వా న్సమనుజ్ఞాప్య గన్తు మర్హసి సువ్రత, ఇత్యుక్తః ప్రాహ
రామోపి హనూమాన్మాతరం ప్రతి, కాలాత్యయో భవే ద్దేవి
మయి తత్ర సమాగతే, మమేదానీం వరారోహే కార్యస్య
మహతి త్వరా, పునరాగమనే దేవి తథా భవతు సున్దరి,
ఇత్యుక్తం రాఘవేణైత ద్వాక్యం శ్రుత్వా మహామతిః
హనూమా న్ప్రణతో భూత్వా వాక్యం చైత దువాచ హ,
స్థాతవ్య మత్ర భవతా యత్రకుత్రాపి సర్వథా, యస్మా
ఛ్ఛ్రాంతా మహాసేనా వానరాణాం తరస్వినామ్, సుస్వాదు కంద
మూలోఽయ మఞ్జనాఖ్యో మహాగిరిః, ఇత్యుక్తో వాయుపుత్రేణ
శ్రీరామః ప్రాహ మారుతిం, జానేఽహ మఞ్జనాసూనో తథాపి
వచనం తవ, శ్రోతవ్యం హి మహాబాహో గచ్ఛాఽగ్రే త్వం
హరీశ్వర, ఇత్యుక్త్వా వాహినీం తాంచకర్ష స్పర్వత మాయయౌ,
శాపమోక్షం చ యక్షాణాం కేషాంచి త్పర్వతో త్తమే, దత్వా

ర్బాణధారియై ఋశ్యమూక పర్వతమునుండి రామచంద్రమూర్తి వానర సైన్యముతో బయలుదేరి శేషాచల సమీపమునకు వచ్చు చుండగా హనుమంతుని తల్లియైన యంజనాదేవి రామచంద్ర మూర్తి కెదురుగ వచ్చి యాయనకు నమస్కరించి యీ క్రింది విధ ముగఁ బ్రార్థించెను. రామచంద్రా! యీ పర్వతమునందలి యీ వనమున నేనును మహర్షులునుగూడ నీ రాకకు నిరీక్షించుచు నిచట తపస్సు చేసికొనుచుంటిమి. మమ్ముల నందరిని ననుగ్రహించి వెళ్ళు మని ప్రార్థింప రామచంద్రమూర్తి యంజనాదేవితో నిటులఁ జెప్పెను. "దేవీ! నాకు గాలాతిక్రమణము గలుగును. కార్యము యొక్క తొందర యెక్కువగా నుండెను. నేను తిరిగివచ్చునపుడు నీ కోరిక ప్రకారము జరుగుగాక" యని పలుకగా, నా వాక్యము విని యాంజనేయుడు చేతులు జోడించి రామచంద్రమూర్తి నిటులఁ బ్రార్థించెను. "రామచంద్రప్రభూ! యీ వానర సైన్యమంతయు నెడతెగకుండ నడచుచుండుటవలన శ్రమచెందియున్న కారణముచే నెచ్చటనైనను నొకచోట విశ్రమించవలసిన యవసర ముండెను. ఇదియునుంగాక, వానరు లందరకు నిచ్చట సమృద్ధిగ మధురమైన కందమూల ఫలాదులు లభించును" అని హనుమంతుడు చెప్పగా రామచంద్రమూర్తి యిటులఁ బలికెను. "హనుమంతా! నీ మాట తప్పక వినవలసియుండెను గాన నీవు ముందు నడువుము. నేను వానర సైన్యము నంతను దీసికొని వచ్చెద" నని చెప్పి వెంటనే సైన్యము నంతను దీసికొని యంజనా పర్వతమునకు రామచంద్రమూర్తి వచ్చి యచ్చట శాపగ్రస్తులయి యున్న కొందఱు గంధర్వులకు

పశ్చాత్తత్కపినాథానీ ప్రముదితా సుగ్రీవసంరక్షితా
యుద్ధాత్యుత్కవశా స్సహర్షమవన స్స్వర్క్వాపి మార్గే పునః
నానాచిత్రవిచిత్రకాననసదీః పశ్యం త్యగా దద్భుత
ప్రాప్తేమాచలసత్కుల్య మద్రి మధికం సహ్యాభిధం సా చమూః॥౧౧

---

రామో వా ష్టానాదేశ్య ఆశ్రమం పుణ్యపర్ణసమ్, సంప్రాప్య తు మహాభాగా మాపృచ్ఛ్య రఘునందనః, తత్ర పుష్కరిణీం గత్వా లక్ష్మణాద్యై స్సమన్వితః, కృత్వా స్నానం మహాతీర్థే సర్వత్ర విజయప్రదే, ఫలమూలాని చానీయ మహర్షిభ్యో వితీర్య చ, పృథక్పృథక్ కుటీం కృత్వా తస్థౌ సహార్యసుతాదిభిః, సుస్వాదుఫలమూలాని మధూని సుబహూని చ, ఆనీయ వాయుపుత్ర స్తం పూజయామాస రాఘవమ్, తతో రామ స్ససం హృష్ట స్సుగ్రీవప్రముఖై స్సహ, స్వవస త్సుసుఖం రామ స్స్వగేహ ఇవతత్ర తు, వానరాశ్చ మహాత్మానో గోలాంగూలా మహాబలాః, సర్వత స్తత్ర పుష్పాణి మూలాని చ ఫలాని చ, మధూని స్వాదుతీర్థాని భక్ష్యజాతా న్యనేకశః, భక్షయిత్వా మదోన్మత్తా శ్చేరు స్తత్ర సహస్రశః, ఆప్లవంతః ప్లవంతశ్చ గర్జంతశ్చ ప్లవంగమాః, చేరు స్తే వానరా స్సర్వే ముదితా బలగర్వితాః, లంకాం సమూల ముత్పాట్య త్రికూటం వా మహాగిరిం, ఆనేష్యామో వయం సింధుం తరామ శ్చంద్రభాస్కరౌ, గృహ్ణీమ ఇతి తే సర్వే బ్రువంతః కోటిశః స్థితాః తతః ప్రభాతే విమలే రామో రాజీవలోచనః, వితీర్య చాంజనాదేవ్యై వరా నాపృచ్ఛ్య తాం పునః, సహ సైన్యై ర్మహాతేజాః ప్రతస్థే౽రిజిగీషయా, ఇతి.

౫౧ పిమ్మట నా వానరసైన్యము సుగ్రీవునిచే రక్షింపబడుచు యుద్ధము చేయు నుత్సాహముచే మార్గములో నెక్కుడను మహార్థకాలమైన నిలుకళ, అనేక చిత్ర విచిత్రములైన నదులను, అరణ్యములను మార్గమధ్యమున గాంచుచు హిమవత్పర్వతములో సాటియగు సహ్యాద్రినిఁ జేరెను,

---

శాపవిముక్తిని గలుగజేసి పిదప అంజనాదేవి యాశ్రమమునకు వచ్చి యామెచేఁ బూజింపఁబడి యామె నడిగి యచ్చటనుండి స్వామి పుష్కరిణికి సౌమిత్రి సుగ్రీవాదులతో గలిసి వెళ్ళి యా తీర్థమున స్నానముచేసి వచ్చునపుడు కందమూల ఫలాదులుగూడ తీసికొనివచ్చి మహర్షులకిచ్చి పిమ్మట నచ్చట వేరువేరుగఁ బర్ణ కుటీరములను గల్పించుకొని సుగ్రీవాది వానరులతో నచ్చట నా దినముండెను. హనుమంతుడు మధురమయిన ఫలములను దీసికొనివచ్చి రామచంద్రమూర్తి మొదలగువారికిచ్చి యతిథిపూజ చేసెను. రామచంద్రమూర్తియును మిక్కిలి సంతోషముతో సుగ్రీవాది వానరులతోగూడ నచట స్వగృహమునందువలె సుఖముగ నా దినమంతయు గడపెను. వానరులును జాంబవంతుడు మొదలగు భల్లూకములును (ఎలుగుబంట్లును) ఆ పర్వతమునందు. తేనెను మధురమయిన ఫలములను స్వాదు జలమును నాస్వాదించియు భక్షించియు త్రాగియు నచట ప్రమత్తులయి సంచరించుచుండిరి. ఆ వానరులలో కొందఱు సంతోషముకొలది గంతులు చిందులు వైచుచు, మఱికొందఱు సింహనాదము చేయుచు బల గర్వితులయి సంచరించుచుండిరి — ఆ వానరు లందరు నిట్లు గర్జించుచుండిరి. (ఏమన) "లంకనుగాని, త్రికూటపర్వతమును గాని పెకలించి తీసికొని రాగలము, సముద్రమును దాటగలము. సూర్యచంద్రులను సైతము పట్టుకొనగలము" అని కోట్లకొలది వానరులు గర్జించుచుండిరి. పిదప ప్రాతఃకాలమున రామచంద్రమూర్తి అంజనాదేవికి వరముల నిచ్చి యామె నడిగి సుగ్రీవాది వానరులతోఁ దిరిగి లంకకుఁ బోవుటకుఁ బ్రయాణమయ్యె నని—

తచ్ఛైలే వకుళాశ్చ చూతపనసాశ్శోకాదయో భూరుహా
నైకే సంతి ఫలోత్కరేణ నమితా వాప్యోప్యనేకా స్థ్సితాః
కించాద్రౌతు జలాశయాశ్చ బహవోఽతిష్ఠం స్తతో వానరాః
స్నాత్వా తత్ర జలం నిపీయ బుభుజు స్స్వైరం ఫలా న్యప్యలమ్. ౫౨

తతో నిర్గత్య మలయం సమనుప్రాప్య రాఘవః
వానరానీకసంయుక్తః క్రమా త్సింధు ముపాగతః,
ప్రావేశ్య సర్వసైన్యం చ తత్తీరే స్వాయమాస సః. ౫౩

ఇత్యాశ్చర్య రామాయణే
యుద్ధకాండే ప్రథమ స్సర్గ స్సమాప్తః.

---

## ద్వితీయ స్సర్గః.

పశ్చాత్తజ్జలధిం నిరీక్ష్య సహసోద్ధూతాంబురాశిం తథా
నక్రాద్యై ర్జలజంతుభి ర్భయకరం ప్రాహార్కజం రాఘవః
సుగ్రీవాఽద్యవయంమహోదధి మిమం ప్రాప్తావిచింతాఽస్తి సా
యా నః పూర్వ మభూ దముం నహి తరే మోపాయచింతాం
వినా. ౧

ఏత ద్వానరసైన్య మద్యతు యథా పారం పరం తు వ్రజే
న్మంత్రస్తు క్రియతాం తథాఽద్య నిఖిలై రస్మాభి రాశ్వర్కజ!
తావ త్సింధుతటేతు వానరచమూ స్సంస్థాప్యతాం వై త్వయా
త్వక్త్వాత్మీయచమూం న కశ్చిదపివా గచ్ఛే త్పరత్ర ధ్రువమ్. ౨

౫౨ ఆ పర్వతమున పొగడచెట్లు, మామిడిచెట్లు, పనసచెట్లు, అశోక వృక్షములు మొదలగు ననేక వృక్షములు ఫలభారముచే వంగినవై యున్నవి. మఱియు నట దిగుడు బావులు, సరస్సులు ననేకము లున్నవి. కనుక వానరు లా కొలనులలో స్నానముచేసి జలంబుల ద్రావి స్వేచ్ఛగా ఫలంబుల దిని తృప్తినందిరి.

౫౩ తరువాత శ్రీరామచంద్రమూర్తి వానర సైన్యముతో బయలుదేరి మలయ పర్వతమును జేరి క్రమముగా సముద్రతీరమును జేరెను.

ఇట్లాశ్చర్య రామాయణ యుద్ధకాండమున
ప్రథమ సర్గము ముగిసెను.

---

## రెండవ సర్గ ప్రారంభము

౧ అనంతరము రామచంద్రమూర్తి మొసళ్లు మొదలగు జల జంతువులచే భయంకరమై యొప్పుచున్నదియును, గాలిచే పై కెగుర గొట్టబడుచున్న జలరాశి గలగియు నగు సముద్రమును జూచుచు సుగ్రీవునితో నిటులఁ బల్కెను. సుగ్రీవా! మనము సముద్రతీరమునకు జేరితిమి. కాని కిష్కింధలో నున్నపుడు మనకు సముద్రతరణ విషయమైన యే విచారము కలిగెనో, ఆ విచార మిప్పుడు గలుగుచున్నది. ఏదైన గొప్ప యుపాయముచే దీనిని దాట సాధ్యము కాని, యుపాయము నాలోచింపకుండ దాట సాధ్యము కాదు.

౨ సుగ్రీవా! మన వానరసైన్య మంతయు నిపుడు సముద్రపు టవతలి యొడ్డునకు జేరు నుపాయమును మన మందఱము కలిసి యాలోచింప వలసి యున్నది. అంతవరకు సముద్రతీరమున వానరసైన్యమును నిలుపవలసినది. వానరసైన్యములో నొకడుకూడ నితర స్థలమునకుఁ జీలిపోకుండ నుండునటుల నాజ్ఞాపింపుము.

శ్రుత్వా తద్వచనం తతో రవిసుత స్సౌమిత్రిణా సంయుత
స్తీరే వారినిధే ర్మహీరుహయుతే సేనాం తతో౽వేశయత్
తచ్ఛాఖామృగవాహినీ జలనిధి స్సంశోభతే౽న్యోన్యథాః
తద్వేలావన మేత్య తత్ర కపయః పశ్చా న్నివిష్టాశ్చ తే. 3

ఏవం వానరవాహినీ జలనిధే స్తీరే నివిష్టా సతీ
వాతోద్ధూతతరంగ మాశరగణై స్సంసేవితం సర్వతః
ఆకీర్ణంచ భుజంగమై ర్జలచరై రన్యైశ్చ ఘోరం తథా
పశ్యన్తీ వరుణాలయం ప్రముదితా తస్థౌచ వేలావనే. ४

సేనా సాచ నివేశితాంబుధితటే నీలేన సర్వా తతో
మైందశ్చ ద్వివిదశ్చ వానరవరా వేతా వుభౌ జాగ్రతౌ
తద్రక్షార్థ మలం విచేరతు రథో సౌమిత్రి మేతి ద్వచః
ప్రాహైవం రఘునందనో వికలహృద్వ్యామ్యాత్మజః
సంస్మృతేః ౫

* లోకే కాలగతో వినశ్యతి మహా౯ శోకో౽పి నూనం మమ
ప్రాయోభూ ద్విపరీత మద్య తదలం శోకో౽భివృద్ధో మమ
దుఃఖం నే సహ దూరగావనిసుతే త్యాహోస్వి దన్యైర్హృతా
సీతా౽భూదితి కింతు భూమితనయా ప్రాయో వృథైతీతి శుక్. ౬

---

* భూమితనయా ప్రాయో వృథైతీతి శుగితి–తస్యాయ మాశయః – భూమిజాయా యావన మతివర్తతే; వార్ధకం సమేష్యతీతివా; తద్యావన మహం నానుభూతవా నితివా;

౪౫ ఇంక, అరిష్టసూచకముగూడ రాక్షసులకుఁ గన్పడుచున్నది. రాక్షసుల నక్షత్రమయిన మూల నక్షత్రము శని కేతువులచే నాక్రమింపబడినందున రాక్షసుల కరిష్టము తప్పదు. ఇంకను మనకు శుభశకునములు గానవచ్చుచున్నవి. వనములు పుష్పములచే ఫలములచే నిండియున్నవి. ఉదకములు నిర్మలములుగా నుండెను. మన కపిసైన్యము సంతోషముతో ప్రకాశముతో నున్నది. ఈ శుభశకునములను గాంచి సంతసింపుము.

౪౬ ఇవ్విధముగ లక్ష్మణునిచే బాగుగబోధింపబడిన రామచంద్రమూర్తియు లక్ష్మణుడు చెప్పిన శుభశకునములనుజూచి మిక్కిలి సంతోషపడెను.

౪౭ ఆ వానరులు వాయువేగముగ బోవుచున్నవారలై రాముని ప్రయోజనమునందే ద్రుఢసంకల్పులై తమ పరాక్రమమును బలమును ఉద్రేకమును పరస్పరము గనబరచుచుండిరి. ఆ వానరులలో కొందఱు వేగముగఁ బోవుచుండిరి. కొందఱు పైకెగురుచుండిరి. మఱి కొందఱు కిలకిలారావములు చేయుచుండిరి. కొందఱు చెట్లను విరుగకొట్టుచుండిరి.

౪౮-౪౯ కొందఱు గర్జించుచుండిరి. మరికొందరు కొండల నెక్కుచుండిరి. ఇంకను కొందఱు సింహనాదములను జేయుచుండిరి. కొందఱు తాళ్ళతోను చెట్లతోను నాడుచుండిరి.

౫౦* ఇవ్విధముగ వానరసైన్యముతో శ్రీరామచంద్రమూర్తి వెళ్ళుచు మార్గమధ్యమున నంజనాదేవిచే సభక్తికముగాఁ బూజింపఁబడెను. ఆమె పూజకు మెచ్చి వరమ్ములిచ్చి మునుపటివలెనే హనుమంతుని భుజములపై నధిష్టించి వేగముగా గొప్పవానరసైన్యముతో నుత్సాహపడుచు వాక్యముల బలుకుచు వెళ్ళుచుండెను.

---

* అంజనాదేవి రామున కాతిథ్యముచేసనవిషయము వారాహపురాణమున వేంకటేశ్వర మహాత్మ్యమున విస్తృతముగ గన్పడును. ఆకథ యిచట ననుసంధేయము. (అది యెట్లన) "రావణవధార్థమై ధను

తథాహి. ఏతస్మిన్విషయే వారాహపురాణే వేంకటేశ్వర మాహాత్మ్యే సంస్థితాం కథాయ మత్ర సుసంగమః. తథాహి ఋశ్యమూకాచలా త్తస్మా ద్వానరై ర్బహుభి ర్వృతః, రావణస్య వధార్థాయ కృతోద్యోగ స్సకార్ముకః, శేషా చలసమీపే తు యదా రామ స్సమాగతః, తదా సత్యంజనా దేవీ వాయుసూనో ర్మహాత్మనః, జననీ పురతో గత్వా రామం రక్తాంతలోచనం, నమస్కృత్య మహాభాగా వచనం చేద మబ్రవీత్, ప్రతీక్షన్తి మహాబాహో త్వదాగమన మద్భుతమ్, తిష్ఠామ్యస్మి న్గిరౌ రామ మునయోఽపిచ కాననే, తపః కుర్వన్తి సతతం త్వదాగమనకాంక్షయా, తా న్సర్వా న్సమనుజ్ఞాప్య గన్తు మర్హసి సువ్రత, ఇత్యుక్తః ప్రాహ రామోఽపి హనూమన్మాతరం ప్రతి, కాలాత్యయో భవే ద్దేవి మయి తత్ర సమాగతే, మమేదానీం వరారోహే కార్యస్య మహతీ త్వరా, పునరాగమనే దేవి తథా భవతు సున్దరి, ఇత్యుక్తం రాఘవే ణైత ద్వాక్యం శ్రుత్వా మహామతిః హనూమా న్ప్రణతో భూత్వా వాక్యం చైత దువాచ హ, స్థాతవ్య మత్ర భవతా యత్రకుత్రాపి సర్వథా, యస్మా ఖ్రాంతా మహాసేనా వానరాణాం తరస్వినామ్, సుస్వాదు కంద మూలోఽయ మఞ్జనాఖ్యో మహాగిరిః, ఇత్యుక్తో వాయుపుత్రేణ శ్రీరామః ప్రాహ మారుతిం, జానేఽహ మఞ్జనాసూనో తథాపి వచనం తవ, శ్రోతవ్యం హి మహాబాహో గచ్ఛాఽగ్రే త్వం హరీశ్వర, ఇత్యుక్త్వా వాహినీం తాంచకర్ష న్పర్వత మాయయా, శాపమోక్షం చ యక్షాణాం కేషాంచి త్పర్వతో త్తమే, దత్వా

ర్బాణధారియై ఋశ్యమూక పర్వతమునుండి రామచంద్రమూర్తి వానర సైన్యముతో బయలుదేరి శేషాచల సమీపమునకు వచ్చుచుండగా హనుమంతుని తల్లియైన యంజనాదేవి రామచంద్రమూర్తి కెదురుగ వచ్చి యాయనకు నమస్కరించి యీ క్రింది విధముగఁ బ్రార్థించెను. రామచంద్రా! యీ పర్వతమునందలి యీ వనమున నేనును మహర్షులునుగూడ నీ రాకకు నిరీక్షించుచు నిచట తపస్సు చేసికొనుచుంటిమి. మమ్ముల నందరిని ననుగ్రహించి వెళ్ళుమని ప్రార్థింప రామచంద్రమూర్తి యంజనాదేవితో నిటులఁ జెప్పెను. "దేవీ! నాకు గాలాతిక్రమణము గలుగును. కార్యముయొక్క తొందర యెక్కువగా నుండెను. నేను తిరిగివచ్చునపుడు నీ కోరికప్రకారము జరుగుగాక" యని పలుకగా, నా వాక్యము విని యాంజనేయుడు చేతులు జోడించి రామచంద్రమూర్తి నిటులఁ బ్రార్థించెను. "రామచంద్రప్రభూ! యీ వానర సైన్యమంతయు నెడతెగకుండ నడచుచుండుటవలన శ్రమచెందియున్న కారణముచే నెచ్చటనైనను నొకచోట విశ్రమించవలసిన యవసర ముండెను. ఇదియునుంగాక, వానరు లందరకు నిచ్చట సమృద్ధిగ మధురమైన కందమూల ఫలాదులు లభించును" అని హనుమంతుడు చెప్పగా రామచంద్రమూర్తి యిటులఁ బలికెను. "హనుమంతా! నీ మాట తప్పక వినవలసియుండెను గాన నీవు ముందు నడువుము. నేను వానర సైన్యము నంతను దీసికొని వచ్చెద" నని చెప్పి వెంటనే సైన్యము నంతను దీసికొని యంజనా పర్వతమునకు రామచంద్రమూర్తి వచ్చి యచ్చట శాపగ్రస్థులయి యున్న కొందఱు గంధర్వులకు

పశ్చాత్తత్కపివాహినీ ప్రముదితా సుగ్రీవసంరక్షితా
యుద్ధౌత్సుక్యవశా న్ముహూర్త మనస న్నక్త్వాపి మార్గే పునః
నానాచిత్రవిచిత్రకాననదీః పశ్యం త్యగా దధ్వని
ప్రాలేయాచలతుల్య మద్రి మధికం సహ్యాభిధం సా చమూః॥౧

---

రామో ఽఞ్జనాదేవ్యా ఆశ్రమం పుణ్యదర్శనమ్, సంప్రాప్య తు మహాభాగా మాపృచ్ఛ్య రఘునందనః, తత్ర పుష్కరిణీం గత్వా లక్ష్మణాద్యై స్సమన్వితః, కృత్వా స్నానం మహాతీర్థే సర్వత్ర విజయప్రదే, ఫలమూలాని చానీయ మహర్షిభ్యో వితీర్య చ, పృథక్పృథక్ కుటీం కృత్వా తస్థౌ సూర్యసుతాదిభిః, సుస్వాదుఫలమూలాని మధూని సురభీణి చ, ఆనీయ వాయుపుత్రస్తం పూజయామాస రాఘవమ్, తత్ర రామ స్ససంహృష్ట స్సుగ్రీవప్రముఖై స్సహ, న్యవస త్సుసుఖం రామ స్స్వగేహ ఇవ తత్ర తైః, వానరాశ్చ మహాత్మానో గోలాంగూలా మహాబలాః, సర్వత స్తత్ర పుష్పాణి మూలాని చ ఫలాని చ, మధూని స్వాదుతీర్థాని భక్ష్యజాతా న్యనేకశః, భక్షయిత్వా మదోన్మత్తా శ్చేరు స్తత్ర సహస్రశః, ఆప్లవంతః ప్లవంతశ్చ గర్జంతశ్చ ప్లవంగమాః, చేరు స్తే వానరా స్సర్వే ముదితా బలగర్వితాః, లంకాం సమూల ముత్పాట్య త్రికూటం వా మహాగిరిం, ఆనేష్యామో వయం సింధుం తరామ శ్చంద్రభాస్కరౌ, గృహ్ణీమ ఇతి తే సర్వే బ్రువంతః కోటిశః స్థితాః తతః ప్రభాతే విమలే రామో రాజీవలోచనః, వితీర్య చాంజనాదేవ్యై వరా నాపృచ్ఛ్య తాం పునః, సహ సైన్యై ర్మహాతేజాః ప్రతస్థే ౽రిజగీషయా, ఇతి.

౫౧ పిమ్మట నా వానరసైన్యము సుగ్రీవునిచే రక్షింపబడుచు యుద్ధము చేయు నుత్సాహముచే మార్గములో నెక్కడను ముహూర్తకాలమైన నిలువక, అనేక చిత్ర విచిత్రములైన నదులను, అరణ్యములను మార్గమధ్యమున గాంచుచు హిమవత్పర్వతముతో సాటియగు సహ్యాద్రినిఁ జేరెను,

---

శాపవిముక్తిని గలుగజేసి పిదప అంజనాదేవి యాశ్రమమునకు వచ్చి యామెచేఁ బూజింపఁబడి యామె నడిగి యచ్చటనుండి స్వామి పుష్కరిణికి సౌమిత్రి సుగ్రీవాదులతో గలిసి వెళ్ళి యా తీర్థమున స్నానము చేసి వచ్చునపుడు కందమూల ఫలాదులుకూడ తీసికొనివచ్చి మహర్షులకిచ్చి పిమ్మట నచ్చట వేరువేరుగఁ బర్ణ కుటీరములను గల్పించుకొని సుగ్రీవాది వానరులతో నచ్చట నా దినముండెను. హనుమంతుడు మధురమయిన ఫలములను దీసికొనివచ్చి రామచంద్ర మూర్తి మొదలగువారి కిచ్చి యతిథిపూజ చేసెను. రామచంద్ర మూర్తియును మిక్కిలి సంతోషముతో సుగ్రీవాది వానరులతో గూడ నచట స్వగృహమునందువలె సుఖముగ నా దినమంతయు గడపెను. వానరులును జాంబవంతుడు మొదలగు భల్లూకములును (ఎలుగుబంట్లును) ఆ పర్వతమునందు. తేనెను మధురమయిన ఫలములను స్వాదు జలమును నాస్వాదించియు భక్షించియు త్రాగియు నచట ప్రమత్తులయి సంచరించుచుండిరి. ఆ వానరులలో కొందఱు సంతోషముకొలది గంతులు చిందులు వైచుచు, మఱికొందఱు సింహనాదము చేయుచు బల గర్వితులయి సంచరించుచుండిరి - ఆ వానరులందరు నిట్లు గర్జించుచుండిరి. (ఏమన) "లంకను గాని, త్రికూటపర్వతమును గాని పెకలించి తీసికొని రాగలము, సముద్రమును దాటగలము. సూర్యచంద్రులను సైకము పట్టుకొనగలము" అని కోట్లకొలది వానరులు గర్జించుచుండిరి. పిదప ప్రాతఃకాలమున రామచంద్రమూర్తి అంజనాదేవికి వరముల నిచ్చి యామె నడిగి సుగ్రీవాది వానరులతోఁ దిరిగి లంకకుఁ బోవుటకుఁ బ్రయాణమయ్యె నని—

తచ్ఛైలే వకుళాశ్చ చూతపనసాశోకాదయో భూరుహా
నైకే సంతి ఫలోత్కరేణ నమితా వాప్యోప్యనేకా స్థితాః
కించాద్రౌ జలాశయాశ్చ బహవో౽తిష్ఠం స్తు తే వానరాః
స్నాత్వా తత్ర జలం నిపీయ బుభుజు స్స్వైరం ఫలా న్యప్యలమ్. ౫౨

తతో నిర్గత్య మలయం సమనుప్రాప్య రాఘవః
వానరానీకసంయుక్తః క్రమా త్సింధు ముపాగతః,
ప్రావేశ్య సర్వసైన్యం చ తత్తీరే స్వాయమాస సః. ౫౩

ఇత్యాశ్చర్య రామాయణే
యుద్ధకాండే ప్రథమ స్సర్గ స్సమాప్తః.

---

## ద్వితీయ స్సర్గః.

పశ్చాత్తజ్జలధిం నిరీక్ష్య సహసోద్ధూతాంబురాశిం తథా
నక్రాద్యై ర్జలజంతుభి ర్భయకరం ప్రాహార్కజం రాఘవః
సుగ్రీవాఽద్యవయంమహోదధి మిమం ప్రాప్తావిచింతాఽస్తి సా
యా నః పూర్వ మభూ ద్యముం నహి తరేమోపాయచింతాం
వినా. ౧

ఏత ద్వానరసైన్య మద్యతు యథా పారం పరం తు వ్రజే
న్మంత్రస్తు క్రియతాం తథాఽద్య నిఖిలై రస్మాభి రాశ్వర్కజ!
తావ త్సింధుతటేతు వానరచమూ స్సంస్థాప్యతాం నైవ త్వయా
త్యక్త్వాత్మీయచమూం న కశ్చిదపివా గచ్ఛే త్పరత్ర ధ్రువమ్. ౨

౫౨ ఆ పర్వతమున పొగడచెట్లు, మామిడిచెట్లు, పనసచెట్లు, అశోక వృక్షములు మొదలగు ననేక వృక్షములు ఫలభారముచే వంగినవై యున్నవి. మఱియు నట దిగుడు బావులు, సరస్సులు ననేకము లున్నవి. కనుక వానరు లా కొలనులలో స్నానముచేసి జలంబుల ద్రావి స్వేచ్ఛగా ఫలంబుల దిని తృప్తినందిరి.

౫౩ తరువాత శ్రీరామచంద్రమూర్తి వానర సైన్యముతో బయలుదేరి మలయ పర్వతమును జేరి క్రమముగా సముద్రతీరమును జేరెను.

ఇట్లాశ్చర్య రామాయణ యుద్ధకాండమున
ప్రథమ సర్గము ముగిసెను.

## రెండవ సర్గ ప్రారంభము

౧ అనంతరము రామచంద్రమూర్తి మొసళ్లు మొదలగు జల జంతువులచే భయంకరమై యొప్పుచున్నదియును, గాలిచే పైకెగుర గొట్టబడుచున్న జలరాశి గలగియు నగు సముద్రమును జూచుచు సుగ్రీవునితో నిట్లనియెను. సుగ్రీవా! మనము సముద్రతీరమునకు జేరితిమి. కాని కిష్కింధలో నున్నపుడు మనకు సముద్రతరణ విషయమైన యే విచారము కలిగెనో, ఆ విచార మిప్పుడు గలుగుచున్నది. ఏదైన గొప్ప యుపాయముచే దీనిని దాట సాధ్యముకాని, యుపాయము నాలోచింపకుండ దాట సాధ్యముకాదు.

౨ సుగ్రీవా! మన వానరసైన్య మంతయు నిపుడు సముద్రపు టవతలి యొడ్డునకు జేరు నుపాయమును మన మందఱము కలిసి యాలోచింప వలసి యున్నది. అంతవరకు సముద్రతీరమున వానరసైన్యమును నిలుపవలసినది. వానరసైన్యములో నొకడుకూడ నితర స్థలమునకుఁ జేరిపోకుండ నుండునటుల నాజ్ఞాపింపుము.

శ్రుత్వా తద్వచనం తతో రవిసుత స్సౌమిత్రిణా సంయుత
స్తీరే వారినిధే ర్మహీరుహయుతే సేనాం తతోఽవేశయత్
తచ్ఛాఖామృగవాహినీ జలనిధి స్సంశోభ తేఽన్యోయథాః
తద్వేలావన మేత్య తత్ర కపయః పశ్చా న్నివిష్టాశ్చ తే. ౩

ఏవం వానరవాహినీ జలనిధే స్తీరే నివిష్టా సతీ
వాతోద్ధూతతరంగ మాశరగణై స్సంసేవితం సర్వతః
ఆకీర్ణంచ భుజంగమై ర్జలచరై రన్యైశ్చ ఘోరం తథా
పశ్యన్తీ వరుణాలయం ప్రముదితా తస్థౌచ వేలావనే. ౪

సేనా సాచ నివేశితాంబుధితటే నీలేన సర్వా తతో
మైందశ్చ ద్వివిదశ్చ వానరవరా వేతా వుభౌ జాగ్రతౌ
తద్రక్షార్థ మలం విచేరతు రథో సౌమిత్రి మేత ద్వచః
ప్రాహైవం రఘునందనో వికలధీ ర్దుఃఖమ్యాత్మజా
సంస్మృతేః ౫

* లోకే కాలగతో విసృజ్యతి సుహృత్ శోకాంఽపి నూనం మమ
ప్రాయోభూ ద్విపరీత మద్య తదలం శోకోఽభివృద్ధో మమ
దుఃఖం నే సహి దూరగావనిసుతే త్యాహోస్విద న్యైర్హృతా
సీతాఽభూదితి కింతు భూమితనయా ప్రాయో వృథై
తీతి శుక్. ౬

* భూమితనయా ప్రాయో వృథైతీతి శుగితి-తస్యాయ
మాశయః - భూమిజాయా యావన మతివర్తతే; వార్ధకం
సమేష్యతీతివా; తద్యావన మహం నానుభూతవా నితివా;

3 రామచంద్రమూర్తి యిటుల చెప్పగా వెంటనే సుగ్రీవుడు లక్ష్మణునిగూడ దోడు తీసికొని వృక్షరాజములతో నొప్పుచున్న సముద్ర తీరమున సేనల నన్నిటిం బ్రవేశపెట్టెను. అచ్చట విడిసిన వానర సైన్యము రెండవ సముద్రమువలె నొప్పుచుండెను. ఆ వానరు లందఱు నచట సముద్రతీరము నందలి వేలావనమున నుండిరి.

౪ అచ్చట నివసించిన వానరసైన్యము, గాలిచే నెగుర గొట్టబడుచున్న తరంగములు గలదియును రాక్షసులతోను, మొసళ్ళతోను. జల సర్పములతోను, ఇతర జలజంతువులతోను భయంకరమయిన సముద్రమును జూచుచు సంతోషముతో వేలావనమునం దుండెను.

౫ సేనాపతియగు నీలుడు, ఏ సేన యెచ్చట నుండవలయునో, అచ్చటు నా ప్రకారము నింపిన పిదప, మైందుడును ద్వివిదుడు ననువానరవీరు లిరువురును జాగరూకులై యా సైన్యముల రక్షణమునకై యిటునటు దిరుగుచుండిరి. పిదప రామచంద్రమూర్తికి సముద్రమున కవతలి యొడ్డున నేకదా సీత యున్నదని యామె స్మృతికి రాగా, నపుడు వికల మనస్కుడై లక్ష్మణునితో శ్రీరామచంద్రమూర్తి యిటుల బలికెను.

౬ లక్ష్మణా! లోకములో సాధారణముగ నందఱికి దుఃఖము గలిగినచో నది కాలక్రమముగ నశించును. అనగా మొదట నున్న దుఃఖము తరువాత గొన్ని దినముల కుండదు. ఇది లోకసామాన్య విషయము. ఇది నాకు విపరీతముగ నున్నది. నానాటికి సీతను విడచిన దుఃఖము వృద్ధి యగుచుండెను. కాని తగ్గుటలేదు. సీత దూరమునం దున్నది కదాయని కాని, లేక యామెను రావణు డపహరించెనని కాని నేను వగచుటలేను. * సీతకు వయస్సంతయు వ్యర్థమైపోవుచున్నది కదా యని దుఃఖించుచుంటిని

---

* సీత వయస్సంతయు వ్యర్థమైపోవుచున్నది కదా యని దుఃఖించుచుంటిని - దీనిభావ మేమనగా—సీతాదేవియొక్క యౌవనము గడచిపోయినది ముదిమివచ్చునని కాని యామెయౌవనమును నేననుభవించనైతి నని కాని శ్రీరామునకు దుఃఖముకాదు. ఇక నెందుకనగా,

సత్యం బ్రవీమి సౌమిత్రే తద్వియోగ మితఃపరమ్
సోఢుంచ నహి శక్నోమి దహ్యేఽహం మదనాగ్నినా. ౭
సౌమిత్రే జనకాత్మజా దశరథస్యాపి స్నుషా మే ప్రియా
శేతే రాత్రిచరీవశంగతవతీ తన్మధ్యగా సా కథమ్.

---

రామస్య శోకః నభవతి కింతు, "సత్యాం కుర్మి దశగ్రీవ భస్మసా"దిత్యాది వచనానుసారేణ దశముఖం భస్మసా కర్తుం సమర్థాపి భూమిజా మద్రక్షణసామర్థ్యం విశ్వస్య మమాపకీర్తిర్భవి తేతి మత్వా భూమిజా సర్వదా మామేవ స్మృతవతీ దుఃఖితాభూత్. ఏవంస్థితే తస్యా ఉపకృతి మేతావదహం కించిదపి కర్తు మశక్తోఽభూవ మిత్యేవ రామస్య శోకః. నతు తద్భావన మననుభూతవా నహ మితి వేద్యమ్. ఏవమేవ మహాభారతేఽపిసంధృశ్యతే. ద్రౌపదీవస్త్రాపహరణకాలేశరణాగతయా తయా "గోవింద పుండరీకాక్ష రక్ష మాం శరణాగత" మిత్యుచ్చరితం. గోవింద నామాద్యాపి మాంబాధయతీ త్యజ్ఞాతవాసానంతరిక స్వడౌత్య నిష్క్రమణసమయే శ్రీకృష్ణే నైవం ప్రతిపాదితమ్ - "గోవిందేతి యదాక్రందత్, కృష్ణా మాం దూరవాసినం, ఋణం ప్రవృద్ధమివ మే హృదయా న్నాపసర్ప" తీతి. తస్యో భక్తాక్రందనధ్వని మాకర్ణ్య భగవాం స్తత్కష్ట నివారణపర్యంతం పరితాప మాప్నోతీతి వేద్యమ్.

౭ లక్ష్మణా! నేను యథార్థము చెప్పుచున్నాను. ఇంక సీతా వియోగ మును సహింపజాలను. నా శరీరము దహించుకొని పోవుచున్నది.

౮ లక్ష్మణా! జనక చక్రవర్తికి కూతురైయుండి దశరథమహారాజునకు కోడలయియుండియు నాకుఁ బ్రియసీయయ్యు రక్కసుల మధ్య వారి వశములో నుండవలసి వచ్చెఁగదా! ఆమె యెట్లు పరుండు చున్నదో గదా! రావణుని వక్షస్స్థలము బ్రద్దలగునటుల బాణము

---

"ఓ రావణా! నాభర్త యనుజ్ఞ లేకపోవుటవలన నిన్ను భస్మము చేయకుండ నుంటినని, రావణునితో పూర్వము సీత చెప్పిన మాటను బట్టి యీగామె రావణుని భస్మము చేయజాలినను నేను రక్షింపగలనని నమ్మియు, తానే రావణుని భస్మము చేసినచో నా శపకీర్తికలుగు ననియుఁ దలంచి యెప్పుడును నన్నే స్మరించుచు దుఃఖించుచున్నది. ఇట్టి స్థితిలోనే నా మెకుఁ గొంచెమైనను నింతవఱకు నేమియు నుప కారము చేయలేకపోతి నని శ్రీరామచంద్రమూర్తి దుఃఖపడుచుండె నని పైదాని భావమని తెలియదగినది.

ఇవ్విధముగ నే మహాభారతమున గూడ గన్పడును. దుశ్శాసనుడు నిండుసభలో తన వస్త్రముల నొలుచునపుడు ద్రౌపది "గోవిందా, నన్ను రక్షింపు" మని గోవిందనామముచ్చరించెను ఆ గోవిందా! యను మాట తనను పదుమూడు సంవత్సరములనుండి బాధించు చున్నదని పదుదాలుగవ సంవత్సరమున తాను రాయబారము పోవు టకు ముందు కృష్ణుడు పాండవులతో నిటులఁ జెప్పెను. "ధర్మ రాజా! నీవు యుద్ధము చేయుదువుగాక, చేయకపోదువుగాక! దూర ములోనున్న నన్ను వస్త్రాపహరణకాలమున ద్రౌపది, గోవిందా! యని పిలిచెను. దూరస్థుడనుగా నుండుటచే ఆ దుష్టుల నేమియు చేయజాల నైతిని. గోవిందా యనుమాట నా హృదయమునుండి తొలగిపోక ప్రతిదినము ఋణము వడ్డీతో బెరిగినట్లు పెరుగుచున్నది. ఆ అప్పు నేను దీర్చుకొనవలసియున్నది" యని చెప్పెను. అందువలన భక్తుల యాక్రందనమును భగవంతుడు విని వారి కష్టములను దీర్చువఱకు మిగుల పరితాపపడుచుండు నని తెలియదగినది.

పఙ్క్త్యాస్యోరసి నాయకా సహ మలం సంక్షిప్య సీతాం కదా
ప్రత్యాహృత్య సలంభయామి చ కదా శోకం విమోక్ష్య
మ్యహమ్. ౮
శోకం మద్విరహాగతం మహాసుతా నూనం కదా వాత్యజే
దుఃఖం భ్రాతృవియోగజనితం మోక్ష్యామ్యహం వా కదా
ఏవం చింతయతోఽస్య హంసవిహగ స్తత్రాగత స్సత్వరం
దృష్ట్వా దక్షిణ దిక్సమాగత మిదం ప్రాహోక్త తం రాఘవః. ౯
పశ్చా ద్గమిష్యసి సరః ప్రతి మానసం త త్పాథేయ ముత్సృజ
బిసగ్రహణాయ భూయః। మాం తావ దుద్ధర శుచా
దయితా ప్రవృత్త్యా, స్వార్థా త్సతాం గురుతరా ప్రణయ
క్రియైవ. ౧౦
ఏవం కథయత స్తస్య చిరా ద్భార్యావియోగినం
హంసం విహంగమం హంసీ తజ్జాయాఽన్వేషిణీ పతిమ్
తత్రాగతా సతీ దైవా త్స్ఖలితాఽభూ త్తతః పరమ్
* శాపముక్తౌ శుభౌ సద్యో దివ్యరూపధరౌ తతః
నత్వా చ రాఘవం స్తుత్వా ప్రోక్త్వా సీతాసుఖస్థితిం
తన్మేళనం ద్రుతం తస్య విమానేన దివం గతౌ. ౧౧-౧౨-౧౩

---

* శాపముక్తౌ శుభౌ ఇతి - హంసపత్త్రిణా వేతౌ పురా కౌ ? ఏతయోః కో వా కిమర్థం శాపం దదా విత్యత్రేయం పౌరాణికీ గాథానుసంధేయా - పురా కస్మింశ్చి దగ్రహారే వకుళాంబేతి కాచన పతివ్రతా స్థితా. తత్సదనాంతికస్థ నికేతనే పరనిందాపరాయణౌ ద్విజదంపతీ న్యవసతామ్. జాయాపతీ చ తావేతస్యాం వకుళాంబికాయాం దోషారోపణం కుర్వంతౌ

లను ప్రయోగించి వానిని హతమార్చి సీత నెప్పుడు తీసికొని రాగలనో కదా! ఎప్పుడు నేను నీ దుఃఖమును విడుతునో కదా యని పలికెను.

మఱియు తనలోని నా విరహదుఃఖమును సీతాదేవి యెప్పుడు విడువగలదు. నేను సీతావియోగదుఃఖము నెప్పుడు విడువగలను? అని శ్రీరాముడు చింతించుచుండ నచ్చటికి నొక హంస వచ్చెను. దక్షిణదిక్కునుండి వచ్చిన హంసను గాంచి శ్రీరామచంద్రమూర్తి యిటుల బల్కెను

౧౦ ఓ హంసా! తరువాత మానససరోవరమున కేగవచ్చును. తామర తూండ్లు తెచ్చుకొనవచ్చును. ఇప్పుడు నీ నోట నములుచున్న తామర తూండ్లు విడిచి స్పష్టముగా సీతాదేవి వృత్తాంతము చెప్పి సీతావియోగదుఃఖితుడనగు నన్నుద్ధరింపుము సజ్జనులకు స్వార్థముకంటె పరోపకారమే గొప్పది కదా!

౧౧-౧౨౧౩ శ్రీరాముడు ఈ రీతిగ బలుకుచుండ చిరకాలమునుండి భర్త నెడబాసిన యాడుహంస భర్తను వెదకుటకు వచ్చి దైవయోగమున నచ్చట పతియగు మగహంసను గలిసికొనెను. పిమ్మట నా హంసదంపతులు * శాపవిముక్తులై యప్పుడే దివ్యరూపధరులై శ్రీరాముని నమస్కరించి స్తుతించి సీతాదేవికుశలవార్తను చెప్పి విమాన మెక్కి స్వర్గమునకు వెళ్ళినవి.

---

* శాపవిముక్తు లయిరి. ఈ హంసపక్షులు పూర్వ మెవ్వరు? వీరల కెవ్వ రెందునకై శాపమిచ్చి రను విషయములో నీ క్రింది పురాణగాథ యనుసంధానము చేసికొనదగినది

పూర్వకాలమున నొక యగ్రహారమున వకుళాంబయను నొక పతివ్రత యుండెను. ఆమె గృహమునకు ప్రక్కనున్న గృహములో భార్యాభర్త లిరువురు బ్రాహ్మణదంపతు లుండిరి. వార లిరువురు పరాపవాదము పరనింద చేయు స్వభావము గలవారు. ఆ దంపతులు వకుళాంబ యను పతివ్రతయందు లేనిపోని దోషముల

పశ్చా ద స్తంగతే భానౌ లక్ష్మణాశ్వాసిత శ్చ సః
కాలేతు పశ్చిమాం సంధ్యా ముపాస్య న్యవస త్సుఖమ్. ౧౪
తతో రఘుపతి స్తస్యాం రాత్రౌ సూర్యాత్మజాదిభిః
సేనేయం మహతీ తీర్త్వా కథం స్యా ద్దుస్తరాంబుధిమ్
ఇత్యబ్ధితరణోపాయం చింతయ న్నవస త్సుఖమ్. ౧౫

ఇత్యాశ్చర్య రామాయణే యుద్ధకాండే
ద్వితీయ స్సర్గ స్సమాప్తః.

---

వేవావసతామ్. తదపవాదవచనా న్యసహమాన స్తత్పతి స్స్వజాయా మాత్మనో నికేతనా న్నిష్కాసితవాన్. సాచ తతఃపరం దుఃఖితా తజ్జాయాపతీ త్యేవం శశాప, యతో మా మగతికాం పతత్త్రిణీ మివ యువా మకురుతా మతో యువా మగతికౌ పతత్రిణౌ భూత్వాచ జాయాపతీ వియోగదుఃఖ మహామివానుభవిష్యథ ఇతి - తత స్తావుభా వపి పశ్చాత్తప్తౌ తత్పాదయో ర్నిపత్య శాపవిముక్తిం ప్రార్థయామాసతుః. స్వభావతో౽తిమృద్వీ సాప్యేవ మనుజగ్రాహ, యదా యువయో శ్శ్రీరామచంద్ర సందర్శనం భవితా తదా శాపవిముక్తి ర్భవితేతి. పశ్చాత్తావేవ జాయాపతీ కాలక్రమేణ హంస పతత్త్రిణా వుద్భూతౌ క్రమా జ్జాయాపతీచ భూత్వా వియోగ దుఃఖ మనుభవతః. స్వప్రేయసీ మన్వేషయ న్నుపమా న్పతత్రీ దక్షిణస్యా దిశ ఆగచ్ఛ న్రామేణ సందృష్టః ప్రేయసీ కుశల వార్తాంచ సంపృష్టః. ఏతస్మి న్నంతరే దైవా త్తజ్జాయాపి తత్రాగతా. స్వభర్త్రా మిళితా. రామానుగ్రహేణ తావుభావపి శాపవిముక్తౌ దివ మగాతా మితి.

౧౪ పిమ్మట సూర్యుఁ డస్తమించగా శ్రీరామచంద్రమూర్తి లక్ష్మణునిచే నోదార్చబడి సంధ్యావందనము చేసి సుఖముగా నుండెను.

౧౫ పిమ్మట నారాత్రియందు సుగ్రీవాదులతో నీ వానరసైన్యము దుస్తరమగు నీ సముద్రము దాటుటెట్లని సదుపాయము నాలోచించుచు సుఖముగ నుండెను.

ఇట్లు యుద్ధకాండమున ద్వితీయసర్గము ముగిసినది.

---

నారోపించుచు నామె భర్తకు కల్పితకథలను జెప్పుచు నామెయందు భర్తకు ద్వేషము కలుగునట్లు చేయగా, భర్త యపవాదమును భరింపలేక తన భార్యయయిన వసుశాంబను తన గృహమునుండి వెడలగొట్టెను. ఆమె పిదప మిక్కిలి దుఃఖపడి యా బ్రాహ్మణ దంపతుల మూలకముగ తనకు భర్తృవియోగము సంభవించినది యని తెలిసికొని వారి నీ క్రిందివిధముగ నామె శపించెను. ఓ దంపతులారా! నన్ను దిక్కులేని పక్షిని వలె మీరు చేసినందున మీరుకూడ పక్షులై నేను భర్తృవియోగదుఃఖ మనుభవించునట్లు మీరుకూడ పరస్పర మెడబాటుగలిగి వియోగదుఃఖ మనుభవించెదరు గాక యని శపించెను. పిదప వారలు పశ్చాత్తాపపడి యామె పాదములమీదఁబడి శాపవిముక్తిని ప్రార్థింపఁగా, స్వభావముచే కారుణ్యముగల వసుశాంబ వారలయందు కనికరము జూపుచు నిట్లు శాప విముక్తిని జెప్పెను. ఓ దంపతులారా! మీకు శ్రీరామచంద్రమూర్తి దర్శన మయినతోడనే శాపవిముక్తి కలుగుగాక యని చెప్పెను. ఆ దంపతులు మృతినొంది హంసపక్షు లయి పుట్టి, క్రమముగ దంపతులుకూడ నయి శాపవశముచేతనే పరస్పర మెడబాటు కలిగి యొకరినొకరు వెదకుకొనుచుండ మగపక్షి దక్షిణదిశనుండి వచ్చుచుండగా రామచంద్రమూర్తి దానిఁజూచి సీతా కుశలవార్త నడుగుచున్నంతలో దైవవశముచే మగహంసను వెదకుకొనుచు నాఁడహంసకూడ నచ్చటకువచ్చి తన భర్తను కలిసికొనగలిగెను. కలుసుకొనుటయే కాక రామ దర్శనముచేతను తదనుగ్రహముచేతను శాపవిముక్తులై దివ్యరూపధారులై స్వర్గమునకు విమానములో వెళ్ళిరి, అని.

## తృతీయ స్సర్గః

లంకాయాం పవనాత్మజేన తు కృతం కర్మాతిఘోరం ముహు
స్సంస్మృత్యాఽఽశరనాయకోఽతిచకితః కృత్వాసదో మంత్రిణః
ఆహూయా ప్యఖిలా న్విభీషణముఖాన్ సాపత్రపోఽవాఙ్ముఖః
ప్రాహైనం దశకంధర స్సదసి తా న్నితి ప్రధానం వచః. ౧

నూనం దుష్ప్రసహా పురీ తు కపినా సేయం ప్రవిష్టా తథా
భగ్నాశోకవనీచ తేన మహాజౌ దృష్ట్వా పురీ ధగ్ధితా
ప్రాసాదోఽపి తథాకృతోఽసురవరా నైకే హతాశ్చాభవన్
లంకా ప్యావిలతా మనాయి సచివైః కర్తవ్య మాలోచ్యతాం. ౨

వక్తవ్యంచ భవద్భి రద్య భవితా యద్యుక్త మత్యుత్తమం
లోకే ప్రాహు రనుత్తమం తు విజయం సన్మంత్రమూలంబుధాః
మిత్రై ర్బంధుభి రాత్మమంత్రిభి రలం మంత్రస్తు కార్యో నృపై
స్సర్వే తేఽత్ర వసంతి కార్య మధునా యుష్మాభి రాలోచ్య
తామ్. 3

నూనం వానరవాహినీపరివృతో లంకాం నిరాతంకతో
రామః ప్రాప్స్యతి సంతరిష్యతి సుఖం వారాంనిధిం సానుజః

## మూడవసర్గ ప్రారంభము

౧ (రామచంద్రమూర్తి సైన్యముతో సముద్రతీరమునకు వచ్చినట్లు చెప్పి యిప్పుడు లంకలో నీలోపుగా జరిగిన వృత్తాంతము చెప్పబడుచున్నది.) లంకలో రావణుడు హనుమంతునిచేఁ జేయబడిన యశోకవనభంగము మొదలగు ఘోరకృత్యములను మాటిమాటికిఁ దలంచి మిక్కిలి భయమంది సభ దీర్చి విభీషణాది మంత్రులఁ బిలచి యాసభలో సిగ్గుచేఁ దలవంచుకొని మంత్రులతో నీతియుక్తమగు వాక్యమిట్లు పలికెను.

౨ ఓ మంత్రులారా! నిశ్చయముగ మన లంక యెవ్వరికిని బ్రవేశింప శక్యము కానిది. అట్టి లంకను ఒక వానరమాత్రుడు ప్రవేశింప గలిగెను. ప్రవేశించుటయే కాక మన యశోకవనమును రూపుమాపెను. సీతను జూచెను. చైత్యప్రాసాదమును విఱుగఁ గొట్టెను. పట్టణమునంతయు నల్లకల్లోలము చేసెను. రక్కసులను జంపెను. ఒక్క వానరుని నివారింపలేనివారలు పెక్కు వానరులు వచ్చిన, నేమి చేయగలరు? కావున కర్తవ్యమును మంత్రులయిన మీరందఱు నాలోచింపవలయును.

3 ఓమంత్రులారా! మీరలందఱు నాలోచించి, యే మార్గము యుక్తమో యుత్తమమో చెప్పుడు. లోకములో నీతిశాస్త్రవేత్తలు విజయమునకు మంత్రాలోచనమే మూల మని చెప్పుదురుగదా! రాజులు మంత్రాలోచనమును తమ మేలుఁగోరు బంధుగులతోను మిత్రులతోను మంత్రులతోను చేసి కార్యము నారంభింపవలెను. అట్టి వారందఱు నిచ్చటనే యుండిరి. ఇప్పుడు కర్తవ్యము నాలోచించి మీరలు చెప్పెదరు గాక.

౪ ఎవడో కుంటరి క్రోతివాడు గంతులువెట్టి పోయిన మాత్రాన నింత యాలోచనము చేయవలయునా? అని యందురేమో యని చెప్పుచుండెను. ఇంతమాత్రముతో సరిపోదు. రామచంద్రమూర్తి వానరసైన్యముతో నిరాటంకముగా సముద్రమును దాటి లంకలో బ్రవేశించును. సముద్రము నెట్లు దాటునని తలంపకుడు. తన

నోచే ద్బాణశ తై స్తు శోషయతి వా సింధుం తు నో ద్వాపరః
కించాత్రో నగరే ప్రవిశ్య కపయః కుర్యు ర్విరుద్ధం ధ్రువం. ౪

తస్మా దాలోచ్యతాం యచ్చ యుక్తం హితకరం భవేత్
ఇత్యుక్తా రాక్షసా శ్శత్రుబలాజ్ఞానవశా త్తదా
నీతిబాహ్యా దశముఖం ప్రాహు రేవ మబుద్ధయః. ౫॥

రాజన్ కిం ను విషాద మేష్యతి భవాన్ పూర్వం జితా భోగిపూ
ర్యక్షేశోఽపి జిత స్త్వయాఽఽహృత మభూ త్తత్పుష్పకం
స్తై మహాత్ ! త్వద్భ్రాతే రసురీ మయ స్తవ పురా కన్యాం
దదౌ వాక్నసః! కిం పాంథో ప్సుగ రాక్షసోఽపి పరితాం నీత
స్త్వయా ప్యాహవే. ౬॥

పూర్వం తత్రభవాన్ భవాంస్తు వరుణం తస్యాత్మజాం శ్చాజయః
కించత్వం శృణు పన్నగాశ్చ విజితా నాగాధిపో నిర్జితః
శంఖ స్తక్షక వాసుకీచ విజితా దేవా స్తథా నిర్జితా
మాయాం శ్చాపగతా స్త్వయా బహువిధా రాజన్ యమో
నిర్జితః. ౭॥

తస్మాత్తే సదృశో న హా ధ్రువమయం రామః కయా న్మానుషః
కించాల్పాః కపయోపి తిష్ఠతు భవా న్నత్రైవ సర్వే వయమ్
గత్వా జేతు మలం భవేమ చ కపీ న్సర్వాం స్తథా రాఘవా
వస్మా స్వన్యమనస్సు మారుతసుతోఽ కృత్యం చకా రేదృశమ్,
౮॥

గత్వా స్వర్గ మలం సురై రభినుతః పూర్వం భవా నప్యభూ
న్నాసం కేవలమానుషా ద్రఘుపతేః కార్యా త్వయా నాపి భీః

యమోఘమైన బాణములచే సముద్రము నింకింపజేసికూడ దాట గలడు. సందియము లేదు. వానరు లెట్లయిన లంకలో బ్రవేశించి కూడని పనులు గూడఁ జేయుదురు. నిశ్చయము.

౫౪ కావున, మనకు మేలుగలుగునట్లుయుక్తముగ నాలోచింపుడని రావణుడు చెప్పగా, నా రాక్షసులు నీతిబాహ్యులుగాన శత్రువుయొక్క బలమును దెలిసికొనలేక రావణునితో నీ క్రిందివిధముగఁ బలికిరి.

౬౪ ఓ రావణప్రభూ ! నీవేల విచారపడెదవు ? నాగలోకమును జయించితివి. కుబేరుని గెల్చి పుష్పకవిమానమును దెచ్చితివి. నీవలని భయముచే మయుడను రాక్షసుడు తన కొమరితయగు మండోదరిని నీ కొసంగెను. యుద్ధరంగమున మధు వను రక్కసుని లోబరచు కొంటివి. ఇట్టి నీవు మానవమాత్రు డొకడు లంకకు వచ్చునని భయపడియెదవేల ?

౭౪ మహాత్మా ! నీవుచేసిన పనుల నింకను జెప్పెదము వినుము. పూర్వము నీవు వరుణదేవుని నతని పుత్రులనుగూడ గెల్చితివి. పాతాళమున ఆదిశేషువు తక్షకుడు వాసుకి మొదలగు పన్నగులను గెల్చితివి. స్వర్గమున దేవతలను జయించితివి. అనేక విధములయిన మాయలను దెలిసికొంటివి. యమునిగూడ గెల్చితివి.

౮౪ ఇందఱను జయించిన నీకు రాము డెట్లు సమాను డగును ? అత డొక సామాన్య మానవుడు. అతడెంత ? వానరులా అల్పులు. వీరివిషయమై యింత యాలోచన మేల ? నీ విచటనే యుండుము. మేమందఱము వెళ్ళి రామలక్ష్మణులను వానరుల నందఱనుగూడ జయించి రాగలము. హనుమంతుడు వచ్చి లంక దగులపెట్టినప్పుడు మీర లెక్కడికి వెళ్ళితిరని యనియెదరేమో, మే మందఱము పరాకుగా నుండుటచే నింతపని నతడు చేసెను.

౯౪ ఇదియునుంగాక స్వర్గలోకమును జయించి యచ్చటి దేవతలచేఁ బూజింపబడితివి. అట్టి నీవు కేవల సామాన్యమానవునివలన భయ

పుత్త్రం త్వింద్రజితం భవాన్ రణకృతే సంప్రేషయేచ్చేత్కపీ
న్సర్వానప్యయ మేకఏవ విలయం నేష్యత్యరం రాఘవౌ. ౯౫

పశ్చాదంబుదసన్నిభోఽసురవరో నామ్నా ప్రహస్తః పునః
ప్రాహైవంతు చమూపతి ర్దశముఖం కృత్వాంజలిం మస్తకే
దేవశ్చాపి భవంత మాహవతలే జేతుం నశక్తాః పురా
యుద్ధే కిం పునరాశరేశ కపయో మర్త్యాస్తు భక్ష్యాస్తవ.
౧౦౫

పూర్వం తేన హనూమతా కృత మిదం లంకాపురీధర్షణం
నూనం రాత్రిచరప్రమాదవశతో జాతం నచ ద్వాపరః
యాస్య త్యద్య సమీరసూను రసుభిః కుత్రాధునా వా విభో
కర్తుం భూమి మిమా మవానరయుతాం శక్తోఽహ మాజ్ఞాపయ
౧౧౫

పశ్చాద్దుర్ముఖఏవ మాహ దమజాధీశం విధాయాంజలిం
నాథాఽహం పరిఘం ప్రగృహ్య గతవాన్రామం తథాలక్ష్మణమ్
సుగ్రీవాంగదముఖ్యవానరవరైస్సాకం విహత్యాశు తే
ప్రాప్స్యామ్యంతిక మాశు మా మధిపతేఽస్మాకం సమా
జ్ఞాపయ. ౧౨౫

తతః కౌంభకర్ణి ర్నికుంభోఽసురస్తం
దశాస్యం ప్రతీదం వచః ప్రాహ నమ్రః
భవంతస్తు సర్వే వసం త్వత్ర తూర్ణం
హనిష్యా మ్యహం తం సమూలంతు రామమ్. ౧౩౫

పడవలసినపనిలేదు. ఇంతయేల? రణశూరుడగు నీ కుమారుడయిన యింద్రజిత్తుని నొకనిఁ బంపినఁ జాలును అతడు సర్వనాశనమును జేయ సమర్థుడు.

౧౦౫ (సభలోని రక్షసు లిట్లు చెప్పిన పిమ్మట మంత్రులు సేనాపతులు మొదలగువార లిట్లనుచుండిరి. వారిలో ప్రహస్తుడను సేనాపతి లేచి రావణునితో నిట్లు చెప్పదొడగెను.) మేఘమువలె నల్లనివాడయిన ప్రహస్తుడను సేనాపతి రావణునితో నిట్లు చెప్పెను. ప్రభువర్యా! నీకేల యీ విచారము. దేవతలుకూడ యుద్ధములో నిన్ను జయింప జాలరుగదా! ఇక క్రోతులా నీ యెదుట నిలచి యుద్ధము చేయ గలవు? మన శాహారములయిన మానవులా యుద్ధము నీతోఁ జేయునది.

౧౧౫ హనుమంతుడు లంకాపురినంతను అల్లకల్లోలము చేయుట రాక్షసులు ప్రమాదముతో నుండుటచే (అనగా మమ్ము నెదిరించు వాడెవ్వడు? అని యేమఱియుండుటచే) తటస్థించెను గాని లేకపోయిన ప్రాణములతో పోవగలడా? ఇప్పుడు మాత్ర మా క్రోతి ప్రాణములతో నెచ్చటకుఁ బోగలడు? చతుస్సముద్రపర్యంతమయిన యీ భూమిని వానరు లనువారు లేకుండఁజేసెదను.

౧౨౫ ఇట్లు ప్రహస్తుడు చెప్పిన పిదప దుర్ముఖుడు లేచి చేతులు జోడించి రావణునితో నిట్లు చెప్పదొడగెను. రాక్షసరాజా! నే నొకడనే యీ నిమిషమునఁబోయి పరిఘను జేతబట్టి సుగ్రీవాది వానరసహితముగా రాముని దెగటార్చి నీయొద్దకు వచ్చెదను. నా కాజ్ఞ నిమ్ము, అని పలికెను.

౧౩౫ పిదప కుంభకర్ణునికొడుకయిన నికుంభుడు లేచి నమ్రతతో రావణుని గూర్చి యిటులఁ బలికెను. రాక్షసరాజా! మీర లందఱు నిచ్చటనే యుండుడు. నిశ్చయముగ రాముని సమూలముగ నే నొక్కడనే హతమార్చి వచ్చెదను.

పశ్చా ద్వజ్రహనుః ప్రాహ దశానన మిదం వచః
భక్షయిష్యా మ్యహం సర్వా న్వానరాంశ్చ నరావపి. ౧౪॥

యజ్ఞహా రభసశ్చాథ మహాపార్శ్వ మహోదరః
సూర్యశత్రుశ్చ సుప్తఘ్నో దుర్ధర్ష శ్చేంద్రజి త్తథా
వజ్రదంష్ట్రో౽తికాయశ్చ విరూపాక్ష శ్చ పట్టసాన్
ప్రగృహ్య పరిఘా న్ప్రాసా న్ప్రాయుధా న్యూచు ప్రభుమ్.
౧౫-౧౭॥

రామం లక్ష్మణసంయుక్తం రవిసుతం లంకాపురీధర్షకం
సామీరించ కపీ న్పరానపి వయం హన్యామ నూనం విభో
కించైక స్త్వవ సూను రింద్రజి దయం సర్వా న్వినిష్యత్యగం
తూష్ణీం తిష్ఠ విముంచ శోక మధునా త్వంసస్సుఖా జ్జ్ఞాపయ. ౧౮॥

మృత్యుంజయం సమభ్యర్చ్య వరా నో౽న్యసుదుర్లభాన్
ప్రాప, యో మఘవానంచ బద్ధ్వా చానీతవా న్పురీం
తవాత్మజే స్థితే తస్మి న్వికలః కిం భవా నభూత్. ౧౮॥-౧౯

ఏవం పౌరుషవాక్యాని వదత స్తా న్నిశాచరాన్
వారయి త్వోపవేశ్యాథ ప్రాంజలి స్స విభీషణః
నమస్కృత్యా౽౽శరాధీశం ప్రాహైవం ధర్మతత్పరః, ౨౦॥
కార్యస్య సాధనే నీతా * వుపాయత్రయ మీరితం

* ఉపాయత్రయ మీరిత మితి - ఏవమేవ కామందకే సందృశ్యతే, "సామాదీనా ముపాయానాం త్రయాణాం విఫలే నయే, వినయే న్నయసంపన్నో దండం దండ్యేషు ధర్మభృ"దితి.

౧౪ పిదప వజ్రహను వనువాడు రావణునితో నిటుల జెప్పెను. మహా ప్రభూ! దీనికింతయాలోచన మేల? నే నొక్కడనే పోయి నరులను వానరులను గూడ నందఱను భక్షించి వచ్చెద ననెను.

౧౫-౧౭ పిదప యజ్ఞహుడు, రభసుడు, మహాపార్శ్వుడు, మహోదరుడు, సూర్యశత్రువు, సుప్తఘ్నుడు, దుర్ధర్షుడు, ఇంద్రజిత్తు, వజ్రదంష్ట్రుడు అతికాయుడు, విరూపాక్షుడు, పరిహస్త నికుంభాదుల మార్గము ననుసరించి వారివారి యాయుధములను జేతఁబట్టి త్రిప్పుచు రావణు నితో నిటుల బలికిరి.

౧౮ ఓరాక్షసరాజా! రామలక్ష్మణులను, వానరరాజైన సుగ్రీవుని, లంకాపురి వల్లకల్లోలము చేసిన హనుమంతుని నితరవానరుల నంద ఱను మేమిపుడే వెళ్ళి చంపివచ్చెదము మేమందఱముకూడ నక్కర లేదు. ఒక యింద్రజిత్తే వారల నందఱను హతము చేసి రాగలడు. నీ విచట నే యూరకయుండుము. విచారమును విడువుము మమ్ముల నాజ్ఞాపింపుమనిరి.

౧౮-౧౯ రాక్షసరాజా! ఏ యింద్రజిత్తు మృత్యువును జయించిన పరమేశ్వరుని వలన నితర దుర్లభములైన వరములను బొందియుండెనో, ఏ మహాశయుడు దేవేంద్రుని బంధించి లంకకు దెచ్చెనో, అట్టి నీ కొడుకుండ నీవేల విచారపడుచుంటివి?

౨౦ ఈ ప్రకార మాయుధముల జేతఁబట్టి పౌరుషవాక్యములను బలుకు చున్న యందఱను నివారించి వారివారి స్థానములఁ గూర్చుండబెట్టి విభీషణుడు సోదర క్షేమచే రావణునిగూర్చి నమస్కారపూర్వ కముగ నిట్లు చెప్పదొడగెను.

౨౧-౨౨ అన్నా! * కార్యమును సాధించుటకు సామదానభేదము లను

---

* కార్యమును సాధించుటకు సామదానభేదములను మూడుపా యములే. కాయుండకమను నీతిశాస్త్రమునందు నివ్విధముగనే కన్పడును. (వేమన) "సామదానభేదములను నుపాయములు మూడును నిష్ఫలము లయినపుడు దండోపాయమును బ్రయోగింపవలయు" నని.

తదుపాయై రసాధ్యేతు కార్యే దండః ప్రకీర్తితః
ప్రథమోక్తా నుపాయాం స్త్రీ న్ప్రయుజ్జ్యైవ సోదర
దండోపాయప్రయత్నస్తు రిపౌ యుక్తో భవేన్నహి. ౨౧—౨౨

ఏవ మేవ స్తువం త్యేతే కార్య మాయోధనం తు యైః
తద్విధాయక శాస్త్రం తు స్మారయామి తవాధునా
*పురుషా వింశతిః ప్రోక్తా యోద్ధవ్యా నీతికోవిదైః. ౨౩—౨౪

భ్రాత స్సంశృణు వచ్మి తథ్య మబల శ్శాఖామృగః కశ్చన
ప్రాప్యైతాం నగరీం విధాయ వి[illegible]ర్దైః కష్టం త్వశక్యం పురా
కర్మాద్యాపి భయమానహం జనకజాందృష్ట్వాయయౌ స్వేచ్ఛయా
రామస్యాంతిక మాశరాః పున రిమే నాత్రస్థితాః కిం తదా. ౨౫

---

*పురుషా వింశతిః ప్రోక్తా ఇతి—"బాలో వృద్ధో దీర్ఘరోగీ తథా జ్ఞాతిబహిష్కృతః, విరక్తప్రకృతిశ్చైవ దేవబ్రాహ్మణనిందకః, దుర్భిక్షవ్యసనోపేతో విషయే త్వతిసక్తిమాన్, భీరుకో భీరుకజనో లుబ్ధో లుబ్ధజన స్తథా, అనేక చిత్తమంత్రశ్చ దైవచింతక ఏవచ, దైవోపహతకశ్చాపి బలవ్యసనసంయుతః, అదేశస్థో బహురిపు ర్యుక్తో కాలేన యశ్చన, సత్యధర్మవ్యపేతశ్చ వింశతిః పురుషా అమీ, ఏతైస్సంధిం న కుర్వీత నిగృహ్ణీయాత్తు కేవలమ్" ఇతి.

మూడుపాయములే రాజనీతియందుఁ జెప్పబడినవి. ఈ మూడుపాయములచే కార్యము సాధింపబడదేని దండోపాయమును బ్రయోగింపవలయు నని నీతిశాస్త్రమునఁ జెప్పబడెను. మొదటఁ బ్రయోగింపవలసిన సామదాన భేదోపాయములను మూడిటి నుపయోగింపకయే దండోపాయమునకు (యుద్ధమునకు) ప్రయత్నించుట యుక్తముగా లేదు.

౨౩-౨౪ అన్నా! మనవారలు వీరు యుద్ధమును బోగడుచున్నారుగదా! ఎవరెతో యుద్ధముచేసిన జయము గలుగునో, ఆ విషయమును దెల్పు శాస్త్రములను నీకుఁ దెలిసినను జ్ఞాపకము చేయుదును. వినుము. * ఇరువది రకముల పురుషులతోనే యుద్ధము చేయవలయునని నీతివేత్తలు చెప్పుదురు. (వారిలో రామచంద్రమూర్తి చేరడని భావము.)

౨౫ ఓ సోదరా! సత్యముగ నొక వాక్యమును చెప్పెదను వినుము. బలములేని యొక వానరుడు మన లంకాపురి కరుదెంచి దేవతలు నైతము చేయలేని భయంకర మగు కృత్యమును గావించి సీతాదేవిని జూచి స్వేచ్ఛగా శ్రీరాముని యొద్ద కేగెను. అప్పుడీ రాక్షసు లెక్కడ లేరా?

---

* ఇరువది రకముల పురుషులతో—

బాలుడు, వృద్ధుడు, దీర్ఘరోగి, జ్ఞాతులచే బహిష్కరింపబడిన వాడు, విరక్తిగలవాడు, దేవబ్రాహ్మణులను నిందించువాడు, దారిద్ర్య కష్టముతో నున్నవాడు, భోగలంపటుడు, భయస్వభావముగలవాడు, లుబ్ధుడు, ఏకాభిప్రాయము కాని యాలోచన ప్రకారము చేయువాడు, దైవసాహాయ్యము లేనివాడు, చతురంగ బలసంబంధమయిన వ్యసనము గలవాడు; ఎక్కువ శత్రువులు గలవాడు, ఒకని యాజ్ఞలో నుండువాడు, సత్యధర్మములకు దూరమైనవాడును, ఈ మొదలయిన యిరువది పురుషులతో యుద్ధము చేయవలయును. పై వారలతో సంధి చేసికొనగూడదు. (అని నీతిశాస్త్రమున గన్పడును.)

ఏతాదృ క్ఛతకోటివానరయుత స్సూర్యాత్మజేనాన్వితః
సంయుక్త స్త్వనుజేన రాఘవవిభు స్తీర్త్వాంబుధిం సత్వరం
లంకా మేష్యతి నూన మాహవతలే యోద్ధుం బలాఢ్యాస్తు తే
రేతేషు ప్రభవే త్త్వమీరజవసహశౌర్యాతిదూరేషు కః. ౨౬

కించ యుద్ధసమిత్తంచ కిమస్తి దనుజేశ్వర
మారితా దనుజాః పూర్వం తేన మారుతసూనునా
ఏవం త్వయా చేత్కథితం వచ్మి తత్కారణం శృణు. ౨౭
ఆత్మజాయాపహర్తా లోకే హ్యాతా యది తదా పునః
కోను తిష్ఠతి తేజస్వీ తూష్ణీం వద దశానన
స్వజాయాన్వేషణే రామః ప్రేషయామాస మారుతిం
సీతాం నిరీక్ష్య గచ్ఛంతం ప్రథమం మారుతిం పునః
ఆతాడయ స్తనే హ్యైతాం స్స్వాంతక్షార్థం తు మారుతిః
రాక్షసా స్హతవా న్నూనం దోష స్తస్య న విద్యతే.
౨౮–౨౯–౩౦

రామేణ యోద్ధు మధునా యతసే యది త్వం
తే తత్కృతాపకృతి రిద్యగితి త్వమేవ
బ్రూహ్యసురేశ ! గహనస్థితతత్కళత్రం
హృత్వాపకార మధికం కృతవాం స్త్వ మాదౌ. ౩౧
ఖరాదయో హతాః పూర్వం రాఘవేణేతి చేద్వచః
వదతి భ్రాత రస్యాపి కారణం భగినీ తవ
తత్రాపి దోషలేశోఽస్తి రాఘవే నహి రావణ, ౩_౨_౩౩

౨౬ ఇట్టి నూరుకోట్ల వానరులతో సుగ్రీవునితో లక్ష్మణునితో శ్రీరామ చంద్రమూర్తి సాగరముదాటి లంకకు రాగలడు. నిశ్చయము. యుద్ధ రంగమున బలాఢ్యులైన వారితో యుద్ధముచేయుటకు హనుమంతుని శౌర్యమునకు జాలిన మన రాక్షసులలో నెవ్వడు సమర్థుడు?

౨౭॥ రాక్షసేంద్రా! ఇప్పుడు రామునితో యుద్ధమునకు మాత్రము కారణ మేమున్నది? లేకేమి? రాముడు వాయుపుత్రునిచే మన రాక్ష సులను జంపింపలేదా యందువేని దానికి కారణము జెప్పెద వినుము.

౨౮-౨౯-3౦॥ లోకమున నితరులు తన భార్యను హరించినప్పుడు పరా క్రమము గలవా డెవ్వడైన నూరకుండునా? శ్రీరాముడు హనుమం తుని సీతాన్వేషణమునకై పంపెను. ఆ సీతాదేవిని గాంచి వెళ్ళు చుండగా ముమ్మందు మన రాక్షసులు హనుమంతుని గొట్టిరి. అత డాత్మరక్షణకై మన రాక్షసులను జంపెను. నిశ్చయము. ఇందతని తప్పేమున్నది?

3౧॥ రాక్షసేంద్రా! రామునితో నిపుడు యుద్ధముచేయం బ్రియ త్నించుచున్నావుగదా! ఆయన నీకుం జేసిన యపకారమేదియోయిట్టి దని నిరూపించి నీవే చెప్పుము మొదట నెవ్వరి కెవ్వ రపకారము చేసిరని విచారింతము. ఎచ్చటనో యడవిలో నున్న రాముని భార్య నపహరించి తెచ్చి యాయనకు మొదట నపకారము చేసినవాడవు నీవేకదా.

3౨-33 అన్నా! ఖరదూషణాదులను ముందు రాముడేగదా చంపెనని యనియెదవేమో కాని, దానికి కారణభూతురాలు నీ చెల్లెలే యై యున్నది. ఆ ఖరదూషణాదులను జంపుటలోగూడ రామునితప్పు లేదు. (అనగా శూర్పణఖ ఖరదూషణాదులను రాముని మీదికి దండెత్తి పంపగా వారలు రామునిమీదికి యుద్ధమునకుబోయిరి తనప్రాణమున కపాయము వచ్చినపుడు తమ్ము తాము రక్షించుకొనుటకు రాముడు ఖరదూషణాదులతో యుద్ధము చేసెను. రాముని తప్పులేదని భావము.)

పరదారాపహరణ మాయుః కీర్తిం వినాశయేత్
లంకావాసినాం నూనం నాశహేతు ర్మహీసుతా
భవిష్యతి న సందేహ స్త్య జ్యతా మధునాపివా
యుద్ధకారణ మేవాద్య నభవే త్తేన తే పునః. ౩౪-౩౫

కాముక స్స న్నహం సీతాం లంకాం నానీతవా న్ధ్రువం
కింతు మత్సోదరా స్తేన హతా స్త్వద్రామ మాహవే
హంతు మేవాత్ర సబీజం మహా మానీతవా నితి
వదే ద్యది భవాం స్తే స్యా త్సీతయా కిం ప్రయోజనం
త్యక్త్వా తాం రాక్షసై స్సాకం వ్రజే ద్రామాంతికం భవాన్
యోద్ధుం తదా పురీయం స్యా ద్రక్షితా నచ తేఽ యశః.
౩౬-౩౭-౩౮

భ్రాత స్త్వం శృణు రాఘవోఽమితబలో ధర్మానురక్త స్తథా
యత్ర స్థాస్యతి ధర్మబుద్ధి రతులా తత్ర స్థిత స్స్యా జ్జయః
తాదృ గ్ధర్మయుతేన రామవిభునా యోద్ధుం ప్రయత్నస్తు తే
యుక్తో నైవ భవే త్సమర్పయ మహీజాతాం తు తస్మై
ద్రుతమ్. ౩౯

మదుక్తం వచనం తాత శృణోతి యది నో భవాన్
రాక్షసై స్సహ లంకేయం వినష్టా స్యా ద్ధ్రువం విభో. ౪౦

న కేవలం భవా న్రాజా మమ భ్రాతేతి గౌరవాత్
తత్ప్రీతిత శ్చ నత్వాఽహం వచ్మి మద్వచనం శృణు. ౪౧

౩౪-౩౫ రాక్షసేంద్రా! పరదారాపహరణము వలన, ఆయువు, కీర్తియు గూడ నశించును. ఈ లంకలోనివారి కందఱకు, అపాయము కలుగుటకు సీతయే కారణము. ఇందుకు సందియము లేదు. ఇప్పుడైనను మించలేదు, సీతను విడిచిపెట్టుము. అట్లు చేసినచో నీకును ఆ రామునకును నిక యుద్ధకారణమే లేకపోవును.

౩౬-౩౭-౩౮ నేను సీతను కాముకుడనై తీసుకొనిరాలేదు. ఖరదూషణాదులను రాముడు చంపెను గాన యుద్ధమున రామునిగూడ నేను జంపవలయునని యాయనను యుద్ధమునకు లాగుటకై సీత నిచటకు దెచ్చితి నని యనియెద వేమో! అట్లయినచో సీతతో నేమిపని? ఆమెను విడిచిపెట్టి రాక్షసులతో రామునిమీదికి నీవే యుద్ధమునకు బొమ్ము. అప్పుడు లోకము మెచ్చును. (అనగా, అతని తమ్ములను జంపిన హేతువుచే రావణుడు యుద్ధమునకు వచ్చెనని లోకము మెచ్చునని భావము.) సీతను విడిచి యచ్చటికే యుద్ధము చేయబోయినచో నీకు నపకీర్తియు నుండదు. లంకయు సురక్షితముగా నుండును.

౩౯ అన్నా! వినుము. రామచంద్రమూర్తి సామాన్యబలము కలవాడు కాడు. మఱియు దేహబలమునకు దోడు ధర్మబలము గలవాడు. కావున నెచ్చట ధర్మముండునో, అచ్చటనే జయముగూడ నుండును. అట్టి ధర్మాత్ముడగు రామునితోఁ గయ్యమునకుఁ బ్రయత్నించుట మంచిదికాదు. వెంటనే సీతను రామునకు సమర్పింపుము.

౪౦ తండ్రీ! నేను చెప్పినమాటను నీవు వినకపోతివేని (అనగా సీతను రామచంద్రమూర్తికి సమర్పింపవేని) రాక్షసులతో సహితము లంకాపట్టణము నాశనమైపోవును.

౪౧ నీవు నాకు రాజువుమాత్రమే కావు అన్నవు కావున గౌరవముతోను భక్తి ప్రేమచేతను నమస్కరించి యింతగా జెప్పుచుంటిని. మాటను వినుము.

భ్రాత ర్మా మనుగృహ్ణీష్వ కృపాం కురు మయి ప్రభో
పథ్యం శుభకరం మేఽహం వచనం వచ్మి తచ్ఛృణు. ౪౨

ఏవ మాత్మహితాం తస్మి న్వదత్యపి దశాననః
త ద్వచ శ్శ్రవణేఽభీష్టరహితోఽసురనాయకః
విసృజ్య సదస స్తూర్ణ మగా ద్వాస్త్రీనికేతనమ్. ౪౩

ఇత్యాశ్చర్యరామాయణే యుద్ధకాండే
తృతీయ స్సర్గ స్సమాప్తః.

---

చతుర్థ స్సర్గః

తతః పరదినే ప్రాతః పున ర్భయయుతో హితం
దశాననస్య భవనం నిర్జగామ విభీషణః. ౧

తత్ర గత్వా దశాస్యం తం రక్షోద్విజగణార్చకం
నమస్కృత్య తదా ప్రాహ ప్రాంజలి స్స విభీషణః. ౨

భ్రాత ర్మే వచనం శ్రోతు మనిచ్ఛత్యపి వై త్వయి
త్వయి ప్రేమవశా ద్భూయో వక్తు మాగాం తవాంతికమ్. ౩
సాధ్వీభూమిసుతా యదా త్రభవతాఽఽనీతా తదారభ్య వై
రక్షోధీశ బహూని దుష్టశకునా న్యత్రోద్భవంతి ధ్రువమ్
నాగ్ని ర్భాతి విశేషతః పరివృతో ధూమేన శాలా స్వలం
కించోధాంసి గవాం పయోవిరహితా న్యత్యంతశుష్కాణి చ. ౪

౪౨ అన్నా! నన్ననుగ్రహింపుము. నా యందు దయనుంచుము, నీకు మేలుగలుగునట్టి యథార్థమయిన మాటను జెప్పుచున్నాను. వినుము.

౪౨౹ ఇవ్విధముగఁ దన మేలుగోరి విభీషణుఁడు చెప్పుచున్నను నతని మాటలను వినుటయం దిష్టములేక రావణుఁడు నాటిదినము సభ చాలించి యింటికి వెడలిపోయెను.

యుద్ధకాండమున మూడవ సర్గము సమాప్తము.



## నాల్గవ సర్గ ప్రారంభము

౧ పిమ్మట మరునాటి యుదయమున విభీషణుఁడు మరల హితబోధ చేయుటకై రావణుని గృహంబున కరిగెను. (ఉదయమున విభీషణుఁడు వెళ్ళిన కారణ మేమనగా రావణుఁడు స్నానసంధ్యాజపములు చేసికొను కాలముగాన శాంతచిత్తుఁడుగ నుండుననియుఁ దనమాటలను శాంతముతో వినుననియు దలచి యుదయమున వచ్చెనని తెలియ దగును.)

౨ విభీషణు డచ్చటకు వెళ్ళి రాక్షసబ్రాహ్మణులఁ బూజించుచున్న రావణునకు నమస్కరించి దోసిలొగ్గి భక్తితో నిటులఁ బలికెను.

3 ఓ సోదరా! నా మాట నీవు వినగోరకపోయినను సోదరప్రేమచే మరలఁ జెప్పుటకు నీ యొద్దకు వచ్చితిని.

౪ ఓ రాక్షసేంద్రా! పతివ్రతయగు సీతాదేవిని నీ వెప్పు డీ లంకకుఁ దెచ్చితివో, అప్పటినుండి యిచ్చట దుశ్శకునములు గానవచ్చుచున్నవి. వానిని గొన్నిటిని జెప్పెదను వినుము. అగ్నిశాలలో అగ్ని మిక్కిలి పొగతోఁగూడుకొని ప్రకాశించుటలేదు. ఆవుల పాదుగులు పాలు లేక యెండిపోయినవి.

చక్రాకారతయా గృహేషు గరుడా నూనం భ్రమంతి ప్రభో
కించాగ్న్యాయతనేషు పన్నగవరాః ప్రాయ శ్చరంత స్థిస్తాః
సర్వే ష్వత్ర విదం త్వ్యథాపి చకితా స్తే నాబ్రువ న్కించన
భ్రాత స్త్వం తు మయా సమీరిత మిదం పృష్ట్వాఽసురా
న్విధ్వరమ్. ౫

తచ్ఛ్రుత్వాఽథ విభీషణం దశముఖః క్రుద్ధో వచః ప్రాహ తమ్
రేరే ప్రాణభయం కిమాగత మభూ దేవం వృథా జల్పసి
రామో భూమిసుతాసమీప మపి నో ప్రాప్తుం సమర్థో భవే
ద్దేవై శ్చాపి సమేత్య వా రఘుపతి ర్మేఽగ్రే నహి స్థాస్యతి. ౬

ఇత్యుక్త్వా రావణః క్రుద్ధ స్సంత్యజ్యచ విభీషణం
పున స్సభాం గత శ్శీఘ్రం భూయో మంత్రయితుం హి తైః. ౭

ప్రహస్తాద్యసురైః పూర్ణాం సభాం వీక్ష్య సమంతతః
సేనాపతిముఖా నేవం ప్రాహ పఙ్క్తిముఖ స్తతః. ౮

ప్రతికార్యం సద్భై తావ ద్భవతాం మత మాశ్రితః
కృతవా నహ మద్యాపి భవతాం సమ్మతం యథా
ప్రవర్తేఽహం సమాలోచ్య వక్తవ్యం మద్ధితైషిభిః
కుంభకర్ణోఽపి చాగా ద్ద్వ్య సభా మేతాం సముత్థితః
షోయం దక్షిణబాహు ర్మే సమేతిస్మ సభా మిమాం
తదాగమనశోనూనం సభేయం పూర్ణతాం గతా. ౯-౧౦-౧౧

౫ గ్రద్దలు గ్రహములపైని చక్రాకారముగా దిరుగుచున్నవి. అగ్నిశాలల లో సర్పములు ప్రాకుచున్నవి. ఈ సంగతి లంకలోనివారి కందరికిఁ దెలిసినను నీకు భయపడి చెప్పరైరి. నీవు సోదరుఁడ వని నేను జెప్పితిని. నేను జెప్పినది నిజమగునో కాదో నీవు విచారించి తెలిసికొనుము.

౬ పిదప రావణుఁడు విభీషణుని మాటలు విని కోపముతో నిట్లుఁబలికెను. ఓరీ ! అది యట్లుండనిమ్ము. ఇప్పుడు నాకు వచ్చిన ప్రాణభయమేమి ? రాముఁడు దేవతలను సహాయముగా దీసికొనికూడ సీతయొద్దకు రాలేడు. నా యెదుట నిల్వలేడు.

౭ ఇట్లు రావణుఁడు కోపముతోఁబలికి విభీషణుని విడిచి పురల వేగముగ హితులతో నాలోచించుటకై సభ కేతెంచెను.

౮ ప్రహస్తుఁడు మొదలగు మంత్రులతో నిండియున్న సభను తేరిపార జూచి రావణుఁడు వారితో నిట్లుఁ బలికెను.

౯-౧౦-౧౧ ఓ మంత్రులారా ! ఇంతవర కే పని చేసినను మీ యభిప్రాయమును కనుగొని మీమీ యిష్టముచొప్పున జేయుచుంటిని. ఇప్పుడును మీ యిష్టము చొప్పున నే చేయుదును. నా మేలును గోరిన మీరలు చక్కగ నాలోచించి చెప్పవలయును. నాకుఁ గుడిభుజము వంటి వాఁడైన కుంభకర్ణుఁడు నిద్ర నుండి లేచి సభకు వచ్చినందున సభ నిండుసభగా నిపు డుండెను.

* ఏతావత్తు మదాశయోఽపి భవతాం నోక్తోఽద్య వచాశ్రి
శరాః, వైదేహీం గహనే స్థితాం రఘుపతేర్జాయాం
సురూపా మహమ్, కామేనైవ సమానయం మహీసుతా
నోరీచకారాపి మాం, భూజాతాపగమే భవేన్మమ మృతి
ర్యుద్ధేఽస్తి తద్వ్యాపరః. ౧౨

కించ రామోఽర్కజాతాద్యై ర్వానరై స్సహితోఽంబుధేః
తీరే సమేత్య స్థితవాం స్తరిష్యతి చ వారిధిం
హత్వా రామం యథా సీతాం లభేఽహం సచివోత్తమాః
తథోపాయం సమాలోచ్య భవంతః కథయంతు మే. ౧౩-౧౪

తచ్ఛ్రుత్వా కుంభకర్ణస్తు క్రుద్ధో వాక్యమువాచ తమ్
కమాపృచ్ఛ్య భవాన్సీతాం రామలక్ష్మణరక్షితాం
ఆనీతవా నభూత్కార్యం సమాలోచ్య భవాన్పునః
కృతవాన్వాఽధునా కృత్వా కార్యం తే మంత్రణం పునః
నయుక్తమితి మన్యేఽహం కార్యస్య కరణాత్పురా
మాదృశాన్పృష్టవాంశ్చేత్త్వ ముపాయం తు వదేమహి.
౧౫-౧౬-౧౭

---

*భవతాం నోక్త ఇతి- అనేనైతావద్రావణకృతసీతాపహారణవృత్తాంతో హనుమత్కృతలంకాదహనపర్యంతం కేషాంచిదేవ జ్ఞాతపూర్వో నతు సర్వేషా మిత్యవగమ్యతే. అంతఃపురస్త్రీణాం కాసాంచిద్విజ్ఞాతః తద్ద్వారతో విభీషణోఽపి తత స్తం జ్ఞాతవా నితి వేద్యమ్.

౨౨ * ఓంమిత్రులారా ! నా మనస్సులోని యభిప్రాయమును నేను మీ కింతవరకు జెప్పియుండలేదు. ఇప్పుడు చెప్పుచున్నాను. వినుడు. జనకుని కొమార్తెయును, రాముని భార్యయును, త్రిలోకసుందరియు నగు సీత దండకవనమునం దుండగా నే నామెను కామముచే లంకకు దెచ్చితిని. కాని యామె యింతవరకు నన్నంగీకరింపలేదు. యుద్ధములో నేను చత్తునో చావనో సందియము కాని, సీత లేకపోయినచో మాత్రము కామాగ్నిచే నేను చచ్చుట నిజము.

౧౩-౧౮౫ ఓ మిత్రులారా! రాముడు మనపై దండెత్తుటకై సుగ్రీవాది వానరులతో బయలుదేరి సముద్రతీరమునకు వచ్చి విడిసియున్నటుల దెలియుచుండెను. అంతవరకు వచ్చినవాడు సముద్రమును గూడ నెట్లో దాటిరాగలడు, ఇప్పుడు కర్తవ్యమేమనగా, రాముని నెట్లో చంపి సీత దక్కునట్లు చేసికొనుట నా ముఖ్యోద్దేశము. దీనికి దగిన సలహా మీరు చెప్పవలయును.

౧౯౧౬-౧౭౫ రావణుడు పై విధముగ జెప్పచుండగా, కుంభకర్ణుడు లేచి కోపముతో రావణునిగూర్చి యిటులఁ బలికెను. రాక్షసేంద్రా! మొదట నీ నెవనితో సంప్రదించి రామలక్ష్మణులచే రక్షింపబడుచున్న సీతను నీ విచటకు దొంగిలించి తెచ్చితివి? మొదట చక్కగ నాలోచించి కార్యము చేయనలయునా / కార్యము చేసిన పిమ్మట నాలోచనను చేయవలయునా ? సీతను నీ విచటకుఁ దీసికొనిరాక పూర్వమే నాబోంట్లను నీ వడిగియున్నచో మేము మంచి సలహా చెప్పుదుము గదా !

---

* దీనిని బట్టి జూడ రావణుడు సీతను రహస్యముగా నుంచినట్లును, ఏ కొందరికో తెలిసినను ఈ విషయ మందఱకు తెలియనట్లును; హనుమంతుడు వచ్చి లంకను దగులపెట్టినతర్వాత అందరికి తెలిసినట్లును గోచరించుచున్నది.

ప్రాణాపాయస్య సమయే విచారే కిం ఫలం భవేత్
రాజకార్యే ష్వలం మంత్రం ప్రథమం యః కరోతి సః
స్వకార్యస్య వినాశేపి విచారం నగతో భవేత్ ౧౮-౧౯

భ్రాత స్త్వం త్వతిదుష్టకార్య మధికాపాయాన్వితం దుస్సహం
పూర్వంత్వై కృతవా నభూ రనుచితం హ్యద్యాపి ధన్యో భవాన్
యః ప్రాణాస్తు తే నాం భయం తే [illegible] స్సంపేక్ష్య నైవావధీ
త్తత్రై వాత్మకళత్ర చౌర్యసమయే తస్యాద్య తుష్టో భవ. ౨౦

యద్య ప్యనుచితం కర్మ త్వయా కృత మజానతా
సర్వం సమీకరిష్యామి స్వస్థచిత్తో భవ ప్రభో. ౨౧

మహాపార్శ్వ స్సముత్థాయ ప్రాహైవ మథ రావణం
ప్రాణైః కంఠగతై ర్వాపి నత్యాజ్యా భూమిజా త్వయా. ౨౨

కుంభకర్ణేంద్రజిన్ముఖ్యాః పంచషా వా వయం విభో
సమూలం రాఘవం హంతుం సమర్థా స్త దలం భియా. ౨౩

పశ్చాత్తత్ర నిశాచరా దశముఖం ప్రాహు స్తదైవం విభుం
సంహార శ్చ కియా న్భవిష్యతి విభో శాఖామృగాణాంతు నః
రామార్థే పరిచింతనం త్విద మహో బ్రహ్మాస్త్రపాత శ్శ్నకే
లంకాదగ్ధృకపీంద్రసంహృతికృతి స్స్వైరా-ధునా చింత్యతామ్.
౨౪

౧౮-౧౯ ప్రాణములమీదికి వచ్చిన తర్వాత నీ విప్పు డాలోచించిన ఫల మేమి ? రాజ కార్యములలో మొదట జక్కగ నాలోచించి ప్రారంభించిన కార్యము, పిమ్మట చెడిపోయినను విచార ముండదు.

౨౦ అన్నా ! మిక్కిలి యపాయకరమయినదియు దుస్సహమైనదియు ననుచితమునగు దుష్టకార్యమును జేసితివి, ఇప్పటికి నీవు చాల ధన్యాత్ముడ వేయని చెప్పవచ్చును. ఎందువల ననగా, సీత నపహరించు కాలమున రాముడు నిన్ను జూచినచో నప్పుడే నిన్ను హతమార్చి వేయును. అట్టిదిక్కులేనిచావు గలుగనందుకు నీవుసంతోషింపుము.

౨౧ అన్నా ! నీవు తెలిసియో తెలియకయో అనుచితమయిన పని చేసితివి. చేసినదానికి వగవ పనిలేదు. సర్వమును నేను సమకూర్చెదను నీవు స్వస్థచిత్తుండవై యుండు మని చెప్పి విరమించెను.

౨౨ పిమ్మట మహాపార్శ్వుడు లేచి రావణునితో నిటులఁబలికెను. ప్రాణము కంఠగతమైనను (అనగా ప్రాణముమీదికి వచ్చినను) సీతను మాత్రము నీవు విడువగూడదు.

౨౩ రాక్షసేంద్రా ! కుంభకర్ణుడు, ఇంద్రజిత్తు మొదలగు మేమైదారుగురమే రాముని సమూలముగా హతముచేయ సమర్థులము. నీవు భయపడవలసిన యవసరములేదు.

౨౪ పిమ్మట సభలోని రక్కసులు తమ ప్రభువగు రావణునితో నిటుల పలికిరి. రాక్షసేంద్రా ! కోతులను జంపుటయనగా మా కెంతపని. రాముని విషయమై యింత యాలోచన పిచ్చుకమీద బ్రహ్మాస్త్ర ప్రయోగమునలె నున్నది. మన మాలోచించవలసినది యొక్కటి మాత్రముండెను, అది యేదన ? లంకను దగులబెట్టిన కోతిని జంపుట విషయమై యాలోచింపవలెనని,

తతో విభీషణః ప్రాహ రావణం ప్రాంజలి ర్వచః
రాక్షసానాం రంజనంతు తవ కార్యం మహాప్రభో
తేషా మపకృతి ర్న్యాన మయుక్తా దశకంధర. ౨౫

త్వయైకేన కృతం పాప మేకేన నగతం భవేత్
ఆవరిష్యతి సర్వాంశ్చ లంకాపురనివాసినః
మహాద్రిసన్నిభా నూనం కపయోఽత్ర సమాగతాః
సమావృత్య పురీం సర్వాం పీడయేయు రిమాః ప్రజాః ౨౬-౨౭

యేన త్వంతు పురా జిత స్సురపతేః పుత్త్రేణ నూనం విభో
యే నైకేన శరేణ సోపి నిహత స్తం మన్యసేఽల్పం త్వహో
ఏతస్మా దధికం కిమస్తి భువనే మౌర్ఖ్యం దశగ్రీవ హా
పూర్వం రామహతో విరాధదనుజ స్త్వద్ధీనవీర్యః కిము ? ౨౮

నకుంభకర్ణేంద్రజితౌ చ రాజం
స్తథా మహాపార్శ్వ మహోదరౌ చ
నికుంభకుంభౌచ తథాఽతికాయ
స్థాతుం న శక్తా యుధి రాఘవాగ్రే. ౨౯
సీతాంచ సత్కృత్య మహాధనేన
దత్వాచ రామాయ సుఖీభవ త్వం,
నోచే న్న రామేణ విమోక్ష్యసే త్వం
గుప్త స్సురేంద్రై రపి శంకరేణ. ౩౦

౨౫ పిమ్మట విభీషణుడు లేచి చేతులు జోడించి రావణునితో నిటులఁ బలికెను. రాక్షసేంద్రా! రాక్షసులను సంతోషపెట్టుట నీవు చేయవలసిన పని కాని, రాక్షసుల కుపద్రవము గలుగునట్లు చేయుట నీకు యుక్తమయిన పని కాదు.

౨౬-౨౭ అన్నా! నీవొక్కడవు చేసినపాపము నీతోనే పోదు. లంకలో నున్న యందఱకు నది చుట్టుకొనును, ముందు జరుగబోవునది చెప్పె దను వినుము. పర్వతాకారముగల వానరులు ఇచటకు వచ్చి లంక నంతను ముట్టడించి స్త్రీలు పురుషులను విచక్షతలేకుండ నందఱను బాధించెదరు.

౨౮ అన్నా! నీవొక సంగతిని బాగుగ నాలోచింపుము. పూర్వము ఏ వాలి నిన్ను జయించి తన పట్టణమునకుఁ దీసికొనిపోయి నిన్ను బంధించి ముప్పతిప్పలు పెట్టెనో; ఆ వాలిని రామచంద్రమూర్తి యొక బాణముచేఁ జంపివేసెను. నిన్ను జయించిన వాలిని సంహరిం చిన రాముని తృణప్రాయముగా దలచుచుంటివి. ఏమి నీ మూర్ఖత? ఇంతకంటె మూర్ఖత్వ మున్నదా? ఇదియునుంగాక విరాధుని రామ చంద్రమూర్తి యొకదెబ్బతో చంపెనుగదా! ఆ విరాధుడుమాత్రము నీకంటె తక్కువవాడా? ఇవన్నియు నాలోచింప వేమి?

౨౯ అన్నా! నీవెవరిమీద నాధారపడియుంటివో వార లెవ్వరు రాముని ముందు నిలువలేరు. ఈ కుంభకర్ణుడు కాని, ఇంద్రజిత్తు కాని లేక మహాపార్శ్వ మహోదరులుకాని, నికుంభుడు, కుంభుడు, ప్రహస్తుడు అతికాయుడు మొదలగువార లెవ్వరుగూడ రామునిముందు నిలువ జాలరు. ఇది నిజము.

30 కావున సీతను సర్వాభరణభూషితురాలనుగా జేసి తీసికొనివెళ్ళి రామునకు సమర్పించితివేని నీవు మేము రక్కసులుగూడ సుఖపడు దుము. నేను జెప్పిన చొప్పున నీవు వినవేని శంకరుడంతవానిచే నీవు దాచబడినను రాముని బారినుండి నీకు విముక్తిగలుగదు. ఇది ముమ్మాటికి నిజము.

తచ్ఛ్రుత్వా మేఘనాద స్తు ప్రాహైవం పితరం తదా
తాతాయం సోదరోప్యేవం శత్రుపక్ష ముపాశ్రితః
నిర్లజ్జ స్వదసి బ్రూతే విరుద్ధవచనాని హా. 30

ధైర్యేణ విక్రమేణాపి సాహసేన బలేన చ
శౌర్యేణ రహిత స్సోయం ధ్రువం నహి పుమా న్విభో 31

తన్నిశమ్య వచః ప్రాహ మేఘనాదం విభీషణః
బాలో స్యలం కుమార! త్వం నహి పక్వా చ తే మతిః
మంత్రాలోచనశ క్తి స్తే యతో నాభూ త్తవాధునా
యథార్థం నవిజానాసి మతిం తే గా సమాశ్రితాః
గచ్ఛేయు ర్ఖలా స్తేఽరం వినశ్యేయు ర్న సంశయః.
33-34-35

తతో విభీషణం ప్రాహ రావణః కాలచోదితః
అగృహ్ణా న్స్వహితం వాక్యం మ్రియమాణ ఇవౌషధమ్. 36

జ్ఞాతి శ్చే ద్దనలేన కిం ఫలమితి న్యాయోఽస్తి లోకత్రయే
జ్ఞాతీనాం ప్రకృతి స్తథా భవతి హి స్వజ్ఞాత్యనర్థార్థితా
ఐశ్వర్యప్రదతా గవా మివ గుణ స్సర్వేంద్రియాణాం జయో
విప్రాణాం ప్రకృతిర్యథా చపలతా స్త్రీణాం స్వభావో యథా.
37

3౧౹ ఆ విభీషణుని వచనములను విని యింద్రజిత్తు మండిపడుచు లేచి తండ్రితో నిటుల బలికెను. తండ్రీ! వీడు నీకు సోదరుడయి యుండియు శత్రుపక్షములో దూరి, సిగ్గులేక సభలో నెట్లు విరుద్ధముగ వదరుచుండెనో చూడుము.

3౨౹ తండ్రి! ఇతడు (విభీషణుడు) శౌర్యము ధైర్యము, విక్రమము, సాహసము, బలములేని నపుంసకుడని చెప్పవలయును.

33-3౪-3౫ ఇంద్రజిత్తు మాటలు విని విభీషణుడు శాంతముతోనే యివ్విధముగ నింద్రజిత్తుతోఁ బలికెను. కుమారా! నీవు పిల్లవాడవు. నీ బుద్ధి యింకను పరిపక్వము కాలేదు. అందువలననే మంత్రాలోచనశక్తి నీకు లేకపోయెను. నీవు యథార్థము దెలిసికొనజాలవైతివి. నీ మతి ననుసరించినయెడల సర్వనాశము తప్పక జరుగును. ఇందుకు సందియము లేదు,

3౬ పిదప రావణుడు కాలచోదితుడై తన హితమును దాను దెలిసికొనలేక మృత్యువాసన్నమైనవాడు ఔషధమును గ్రహింపనట్లు విభీషణుని వచనము గ్రహింపనివాడై యతనితో నిట్లు పలికెను.

3౭ ఓరీ విభీషణా! జ్ఞాతియొక్క డుండినచో నింక నిప్పుతో పనిలేదను సామెత ముల్లోకములలో నున్న విషయమే. గోవులకు ఐశ్వర్యము నిచ్చుటయు, బ్రాహ్మణులకు ఇంద్రియ నిగ్రహము, స్త్రీలకు చపలత్వము, జ్ఞాతులకు తన జ్ఞాతివారల శ్రేయస్సును సహింపలేకపోవుటయు (కీడుతలపెట్టుట) స్వభావములు. కావున నా శ్రేయస్సును నీవు సహింపలేకపోవుట జ్ఞాతి స్వభావమే యని పలికెను.

అనుజీవ్య భవా న్మత్త స్స్వాతావ ద్గురువ త్కథమ్
నిర్లజ్జో భాషతే నూనం లోకప్రతీతపశిక్షకః
భవా న్మాం శిక్షయతి వా హాన్మ్యవాహం నసంశయః
కింతు పూర్వకృతం తేఽద్య సంస్మృత్య తు సహోచితం
త్యజామి త్వాం విమూఢత్వ మితి శీఘ్రం ప్రజాధునా. ౩౮–౩౯
ఇత్యేవం రాక్షసేంద్రేణ కథితోఽపి విభీషణః
సోదరస్య సమూలస్య వినాశస్తు భవేదితి
మన్వానః ప్రాహ తం భూయో భ్రాతృప్రేమవశంగతః ౪౦–౪౧

భ్రాత స్తే కుశలం ప్రాప్నుహి భవతా గ్రాహ్యం మదీయం వచో
నీత్వా భూమిసుతాం సమర్ప్య విభవే రామాయ దోషో మమ
క్షంతవ్యో భవతేతి తస్య చరణద్వంద్వం త్వయా స్పృశ్యతాం
యద్యేవం క్రియతే పురీ పయ మయా సంరక్షితా స్స్యాద్భవాన్
౪౩

* స్వదుర్దశానుస్మరణస్య సాధనం ప్రీత్యావహం చ శ్రవణేన
కేవలమ్, వచోఽస్య గృహ్ణ న్ననుజస్య రావణ స్త మాహ
చైవం పరుషం విధేర్వశః. ౪౩

*అస్యాయ మాశయః– "నాసంవత్సరవాసినే" ప్రబ్రూయా దిత్యాదరేణ గురూపసదనయుక్తస్య పాదయోః పతితస్య వక్తవ్యమ్. అస్య దురవస్థాం పరీక్ష్య హిత ముక్త్వా నయం విభీషణః. దూరస్థేనచే దుక్తం పరిత్యాజ్యం, సాక్షా దనుజతయా ప్రత్యాసన్నేనోక్తం కథం త్యాజ్యం? కించ పరుష ముప్యుక్తవాన్. శ్రవణసమనంతరం 'స్థితోఽస్మి గతసందేహః'

౩౮-౩౯ ఓరీ! యింత పర్యంతము నీవు నా వలన బ్రదుకుచు ముల్లోకములను శిక్షించిన నన్ను గూడ గురువువలె శిక్షింపుచున్నావా? నిన్నిపుడే చంపివేయుదును. కాని నీపూర్వపు కృత్యమును (నీవు పూర్వము చేసిన యుపకారమును) దలంచి నీవు వధార్హుడవయినను నిన్ను క్షమించితి ఈ క్షణమున నీవిచట నుండి వెడలిపొమ్ము.

౪౦-౪౧ ఇట్లు రావణుడు పలికినను, సోదరుడగు రావణుడు సమూలముగా నశించిపోవునని తలంచి భ్రాతృప్రేమకు వశుడై విభీషణుడంతిమ సందేశము (తుది పలుకును) ఇట్లు తిరిగి రావణునితోఁ బలికెను.

౪౨ అన్నా! రావణా! నీకు క్షేమకరమగు వాక్యము చెప్పెదను. నీవు నామాట వినుము. ఈ సీతాదేవిని తీసికొనిపోయి జగత్ప్రభువగు శ్రీరామచంద్రమూర్తికి సమర్పించి నాతప్పు క్షమించి కావుమని ఆయన పాదపద్మము లంటి ప్రార్థించితివేని నీవును లంకాపురియు మేమును రక్షింపబడుదుమని విభీషణుడు చెప్పెను.

* ౪౩ తన దుర్దశను దాటుటకు సాధనమును, విన్నమాత్రముచేత ప్రీతికరమునగు విభీషణునివాక్యమును రావణుడు కాలవశంగతుడై గ్రహింపక పోవుటయేకాక పరుష వాక్యమునుగూడ నిట్లు బలికెను.

---

* విభీషణ వాక్యమును గ్రహించక రావణుడు పరుష వాక్యమునుగూడ బల్కెననుచోట నిది యాశయము. ఒక ధర్మమును బోధింపవలసినప్పుడు సంవత్సరము తనయొద్దనుండి యాశ్రయించుచు పాదములమీదబడి భక్తిచేయనివానికి జెప్పగూడదని ధర్మసూత్రమున జెప్పబడినది. ఇచ్చట విభీషణుడు, అన్నయగు రావణుని దురవస్థ జూచి భరించలేక మేలుకలుగు మాటగదా యని యడుగకయే చెప్పెను. ధర్మసూత్రమును పాటించలేదు. దూరపు బంధువు చెప్పి

జ్ఞాతీనాం వ్యసనేషు హృష్యతి పరం తజ్జ్ఞాతివర్గో ధ్రువం
కించైతద్ద్విపగీతమస్తి చ తథా వచ్మి శృణు త్వంచ తత్
నాగ్ని ర్నో భయకృన్న శస్త్రనిచయో నో పాశజాలం తథా
జ్ఞాతీనాం నివహాద్యథా భయ మరేః పక్షం శ్రితా న్నో భవేత్. ౮౮

నివసే చ్ఛత్రుణా వాపి శత్రుపక్షశ్రితేన చ,
క్రుద్ధేనాశీవిషేణేవ నకదాచన సజ్జనః,
ఇతఃపరం విమూఢాత్ర భాషసే చే ద్ధ్రువం పునః,
హనిష్యామీతి తేనోక్త స్సచివై స్సహా సో పరి
ఉత్ప్లుత్య గగనం తత్ర స్థితః ప్రాహా విభీషణః
స్వస్తి తేஉస్తు వ్రజిష్యామి సుఖీభవ మయావినా

---

ఇతివా వక్తవ్యం. త్వయా ఉపకారః కృతఇతి స్తోత్రం వా కర్తవ్యం. సదృశప్రత్యుపకారాభావేన అనుతాపోవా కర్తవ్యః. తద్విహాయ శత్రూ న్నృతి వక్తవ్య ముక్తవా నితి భావః తథా కథనే (రావణ) ఇతి (విధేర్వాశ) ఇతి పదద్వయం హేతుభూతమితి వేద్యమ్.

౪౪ ఓ విభీషణా! దాయాదుల సహజగుణము నాకు తెలియదా? దాయాదులకు కష్టము కలిగినచో వాని దాయాదులు సంతోషింతురుగదా! గజగీతను జెప్పెద వినుము. పూర్వము పద్మవనమున మానవులారా! మీ పగ్గములకు, మేము భయపడము. మీరు వేసే మంటకు భయపడము. శస్త్రాస్త్రములకు భయపడము. కాని శత్రువులలోజేరి మా రహస్యములను వెల్లడిచేయు మా దాయాదులకు మాత్రము భయపడెదము. అని యేనుగులుచెప్పెను (అనగా మమ్ము బట్టుకొను నుపాయము మీతో వచ్చిన యేనుగులు చెప్పును కాన వాటికి భయపడెద మని భావము.)

౪౫-౪౬ ౪౭-౪౮-౪౯ ఓరీ! శత్రువుతోగాని శత్రుపక్షమునాశ్రయించి పైకి మిత్రుడుగా నుండువారితోగాని సహవాసముచేయుట, బుస్సుకొట్టుచున్న తాచుపాముతో సహవాసము చేయుటవంటిదే, కాన చెప్పుడు వారితో నివసింప గూడదు; ఇటు పిమ్మట నీ విచట మాట్లాడినచో నిన్ను జంపుటయే నిజము, అని కఠినముగ బలుకగా విభీషణుఁడు తన నలుగురు మంత్రులతో గగనమున కెగిరి యచ్చట నుండి రావణునితోనిటుల బలికెను. అన్నవుగాన నీ హితముగోరి జెప్పితిని. నీవు వినకపోతివి. నీకు శుభము గలుగుగాక! నన్ను విడిచి నీవు సుఖముగా నుండుము. నీ వధర్మము చేసినను నీకు హితము

---

నచో వినకపోవుగాక. సాక్షాత్తు తమ్ముడు గనుక దగ్గర బంధువు. అతడు చెప్పినను నేల వినగూడదు? వినకపోవుటయే కాక పరుష వాక్యమును బలికెను. వినిన పిమ్మట రావణుడు సందేహము తీరినదని యనవలసినది. లేక నా కుపకారము గావించితివని విభీషణుని బొగడ వలసినది. తగిన యుపకారము చేయలేనప్పుడు పశ్చాత్తాప మైన బడవలసినది. ఏదియులేక శత్రువులతో బలుకవలసినట్లు పలికెను. అట్లు పల్కుటలో రావణుడు (లోకములను బీడించువాడు) విధివశంగతుడు (మృత్యు వాసన్నమైనవాడు) అను నీ పదములు కారణము అని యోజింగునది.

భవతే సాన్త్వనక్త్రాత్ర ననివారయితా ధ్రువం
హితైషిణా మయోక్తం తే వచనం నశ్రుతం త్వయా,
గతాయుషో నగృహ్ణన్తి సుహృద్భిః పరికీర్తితం
ఇత్యుక్త్వాగా న్ముహూర్తేన రామచంద్రాంతికం తు సః.
౭౫-౭౬-౭౭-౭౮-౭౯

ఇత్యాశ్చర్యరామాయణే యుద్ధకాండే
చతుర్థస్సర్గః.

## పంచమస్సర్గః

గత్వైవంతు విభీషణో రఘుపతే స్స్వీయప్రవృత్తిం పున
స్సుగ్రీవాది కపీంద్రయూథక మథో విజ్ఞాపయిష్య న్కపీన్
ప్రాహైవం కపిసత్తమా శ్శృణుత మే వాక్యం శరణ్యార్థినో
నామ్నాహంతు విభీషణో దశముఖభ్రాతా కనిష్ఠోఽభవమ్. ౧

లంకేశ స్త్వసశమ్యా *ధర్మవచనం ప్రోక్తం మయా వానరా
స్సందుష్యాపిచ నైకథా నిజపురా న్నిష్కాసయామాస మామ్
తస్మాద్రామవిభుం కృపాంబుధి మముం ప్రాప్తుం శరణ్యం పునః
ప్రాప్తోఽహం త్విహ మాం వదంతు విభవే తస్మై భవంతో
ద్రుతమ్. ౨

---

* ధర్మవచనమితి:— నన్వత్రేయ మాశంకా - జ్యేష్ఠేన కనిష్ఠస్య ధర్మబోధనం న్యాయ్యం. నతు కనిష్ఠేన, విభీషణేన

చెప్పువాడుకాని యధర్మమునుండి నిన్ను మరలించువాడుకాని యిందులో నొక్కడైనను లేడు. అందరు ఇచ్చకము చెప్పువారలే, కాని నీ హితముగోరి నేను చెప్పితే నీవు వినకపోతివి. కాలము సమీపించినవారలు తమ మిత్రులు చెప్పిన మంచి మాటలను నిజముగా వినరు, అని పలికి క్షణకాలములో తన మంత్రులతోగూడ రామచంద్రమూర్తి సమీపమునకు వచ్చెను.

యుద్ధకాండమున నాల్గవసర్గ సమాప్తము.

---

## పంచమసర్గప్రారంభము

౧ విభీషణుడు పైన చెప్పిన విధముగ నలుగురు మంత్రులతో రామచంద్రమూర్తి యున్నచోటుకు వెళ్లి తనరాకను సుగ్రీవాది వానరుల ద్వారా రామచంద్రమూర్తికిఁ దెలియపరుప దలచి యావానరోత్తములతో నిటులఁ బలికెను. శరణార్థినై వచ్చిన నా విన్నపమును మీర లాలకింపుడు. నేను విభీషణుడను పేరుగలవాడను. రావణుని కనిష్ఠసోదరుడను.

౨ వానరులారా! రావణుడు నేను చెప్పిన * ధర్మవాక్యములను వినక పోవుటయే కాక నన్ననేకవిధముల దూషించి తన పురమునుండి వెడలగొట్టెను. అందువలన దయాసముద్రుడగు శ్రీరామచంద్రమూర్తిని నేను శరణు వేడుటకు వచ్చితిని. నన్ను గురించి మీరలు శ్రీరామచంద్రమూర్తితో విన్నవింపవలయును.

---

* ధర్మవాక్యములను—ఇచ్చట నొక యాశంక కలుగును. ఏమనగా - పెద్దవాడు చిన్నవానికి హితోపదేశము ధర్మబోధనము చేయవచ్చును కాని చిన్నవాడైన విభీషణుడు పెద్దవాడైన రావణు

విశ్వామిత్రమఖాభిరక్షక మథో చాహల్యయా పూజితమ్
శ్రీమాహేశ్వరచాపఖండనకరం భూమ్యాత్మజోద్వాహమ్
పశ్చాద్భార్గవగర్వహారక మిమం శ్రీరామచంద్రం వినా
కం యాయాం శరణం నరాధమ మహం భ్రాత్రా వినిష్కాసితః. 3

దుష్కార్యం భవతా కృతం రఘుపతే ర్జాయాపహారాత్మకం
భ్రాత స్త్వం ద్రుత మద్య భూమితనయాం నీత్వాచ తస్యాంతికమ్
దత్వా తత్పదపంకజేతు శరణం యాహీ త్యహం ప్రోక్తవాం
స్తస్మా న్మాం దశకంథరో నిజపురా న్నిష్కాసయామాస హ. 4

జ్యేష్ఠస్య దశాననస్య ధర్మోపదేశకరణం సమంజస మితి చే దుచ్యతే - నహి హితోపదేశవిషయే జ్యేష్ఠకనిష్ఠన్యాయోఽన్వేతి, జ్యేష్ఠేన కనిష్ఠస్యేవ కనిష్ఠేనాపి జ్యేష్ఠస్యహితోపదేశకరణే న దోష ఇతి వేద్యం. ఏవంచ జ్ఞానాజ్ఞానఏవ ముఖ్యే, ఇత్యధోలిఖిత వచన మేవ ప్రమాణం భవతి. తథాహి;- "పితౄ నధ్యాపయామాస శిశు రాంగిరసః కవిః. పుత్రకా ఇతి హోవాచజ్ఞానేన పరిగృహ్యతాన్, అజ్ఞంహి బాలమిత్యాహుః పితేత్యేవచ మంత్రద'' మితి. తస్మా ద్విభీషణస్య కనిష్ఠత్వేపి జ్ఞానేన మహత్వాచ్చ దశాననస్య వయసా మహత్వేపి మూర్ఖత్వాచ్చ, విభీషణేన దశాననం ప్రతి హితోపదేశకరణం నదోష ఇతి వేద్యమ్. అపిచ "వరం హుతవహజ్వాలాపంజరాంతర్వ్యవస్థితిః న శౌరిచింతావిముఖజనసంవాదవైశస'' మితి వచనా ద్రావణగృహే వస్తు మనిచ్ఛ న్విభీషణో ద్రుత మాజగామ రామాంతిక మితి, యదుక్తం సమంజస మేవేతి వేద్యమ్.

3 విశ్వామిత్ర యాగసంరక్షకుడును, అహల్యాశాపవిమోచకుడును, శివ ధనుర్భంజకుడును, పరశురామగర్వనిర్వాపకుడు నగు శ్రీరామ చంద్రుడు తప్ప రావణునిచే నిట్లు వెడలగొట్టబడి దిక్కులేని పక్షినై యున్న నాకు మఱియొకడు రక్షకుడు లేడని యిచ్చటకు వచ్చితిని.

౪ వానరులారా! నన్నతడు వెడలుగొట్టుటకుఁ గల కారణమైన నేను జేసిన హితోపదేశమును జెప్పెదను వినుడు. అన్నా! శ్రీరామచంద్రుని భార్యయగు సీతామతల్లిని నీ వపహరించి దుష్కార్యమును జేసితివి. ఇప్పుడైనను నీవు సీతను వెంటబెట్టుకొని శ్రీరాముని సన్నిధికేగి సీతను సమర్పించి యాయన చరణకమలములను శరణుపొందుమని నేను జెప్పగా, నా హితవచనములనతడు వినకపోవుటయే కాక తన పురమునుండికూడ నన్ను వెడలగొట్టెను.

---

నకు ధర్మబోధనము చేయుట సమంజసము కాదను నాశంక కిట్లు సమాధానము గ్రహింపదగినది. హితోపదేశమునందు పెద్ద చిన్న లక్ష్యములేదు. పెద్దవాడు చిన్నవానికి వలె చిన్నవాడు పెద్దవానికి హితోపదేశము చేయవచ్చును. ఇందు జ్ఞానాజ్ఞానములే ముఖ్యములని యీ క్రింది వచనమే ప్రమాణము. "అంగీరసుడు పిల్లవాడైయుండియు తన తండ్రులకు చదువుచెప్పెను. పుత్రులారా! యని వారిని బిలచెను. కాన అజ్ఞానముగలవాడు బాలుడనియు, జ్ఞానముగలవాడు చిన్న వాడైనను తండ్రివలెఁ బూజనీయు"డనియు చెప్పబడినది కావున విభీషణుడు వయస్సున చిన్నవాడైనను జ్ఞానముచే పెద్దవాడు కావున. రావణుడు వయస్సున పెద్దవాడైనను మూర్ఖుడు గావునను విభీషణు డుపదేశించుట తప్పు కాదని తెలియదగును. ఇదియునుంగాక "శౌరిచింతలేని రావణునిగృహమునందు నివసించుట విభీషణునకు మండు చున్న నిప్పులో నడుగుపెట్టినట్లగును." - కాన జాగుచేయక రాముని సన్నిధికి వచ్చుట కూడ సమంజసమనియే తెలియదగును.

♦ త్యక్త్వా దారాంశ్చ పుత్రాంశ్చ బంధూ న్మిత్రాణి సంపదః
రాఘవం శరణం నూనం ప్రాప్తవా నస్మి సాంప్రతం. ౫

---

♦ అత్రేయ మాశంకా సముదేతి:- విశ్రవః పితామహ వరప్రదానవిభవవిదితసకలధర్మబ్యం దేన విభీషణేన జ్యేష్ఠో భ్రాతా పితృసమ ఇతి పితృవ దనువర్తనీయో జ్యేష్ఠభ్రాతా, బాల్యాత్ప్రభృతి పరిపోషకశ్చ రావణః, సపది సన్నిహితే శత్రౌ క్షుద్రబుద్ధినేవ తేన నూనం కథం పరిత్యక్తః? త్యజతునామ కథంచిత్, తథాపి నయుక్త మభిగంతుం తస్య ప్రహర్తారం, అభిగచ్ఛతునామ, నోచిత మస్య స్థాన మభిలషితుం; అభిలషతు నామ, నోపయిక మస్య వధోపాయం నిర్దేష్టు మితి. అత్ర కేచిత్ రావణస్య నిరవధికదోషదూషితత్వాత్ "గురోరప్యవ లిప్తస్య కార్యాకార్య మజానతః, ఉత్పథం ప్రతిపన్నస్య పరి త్యాగో విధీయతే" ఇతి స్మరణా ద్విభీషణేన సంత్యక్తో రావణ ఇత్యాహుః.

అన్యే కేచి దేవ మాహుః—విభీషణస్య బ్రహ్మదత్త వరప్రభావేన జ్ఞానసంపన్నత్వేన సర్వవేదాంతవేద్య స్సర్వ లోకేశ్వర శ్రీమన్నారాయణఏవ లోకోజ్జీవనాయ భూమ్యాం శ్రీరామరూపే ణావతతారేతి నిర్విశంకం జ్ఞాతవానేవాయమ్. ఏతాదృశవిశేషవిజ్ఞానవతో విభీషణస్య స్వానుష్ఠేయధర్మేషు సామాన్యవిశేషధర్మపరీక్షాం విధాయ సామాన్యధర్మం విహాయ విశేషధర్మమాత్రానుష్ఠాన మేవ కర్తవ్యం భవతి. ప్రకృతే పరమాత్మభూతశ్రీరామచంద్రానుసరణం విశేష

౫ * ఓ వానరులారా! దారపుత్త్రాదులను బంధువులను మిత్త్రులను సంపదను విడిచి రామచంద్రమూర్తిని శరణు పొందుటకు నే నిచటకు వచ్చితిని.

---

* ఇచ్చట నొక యాశంక కలుగును (ఏమన) బ్రహ్మ విశ్రవసుడు మొదలగువారి వరప్రదాన మహిమచే సకలధర్మములను దెలిసిన విభీషణుడు "జ్యేష్ఠభ్రాత తండ్రితో సమానుడను వాక్యముచే తండ్రివలె సేవింపదగినవాడును. మఱియు, బాల్యము నుండియుఁ దనను బోషించినవాడు నగు రావణుని శత్రువతనిపై దండెత్తి వచ్చినపుడు క్షుద్రబుద్ధివలె నెట్లు వదిలిపెట్ట సమకట్టెను? వదిలితే వదలుగాక! రావణుని జంపబూనిన రామునొద్ద కా పోవలెను! పోవుగాక, రావణుని రాజ్యము తనకుఁ గావలెనని రాముని వేడుట యుక్తమా? వేడుగాక, రావణుడు చచ్చుటకుఁ దగిన యుపాయము చెప్పుట యెంతయు దగదు: అని యాక్షేపణ కలుగును. కాని యీ యాక్షేపణములకు సమాధానము నిట్లు కొందఱు చెప్పుదురు. (ఏమన) "కార్యాకార్య విచక్షణత లేక దుర్మార్గములోఁ బ్రవేశించిన గురువునైనను బరిత్యజింపవలయును" అను వచనమును బట్టి తప్పులకు బుట్టినిల్లైయున్న రావణుని వదలిపెట్టుట విభీషణునకు దోషము కాదని కొందఱు సమాధానము చెప్పుదురు. మఱికొందఱీ క్రింది విధముగ నీ విషయమునఁ జెప్పెదరు. ఎట్లనగా - విభీషణుడు బ్రహ్మ యిచ్చిన వరప్రభావముచే గొప్ప జ్ఞానసంపన్నుడగుటచే సకల వేదాంతవేద్యుడై సర్వలోకేశ్వరుడైన శ్రీమన్నారాయణమూర్తియే లోకోజ్జీవనార్థమై శ్రీరామచంద్రమూర్తిగా భూమియం దవతరించెనని నిస్సంశయముగ దెలిసికొనినవాడు. కనుక యిట్టి విశేష విజ్ఞానముగల విభీషణునకు తా ననుష్ఠించు ధర్మములలో సామాన్యవిశేష ధర్మములను బరీక్షించి సామాన్య ధర్మమును వదలి విశేషధర్మము మాత్రమే యనుష్ఠింప దగియున్నది. ప్రకృతమున పరమాత్మయైన శ్రీరామచంద్రుని సేవించుట విశేషధర్మము. అన్న ననుసరించుట సామాన్య ధర్మము. ఈ రెండు ధర్మములకు పరస్పర విరోధము

భూమిజాతాపహరణసమకాలే మయా పునః
నిగ్రహే కరణేఽపి బహువారం హితం వచః
వక్తుం దశానన స్త్వహం విలంబం కృతవాం స్తతః
పాపీయసా సహా మేవాస్మి న్ప్రసంగే వానరోత్తమాః
దోషోఽయం క్షమ్యతా మేవం వక్తవ్యం రాఘవం ప్రతి
నిశమ్య తద్వచస్తూర్ణం సుగ్రీవోఽగా ద్రఘూత్తమమ్. ౬-౭-౮

---

ధర్మః, జ్యేష్ఠానువర్తనం సామాన్యధర్మః, ఏతయోరవిరోధే ద్వావప్యనుష్ఠేయావేవ. విరోధే విశేషధర్మ ఏవానుష్ఠేయః ధర్మద్వయానుష్ఠానతాత్పర్యేణైవ రావణస్య బహుధా నీతిబోధన మయ మకరోత్. అథాప్యసురప్రకృతి ర్దశాననో హితమపి తద్వచో నాఙ్గీచకార. తదా రావణసాంగత్యరూపం సామాన్యధర్మం విహాయ విశేషధర్మభూతాం శ్రీరామసేవాం కర్తుమేవ సగతవానితి తస్మి న్న కోఽపి దోష ఇతి వేద్యమ్.

నను రాజ్యాపేక్షయా విభీషణేన రామసమీపగమనం కృతఘ్నతాదోషాపాదక మితి చేన్న. నతదపేక్షయా రామ సమీపం ప్రతి గతవా నను ఇతి వక్ష్యమాణోత్తరకాండ శ్లోకేన విస్పష్టం భవతి. తథాహ – "యావ త్ప్రజా ధరిష్యంతి తావ త్త్వంతు విభీషణ, రాక్షసేంద్ర మహావీర్య లంకాస్థ స్త్వం ధరిష్యసి, శాసిత స్త్వం సఖిత్వేన కార్యం తే శాసనం మమ; ప్రజాస్సంరక్షధర్మేణ నోత్తరం వక్తు మర్హసీతి"

౬-౭-౮ ఓ వానరులారా! రావణుడు సీతనపహరించిన కాలముననే నే నతనిని విడిచి బయలుదేరి రావలసిన మాట నిజమే కాని యనేక పర్యాయములు రావణునకు హితబోధచేసిన విను నేమో యను నాశతో నతనికిఁ బలుమారులు చెప్పిచూచుటకై నే నాలస్యము చేసితిని. అందువలన నిజముగ ఈ విషయమున నేను పాపినే. సందియములేదు. నా దోషమును దీనిని క్షమింపవేడుచున్నానని కూడ రామచంద్రమూర్తితో మీరలు చెప్పవలసినది- ఇట్లు చెప్పుచున్న విభీషణునిమాటలను విని సుగ్రీవుడు వెంటనే రాముని సమీపమునకు వెళ్లెను.

---

లేనపుడు సామాన్య విశేష ధర్మములు రెండును అనుష్ఠింప దగినవే ఈ రెండు ధర్మములకు పరస్పరవిరోధము గలిగి నపుడు విశేష ధర్మమును మాత్రమే యనుష్ఠింప వలయును. ఈ రెండు ధర్మములను అనుష్ఠింపఁ దాత్పర్యముతోనే విభీష ణుడు రావణునకు బహువిధములుగ నీతిబోధను జేసెను కాని రాక్షసప్రకృతి గల రావణుడు విభీషణుని హితవచనముల నంగీకరింపడయ్యెను. అందువలన రావణసాంగత్యరూప మగు సామాన్య ధర్మమును విడిచి శ్రీరామసేవారూపమగు విశేష ధర్మమును విభీషణు డనుష్ఠించుటకు రావణుని విడిచి వెళ్ళెను. కాన విభీషణుని దోషము లేశము లేదని (కొందరు చెప్పెదరు) ఇందుపై నొక యాశంక కలుగును. ఎట్లన - ఇంతవఱకుఁ దన కుపక రించిన రావణుని వదలి రాజ్యాపేక్షచే రాముని నాశ్రయించుట విభీషణునకు కృతఘ్నతకాదా యను నాక్షేపమున కిట్లు సమాధా నము దెలిసికొనదగినది. రాజ్యాపేక్షచే విభీషణుడు రామునిసమీప మునకు వెళ్ళనటులును, రాముడే బలాత్కారముగ రాజ్య మిచ్చి నట్లును నీక్రింది యుత్తరకాండ శ్లోకములవలన దెలియబడుచున్నది. ఎట్లన "ఓ విభీషణా! లంకలోనుండి యచ్చటి ప్రజలను బరిపాలింప వలెను. మిత్రుడనగుటచే నే నీ విషయమున శాసించుచుంటిని. నీ కిష్టము లేక పోయినను నా శాసనమును బట్టి ధర్మముగ రాక్షసు

విభీషణవచ శ్శ్రుత్వా రాఘవేణాభయం ద్రుతం
విభీషణాయ దత్తంచే న్మూలచ్ఛేదో భవేదితి
భీత్యాగతోఽగ్రజాత స్తం ప్రాహైవం రఘునందనమ్. ౯౪

నూనం కామచరా స్సర్వే స్సకపటాః పాపాశ్చ రాత్రించరాః
కిం చాదృశ్యతయైవ సంచరితు మప్యత్యంతశక్తా విభో
కాలేఽస్మా న్వినిహంతు మేవ కపటం వేషం గృహీత్వాధునా
సంప్రాప్త స్తవసన్నిధిం పున రయం త్యాగా ద్దశాస్యానుజః. ౧౦౪

---

ఏవంచ విభీషణస్య అనన్యప్రయోజనతయా శ్రీరామాశ్రితత్వా దేవ ఇక్ష్వాకుకులధనభూతశ్రీరంగనాథం సమభ్యర్చితుం శ్రీరామో ప్యన్యేషా మవితీర్య విభీషణాయ దత్తవానితి వేద్యం. అత్రేద మనుసంధేయం - త్యజే దేకం కులస్యార్థే గ్రామస్యార్థే కులం త్యజేత్, గ్రామం జనపదస్యార్థే ఆత్మార్థే పృథివీం త్యజే దితి." ఆత్మానం సతతం రక్షే ద్దారై రపి ధనై రపి, ఇతిచ వచనసద్భావాత్, సోపాధికబంధవో రక్షకా నభవేయు రిత్యాశయేన నిరుపాధికబంధుభూతం శ్రీరామచంద్రం దారాత్మజాదిసర్వస్వపరిత్యాగపూర్వకం శరణం ప్రాప్తవా నయ మితి పరమార్థః

౯౫ సుగ్రీవుడు రామునిసన్నిధికి వెళ్ళిన కారణ మేమనగా, విభీషణుడు చెప్పిన మాటలను రామచంద్రమూర్తికూడ విని శరణాగతుడై వచ్చితి నని విభీషణుడు చెప్పినందున వెంటనే నీ కభయమిచ్చినావని రామ చంద్రమూర్తి తొందరపడి యనునేమో యని భయపడి రామునితో నభయము నీయవద్దని చెప్పుటకు సుగ్రీవుడు వెళ్ళెను. కాని విభీషణుని గ్రహింపుమని చెప్పుటకు నచటకు వెళ్ళలేదు. ఇట్లు సుగ్రీవుడు వెళ్ళి రామచంద్రమూర్తిని గూర్చి యీ క్రిందివిధముగఁ జెప్పదొడగెను.

౧౦౫ రామప్రభూ! రాక్షసులు కామరూపులు, కామచారులు, మాయో పాయము గలవారును. ఇతరులకుఁ గనుపడకుండగ దిరుగు వారునుగూడనై యుండిరి. ఈ జాతి స్వభావ మిట్టిది. ఇప్పుడు రావ ణుని తమ్ముఁడు అన్నతోఁ దాను గలహించినట్లు చెప్పి మనలో చేరి యవకాశము కలిగినప్పుడు మనలను జంపుటకై కపటవేష ముతో నీ సన్నిధికి వచ్చెను.

---

లను బరిపాలింపవలెను. నీవు మాఱుమాట చెప్పవద్దు" అని యుండుటచే విభీషణుడు ఇతర ఫలాపేక్ష లేక రాముని నాశ్రయిం చినవాడు గనుకనే యిక్ష్వాకుమహారాజు నాటినుండియు తద్వం శీయులకు కులధనముగా వచ్చుచున్న శ్రీరంగనాయక విగ్రహమును శ్రీరామచంద్రమూర్తి యితరు లెవ్వరికి నియ్యకుండ విభీషణున కిచ్చెనని తెలిసికొనదగును, ఇచ్చట నీ క్రిందివిషయముగూడ గమ నింపదగినది. ఏమనగా - "వంశమును రక్షించు నిమిత్త మొకని వంశమున బుట్టినవానిని విడువవలయును. గ్రామము రక్షించు నిమిత్తము వంశమును విడువవలయును. దేశమును రక్షించుటకై గ్రామమును విడువవలయును. తన్ను రక్షించుకొను నిమిత్తమీ పృథ్వినే విడువవలయు"నని యుండుటచేతను, మఱియు, భార్యను ధనమును గూడ వదలియైనఁ దనను రక్షించుకొనవలెనని యుండుట చేతను సోపాధిక బంధువు లెవ్వరును రక్షకులు కాజాల రనియు, నిరుపాధికబంధు వగు శ్రీరామచంద్రమూర్తియే తనను రక్షించు వాడనియుఁ దలచి సర్వసంగ పరిత్యాగపూర్వకముగా శ్రీరాముని విభీషణుడు శరణు జొచ్చెనని పరమార్థమైయున్నది.

సోఽయం శక్తి-ముఖేన నూన మసుర స్సంప్రేషితోఽత్రాగతో
యద్వానీతివిశారదోఽయ మధునా త్వాగా త్స్వయంవా విభో
నూనం న స్సమయో సహాంతుమసనా ప్రాపాంతికం తేఽసుర
స్సోఽయం కేవలభక్తితో నహి సమాయాతో ధ్రువం రాఘవ.
౧౧॥

♦♦ షడ్విధం బల మేన స్యా ద్విశ్వాసార్హం రఘూత్తమ
నాసౌ తద్బలమధ్యస్థ స్తదయం త్యజ్యతాం త్వయా. ౧౨॥

న కేవలం రాక్షసోఽయం సాక్షా చ్ఛత్రుసహోదరః
కించైకో నాగత స్సోఽయం కించ నాశస్త్రభృ ద్విభో
చతుర్భి స్సచివై స్సోఽయం సమాగా చ్ఛస్త్రపాణిభిః
గదాపాణి స్స్వయం చాయం విశ్వాసార్హో నహి ధ్రువమ్.
౧౩-౧౪॥

---

♦♦ షడ్విధం బల మితి— "మౌలం భృత్యం సుహృచ్ఛ్రేణీ ద్విష దాటవికం బలం" ఇతి షడ్విధాని బలాని. తత్ర పరంపరయా ప్రాప్తం బలం మౌలం, వేతనదానేన సంస్థాపితం బలం భృత్యబలం, మిత్రై స్సంప్రేషితం బలం సుహృద్బలం, జనపదాదిభ్య స్స్వాగతం శ్రేణీబలం, స్వారాత్యరాతిప్రేషితం బలం ద్విషద్బలం, కిరాతాదిబల మాటవికబలం చేతి.

౧౧ రామచంద్రా! రావణుడు పంపగా వీడు వచ్చెనో లేక సామాద్యుపాయములను జక్కగా దెలిసినవాడు గనుక వాడు పంపకపోయినను వీడే స్వయముగ వచ్చెనో. యెట్లు వచ్చినను సమయము వచ్చినప్పుడు మనలను జంప నుద్దేశముతోనే వచ్చినవాడుకాని కేవల భక్తితో వచ్చినవాడు మాత్రము కాదుసుమా!

౧౨* రామచంద్రా! ఆఱువిధములయిన బలములనే నమ్మవచ్చును గాని యీ వచ్చినవాడు పై యాఱువిధములగు బలములలో చేరనివాడు గాన మనము వీనిని విశ్వసింపక త్యజించుటయే యుత్తమము. లేకపోయినచో వీనివలన అపాయము వచ్చును,

౧౩-౧౪ రామచంద్రా! ఈ వచ్చినవాడు కేవలము రాక్షసుడు కాడు. సాక్షాత్తుగ నీ శత్రుసహోదరుడు. ఇదియునుం గాక ఒక్కడు రాలేదు. నలుగురిని వెంటబెట్టుకొని వచ్చెను. ఇతడు నిరాయుధుడుగా వచ్చినవాడును గాడు, గదాపాణియై వచ్చెను. వీనితో వచ్చిన వారలుకూడ శస్త్రపాణులయి యుండిరి. ఇట్టివానిని విశ్వసింప గూడదు. వెంటనే త్యజింపవలెను.

* ఆఱువిధములయిన బలములు ఏవి యనగా 1. మూలబలము 2. భృత్యబలము 8. సుహృద్బలము 4. శ్రేణీబలము 5. ద్విషద్బలము 6, ఆటవికబలము. 1. పరంపరగా వచ్చుసైన్యము మూలబలము. 2. జీతమిచ్చి చేర్చినది భృత్యబలము. 8. మిత్రులు పంపినది సుహృద్బలము. 4. గ్రామములనుండి వచ్చినది శ్రేణీబలము 5. మన విరోధులకు విరోధులు పంపగా వచ్చిన బలము ద్విషద్బలము; 6, కిరాతాదుల బలము ఆటవికుల బలము, అని తెలియనగును.

♦ సోయం రాత్రిచరో ధ్రువం రఘుపతే కాకో ప్యులూకాన్యథా సైన్యంతు ప్రవిశ న్నథాంతర మలం సంవీక్ష్య చాస్మా న్ధ్రువమ్
హన్యాదేవ నసంశయ స్త దధునా తీవ్రేణ దండేన త
త్పంక్త్యాస్యస్య సహోదరస్తు సచివై స్సాకం ద్రుతం వధ్యతామ్ ౧౫

తచ్ఛ్రుత్వా వచనం సమీరజముఖా న్ప్రాహాథ రామో హరీన్, సుగ్రీవేణ యదుక్త మద్య సకలై ర్యత్రస్థితై స్తచ్ఛ్రుతమ్, వక్తవ్యం భవతాం మతం ద్రుత మహం శ్రోతుం తదిచ్ఛా మ్యహమ్, త్విత్యుక్తాః కపిసత్తమా రఘుపతిం ప్రాహు స్తదైవం పునః. ౧౬

---

♦ కాకో ప్యులూకా న్యథేతి — పౌరాణికీ కథేయ మత్రానుసంధేయా—కాకానా ములూకానాంచ సర్వదాపి విరోధఏవ. దివా ఉలూకా బహిరాగతా శ్చే త్తా న్వాయసా నిహన్యుః, తథా నిశాయా ములూకా గతా వాయసా న్హన్యుః ఏవంస్థితే ఏకదా త్వేక వాయసంఘస్య చోలూకసంఘస్యచ కలహః ప్రచలతిస్మ. తదా త్వేక శ్చిరజీవీ, ఉలూకేషు ప్రవిశ్య, కాకవధోపాయం భవతాం బ్రవీమీ త్యులూకా న్విశ్వాస్య, తేషు ప్రమత్తే, ష్వేకదా దివా స్వాత్మీయా నాహూయ, తై స్సమం మిళిత్వా, సమాలోచ్య చ, తద్రంధ్రేషు శుష్కతృణ విన్యాసపూర్వక మగ్నిం ప్రజ్వాలయామాస. తేన సర్వే ప్యులూకామృతాః. తథైవాయ మప్యంతర మన్వీక్ష్య సర్వాన ప్యస్మాన్హనిష్యతి. తస్మా నవిశ్వసనీయో౽య మిత్యాశయః;—

౧౪ రామచంద్రా! ఉపాయశాలియగు శత్రువయిన యీ రాక్షసుడు మనసేనలోఁ బ్రవేశించి నమ్మకముగ దిరుగుచు సమయము దొరికి నపుడు శత్రువులయిన మనలను జంపును. పూర్వము * ఒక కాకి గుడ్లగూబల నిటులనే చంపెను. కాన శత్రువు నెప్పుడును నమ్మ రాదు. వీనిని వీని యనుచరులను గూడ వెంటనే చంపవలెను. (అని సుగ్రీవుడు చెప్పెను.)

౧౬-౫ విభీషణునిగురించి సుగ్రీవు డింతవరకు చెప్పిన మాటలను రామచంద్ర మూర్తి విని పిదప హనుమంతుఁడు మొదలగువారితో నిట్లు పలి కెను. ఓ హనుమదాది వానరులారా! సుగ్రీవుడు చెప్పిన విషయ మంతయు మీరందఱు వినియున్నారుగదా! గొప్పకార్యము చేయ వలసివచ్చినప్పుడు ఒకడు చెప్పినదానితోనే సంతోషపడుట మంచిదికాదు. కాన మీ మీ యభిప్రాయములనుగూడ చెప్పిన వినగోరుచున్నాను. గాన జెప్పవలెనని యడుగగా వారలు రామ చంద్రమూర్తితో నిటుల బలికిరి.

---

* ఒక కాకి గుడ్లగూబల నిటులనే చంపెను. - ఇచ్చట నొక ప్రాచీన కథ యనుసంధేయము - కాకులకును గుడ్లగూబలకును నెల్లప్పుడును విరోధమే, పగలుగుడ్లగూబలు బయటికి వచ్చినయెడల వానిని కాకులు పొడిచి చంపును. ఇట్లే రాత్రులయందు గుడ్లగూబలు వెళ్ళి కాకులను జంపును. ఇట్లుండ నొక కాకుల గుంపునకును, నొక గుడ్లగూబలగుంపు నకును కలహము జరుగుచుండెను. అప్పుడొక కాకి యుపాయము చే గుడ్లగూబల గుంపులోఁ బ్రవేశించి కాకులనన్నిటిని జంపు నుపాయము మీకుఁజెప్పెదనని గుడ్లగూబలను నమ్మించపజేసి యవి యేమఱుపాటుతో నుండగా నొకనాటి పగలు కాకులనన్నిటిని బిలుచుకొని వచ్చి గుడ్లగూబలుండు తొఱ్ఱలలో నెండుగడ్డి కూరి నిప్పంటింపగా గుడ్ల గూబలన్నియు చచ్చెను. కావున నిపుడు వచ్చిన యీవిభీషణుడు కూడ నటులనే చేయును గాన వీనిని నమ్మరాదని యభిప్రాయము.

అజ్ఞాతం తవ నాస్తి కించన విభో సర్వేషు లోకేష్వపి
జ్ఞాత్వా ప్యద్యసుహృత్తయాఽపిచ భవాన్పృచ్ఛత్యనల్పోపినః
ఇత్యుక్త్వాఽంగదముఖ్యవానరవరా స్సాహు స్తదా తే వచః
ప్రత్యేకం తు వదంతు ముఖ్యసచివా స్స్వీయాశయం తూత్థితాః. ౧౭॥

పశ్చా దంగద ఏవ మాహ వచనం లోకే శఠా స్స్వాశయం
సంఛాద్యైవ చరంతి వీక్ష్య నితరాం రంధ్రం హనిష్యం త్యరీన్
తస్మాచ్ఛత్రుసకాశ[illegible]యు మసురః ప్రాప్త స్తత స్సర్వథా
శంక్యో, నైవ భవే దయం రఘుపతే విశ్వాసయోగ్యో ధ్రువమ్. ౧౮॥

నిశ్చిత్యార్థ మనర్థ మస్య సుగుణా న్సంవీక్ష్య సంగృహ్యతామ్
దోషాధిక్యనిదర్శనే ద్రుత మయం సంత్యజ్యతాం రాఘవ
శ్రుత్వా తద్వచనం త్వథాఽఽహ శరభ శ్చారోఽద్య సంప్రే
ష్యతాం, సమ్యక్తం పరిశీల్య తేన నితరాం కార్యోహి
తత్సంగ్రహః. ౧౯॥

విచక్షణో ఋక్షపతి స్త మాహ వై
సుబద్ధవైరారిసకాశత స్త్వయమ్

౧౭౪ మహాప్రభూ! నీకుం దెలియనిది, మావలన నీవు దెలిసికొనఁదగినది, ముల్లోకములలో నొంచెమైనను లేదు. నీకుఁదెలిసినను మాయందు నీకున్న ప్రేమచేత మమ్ముల నిట్లడుగుచుంటివి. అని పలికి అంగదుడు మొదలగువారితో వా రిట్లనిరి. "అంగదాదులారా! అందఱు కలసి యొక్కటిగఁ జెప్పుటకంటె ముఖ్యులగువారలు వారి వారి యభిప్రాయములను ప్రత్యేకముగ జెప్పుదురుగాక"యని (వానరులు పలికిరి.)

౧౮౪ అనంతరము అంగదుడు లేచి తన యభిప్రాయము నిటులఁ జెప్ప దొడగెను. రామచంద్రప్రభూ! ద్రోహబుద్ధిగలవారు తమ దుష్టబుద్ధిని దాచిపుచ్చి, మిత్రులుగనే కనబడుచు సమయము వచ్చినపుడు తన శత్రువులను జంపగలరు. కాన నిపుడిచటకు వచ్చినవాడు శత్రువునొద్దనుండి వచ్చినవాడుగాన సందేహింపదగినవాడేగాని నమ్మదగినవాడు మాత్రము కాడు.

౧౯౪ రామచంద్రా! క్రొత్తగా వచ్చినవానిని జేరదీయబోవునపుడు గుణదోషములను జక్కగాఁ బరిశీలించి యర్థానర్థములను నైతము నిశ్చయించి గుణములెక్కువగ వానియందుఁ గన్పడినచో వానిని జేర్చుటయు దోషములధికముగ గన్పడినచో వానిని విడుచుటయు జేయుమని నాయభిప్రాయమని చెప్పగా: పిదప శరభుడను వానరోత్తముడు లేచి యిటులఁ జెప్పెను, రామచంద్రా! వీనిని మన సైన్యములో నిపుడే కలుపుకొనక దూరముననే యుంచి యొక చారునెవ్వనినైనను బంపి వాని వలన వచ్చినివాని మంచి చెడుగులను దెలిసికొని, గ్రహింపదగినవాడని తేలినపుడు వానిని పరిగ్రహింపుమని చెప్పెను.

౨౦౪ పిమ్మట జాంబవంతుడు లేచి యిటులఁ బలికెను. రామచంద్రా! మనయందు బద్ధవైరముగల రావణుని సమీపమునుండి వీడు వచ్చినవాడు గనుకను, దేశముకాని దేశమునను, కాలముకాని కాలములోను వీడు వచ్చినవాడుగనుకను, వీడు సందేహింపదగినవాడనియె నా యభిప్రాయము. (దేశముకాని దేశమనగా నూరాదుల

అదేశకాలేఽధిప న స్వమార్గో
విశంకనీయో భవతీతి మే మతమ్. ౨౦॥

మైందః ప్రాహ తతో నయానయవిశేషాభిజ్ఞ ఏతద్వచో
నూనం సౌమ్యగిరా దశాస్యసహజ స్సోఽయం త్వయా పృచ్ఛ్యతామ్, జ్ఞాత్వైవం తు తదీయభావ మథ యత్కార్యం కురు త్వంతు త, చ్ఛ్రుత్వా తద్వచనం సమీరతనయః ప్రోవాచ తం ప్రాంజలిః. ౨౧॥

నాధిక్యా న్నచ వాదనా న్నచ పరం కామా న్న సంఘర్షణా
ద్రాజ న్నద్య వదామి కింతు వచనం పథ్యం బ్రవీమి ధ్రువమ్
దౌరాత్మ్యం సహజే నిరీక్ష్య నితరాం సంచింత్య తే విక్రమం
నూనం తేఽంతిక మాగతోఽయ మధునా సాపేక్ష ఏవాసురః. ౨౨॥

శక్యో నైవ భవే ద్ధృతం రఘుపతే వేత్తుం పరస్యాశయో
యత్ప్రోక్తం సచివై స్తవాద్య వచనం దోషోఽస్తి తస్మిన్ధ్రువమ్
జాత్వస్య బ్రువతో విభో రఘుపతే నోలక్ష్యతే దుష్టతా
కించైతస్య వచః ప్రసన్న మసుర స్సోఽయం తతో గృహ్యతామ్. ౨౩॥

దూరములో మన మింకనునిచ్చట నుంటిమే. ఇప్పుడేమి యూపద్రవము తనకు వచ్చినదని యిచటకు రావలెనని యభిప్రాయము కాలము కాని కాల మనగా తనమాట యన్న వినలేదని వారి యాపత్కాలములో విడిచివచ్చుట కాలవిరుద్ధ మని భావము)

౨౧౪ పిదప నీతివిదుడగు మైందుడను వానరుడు లేచి యిటులఁ జెప్పెను. రామచంద్రా! వానిని దగ్గరకు బిలచి మంచిమాటలతో వానిని గదలించి మాట్లాడించి చూడుము. ఆ ధోరణిలో వాని యభిప్రాయము తెలిసికొని పిదప దండింపదగినవాడని తోచిన దండించుటకాని, పరిగ్రహింపదగినవాడని తోచినచో పరిగ్రహించుట కాని చేయుము. ఇట్లు చెప్పినపిదప హనుమంతుడులేచి యిటులఁ బలికెను.

౨౨౪ రామచంద్రా! తక్కినయందఱికంటె హనుమంతుడు గొప్పవాడని యనిపించుకొనుటకు గాని, వాదమునకుగాని, సంఘర్షణకుగాని, లేక వానియందు ప్రేమచేతగాని, యిప్పుడు నేను జెప్పుటలేదు. నిజస్థితిని జెప్పెదనువినుము. సర్వరాక్షసవినాశకరమైన సీతాపహారణరూపమైన దుర్మార్గము రావణునియందుండుటనుబట్టియు, ఖరదూషణాదులను వధించిన నీయొక్క పరాక్రమమును వినియుండుటను బట్టియు, నేదియో యొక ప్రయోజనమున కపేక్షించి నీ సమీపమునకు మంచిబుద్ధితోనే యితడు వచ్చెను.

౨౩౪ రామచంద్రా! పరుల మనస్సులోని యభిప్రాయములను దెలిసికొనుట చాల కష్టమైన పనియైయున్నది. వచ్చినవాని యభిప్రాయమేమో తెలిసికొనలేక యీ వానరు లెవరియిష్టము వచ్చినట్లువారలు చెప్పినారు. వీరు చెప్పిన మాటలయందు దోషము గనపడుచున్నది. ఎదుటివాని మనశ్శుద్ధిని తెలిసికొనుటకు వాని చేష్ట, ఆకారము, భాష, సాధనములుగానుండును. వీనిమాటలలోగాని, యితరములగు నాకారచేష్టాదులలోగాని, దోషమేమియు, గనపడదు. ఇతనివాక్కు ప్రసన్నముగా నుండెను. ఆకారభాషాదులనుబట్టి నిర్దోషుడుగా గనపడుచున్నందున తప్పక యితనిని బరిగ్రహింపుము.

కించేదం శృణు వాలినో వధ మయం శ్రుత్వాఽభిషిక్తం త్వయా
సుగ్రీవంచ నిశమ్య తేఽంతిక మరం త్యాగా త్ఫలాపేక్షయా
భక్తోఽయం త్వయి తత్ర మే నవిశయః పూర్వం త్వితస్తత్పరే
సందృష్టోఽపిచ భాషితశ్చ నితరాం సోయం త్వయా
గృహ్యతామ్. ౨౮॥

పశ్చా దేవ మువాచ తా న్రఘుపతిః కాచి ద్వివక్షాస్తి మే
పఙ్క్త్యాస్యస్య సహోదరం ప్రతి వచ శ్శ్రావ్యం భవద్భి ర్మమ
సంప్రాప్తం *సుహృదాశయేన సతతం నాహం త్యజేయం ధ్రువమ్
దోషో యద్యపి తస్య తిష్ఠతు మహాం స్తేన క్షతి ర్నో భవేత్
౨౯॥

* సుహృదాశయేనేతి—తస్యాయ మాశయః - సుగ్రీవాది మతాంతరప్రకారేణ సదోషత్వా న్నపరిగ్రాహ్య ఇతి, హనుమన్మతేనతు పరిగ్రాహ్య ఇతి వచనపరిశీలనే అపరిగ్రహే పరిగ్రహేచ సదోషత్వనిర్దోషత్వరూపకారణే దృశ్యేతే. మన్మతేతు సదోషో వా నిర్దోషో వా భవతు; శరణాగత ఇతి వాక్యప్రయోక్తృత్వ మేతస్య పరిగ్రహే ముఖ్యహేతు రితి కథయతి, సుహృదాశయేనేతి. సుహృదాశయేన వాస్తవమిత్రత్వాభినయమాత్రేణాఽపీత్యర్థః. మిత్రభావో నామ శరణాగతత్వ

౬౪। రామచంద్రా! ఇదియునుంగాక యింకొక విషయము చెప్పెదను వినుము. ఏదియో ఫలము నపేక్షించి వచ్చియుండునని చెప్పితిని. ఆ ఫల మేమనగా నీవు పూర్వము దుర్నీతిపరు డగు వాలిని వధించి సుగ్రీవునకు రాజ్యమిచ్చినటులవిన్నవాడుగాన రావణుని జంపి రాజ్యమును తనకిమ్మని ప్రార్థించుటకైనను బుద్ధిపూర్వకముగా నీయొద్దకు వచ్చియుండవచ్చును. ఇతడు నీయందు భక్తి భావము కలవాడనుటలో నేమియు సందియము లేదు. నేను లంకకు వెళ్ళినపు డితనిని నేను జూచి మాట్లాడియుంటిని. ఇతడు పరిగ్రహింప దగినవాడు. సందియము లేదు.

౬౫। ఇట్లు హనుమంతుడు చెప్పగా పిదప రామచంద్రమూర్తి యిట్లు సుగ్రీవాది వానరులతోఁ బలికెను. మిత్రులారా! మీ యభిప్రాయములను జెప్పితిరి. విభీషణుని గుఱించి నా యభిప్రాయమును నేను దెలిపెదను. మీరు వినుడు. నాకు స్వభావసిద్ధమైన గుణమొకటి యున్నది. అది యేదన *మిత్రభావముతో వచ్చిన వానిని (అనగా శరణని వచ్చినవానిని) వదలిపెట్టకపోవుటయే. కాక యతనిని నేను విడువ నిచ్ఛయింపను. వానియెడ దోషముండిన నుండుగాక. అందువలన మనకు వచ్చిన హానిలేదు. శరణాగతరక్షణమే నాకు కర్తవ్యము.

---

* మిత్రభావముతో వచ్చినవానిని - దీని యభిప్రాయ మిట్లు తెలియ దగినది. వీడు దుష్టుడు కాన నంగీకరింపరాదను సుగ్రీవాదుల మతానుసార మితడు పరిగ్రహింప దగనివాడని తేలినను, ఫలాపేక్షచే వచ్చినవాడు గావున ఇతడు నిర్దుష్టుడు కావునను పరిగ్రహింప దగినవాడను హనుమన్మతమును బట్టియు, విచారించితే వదలిపెట్టుటలో పరిగ్రహించుటలోను సదోషత్వము, నిర్దోషత్వము, గారణములుగా గన్పడుచుండెను, కాని పరిగ్రహాపరిగ్రహములలో నా మతప్రకారము, అవి కారణములు కావు. శరణాగతుండనని యత డుచ్చరింటయే పరిగ్రహించుటలో కారణము, అని తెలుపుటకే మిత్త్రిభావముచే వచ్చినవానిని వదలునదిలేదని చెప్పెను.

కించేదం శృణు రాక్షసస్తు నితరాం దుష్టోఽ స్త్వదుష్టోఽథవా
నూనం మే రజనీచరోఽల్పమపి వా కర్తుం త్వశక్తోఽప్రియమ్
నో మే భీః క్రియతాం త్వయాపి నచ భీ స్సూర్యాత్మజా
తాఽధునా, సర్వా నంగుళిమాత్రతోఽసురవరా నిచ్ఛ
న్నిహన్యా మహమ్. ౨౬

పూర్వం స్వీయకళత్రసంహృతికరః కశ్చి త్కపోతేనతు
స్వైర్మాంసై శ్శరణం గతోఽర్చిత ఇతి ప్రాచీనగాథా త్వయా
కిన్నాశ్రావిహి కిం పున ర్నరపతి ర్మాదృ గ్జనోఽర్కాత్మజ
ప్రోక్తాం కణ్వసుతేన కండుమునినా గీతా మిమాం త్వం శృణు.
౨౭

బద్ధ్వా చాంజలి మాత్మసన్నిధిగతం కశ్చిద్రిపుం వా జనో
నోహన్యా చ్ఛరణాగతం సతు నరం దృష్టోపి వాఽఽర్తోపి వా
అన్యేషాం శరణాగతో రిపు రలం ప్రాణా న్పరిత్యజ్యవా
సంరక్ష్యశ్చ కృతాత్మనా భువిస తాం ధర్మోఽయ మత్యుత్తమః.
౨౮

---

మిత్యర్థః. దోషోయద్యపీత్యాది వాక్యతాత్పర్య మిద మవ
ధేయం - యద్యపి సుగ్రీవాదిభి రుక్తా దోషా నసంత్యే
వాస్మిన్, సంతువా తథోప్యధికాః, తద్దోష స్తమేవ బాధయే
న్నతు మాం. కింతు ఆశ్రిత రక్షకో రామ ఇతికీర్తిః, స్వర్గ
ఫలంచ, మమ సంభవే దత స్సవిభీషణో దుష్టోవా భవతు,
మమ నకాపి క్షతి రితి భావః.

౨౬౫ సుగ్రీవా! యిదివినుము. నీవు చెప్పినప్రకారము, ఈవచ్చినరాక్షసుడు చెడ్డవాడు కాని, లేక హనుమంతుని మాట చొప్పున మంచివాడు కాని, యెవడైనను కానిమ్ము, నీవు చెప్పునది యేమన, మనలో బ్రవేశించి కాకులు, గూబలను చంపినట్లు చంపు నని కదా నీకు భయము. వీడు స్వల్పముగ గూడ నా కపకారము చేయలేడు. వీడొకడే కాదు, రాక్షసులందఱు కలసివచ్చినను వారి నందరిని నొక వ్రేలితో జచ్చునటుల మీటి పారవేయుందును. నా కాభయమేమియు లేదు. నీవుకూడ భయపడకుము.

౨౭౫ ఓ సుగ్రీవా! శరణాగత రక్షణమును గురించిన ప్రాచీనమైన కపోతో పాఖ్యానమును నీవెపుడును వినియుండ లేదా? పక్షులకు సహజశత్రువయిన బోయవాడు తన భార్యయయిన ఆడుపావురమును జంపెను. వాడు ఆకలిబాధచేఁ జావసిద్ధమయి తానున్న చోటునకు రాగా, మగపక్షి తన మాంసము నా బోయవాని కాహారముగా నిచ్చి రక్షించెను. పక్షియే యటుల రక్షింపగా, శరణు, అని వచ్చినవానిని వదలిపెట్టుట నా యట్టివానికి ధర్మమా? ఈ విషయమున పూర్వము కణ్వమహర్షి కుమారుడైన కండుమహర్షి చెప్పిన ధర్మగీతములను జెప్పెద వినుము.

౨౮౫ చేతులు జోడించుకొని నన్ను రక్షింపుమని తన సమీపమునకు వచ్చిన శత్రువునైనను నెవ్వడు చంపరాదు. శరణాగతుడైనవాడు శత్రువైనను, ఆర్తుడైనను, దృప్తుడైనను తన ప్రాణముపోవుట సహించియైనను వానిని గాపాడవలయును ఇది సజ్జను లగువారి ధర్మము.

---

ఇచ్చట మిత్రభావ మనగా శరణాగతియే యని తెలియదగును. దోషముండినను నుండుగాక! యను దాని భావ మేమనగా సుగ్రీవాదులు చెప్పినట్లు, అతని యందేవిధమయిన దోషములు లేనేలేవు. అతనియందు దోషములుంటే యెక్కువకూడ నుండుగాక, అతని దోషమతనికే యుండును. నా కేమియు గలుగదు. ఆశ్రితుని రక్షించి నాడను కీర్తియు దానివలన స్వర్గఫలము గలుగును. గాన, అతడు దుష్టుడైనను నాకు బాధలేదని భావము.

మోహాద్వా యదివా భయా ద్భువి జన శ్శక్తోపి రక్షార్థినం
యో నో రక్షతి తస్య పుణ్య మఖిలం సోఽ రక్షితోఽరక్షితః
సంగృహ్యైవ మృ... వ్రజే దితి పరో ధర్మ స్సతాం శ్రూయతే
తస్మా ద్వై తదరక్షణేఽస్తి సుమహా న్దోషోఽర్క జాత! ధ్రువమ్.
౨౯

ధర్మిష్ఠంచ ఫలోదయం మునివచ స్తథ్యం కరిష్యా మ్యహమ్
కించాహం సకృదేవ తేఽస్మ్యహ మితి ప్రోక్తేపి సూర్యాత్మజ!
భూతేభ్యో హ్యభయం దదామి సతతం చేదం వ్రతం త్వస్తి మే
తస్మా ద్దానయ తం మయాఽభయ మలం దత్తం హ్యముష్య
ధ్రువమ్. ౩౦

ప్రాప్తోఽయంతు విభీషణోఽస్తు యదివా పంక్త్యాననో వా
స్వయం, దాతవ్యం హ్యభయం మయేతి వచనం శ్రుత్వాఽ-
ర్కజః ప్రాహ తమ్, ధర్మజ్ఞాఽస్తి కిమత్ర చిత్ర మధునా
బ్రూతే యదేవం భవాన్, శుద్ధం వేత్తి విభీషణం రఘు
పతే మేఽద్యాంతరాత్మా ధ్రువమ్. ౩౧

అద్యారభ్య విభీషణోపి సదృశోఽస్మాభి శ్చిరం తిష్ఠతా
త్త్వాప్నో త్వాశుతు న స్సఖిత్వ మితి తచ్ఛ్రుత్వా వచో
రాఘవః, దేవేంద్రస్తు గరుత్మతేవ నితరాం మైత్రీం

౨౯. శరణాగతుని రక్షించితినేని వీడు పిదప మనలను జంపునని భయము చేతగాని, మోహముచేతగాని, తన శక్తికొలది రక్షింపనివాని సుకృతము నంతను రక్షింపబడనివాడు మృతినొందినవాడై వెంటగొనిపోవును, అని ధర్మము వినబడుచున్నది. కావున శరణాగతుని రక్షింపనిచో గొప్ప దోషము గలుగును.

౩౦. సుగ్రీవా! శరణాగతరక్షణము ధర్మయుక్తమని, స్వర్గాదిఫలప్రదమని కండుమహర్షి వచనములవలన స్పష్టపడుచుండినందున ఆమునివచనము శాస్త్రబద్ధుడనైన నేను యథార్థముగ నాచరించెదను. ఇదియునుంగాక "నీవాడను నేను. నన్ను రక్షింపు"మని ఒక పర్యాయము పలికిన మాత్రాన గూడ సర్వభూతములకు అభయ మిచ్చెదనని నాకు వ్రతముండెను. అందువలన ఈ వచ్చిన వానికి అభయమిచ్చితిని గాన వెంటనే యిటకు వానిని దీసికొని రమ్ము - (సర్వభూతములకు అనుటచే ఏ జాతివాడైనను, ఎంతటి పాపియైనను, పశువు, పక్షి యైనను శరణాగతుడైనచో రక్షించు వ్రతము రామున కుండెనని తెలియదగును.)

౩౧. సుగ్రీవా! ఈ వచ్చినవాడు శత్రువు తమ్ముడుకాక సాక్షాచ్ఛత్రువైన రావణుడైనను సంతోషమే. వానికైనను నేను అభయమివ్వవలసి యుండును. అని చెప్పుచున్న రాముని వాక్యములను సుగ్రీవుడు విని శ్రీరామచంద్రునితో నిటులఁ బలికెను. రామచంద్రా! ధర్మజ్ఞుడ వైన నీవిట్లు చెప్పుటలో నాశ్చర్య మేమియున్నది. (అనగా శరణాగతుడెట్టివాడైనను రక్షించెద నను నీ మాటలో నాశ్చర్యము లేదు. ఇదియునుంగాక, రామచంద్రా! వీడు ద్రోహి కాడు. నిర్మలచిత్తము గలవాడని నా యంతరాత్మ కూడ చెప్పుచున్నది.

౩౨. రామచంద్రా! పై కారణములచే విభీషణు డీక్షణమునందే మాతో స్నేహితుడై మాతో సమానుడై యుండు గాక, అని సుగ్రీవుడు చెప్పగా రామచంద్రమూర్తి విని యింద్రుడు గరుత్మంతునితో

విధాతుం దృష్ట్వా, మిచ్ఛం స్తేన విభీషణేన తు ముదా తం త్వాహ్వాయామాస సః. 3౨౫

పశ్చాచ్ఛోఽపి విభీషణోఽంబరతలా ద్భూమిం తదాఽఽలోకయ, న్స్వీయైస్సాక మరం రఘూత్తమపదద్వంద్వే నిపత్యాఽఽహ తమ్, పంక్త్యాస్యస్య సహోదరోఽహం మధునా తద్వంచిత స్త్వాం పున, శ్శ్రుత్వా లోకశరణ్యా ముత్తమభవత్పాదాంతికం చాగతః. 33౫

నామ్నాహంతు విభీషణో రఘుపతే జాత్యైవ రాత్రించరో
నో శీలేన నిశాచరోఽహం మభవం తథ్యం బ్రవీమి ప్రభో
సంత్యక్తా నగరీ ధనాని చ మయా దారాశ్చ మిత్రాణిచ
ప్రాయ స్త్వద్గత మేవ జీవిత మిదం రామప్రభో! మే ధ్రువమ్.
3౪౫

ఇత్యుక్త్వా ప్రాంజలి ర్భూత్వా స్తోతుం త ముపచక్రమే
నమ స్తే రామ! రాజేంద్ర నమ స్సీతామనోహర
నమ స్తే చండకోదండ నమ స్తే భక్తవత్సల
అహో! త్వత్పాదసద్భక్తినిశ్రేణిం ప్రాప్య రాఘవ
ఇచ్ఛామి ముక్తిసౌధంతు సమారోఢు మహం విభో. 3౫-3౬౫

నమ స్సీతాపతే రామ త్రాహి మాం భవసాగరాత్
ధన్యోస్మి కృతకృత్యోస్మి సాంప్రతం తవదర్శనాత్
త్వత్పాద దర్శనా దేవ విముక్తోస్మి నసంశయః
నయాచే రామరాజేంద్ర సుఖం విషయసంభవం
త్వత్పాదకమలే సక్తా భక్తి రేవ సదాస్తు మే. 3౭-3౮-3౯

స్నేహము చేసినట్లు విభీషణునితో మైత్రినిజేయు నిచ్ఛతో విభీషణు నాహ్వానించెను.

౩౩౪ పిదప విభీషణుడు తన నలువురు మంత్రులతో నేల చూచుచు నాకా శము నుండి దిగి, రామచంద్రమూర్తి పాదములయందు బడి, ప్రణ మిల్లి యిటుల బలికెను. రామచంద్రా! నేను రావణుని తమ్ముడను. అతడు నన్నవమానించిన కారణముచే సర్వలోకశరణ్యుడ వయిన నీపాదములచెంత జేరితిని.

౩౮౪ రామచంద్రా! నాపేరు విభీషణుడందురు. నేను జాతిచే రాక్షసుడనే కాని స్వభావముచే రాక్షసుడనుగాను నేను యథార్థము చెప్పు చుంటిని. నీకెవ్వరును రక్షకులు లేరా! యని యందువేమో! చిరకా లమునుండి నివసించు లంకాపురిని దారపుత్రాదులను బంధుగులను మిత్రులను సంపదలను సర్వము వదలిపెట్టితిని. కావున నాకెవ్వరును రక్షకులులేరు. నేను నా జీవితము నీయధీనములయియున్నవి (అనగా నా యోగక్షేమములకు నీవే దిక్కు)వు.

౩౫-౩౬౪ అని యిట్లు విభీషణుడు చెప్పి, చేతులు జోడించి, రామచంద్ర మూర్తిని స్తుతింప మొదలిడెను. రామచంద్రా! రాజేంద్రా! నీకు నమస్కారము. ఓ సీతామనోహరా! నీకు వందనము. ఓ కోదండ రామా? నీకు దండము. ఓ భక్తవత్సలా! నీ కభివందనము, స్వామీ! నీ పాదారవిందములయందు భక్తి యనెడి నిచ్చెన ద్వారా ముక్తి యను సౌధము నెక్కుటకు గోరుచుంటిని.

౩౭.౩౮-౩౯ ఓసీతాపతీ! నీకునమస్కారము. రామచంద్రా! నన్ను సంసార సముద్రమునుండి యుద్ధరింపుము. నీ దర్శనముచే నేను ధన్యుడను. కృతకృత్యుడను. నీ పాదారవింద సందర్శనము చేతనే నేను ముక్తుడ నైతిని. ఇందుకు సందియములేదు. రామచంద్రా! విషయ సౌఖ్యమును నేను వాంఛింపను. నీ పాదకమలములయందు నిశ్చలమయిన భక్తిభావము నాకు సర్వదా యుండునట్లు నీ వనుగ్రహింపవలయును.

ఏవం తేన విభీషణేన నితరాం శ్రీరామచంద్ర స్స్తుతః
ప్రాహైత ద్వచనం విభీషణ మహం త్వద్భక్తిసంతోషితః
ధ్యాత్వా మాంతువిమోక్ష్యతి ధ్రువమలం సంసారవారాంనిధే
ర్భక్తి స్తే భవతా దచంచలతమా నిత్యాఽనపాయి న్యరమ్. ౮౦

పశ్చా దేవ మువాచ లక్ష్మణమపి శ్రీరామచంద్రప్రభు
ర్లంకారాజ్యతలేఽభిషేక మధునా కుర్యా మిహైవాస్య త
ద్గత్వా చానయ సాగరా జ్జలమితి ప్రోక్త్వా తటే వారిధే
ర్లంకాం తత్సికతామయీం హనుమతా శీఘ్రం తదాఽ
కారయత్ ౮౧

సాక్షాదేవ విభీషణం రఘుపతి స్తత్రోపవేశ్య ద్రుతం
సాముద్రేణ జలేన సూర్యజముఖై ర్యుక్తోఽభ్యషించ త్తదా
పశ్చా దేవ మువాచ తం రఘుపతిః పఙ్క్త్యానన స్యానుజం
లంకారాజ్యతలేఽధునైవ తు మయా పట్టాభిషిక్తో భవాన్. ౮౨

యావ చ్చంద్రదివాకరా తు భవత స్తావ ద్భవాంస్తు ధ్రువం
లంకారాజ్య మిదంతు ధర్మనిరత స్సంపాలయే ద్వై భవాన్
సందేహం త్యజ మానసే దశముఖం హన్యా దయం వా నవే
త్యాత్మానం కురు సుస్థిరం దశముఖం హన్యాం సమూలం
త్వహామ్. ౮3

౪౦ ఇట్లు విభీషణుడు స్తుతింపగా అతని భక్తికి సంతసించి, రామచంద్ర మూర్తి విభీషణునితో నిటులఁ బలికెను. విభీషణా! నన్ను నిరంతరము ధ్యానించుటచే నీవు తప్పక సంసారబంధమునుండి విముక్తుడవు కాగలవు. నీకు అచంచలమైన వైష్ణవభక్తి శాశ్వతముగా నుండగలదు.

౪౧ ఇట్లు రామచంద్రమూర్తి విభీషణునితోఁ జెప్పి పిదప లక్ష్మణునితో నిటులఁబలికెను. లక్ష్మణా! విభీషణునకు లంకారాజ్యమున కిప్పుడే, యిక్కడనే పట్టాభిషేకము చేసెదను. నీవు సముద్రోదకమును దీసికొనిరమ్ము. అని చెప్పి పిమ్మట హనుమంతునిచే సముద్రతీరమున నొక యిసుకతిప్పను లంకనుఁగా జేయించెను.

౪౨ రామచంద్రమూర్తి హనుమంతునిచే నిర్మింపబడిన యిసుకతిప్ప లంకయందు విభీషణుని గూర్చుండబెట్టి, సుగ్రీవాది వానరులతో సముద్రోదకముచే విభీషణుని నభిషిక్తుని చేసెను. ఇట్లభిషిక్తునిగా జేసి రామచంద్రమూర్తి విభీషణునితో నిటుల బలికెను. విభీషణా! లంకారాజ్యమున నిన్నిపుడే పట్టాభిషిక్తునిగా నేను జేసితిని.

౪3 సూర్యచంద్రాదు లున్నంతపర్యంతము లంకారాజ్యమును నీవు ధర్మముగఁ బరిపాలింపుము. రామచంద్రమూర్తి రావణుని సంహరింపగలడో, సంహరింపలేడో, అను సంశయముక నీవు మనస్సులో పెట్టుకొనకుము. రావణుని సమూలముగా నశింప జేసెదను. మనస్సునందే సంశయము నుంచుకొనకుము.

*యావ న్మమ కథా లోకే తావ ద్రాజ్యం విభీషణ!
కృత్వా మమ పదం దివ్యం యోగిగమ్యం సనాతనం
సపుత్రపౌత్రస్సగణస్సంప్రాప్నుహి మహామతే. ౨౨౪

---

* అత్రేద మవధేయం - "అన్నం పానం ధనం వస్త్ర మాయు రారోగ్య మేవచ, గృహం భూజీవనోపాయాన్న యాచే చ్ఛరణాగతః, ప్రత్యహం యాచ్యమానోపి, భగవాం స్తస్య యాచితం, న దదా త్యస్య తత్క ర్మవశా ల్లభ్యం లభేత సః అయాచక ప్రసన్నాయ సర్వం దద్యా ద్ధరి స్స్వయం, తస్య తత్పూర్వకర్మాది విచారస్తు నవిద్యతే, కర్మాధారజనే తావ ద్యావ ద్దేయం తదేవ తత్, దదాతి తస్య భగవదాధారా యాఖిలం త్వహం, దద్యామేన నసందేహ ఇతి తద్వచనం పునః, అనుస్మృత్య రఘూత్తంసం నాపృచ్ఛత్స విభీషణః, తథాపిసోఽనుజ గ్రాహ [illegible] మప్యయం, పరిప్రదాన సమయే నామరత్వం విధిం పునః, యమాచే విధి రేవాస్మై దదా వమ రతాం స్వయం, తద్యాచకదశాస్యాయ నామరత్వం దదౌ విధిః, తతో నిష్కామవృత్త్యా తు సర్వభారం హరౌ పునః, నిక్షిప్య సంస్థితా నూనం భవేమ యది వై వయం, స్వయంతు భగవా నేవ యోగక్షేమా విచారయేత్, ఇతి - ఏవమేవ గీతావాక్య మపి దృశ్యతే. తథాహ- "అనన్యా శ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే, తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమా వహా మ్యహ మితి" అత్ర కాచి దాశంకా సముదేతి. విభీషణేన నిష్కామకేన శ్రీరామానుగృహీత మపి రాజ్యం

౭౭౪ విభీషణా! నా కథ (రామకథ) యెంతదనుక భూమియందుండునో అంతదనుక నీవు రాజ్యమును బరిపాలించి, పిదప నీవు నా దివ్యపదమును పుత్త్రపౌత్త్రాదిసహితముగాఁ జేరగలవు *

---

* ఇచ్చట నీ క్రిందివిషయము గమనింపదగినది? "అన్నము, పానము, ధనము, వస్త్రము, ఆయువు, ఆరోగ్యము, గృహము, భూములు, జీవనోపాయము, పైవానిని శరణాగతుడు భగవంతుని యాచింపరాదు. ప్రతిదినము వీడు భగవంతుని యాచించినను భగవంతుడు వానికీయడు, పూర్వజన్మకృతానుసారముగ నవి లభింపవలసినవే. "యాచింపకుండ నుండువానికి సర్వమును నేనిచ్చెదను. వాని పూర్వకర్మ విచారముతో నాకు పనిలేదనియు కర్మముపై నాధారపడినవానికి కర్మయెంత యియ్యవలెనో. యంతయే యిచ్చును. నామీద నాధారపడినవానికి నేను సర్వము నిచ్చెదను" అను భగవద్వచనము ననుసరించి విభీషణుడడుగకుండినను రాజ్యమును శ్రీరామచంద్రమూర్తి యనుగ్రహించెను. విభీషణుడు బాల్యమున బ్రహ్మను గూర్చి తపస్సు చేసినపుడు అమరత్వము నడిగిన రావణునకు బ్రహ్మ యమరత్వమును (చావు లేకపోవుటను) నీయక యడుగమని విభీషణునకు బ్రహ్మదేవు డమరత్వము నిచ్చెను. దీనివలన మనము నిష్కామపు వర్తనము గలిగియుంటిమేని సర్వభారము భగవంతునిపై వైచితిమేని మన యోగక్షేమములు ఆయనయే విచారించుకొనునని తెలియుచున్నది. గీతావాక్యముకూడ నిట్లే కన్పడుచున్నది, "ఎవ్వ రనన్యమనస్కులై నన్నుపాసించెదరో, వారియొక్క యోగక్షేమములను నేను వహించెద"నని. ఇచ్చటనొక యాశంక కలుగుచున్నది. విభీషణుడు నిష్కాముడుగా వచ్చెను గదా, రామచంద్రమూర్తి రాజ్యము నిచ్చెనని చెప్పినపుడు నాకక్కరలేదని యేల చెప్పియుండ లేదని యాశంకకు సమాధాన మిటుల గ్రహింపదగినది. నేను నాజీవితము కూడ రామచంద్రా! నీయధీనములని చెప్పిన

ఏతస్మి న్నంతరే తత్ర సంస్థితా వానరాః పునః
పరస్పర మిదం వాక్యం ప్రాహు రత్యంతవిస్మితాః. ౪౫

సుగ్రీవస్య ప్రతిజ్ఞాతం యత్పురా రాఘవేణ తు
తదా సమాప్త మభవ న్నచేదం తాదృశం ధ్రువం.
లంకాయాం రాక్షసా నూనం మహాంతో బలిన స్తథా
కథం పరిణమే ద్యుద్ధం నజ్ఞాతుం శక్యతే౽ధునా
లంకారాజ్యం తు తే దత్త మితి రాఘవభాషణం
విభీషణం ప్రతీదానీ మవిచార్య ప్రకీర్తితం
ఇతి తద్వచనం శ్రుత్వా రాఘవః ప్రాహ సాదరం
శృణ్వతాం వానరాణాం తు వాక్య మేత ద్విభీషణం.
౪౬-౪౭-౪౮-౪౯

ఇంద్రాద్యైః పరిరక్షితో౽పిచ సురై ర్విఖ్యాతా మయా తే హత
స్స్యాదే వాత్ర న సంశయో౽స్తి సమరే హన్యాం నచే
ద్రావణమ్, దద్యాం కోసలరాజ్యమేవ మమ తే నూనం
దశాస్యానుజ, ప్రాణైః కంఠగతై రపి ధ్రువ మహం
నోవచ్మ్యసత్యం పునః. ౫౦

---

నమమేతి కథం నోక్త మిత్యస్యేదం సమాధేయం. "మజ్జీవితం త్వద్గత మితి" పూర్వోక్తవిభీషణవచనపరిశీలనే విభీషణో రామాధీన ఇతి స్పష్టీభవతి. అతో రామాజ్ఞోల్లంఘనదోష భియా విభీషణేన లంకారాజ్య మురరీకృత మితి వేద్యమ్.

౪౫ ఈ సమయమున నచ్చటనున్న వానరులందఱు పరస్పరము నిట్లు విస్మయముగ మాట్లాడుకొనుచుండిరి.

౪౬-౪౭-౪౮-౪౯ రామచంద్రమూర్తి సుగ్రీవునకు వానరరాజ్యము నిచ్చెదనని ప్రతిజ్ఞ చేసినను ఆపని వెంటనే తేలిపోయినది. విభీషణునకు లంకారాజ్యము నిచ్చెదనని చెప్పుట యట్టిదికాదు. ఎందుచే ననగా, లంకలోనున్న రాక్షసులందఱు బలవంతులు, గొప్ప వారలునయియుండిరి. రామరావణుల యుద్ధము తుదకెట్లు పరిణమించునో తెలిసికొన వీలులేదు. లంకారాజ్యమునకు నీకిపుడే పట్టముకట్టితినని విభీషణునిగూర్చి రామచంద్రమూర్తి చెప్పుట విచారింపకుండగఁ జెప్పిన మాటగా నున్నదని వానరులు చెప్పుకొనుచుండగా నావాక్యములు రామచంద్రమూర్తి విని వానరులు వినునట్లు విభీషణునితో నిటులఁ బలికెను.

౫౦ ఓ విభీషణా ! ఇంద్రాదిదేవతలచే రక్షింపబడినను గూడ నీయన్నయగు రావణుని జంపుట నిశ్చయము. ఇందుకు సందియములేదు. ఒక పక్షమున రావణుని నేను జంపలేకపోయి నీకు లంకారాజ్యము నీయలేని కల్పములో నా కోసలరాజ్యమును నీకిచ్చివేయుదును. ప్రాణము మీదికి వచ్చినను గూడ నేనన్నృతమాడువాడను కాను.

---

విభీషణుని వచనమును విచారించినచో రాముని యధీనములో విభీషణు డున్నట్లు స్పష్టమగు చుండుటవలన రామాజ్ఞ నుల్లఘించిన దోషము వచ్చునను భయముచే విభీషణుడు లంకారాజ్య మంగీకరించెను. గాని రాజ్యాపేక్షచే గాదని తెలియదగును.

యావ త్త్వం దశకంధరం వినిహతం కృత్వా తు లంకాం శుభాం
దాస్యా మ్యాశరనాయకానుజ! భవే త్తే న్యాసభూతాత్వియమ్
లంకేయం హనుమత్కృతాపిచ భవే త్ఖ్యాతాచ తస్యాఖ్యయే
త్యు క్తే తద్రఘునందనేన నితరాం తం తుష్టువు ర్వానరాః. ॥౧౧॥

పశ్చా త్త్వాహ విభీషణం రవిసుతస్త్వాలింగ్య తం సాదరం
సర్వేఽమీ వయ మద్య రాఘువవిభో ర్దాసానుదాసా ధ్రువమ్
ముఖ్య స్తత్రభవా న్హి నో దశముఖ స్సద్యో వినశ్యే ద్యథా
సాహాయ్యం తు విధాతు మర్హసి తథా త్వం చాశరేశానుజ. ॥౧౨॥

ఇత్యు క్త స్స విభీషణోఽగ్రజతనయం న్రమోఽవద త్ప్రాంజలి,
ర్న్యూనం తద్రఘునందనస్య తు కియా న్సాహ్యం విధాతుం త్వహమ్, కింత్వేతస్య రఘూత్తమస్య నితరాం దాస్యం కరిష్యా మ్యహం, భక్త్యా నిర్మలయా సదారఘుపతే రాజ్ఞా కరస్స్యా మహమ్. ॥౧౩॥

నిశాచరవధే సాహ్యం లంకాయాశ్చ ప్రధర్షణే
*రావణస్య వధేచాహం కుర్యా మత్ర న సంశయః. ॥౧౪॥

---

*రావణస్య వధే చాహ మితి:—అత్రేద మవధేయం. సాక్షా ద్దశాననానుజేన విభీషణేన జ్యేష్ఠభ్రాతుః. పితృసమస్య వధే సాహాయ్యకరణబుద్ధ్యుదయోవా, రావణస్య సహోదర నిష్కాసనే బుద్ధ్యుదయోవా, పురా దశాననం ప్రతి కుబేరేణ

౫౧౪ విభీషణా! రావణుని నేను సంహరించి నిజమైన లంకారాజ్యమును నీకిచ్చుటకు నిప్పుడు హనుమంతునిచే కల్పింపబడిన సైకతరూపమయిన యీ లంక న్యాసభూతముగ (దానికిబదులుగ) నుండగలదు. హనుమంతునిచే నీ కొఱకుఁ గల్పింపబడిన యీ సైకతరూపమయిన లంక హనుమంతుని పేరుతో (అనగా హనుమల్లంక యని) భూమి యందు ప్రసిద్ధమై యుండుగాక, అని యిట్లు చెప్పుచున్న రామ చంద్రమూర్తిని వానరులు బహువిధముల స్తుతించిరి.

౫౨౪ పిమ్మట సుగ్రీవుడు విభీషణుని కౌగిలించుకొని యిటుల సాదరముగః బలికెను. విభీషణా! మనమందరము రామచంద్రప్రభువుకు దాసానుదాసులము. ఈ యందఱిలో నీవు ముఖ్యుడవు కావున రావణునిఁ బరిమార్చుటలో నీవు ముఖ్యముగా రామచంద్రమూర్తికి సహాయము చేయవలెను,

౫౩౪ ఇట్లు సుగ్రీవుడు చెప్పుటతోడనే విభీషణుడు నమ్రతతో నిటులఁ బలికెను. మిత్రమా! రామచంద్రమూర్తికి సహాయము చేయుటకు నే నెంతవాడను. నేను జేయగలిగినది రామచంద్రమూర్తికి దాస్యము మాత్రమే. ఆ దాస్యము మాత్రము నిర్మలమయిన భక్తితో చేసెదను. రామచంద్రమూర్తి యాజ్ఞకు నేను బద్ధుడనై యుందును.

౫౪౪ సుగ్రీవా! రాక్షసవధ విషయమునగాని లంకను రూపుమాపుటలో * గాని రావణవధ విషయమైకాని నేను తప్పక సాహ్యాము చేసెదను. ఇందుకు సందియము లేదు.

---

* రావణవధ విషయమై సహాయము చేసెదనను విషయమున నీక్రింది విధముగఁ దెలిసికొనదగినది — సాక్షాత్తుగ రావణుని సోదరుడగు విభీషణునకు తండ్రితో సమానుడగు జ్యేష్ఠభ్రాత యయిన రావణునిఁ జంపించుటకు బుద్ధిపుట్టుట కాని, లేక రావణునకు సోదరుడగు విభీషణుని దన పట్టణమునుండి వెడల గొట్టింప బుద్ధిపుట్టుట కాని, యిది యంతయు పూర్వము రావణుని

పశ్చా న్మారుతనందనో రవిసుత శ్చాప్యాహతు స్తం పున
స్సర్వేఽమీ కపయో వయం జలనిధిం తర్తుం కథం శక్నుమః
నోపాయః పరిదృశ్యతేఽద్య భవతా సంచింత్య వాచ్యం హి నః
ప్రోక్త శ్చైవ మథాహ తౌ కపివరౌ పక్తిస్యాననస్యానుజః. ౫౫

శ్రీరామోద్య సముద్రమేవ శరణం ప్రాప్నోతి భక్త్యా యది
ప్రాయస్తస్య రఘూత్తమస్య పదవీం దాస్య త్యయం వారిధిః
శ్రుత్వా తద్వచనం సమీరణసుత స్సూర్యాత్మజో ద్వావరం
గత్వా రాఘవ మూచతు ర్దశముఖభ్రాత్రా తదుక్తం వచః. ౫౬

తథేతి రాఘవోప్యుక్త్వా దర్భా నాస్తీర్య వారిధేః
తీరే హుతాశనో వేద్యాం యథా తత్ర వివేశ సః
తత్రాగత శ్శుకో నామ రావణప్రేరితోఽసురః. ౫౭-౫౮

ఆశ్చర్యరామాయణే యుద్ధకాండే పంచమస్సర్గ స్సమాప్తః.

---

విభీష్ణ శ్శాపఏవ కారణమితి వేద్యం, తథాహి– "దశాస్య! సోద రోహం యత్త్వయా నిష్కాసితోఽభవం, తత స్త్వాం సోదరః కశ్చి త్సమయేతు విముచ్యవై, వైరిణా తే మిళిత్వా త్వాం నాశయిష్యతి చ ధ్రువం, ఇతి శాపం దదౌ పూర్వం కుబేరస్తు దశాననం, తచ్ఛాపప్రేరితో నూనం దశాస్యస్తు విభీషణం, విని ష్కాసితవా న్సోపి తత్యాజచ దశానన" మితి పూర్వశాపోను సంధేయః.

౫౫౪ ఇట్లు విభీషణుడు చెప్పగా విని సుగ్రీవుడును హనుమంతుడు నిర్వు రును విభీషణునితో నిటులఁ బలికిరి. మిత్రమా! మేమందఱము సముద్రము దాటునట్టి యుపాయమే మొదటఁ గనుబడుటలేదు. నీవు బాగుగ నాలోచించి సముద్రమును వానరులు దాటు నుపా యము చెప్పవలయును. అని యడుగగా విభీషణుడు సుగ్రీవునితోను హనుమంతునితోను నివ్విధముగఁ జెప్పెను.

౫౬౪ ఓ మిత్రులారా! సముద్రమును దాటుట యెట్లని మీరలు నన్నుఁ బ్రశ్నించిరి, నాకుఁ దోచిన యుపాయము చెప్పెదను వినుడు, రామచంద్రమూర్తి సముద్రునే శరణుపొందినచో సముద్రుడు రామచంద్రమూర్తికి మార్గ మిచ్చును. ఇది యన్నిటికంటె సులభో పాయముగా గన్పడుచున్నదని విభీషణుడు చెప్పగా నతనిమాటను విని సుగ్రీవుడును హనుమంతుడును వెంటనే యీ సంగతి రామ చంద్రమూమూర్తికి వెళ్ళి చెప్పిరి

౫౮-౫౯ రామచంద్రమూర్తియును విభీషణుడు చెప్పినది బాగుగనున్నదని చెప్పి వెంటనే సముద్రతీరమున దర్భలఁ బఱచి యగ్నిహోత్రుడు యజ్ఞవేదికయందుఁ బ్రవేశించినట్లు దర్భశయ్య యందుఁ బ్రవేశిం చెను ఇంతలో శుకుడను రక్కసుడు రావణునిచే బంపబడి సముద్ర తీరమునకు వచ్చెను

ఆశ్చర్యరామాయణమున యుద్ధకాండమున పంచమసర్గము సమాప్తము.

---

గూర్చి కుబేరుడిచ్చిన శాపము మూలముగా గలదని గమనింప దగినది. ఆ కుబేరశాపమేమన; "రావణా! నీ సోదరుడగు నన్ను నిష్కారణముగా లంకాపురమునుండి వెడలగొట్టితివి కాన, నీ సహో దరులలోనే యొకడు నీ కాపద సంభవించు సమయమున నిన్ను వదలి నీ శత్రువుతోఁ గలసి నిన్ను సమూలముగా నాశనము చేయ గలడు" అని పూర్వము రావణునిగూర్చి కుబేరుడు శాపమిచ్చిన కారణమున, ఆశాపముచే ప్రేరేపింపబడియే రావణుడు విభీషణుని వెడలగొట్టెను, విభీషణుడు రావణుని వదలి యతని శత్రువుతో గలిసె నను పూర్వశాపవిషయమిచ్చట గమనింపదగినది.

# షష్ఠ స్సర్గః

శార్దూలో నామ దైత్యోఽథ నిశాచరపతేః పునః
గూఢచార స్సమభ్యేత్య దృష్ట్వా వానరవాహినీం
రావణాంతిక మాగత్య ప్రాంజలి స్తం దశాననం
ప్రాహైతద్వచనం తత్ర సభాయాం సంస్థితం ద్రుతమ్. ౧-౨

దశాస్య! వానరానీకో ద్వితీయఇవ వారిధిః
సముద్రస్య తటేఽతిష్ఠ ద్భ్రాతరా వపి రాఘవౌ
వరాయుధధరౌ వీరౌ తత్తీరే సంస్థితౌ ధ్రువమ్
కపీనాం బల మవ్యాసీ త్సర్వాఽగో దశయోజనం
రక్షోఽధిప! భటానాం స్తూర్ణం శౌర్యం వేత్తు మిహార్హసి
భేదోఽథోప్రదానం వా సాంత్వంవాథ్య ప్రయుజ్యతాం. 3-౪-౫

నిశమ్య వచనం తస్య సంచింత్య బహుధాత్మని
శుక మాహూయ దనుజం ప్రాహైవంతు దశాననః. ౬

సుగ్రీవనికటం గత్వా, భవా న్మద్వచసా వదేత్
అభిజాతోఽసి బలవా న్భ్రాతృతుల్య స్త్వ మర్కజ!
ఆవయో ర్న విరోధోఽస్తి నచ తేఽ స్త్యర్థవిప్లవః
రామస్య దయితాం చాహ మహరంచే త్తవాత్ర కిం
తత స్సుగ్రీవ! కపిభిః కిష్కింధాం వ్రజ సత్వరమ్. ౭-౮౯

# ౨౯ వ సర్గ ప్రారంభము

౧-౨ శార్దూలు డను రావణునిగూఢచారి సముద్రతీరమునందున్న వానరసైన్యము నంతను జూచి తిరిగి రావణుని సమీపమునకు వచ్చి చేతులు జోడించి సభయందున్న రావణునితో నిటులఁ బలికెను.

3-౪-౫ రావణప్రభూ! వానరసైన్యము లంక కేతెంచుటకై వచ్చి సముద్ర తీరమున విడిసియుండెను. అది రెండవ సముద్రమువలె నుండెను. సోదరులయిన రామలక్ష్మణు లిరువురును శ్రేష్ఠమయిన గొప్పాయుధ ములను ధరించి యిచటకు వచ్చుటకై సముద్రతీరమున నున్న వారలు. వానరసైన్యము నెటుచూచినను పదియామడ వెడల్పుపొడవు కలిగియుండెను. రాక్షసరాజా! వారి సమాచారము తెలిసికొను టకై యెవ్వనినైనను దూతను బంపు మని నా యభిప్రాయము. ఈ సమయమున సామమో, భేదమో, దానమో యుపయోగింపవలయును గాని దండోపాయము మాత్రము వ్యర్థము.

౬ ఆ శార్దూలుని మాటలను విని రావణుడు తన మనమునందుఁ బరిపరి విధముల నాలోచించి పిదప శుకుడను రక్కసునిఁ బిలిచి యిటులఁ జెప్పెను.

౭-౧౪ ఓ శుకుడా! నీవు సుగ్రీవునియొద్దకు వెళ్లి నేను చెప్పినానని సుగ్రీ వునితో నిటులఁ జెప్పుము. సుగ్రీవా! నీవు గొప్ప వంశమునందుఁ బుట్టినవాడవు, మఱియు గొప్ప బలముగలవాడవును, నాకు సోదరు నితో సమానుడవును, గావున, అల్పబలముగల నీచవంశీకుడగు రాము నితో నీకుఁ గావలసిన కార్యమేమి? ఇదియునుగాక రామునితో స్నేహము వదలినంతమాత్రమున నీకు గలుగు నష్టమూ లేదు. మన లకుఁ బూర్వవిరోధ మేమయిన నున్నదనుకొందుమనినను నదియు లేకపోయెను. మనకు నిష్కారణముగాఁ గలహ మేల? రామునిభార్యను నే నపహరించిన నీకుఁ గలిగిన నష్టమేమి? కావున నీవు కిష్కింధకు సేనలతో వెళ్ళి పొమ్ము - (అని చెప్పినానని నీవు సుగ్రీవునితో జెప్పుము.)

ఏవం రాక్షసరాజేన సమాదిష్ట శ్శుక స్తతః
విహంగమాకృతి స్తూర్ణం సముత్పత్యాంబుధే స్తటం
సమాగమ్యాంతరిక్షే స్థిత్వా సుగ్రీవం ప్రాహ స్మై వచః. ౯-౧౦

తమువాచ దశగ్రీవ స్సుగ్రీవ శృణు తద్వచః
యద్యహం రామయుక్తాపహారం కిం ప్రతి స్తవ
మమ త్వం భ్రాతృసదృశ స్తవ నా స్త్యర్థవిప్లవః
కిష్కింధాం వ్రజ శీఘ్రం హరిభి స్సహితో భవాన్. ౧౧-౧౨

ఇతి సందిష్టవృత్తాంతం వానరాః క్రోధమూర్ఛితాః
పరిగృహ్యాంబరా త్తూర్ణం పాతయిత్వా చ భూతలే
నిహంతు ముద్యతాం స్తత్ర శుకంతు విహగాకృతిమ్
శుక స్తై ర్నిగృహీతో౽థ ప్రాంజలిః ప్రాహ రాఘవమ్. ౧౩-౧౪

నదూతో వధ్యతే లోకే ఘ్నంత్యమీ వానరా స్తు మాం
రామచంద్ర! కృపాసాంద్ర! వానరా న్వారయ ప్రభో. ౧౫

ఇత్యుక్తో వారయామాస వానరా న్రాఘవః పునః
పశ్చా త్ప్రాహ శుక స్సూర్యసుతం ప్రాంజలిసంయుతః
దశాననస్య వక్తవ్యం యద్యస్తి వద సత్వరం
ఇత్యుక్త స్తం శుకం ప్రాహ సూర్యపుత్రో హ్యరిందమః
గత్వా మద్వచసా బ్రూహి దశాస్యాయ శుక! ద్రుతమ్.
౧౬-౧౭

౯-౧౦ ఇట్లు రావణునిచే నాజ్ఞాపింపబడి శుకుడను రక్కసుడు చిలుకవలెనై ఆకాశమార్గమునఁ బోయి సముద్రతీరమునకు వచ్చి యాకసమునందే యుండి సుగ్రీవునితో నిటులఁ బలికెను.

౧౧-౧౨ సుగ్రీవా! రావణుడు తానుచెప్పినట్లునీతో నిటులఁ జెప్పుమనెను. నేను రామునిభార్య నపహరించినందువలన నీకుఁ గలిగెడి నష్టమేమి? వాలినిబట్టి నీవు నాకు సోదరునివంటివాడవు. నీకిందువలన గలిగెడి నష్టమా యేమియులేదు. కావున నీవు వానరులతో కిష్కింధకు వెడలిపొమ్ము. (అని శుకుడు చెప్పెను)

౧౩-౧౪ ఇట్లు చెప్పుచున్న శుకుడను రక్కసుని వానరులు క్రోధావేశముతోఁ బట్టుకొని పైనుండి కిందకు బడవేసి చావచితుకగొట్టుచుండగా, వానరులచేఁ గొట్టబడుచున్న యా శుకుడు రోదనము చేయుచుఁ జేతులు జోడించి రామచంద్రమూర్తితో నిటులఁ బలికెను.

౧౫ ఓ దయాసముద్రుడా! రామచంద్రా! ప్రభువు చెప్పిన మాటలను జెప్పెడి దూతయందు దోషము లేదుగాన నతడు వధార్హుడు కాడు గదా! ఈ వానరులు నిష్కారణముగాఁ జంపుచుండిరి. వానరులను నివారింపుము.

౧౬-౧౭ ఇట్లు శుకుడు ప్రార్థింపగా రామచంద్రమూర్తియును వానరులతో వానిని జంపవలదని చెప్పి వానరులను నివారించెను. పిదప శుకుడు చేతులు జోడించి సుగ్రీవునితో నిటులఁ బలికెను. ఓ వానరరాజా! నేను లంకకు బోవుటతోడనే సుగ్రీవు డేమి చెప్పెనని రావణుడు నన్నడుగును గదా! చెప్పవలసిన దేమైన నుండిన యెడల జెప్పుమని యడుగగా. సుగ్రీవుడు శుకునితో నిటులఁ జెప్పదొడగెను. ఓరీ నేను చెప్పినట్లు రావణునితో నిటులఁ జెప్పుము.

అరే ర్మిత్రం భవా న్మాన మరి రేవ భవా న్మమ
న మేఽసి మిత్రభూత స్త్వం వధ్య స్త్వం వాలివ న్మమ
నానుకంప్యో నోపకర్తా నప్రియోఽసి త్వ మాశర
సపుత్రమిత్రం సామాత్యం హన్మ్యహం త్వాం దశానన
క్షిప్రమేవ కరిష్యామి భస్మీభూతాంచ తే పురీం. ౧౮-౧౯-౨౦

మహేంద్రాదిసురై ర్వానం గుప్తో ప్యంత ర్హితోఽపివా
పాతాళంవా ప్రవిష్టోపి గతో ప్యర్కపథం భవాన్
న మోక్ష్యతే రాఘవేణ త్రిషు లోకేషు తే పునః
రక్షకం నానుపశ్యామి సురేష్వ ప్యసురేషు వా
రామస్య లక్ష్మణస్యాపి సన్నిధౌ భూమిజాం భవాన్
హృతవాం శ్చే దితః పూర్వం హతఏవ భవా న్ధ్రువం. ౨౧-౨౨-౨౩

ఇత్యుక్త శ్ఛిన్నపక్షశ్చ పురైవ కపిభి శ్శుకః
దశాననాంతికం గత్వా నత్వా ప్రాహ దశాననం. ౨౪

రక్షోధిప! వచ స్తేఽహం సుగ్రీవాయ న్యవేదయం
గృహీతోఽస్మ్యహ మారబ్ధో హంతుం చ కపిభి ర్భృశం
భిన్నపక్షోఽభవం పశ్చా ద్రాఘవః ప్రార్థితో మయా
వానరా న్వారయామాస కృపాసాంద్రో ద్రుతం విభో
రాక్షసానాం కపీనాంచ మైత్రీ జాతు నసంభవేత్
సుగ్రీవస్య వచోఽప్యుక్త్వా పశ్చాదేవ మువాచ సః. ౨౫-౨౬

౧౮-౧౯-౨౦ ఓరి రావణా! నాకు శత్రువయిన వాలికి నీవు మిత్రుడవు గాన. నీవుకూడ నాకు శత్రువుడవే కాని మిత్రుడవు కావు. కావున నీవుకూడ వాలివలె వధార్హుడవు, కాని దయచూపింపఁ దగినవాఁడవు కావు. నీవేమయిన నుపకారివా? కావు; హితుడవా కావు. కాబట్టి నిన్ను పుత్రమిత్రాదులతో గూడ జంపించి నీ లంక నంతను భస్మము చేసి వేయించెదను.

౨౧-౨౨-౨౩ నీ వెచ్చటనో దాగియుండినచో నన్నేమి చేయగల వని యనియెదవేమో చెప్పెదను వినుము. నీవు ఇంద్రాదిదేవతలచే రక్షింపబడినను, కనుబడకుండక వెచ్చటనైన దాగియుండినను, లేక పాతాళములో దాగినను, లేక యాకాశమున దాగినను, రాముని బారినుండి నీవు విముక్తుడవు కాలేవు. నిన్ను రక్షించువాడు ముల్లోకములలో దేవాసురమనుష్యులలో నెవ్వడును కన్పడడు. తన భార్యను హరించినపుడు నన్నేమిచేసెనని యనియెదవేమో, వారలు చూచుచుండగా నీవు సీత నపహరించినట్లయిన నింతకు పూర్వమెన్నడో నీవు చచ్చియుందువు,

౨౪ ఇట్లు సుగ్రీవుడు చెప్పగా మొదటనే వానరులచే రెక్కలూడ పెరుకబడిన యా పక్షిరూపము గల శుకుడు రావణుని సమీపము నకుఁ బోయి నమస్కరించి యిటులఁ బలికెను.

౨౫-౨౬ ఓ రాక్షసరాజా! నీవు చెప్పిన మాటలను సుగ్రీవునకుఁబోయి చెప్పితిని. ఆ సమయమున నచ్చటి వానరులు నన్ను బట్టుకొని రెక్కలూడదీసి కొట్టి చంపుటకు యత్నింపుచుండ, రామచంద్ర మూర్తిని బహువిధముల నేను బ్రార్థింపగా, దయానిధి యగు రామచంద్రుడు వానరులను నివారించెనుగాన నేను బ్రతికి ప్రాణములతో నిచటకు రాగలిగితిని. వానరులకును రక్కసులకును నెప్పుడు మైత్రి పొసగదు- అని చెప్పి సుగ్రీవుడు రావణునితో జెప్పుమన్న మాటలనుగూడఁ జెప్పి పిదపఁ దన యభిప్రాయమునుగూడ నిట్లు చెప్పదొడగెను.

స్వభావతో౽తికోపిష్ఠా వానరా స్తే దశానన
సీతాం ప్రయచ్ఛ రామాయ లంకారాజ్యే విభీషణం
అభిషిచ్య భవా న్రామం శరణం యాతు సత్వరం. ౨౭—౨౮

తథ్యం బ్రవీమి దనుజేశ్వర! మామకీనం
శ్రావ్యం వచో౽ద్య భవతా హిత ముత్తమంచ
సీతాం సమర్పయ నచే ద్ధ్రుతమేవ నూనం
రామాశుగై ర్మృతి మవాప్స్యసి చాత్మజాద్యైః, ౨౯

రామచంద్రః కృపాసాంద్ర స్తత స్త్వం శరణం భవాన్
వ్రజే చ్చే ద్రాఘవో నూనం రక్షిష్యతి న సంశయః ౩౦

తచ్ఛ్రుత్వా రావణః క్రుద్ధో ముహు ర్ధిక్కృత్య తం శుకం
వినిష్కాసితవా న్దూతై రాత్మగేహా ద్బహి ర్ద్రుతమ్. ౩౧

ఏవం నిష్కాసిత స్తేన శుక స్సంత్యజ్య చాసురీం ౩౨
తనుం ద్విజో౽భవ త్సద్య *శ్శాపముక్తివశా త్పునః

యుద్ధకాండే షష్ఠస్సర్గ స్సమాప్తః.

---

*శాపముక్తిరితి — పురా కో౽యం శుకః తస్య కో వా కిమర్థం శాపం దదా విత్యత్ర కథేయ మనుసంధేయా — తథాహి — శుకోపి బ్రాహ్మణః పూర్వం వసిష్ఠో బ్రహ్మవిత్తమః అయజ త్క్రతుభి ర్దేవా న్వైరో౽స్య రాక్షసై రభూత్, తస్య గేహం గతో జాతు కుంభజన్మా మునీశ్వరః అవకాశం విచి

౨౭-౨౮ ఓ రాక్షసరాజా! వానరులు స్వతసిద్ధముగా మహాకోపిష్ఠులు. కాన వానరులు వచ్చి లంకమీదను బడకపూర్వమే సీతను దీసికొని వెళ్ళి రామచంద్రున కర్పింపుము. ఇంతమాత్రముచే నీ తప్పును సహింపడేమో కాన విభీషణుని లంకారాజ్యమునందభిషిక్తునిగా జేసి రాముని శరణుపొంది యాయన సేవచేసికొనుము.

౨౯ రాక్షసరాజా! నేను యథార్థమును జెప్పుచున్నాను నా మాట వినుము. నేను నీ హితముగోరి చెప్పితిని. ఇది యుత్తమమయిన సంగతి. సీతను రామచంద్రమూర్తికి సమర్పింపనిపక్షమున నీవు పుత్రమిత్ర పరివారముతో రామబాణములచే హతుడవు కాగలవు.

౩౦ ఓ రాక్షసరాజా! రామచంద్రమూర్తి పరమకృపాళుడు కావున నీవు శరణనినచో నవశ్యము నిన్ను రక్షిపపగలడు. (అని శుకుడు చెప్పెను.)

౩౧ ఆ మాటలు విని రావణుడు మండిపడి వానినిదిట్టి తన గృహము నుండి భటులచే బయటికి వెడలగొట్టించెను.

*౩౨ ఇవ్విధముగా రావణునిచే బహిష్కరింపబడిన యా శుకుడను రక్కసుడు తన రాక్షస శరీరమును విడిచి వెంటనే బ్రహ్మర్షిగా * శాపవిముక్తిచే నయ్యెను.

యుద్ధకాండమున ఆరవసర్గము సమాప్తము.

---

* శాపవిముక్తిచే - పూర్వ మీ శుకుడెవడు? వాని కెవ్వ రేకారణముచే శాపమిచ్చిరి? యను విషయమున నీ క్రింది కథ యనుసంధేయము ఆది యెట్లన, పూర్వము శుకుడను బ్రాహ్మణు డుండెను. అతడు బ్రహ్మవేత్తయును, అనేక క్రతువులచే దేవతల నారాధించినవాడునయి యుండెను. యజ్ఞములో హవిర్భాగములను దేవతలకే యిచ్చుచు రాక్షసులకీయని కారణమువలన రక్కసులతో నతనికి విరోధముగలిగెను. ఇట్లుండ నొకప్పుడు శుకుని

## సప్తమస్సర్గః

పశ్చాద్వారినిధే స్తటే రఘుపతి స్త్వాస్తీర్ణదర్భేషువై
స్వీయం దక్షిణబాహు మర్థివసుదం కృత్వోపధానం వ్రతీ
శిశ్యే దర్భశయే స్తువత్యథ మహీంజాతాపతౌ వారిధిం
తిస్ర స్తు వ్యతిచక్రముః కిల నిశా *నాదర్శయ త్స్వంతు సః. ౧

---

న్వానో వజ్రదంష్ట్రి శ్శుకాలయం కుంభజన్మాకృతిం ధృత్వా మాంసాన్నం తస్య గేహినీం, అయాచ సోపి మాంసంచ పక్త్వా తచ్ఛుకగేహినీ, భూత్వా తతో ర్పయామాస మాంసాన్నం కుంభజన్మనే, తదా శప్త శ్శుక స్తేన త్వం రక్షో భవ మా చిరం, రక్షఃకృతం పున ర్జ్ఞాత్వా తేన సంప్రార్థితో ఽబ్రవీత్, రామస్య దర్శనం కృత్వా బోధయిత్వా దశాననం, ప్రాప్స్యసి త్వం నిజంరూప మితిశాపవిమోచనం, సఏవ ప్రోక్తవాం స్తస్మా చ్ఛుక శ్శాపవిముక్తిభాక్, ద్విజరూపం గతో భూయో ప్యభూ ద్రాఘవదర్శనా"దితి

* నాదర్శయ త్స్వంతుసః – నను మహాత్మనా రామే

## ఏడవ సర్గ ప్రారంభము

౧ * పిదప రామచంద్రమూర్తి సముద్రతీరమున మౌనవ్రతమును బూని యాశ్రితుల కనేక దానముల నొసగి, తన కుడిభుజమును తల క్రింద దిండుగాఁ బెట్టుకొని దర్భలయందుఁ బరుండి సముద్రుని ధ్యానింపుచుండెను. ఇట్లు రామచంద్రమూర్తి ధ్యానింపుచుండ మూఁడు దినములు గడచిపోయెను. కాని సముద్రుడు తన నిజరూపముతో దర్శన మీయకపోయెను.

---

గృహమునకు అగస్త్యుడు వచ్చియుండెను. శుకుని నెప్పుడు మోసగింతుమా యని యాలోచించుచున్న వజ్రదంష్ట్రుడను రాక్షసుడు శుకుని గృహమునకు అగస్త్యునివేషముతో వచ్చి నిజమయిన యగస్త్యుడు లేకుండగ జూచి, శుకుని భార్యతో మాంసభోజనము నాడు తనకు గావలయునని కోరెను. నిజమని నమ్మి యామె మాంసాన్నమునుఁ బచనము చేసెను అగస్త్యవేషము వేసికొని వచ్చిన వజ్రదంష్ట్రుడు కన్పడకుండ బోయెను. నిజమయిన అగస్త్యుడు మధ్యాహ్న సమయమునకు నెచ్చటినుండియో రాగా శుకుని భార్య మాంసాన్నమును అగస్త్యునకు వడ్డింపగా శుకుడే యీపని చేయించెనని యాగ్రహించి నీవు రాక్షసుడవు కమ్మని శుకుని శపించెను. శుకుడు తనకేమియు దెలియదని మొరపెట్టుకొనగా, ఇదియంతయు రాక్షసునిచే జేయబడినద యని యగస్త్యుడు తెలిసికొని శుకుని విషయమై ప్రసన్నుడై యిటుల శాపవిముక్తి ననుగ్రహించెను. ఓ శుకుడా! నీవు రాక్షస శరీరివై కొంత కాలము వరకు నిట్లుండి పిదప శ్రీరాముని సందర్శించి నీకు ప్రభువైన రావణునకు హితబోధచేసి వెంటనే శాపవిముక్తుడవై తిరిగి నీ బ్రాహ్మణరూపమును బొందగలవని యగస్త్యుడు శాపవిముక్తి ననుగ్రహించెను కావున రామచంద్రమూర్తి దర్శనము చేసి రావణునకు హితబోధచేసియు శుకుడు శాపవిముక్తుడై బ్రాహ్మణత్వము నొందెనని తెలియదగును.

---

* ఇచట నొక సందియము గలుగును. (ఏమన) రాముడంతటి

రామశ్చాపి మతిం చకార చ తదా వారాంనిధిం సంస్తువ
న్స్నానం మే మరణాంతు వా౽ద్య తరణం సింధో రిదానీం భవేత్
వార్ధి స్తస్య దదౌ న దర్శన మతః క్రుద్ధో౽రుణాంతాక్షియు
క్ష్వా హైవం సహజం సమానయతు మే చాపం భవా నాశుగాన్.
౨

నూనం లక్ష్మణ నిర్గుణే ప్రియవచస్సంభాషణం వార్జవం
దాంతిశ్చ ప్రశమః ఫలంతి హి సతో౽సామర్థ్య మేతే గుణాః

---

ణాపి కృతా సముద్రశరణాగతిః కథం విఫలాభూ దితిచేద త్రేదం సమాధేయం. శరణాగతి రకించనానాం దీనా నామేవోపయుక్తాభవే న్నాన్యేషాం శక్తిమతాం మహతో రామస్య దీనతాకించనతారహితత్వేన రామకృతసముద్ర శరణాగతి ర్న ఫలతిస్మేతి వేద్యమ్- అపిచైతదన్యథాపి సమర్థ్యతే-శరణాగతి ర్మహాత్మన్యేవ ఫలతి నత్వల్పే తతఏవ మహాత్మని రామే సుగ్రీవ విభీషణాదిభిః కృతా శరణాగతిః ఫలతిస్మ అల్పే సముద్రే రామకృతా శరణాగతి ర్విఫలతాం ప్రాపేతి వేద్యమ్ - నన్వ త్రేయ మన్యా చాశంకా సముదేతి రామదాసభూతస్య హనుమ మతఏవ సాహాయ్యకృతా సరిత్పతినా ప్రత్యక్షవిషయ భూతస్య రామస్య కిమర్థం దర్శనం నదత్తమితి - అత్రేదం సమా ధేయం రామనామస్థితం బలం నహిరామే స్థితం హనుమతో రామనామకృత స్తన్ముద్రికాధృతో గచ్ఛత స్తాదృశం గౌరవం సంబభూవ నత్వన్యస్య తాదృశం సంభతి. నహిలోకేష్వధి కారిణాం భక్తై స్సమర్థితం కార్య మధికారిభి స్స్వయం కర్తుం శక్యత ఇతి వేద్యం.

౨ రామచంద్రమూర్తి యిట్టి తలంపుతో నుండెను. ఇప్పుడు సముద్ర తరణమైన కావలయును. లేదా మరణమైనను ప్రాయోపవేశము చేత నాకు జరుగవలయును. అను పట్టుదలతో దర్భశాయియై సముద్రుని ధ్యానించుచుండెను. కాని యతడు, దర్శనమీయని కారణముచే మిక్కిలి క్రుద్ధుడై కన్నులెఱ్ఱచేసి లక్ష్మణునితో ధనుర్బాణములను వెంటనే తీసికొని రమ్మని రాముడు చెప్పెను.

3 రామచంద్రమూర్తి లక్ష్మణునితో మఱియు నిట్లు చెప్పుచుండెను. లక్ష్మణా! చూచితివా! సముద్రుడు కానవచ్చుటలేదు. గుణహీనుల

---

వాడు చేసిన శరణాగతియేల వ్యర్థమయ్యెను? అను నాశంకకు సమాధానమిటుల గ్రహింపదగినది. శరణాగతి దీనులకును. దరిద్రులకు నుపయోగించునుగాని. సమర్థులకు నుపయోగపడక పోవచ్చును. అందువలననే, రాముడు దరిద్రుడుగాని, దీనుడుగాని, కాకపోయి నందుచే సముద్రుని శరణాగతి రామునకు ఫలించలేదని చెప్పదగును. మఱియొక విధముగానైనను సమర్థింపవచ్చును ఎట్లన) శరణాగతి మహాత్ముల యెడ నుపయోగించునుకాని, యల్పుల విషయమై చేసిన నది ఫలింపదు. సముద్రుడల్పుడుగాన నిచట ఫలింపలేదని తెలియదగును.

ఇచ్చట మఱియొక యాశంక గలుగును. రాముని దాసుడైన హనుమంతునకు సహాయము చేసిన సముద్రుడు ప్రత్యక్షముగా వచ్చియున్న రామచంద్రమూర్తికి దర్శనమిచ్చి యేల సహాయము చేయలేదని యాశంక కలుగును. కాని, దీని కిటుల సమాధానము చెప్పుకొనదగినది. రామనామమునందున్న బలము, రామునియందులేదు. హనుమంతుడు రామనామము చేసికొనుచు, రామముద్రికను చేతియందు ధరించి వెళ్ళుచుండినందుననే, యాగౌరవమాయనకుఁ గలిగెను. రామనామము చేయకుండ రామదాసుడు కాకుండ మఱియొకడు సముద్రమును దాటుచుండినచో నాగౌరవము లభింపదుగదా: లోకములో నధికారులభటులు కార్యములను సమర్థించుకొని వచ్చినట్లు అధికారులుస్వయముగ సమర్థింపలేరనుట యనుభవసిద్ధమని తెలియదగును.

నో సామ్నా లభతే జనో భువి జయం యద్వా యశో వా ధ్రువం
ధిక్త్వాదీదృశి దుర్జనే శమ మత స్త్వం త్వానయాఽరం ధనుః. ౩

సౌమిత్రే ద్రుత మానయోత్తమశరా నాశీవిషా స్స్వస్విధా
న ద్వైవానుజ! సాయకై ర్జలనిధిం సంశోషయిష్యా మ్యహమ్.
సర్వేఽమీ కపయ స్తరంతు జలధిం పద్భ్యా మితి ప్రోచ్చర
న్ధృత్వా చాప మరం స్థితో రఘుపతిః కాలాగ్నికల్ప స్తతః. ౪

సంపీడ్యాఽథ ధను స్త్వకంపయ దలం లోకాం స్తదా వారిణో
వేగోఽభూ త్సుమహా నధోపరి సము త్పేతు స్తదీయోర్మయః
పశ్చా చ్చాపవికర్షకం రఘుపతిం మామేతి చోక్త్వా ధను
స్సౌమిత్రిః పున రాదదే శరమపి ప్రాప్తానుకంపోఽంబుధౌ. ౫

మధ్యా ద్వారినిధే స్స్వయం రఘుపతే ర్భీత్యా సముద్ర స్తతో
మేరో రర్క ఇవోత్థితోఽమల మహా వైడూర్యతుల్యాకృతిః
సంరక్తస్రగలంకృతోఽబ్జనయనో రక్తాంబరః కాంచన
ధృత్వా సర్వసుమాన్వితాం శిరసి వై మాలాం సమాగా ద్ద్రుతమ్. ౬

రత్నాంజలి స్సమాగత్య సాగరో జానకీపతేః
సమర్ప్యోపాయనం పశ్చా త్తం స్తోతుం సముపచక్రమే. ౭

విషయమై మంచిమాటలు. నిష్కాపట్యము, శాంతము. మొదలగు నవి, పనికిరావు సామరస్యము లేక యిట్లు ప్రతిమాలుచుండెనని, గుణహీనుడు సత్పురుషుని తలంచును, లోకములో సామముచేత, విజయముకాని, కీర్తికాని, సంభవింపదు. ఛీ! యిట్టి దుర్మార్గుని విషయమై శాంతముకూడదు. కావున వెంటనే ధనువును దెమ్ము.

౪ లక్ష్మణా! సర్పతుల్యము లయిన నా యుత్తమశరములనుగూడ వెంటనే తీసుకొనిరమ్ము, ఇప్పుడే నా బాణములచే సముద్రమును శోషింపఁ జేసి వేసెదను. ఈ వానరులందరు కాలినడకతోనే సముద్రమును దాటుదురు గాక యని చెప్పుచు ధనుర్బాణములను జేతబట్టి కాలాగ్ని వలె మండిపడుచుండెను.

౫ పిదప రామచంద్రమూర్తి విల్లును గట్టిగ బట్టుకొని నారితోడ లాగుచు బాణములను సముద్రునిమీద వదల బోవుచుండ, లోకములు సైతము కంపించెను. ఆ యుత్పాతమునకు జలజంతువులతో గూడ, నుదకము పైకెగురుచుండెను. తరంగములు నాకసమున కెగురుచున్నట్లుండెను. ఇట్లు ధనుస్సు నాకర్షించుచు బాణములను వదలఁ బోవుచున్న రామచంద్రమూర్తిని లక్ష్మణుడు వద్దువద్దని, వారించుచు సముద్రునియందు దయగలవాడై రాముని చేతిలోని ధనుస్సును చేతితో బట్టుకొనెను.

౬ పిదప సముద్రజల మధ్యమునుండి బయలుదేరి సముద్రుడు (సముద్రాధిదేవత) రాముని బాణములకు భయపడి వెడలి వచ్చుచుండగా మేరుపర్వతమును విడిచి బయలుదేరి వచ్చు సూర్యునివలె నుండెను. సముద్రుడు వైడూర్యమణితో సమానమయిన యాకారము గలిగి పుష్పమాలికలచే నలంకరింపబడినవాడై పద్మపత్రములవంటి నేత్రములు గలిగి రక్తాంబరధారియై సమస్త దేవతాపుష్పములచే గ్రుచ్చబడిన పుష్పమాలికను శిరస్సునందు ధరించి తనలోని రత్నములను గానుకగా దీసికొని వేగముగా రాముని సన్నిధికి వచ్చుచుండెను.

౭. రత్నములను దోసిలియందుంచుకొని సముద్రుడు రాముని సన్నిధికి వచ్చి యాయనకు రత్నములను గానుకగా సమర్పించి పిదప రామచంద్రమూర్తి నీక్రింది విధముగా స్తుతింప నారంభించెను.

రక్షరక్ష జగన్నాథ ! సర్వలోకాభిరక్షక
జడబుద్ధి రహం మూర్ఖః కథం జానామి నిర్గుణమ్
దండఏవ ధ్రువం లోకే సన్మార్గ ప్రాపకో భవేత్
యథా పశూనాం లగుడో మూర్ఖాణాం తు జగత్పతే
దేహి మే౽ద్యాభయం రామ మార్గం తే వితరామ్యహమ్ !
దశాననభయా దేవ నాగతో౽హం తవాంతికం
క్షమస్వ మే౽పరాధంతు దేహి చాభయ మద్య మే౹౹-౯-౧౦౫
ఇత్యుక్తో రఘునందనో౽తి ముదితః ప్రాహాంబుధిం మే శరో
మోఘో నైవ భవే దతో మమ శరః కస్మిన్ప్రదేశే పునః
సంపాత్యో వద లక్ష్య మస్య మమ నై బాణస్య సందర్శయే
త్యేవం రామసమీరితో జలనిధిః ప్రాహా౽థ తం ప్రాంజలిః.
౧౧౫

శ్రీరామ! ద్రుమకుల్యానామవిలసద్దేశో స్త్యుదీచ్యాం విభో
తత్రానేకమహోగ్రకర్మ నిరతా స్సంస్థా విభో దస్యవః
ఆభీరప్రముఖా స్సదా మమ జలం పాపాః పిబంతి ప్రభో
తత్సంస్పర్శ మహం సహే న చ తత స్తత్రా౽౽శుగః పాత్య
తామ్. ౧౨౫

ఇత్యుక్తో౽వనిజాపతి శ్శర మరం తత్ర వ్యముంచ న్నిజం
తత్రత్యాఖిలదస్యవో౽పి నిహతా స్తస్యాశుగస్యాహతేః

౮-౯-౧౦ ఓ! జగదీశ్వరా! నన్ను రక్షింపుము. రక్షింపుము, సర్వలోక రక్షకా! జడబుద్ధి గల నేను, గుణాతీతుడ వగు నిన్ను నెట్లు తెలిసి కొనగలను? పశువులకు దండము చూపించినతోడనే మంచి మార్గమున నడచినట్లు నావంటి మూర్ఖులకు దండనే సన్మార్గప్రాపక మగును. రామా! నాకభయ మిమ్ము. నీకు మార్గమునిచ్చెదను. ఇంత దనుక రావణుని భయముచే నేను రాకపోతిని కాని వేరు కారణము లేదు.

౧౧ ఇట్లు సముద్రుడు తనను ప్రార్థింపగా, రామచంద్రమూర్తి సంత సించి సముద్రునితో నిటుల బలికెను. ఓ సముద్రుడా! నా బాణ మమోఘమయినది. ఈ బాణము నెచ్చట విడువవలయునో చెప్పుము. అని రామచంద్రమూర్తి పలుకగా సముద్రుడు చేతులు జోడించి శ్రీరామునితో నిటుల బలికెను.

౧౨౹ రామచంద్రా! నా మధ్యభాగమున ద్రుమకుల్యమను పేరుగల యొక ప్రదేశముత్తర దిక్కుగానుండెను. ఆ ద్రుమకుల్యములో మహాభయంకర కృత్యముల నాచరించు పాపాత్ములయిన, యాభీరులు మొదలగు దొంగలు నివసించుచుండిరి. ఆ పాపాత్ములు నా జలమును స్పృశించుచుందురు. వారల స్పర్శను నేను సహింపలేను. కావున రామచంద్రా! నీ బాణ మచ్చటను బడ వేయుము.

౧౩౹ ఇట్లు సముద్రుడు చెప్పుటతోడనే రామచంద్రమూర్తి తన బాణమును ద్రుమకుల్యములో బడునట్లు వదలెను. ఆ బాణమచ్చట పడుటతోడనే యచ్చటనున్న పాపాత్ములందరును హతులయిరి. ఆ బాణము వారలను హతము చేయుటయేకాక యా ప్రదేశములో జొచ్చుకొని పాతాళమువరకు భూమిని ద్రబ్దలు చేసికొని పోయెను ఆ కారణముచే నచ్చటు, వ్రణకూపమను పేరుగల యొక కూపమేర్పడెను. ఆ ప్రదేశమంతయు బాణాగ్నిచే దగ్ధమయి

కూపో భూత్కిల తత్ర కశ్చన మహాంస్తస్య ప్రదేశస్యచ
ప్రఖ్యాతం భువి నామవై మరురితి ప్రాదాద్వరం చాస్య సః.
౧౩౫

దేశోऽయం ఫలమూలపుష్పసహితస్స్నేహేన యుక్తస్తథా
గోభిః క్షీరయుతాభిరన్వితతమస్స్యాదోషధీసంయుతః
ఏవం వైవరదానతో రఘుపతేః పంథాశ్చ్యభూత్తతః
ప్రాప్యైవం రఘునందనం జలనిధిర్నత్వాతు తం ప్రాంజలిః.
౧౩౬

* దేవాయం నళినామకః కపివరః శ్రీవిశ్వకర్మాత్మజః
పిత్రా దత్తవరోऽస్తి తేన సదృశః పిత్రా నళోऽయం ధ్రువమ్
సేతుం కర్తుమలం భవేదర మిహాత్వాదాయ శక్తిం పితు
స్తత్త్వం వచ్మి భవాంశ్చ పృచ్ఛతు నళం శ్రీరామచంద్రప్రభో.
౧౩౭

---

* పిత్రా దత్తవర ఇతి – కిమర్థం పురా విశ్వకర్మా స్వాత్మజాయ వరం దదావిత్యత్రేయం పౌరాణికీ కథాऽనుసంధేయా
ద్విజస్య జాహ్నవీతోయే సాలగ్రామో నళేన తు
బహువారం పరిత్యక్తో విశ్వకర్మాత్మజేన తం
త్యక్తం జలే తతోऽన్విష్య సమానీయ చ తం పునః

నందున నెడారిగా నయ్యెను. అందుచే నా ప్రదేశమునకు మరు కాంతారమని పేరు గలిగెను. ఆ మరుకాంతార ప్రదేశమునకు (నిర్జల ప్రదేశమునకు) రామచంద్రమూర్తి యీ క్రిందివిధముగ వరము లిచ్చెను.

౧౪౫ ఈ మరుకాంతార ప్రదేశము కందమూల ఫలపుష్పాదులతోను సమృద్ధిగ నుండుగాక. ఇచ్చట క్షీరసమృద్ధిగలవై గోవులుండుగాక! సమస్తమయిన యౌషధులతో నీ ప్రదేశము నిండియుండుగాక! యని శ్రీరామచంద్రమూర్తి వరము లిచ్చుట వలన మరుకాంతార ప్రదేశము శుభప్రద మయ్యెను. పిదప సముద్రుడు చేతులు జోడించి రామచంద్రమూర్తికి నమస్కరించి యిట్లు చెప్పదొడగెను.

౧౫౫ *రామచంద్రా! వానర సైన్యమంతయు, సముద్రమును దాటుట కుపాయము జెప్పెదను. వానరసైన్యములో విశ్వకర్మ పుత్త్రుడగు నలుడను వానరోత్తము డుండెను, అతని తండ్రి యయిన విశ్వకర్మ సమస్త శిల్పవిద్య లతనికి నేర్పకొనకుండ వచ్చునట్లతనికి వరమిచ్చెను. కావున నతడుకూడ శిల్పములోఁ దండ్రితో సమానుడుగాన సేతువును గట్టుటకు సమర్థుడై యుండెను. నేను జేయు నుపకార మేమనగా, అతడు నాలో బడవేయు శిలలు మొదలగునవి తరంగ వేగముచే గొట్టుకొని పోకుండ జలమును స్తంభింప జేయుదును అతనిచే నీటిలో విసరబడిన కొండలు సైతము నీటిపైఁ దేలియుండ గలవు. ♦ అతని కటుల తండ్రి వరముగలదు. నేను యథార్థము చెప్పుచుంటిని. నలుని బిలిచి, రామచంద్రా! నీవుకూడ నడుగుము.

---

*♦ తండ్రి వరముగూడ గలదు. విశ్వకర్మ తన పుత్త్రుడగు నలున కవ్విధముగ నెందుకై యెప్పుడు వరము నిచ్చెనను విషయమున నీక్రింది పురాణగాథ యిచట నను సంధేయము. (అది యెట్లన) ఒక బ్రాహ్మణుడు విశ్వకర్మ గృహములో దేవతార్చనము చేయుచుండెడివాడు. నలుడు చిన్నతనముచే దేవతార్చనలలోని సాలగ్రామమును దీసికొనిపోయి గంగలో బడవేయుచుండెను. తండ్రియగు విశ్వకర్మ ప్రతినిత్యము గంగలో వెదకితెచ్చి తిరిగి

ఇత్యుక్త్వాఽంతర్దధే పశ్చా త్సరితాంపతి రప్యథ
రామచంద్రోఽపి సుగ్రీవ లక్ష్మణాభ్యాం సమన్వితః
నళం ద్రుతం సమాహూయ సేతుబంధే నియోజయత్
౧౬-౧౭

నళోఽపి రాఘవం నత్వా ప్రాహైవం రఘునందనం
అహం సేతుం కరిష్యామి సముద్రే రఘునందన
తత్త్వం ప్రాహ సముద్రస్తు నాపృష్టః కస్యచి ద్వదేత్
ఇతి శాస్త్రానుసారేణ న తేఽహ మవదం విభో. ౧౮-౧౯

దండఏవ భవేచ్ఛ్రేష్ఠో మనుజస్యేతి మే మతి
దత్తవా న్దండభీత్యైవ మార్గం తే సరితాంపతిః
సంస్కారిగోఽహ మేతేన కరిష్యామి న సంశయః
గణాధిపతిపూజాం త్వం ప్రథమం కురు రాఘవ. ౨౦-౨౧

ఇత్యుక్తో రాఘవ స్సద్య స్సంస్థాప్యతు గణేశ్వరం
సంపూజ్యారభమాణోఽభూ త్సేతుం వారినిధౌ పునః. ౨౨

---

బాడబాయ దదాతిస్మ తత్కాలే స్వాత్మజాయ సః
దత్తవా న్నాప మప్యేవం త్వద్ధస్తాత్పాతితా జలే
తరిష్యంతి శిలాశ్చేతి తచ్ఛాపోఽత్ర వరోఽభవత్ - ఇతి.

*

౧౬-౧౭ ఇట్లు సముద్రుడు రామచంద్రమూర్తితోఁ జెప్పి పిదప నంతర్ధానము నొందెను. రామచంద్రమూర్తియు సుగ్రీవ లక్ష్మణులతో సంప్రతించి నళుని వెంటనే పిలిచి సేతుబంధ రూపమగు కార్యమున నతని నియమించెను.

౧౮-౧౯ నళుడును రామచంద్రమూర్తికి నమస్కరించి యివ్విధముగ విన్నవించెను. రామచంద్రా! సముద్రమునకు నేను సేతువును గట్టగలను. సముద్రుడు యథార్థమే చెప్పెను. ఇంతవఱకు నే నీ సంగతి నీ కెందుకుఁ జెప్పలేదనగా నడుగనిదే చెప్పగూడదను శాస్త్రము ననుసరించి నేనింతదనుక నీకుఁ జెప్పియుండలేదు. (ఇదియునుం గాక యింతటి గొప్పపని నేను జేయుదునని చెప్పినను నమ్మిక కూడనుండక పోవచ్చును. ఇప్పుడు సముద్రుడు చెప్పుట వలన నీకు నమ్మిక కలిగెను.)

౨౦-౨౧ రామచంద్రా! సామాద్యుపాయములలో దండోపాయముతో సమానమైనది మఱియొకటిలేదు. ఈ సముద్రుడు సామముచే నీవెంత వేడినను మార్గ మిచ్చిన వాడు గాడు. బాణ మెక్కు పెట్టుట తోడనే దండించెదవను భీతితో నీకు మార్గమిచ్చెను. సముద్రుడు మంచి సమయమున మా తండ్రి యిచ్చిన వరము సంగతిని, నాకు జ్ఞాపకము చేసెను. నేనవశ్యము సేతుబంధమును చేసెదను. మొదట గణాధిపతి పూజను నీవే చేయుమనెను.

౨౨ ఇట్లు నళుడు చెప్పుటతోడనే రామచంద్రమూర్తి వెంటనే గణేశ్వరుని స్థాపించి పూజించి సముద్రమున సేతువుకట్టుటకు నారంభించెను.

---

బ్రాహ్మణున కిచ్చుచుండెడివాడు. తన కుమారుని దుష్కృత్యము నకుఁ గోపించి విశ్వకర్మ కుమారునకు శాప మిచ్చెను. పుత్రా! నీవు నీటిలోఁ బారవేసిన శిలలు మునగకుండఁగఁ బైకి దేలియే యుండు గాకయని (శాపమిచ్చెను.) ఆ శాపమే వరరూపక మయ్యె ననెడి కథ యిచ్చట ననుసంధేయము.

నవగ్రహాణాం పూజార్థం శిలాశ్చ నవ రాఘవః
నళహస్తేన సంస్థాప్య పూర్వం పశ్చాన్మహోదధౌ
సేతు మారభమాణో౽భూ త్తదా రామస్య కాచన
ఉదభూ దీదృశీ బుద్ధి స్స్వనామ్నా లింగ ముత్తమం
స్థాపనీయ మితి ప్రాహ పశ్చాద్రామో మరుత్సుతమ్.
౨౩-౨౪

గత్వా త్వం పవనాత్మజ ద్రుత మిత శ్శ్రీవారణాసీం శుభా
మాపృచ్ఛ్యైవ గిరీశ మానయ తతో లింగద్వయం తూత్తమమ్
ఇత్యుక్తః పవనాత్మజో౽పిచ తథేత్యుక్త్వా వినిర్గత్య సో
ప్యాకాశస్య పథా క్షణే శివపురీం వారాణసీ మాగతః. ౨౫
గత్వైవం గిరిశం ప్రణమ్యచ రఘూత్తంసస్య కార్యం పున
శ్శంభో రాశ్వవేదయ త్పవనజ శ్శ్రుత్వా వచోమారుతేః
ప్రాహైవం గిరిశో౽పి దక్షిణదిశం త్వాయా మ్యహంచ ద్రుతం
లింగే ద్వే౽పి మయా౽ర్పితే శుభకరే పూర్వంత్వితో మారుతే.
౨౬

దక్షిణాశాం ప్రవృత్తేన సంప్రాప్తుం కుంభజన్మనా
పురా౽హం ప్రార్థితో౽భూవం తద్దిశాయా స్సమాగమం
తథేతిచ మయా ప్రోక్త స్తతో౽గస్త్యో౽పి తాం దిశం
గతవాం స్తద్వచ స్సార్థం కర్తు మాయామి సత్వరమ్. ౨౭-౨౮
ఇత్యుక్త్వా శంకర స్తస్మై లింగే ద్వే౽పి దదౌ ద్రుతం
తదనుజ్ఞా మవాప్యాథ మారుతి ర్గర్వ సంయుతః
లింగద్వయయుతో రామసన్నిధిం ప్రతి నిర్గతః
విహాయసా పథైవా౽౽శు సమాయాతి స్మ వారిధిం. ౨౯-౩౦

౨౩-౨౪ సేతువుకట్టుటకు బూర్వమే నవగ్రహపూజ కూడ జేయ దలచి నళునిచే నవపాషాణములను స్థాపింపచేసి నవగ్రహములను బూజించి పిదప సేతువు నారంభించు సమయమున రామచంద్రమూర్తిఁ దన పేరుతో నొకలింగము గూడ నచట స్థాపింపవలయు ననియెడి బుద్ధి యుదయించెను. పిమ్మట హనుమంతుని గూర్చి రామచంద్ర మూర్తి యిటులఁ బలికెను.

౨౫ ఓ హనుమంతా! నీవు శీఘ్రముగఁ గాశీపట్టణమునకు బోయి నేను జెప్పినానని చెప్పి శంకరు నడిగి రెండులింగములను దీసికొనిరమ్ము. అని రామచంద్రమూర్తి చెప్పుటతోడనే హనుమంతుడు తథాస్తని పలికి వెంటనే బయలుదేరి యాకాశమార్గమున బోయి క్షణములో వారణాసికిఁ జేరెను.

౨౬ ఇవ్విధమున హనుమంతుడు కాశికిఁ జేరి శంకరుని సమీపించి నమ స్కరించి రామచంద్రమూర్తి లింగములు రెంటిని నిన్నడిగి తెమ్మని పంపెనని శంకరునితో జెప్పగా విశ్వేశ్వరుడును హనుమంతునితో నీక్రింది విధమున జెప్పెను. "హనుమంతా! యుత్తమమయిన రెండు లింగములను దాచి యుంచితిని. నేను గూడ దక్షిణ దిక్కునకు రానుద్దేశముతో నుంటిని. వెంటనే నేనుగూడ వచ్చెదను."

౨౭-౨౮ హనుమంతా! నేను దక్షిణదిక్కునకు నేలరాదలచితినో చెప్పె దను వినుము. అగస్త్యుడిచ్చటనుండి దక్షిణదిక్కునకు బోవునపుడు నన్నుగూడ దక్షిణదిక్కునకు రావలసినదిగాఁ బ్రార్థించెను. అవ్విధ ముననే వచ్చెదనని నేను జెప్పగాఁ బిదప నగస్త్యుడు దక్షిణదిక్కునకు బోయెను. అగస్త్యునితోఁ జెప్పిన మాటను సఫలముచేయుటకై నేను గూడ శీఘ్రములోనే వచ్చెదను.

౨౯-౩౦ ఇట్లు శంకరుడు చెప్పి రెండులింగములను వెంటనే హనుమంతు నకియ్యగాతదనుజ్ఞను బడసి హనుమంతుడు నచటనుండి బయలు దేరి మహాగర్వముతో రామకార్యమును సాధించువాడను. నేనొ క్కడనే కాని వేరొకడు లేడని గర్వముతో రామచంద్రమూర్తి సన్నిధికి గగనమార్గమున వచ్చుచుండెను.

సర్వాంతర్యామి రామోపి పావనే ర్దురహంకృతిం
జ్ఞాత్వా సుగ్రీవ మాహైవం తద్గర్వోన్మూలనార్థ్యథో
ముహూర్త సమయోఽత్యేతి నాగతః పవనాత్మజః
తతోఽహం సైకతం లింగం స్థాపయిష్యామి సూర్యజ
ఇత్యుక్త్వా సైకతం లింగం స్థాపయామాస తత్రసః. 30-31-32-33

కాలేఽస్మి న్రఘునందనోఽపి మనసా సస్మార వైకుంఠ స
చ్ఛ్రీమత్కౌస్తుభ దివ్యరత్న మరమేవాగాన్మరుద్వేగవత్
కృత్వా వేగ మథాంతికం రఘుపతే రాగత్య నానావిధ
స్వర్ణామూల్యవిభూషణాని తు దదౌ వన్యాస రత్నాన్యలమ్. 34
భక్ష్య భోజ్యాది రాశీంశ్చ తత్క్షణే తద్దదౌ బహూన్
తదా సస్మారచ మునీ న్రాఘవస్తేఽపి చాగతాః 35

భక్ష్య భోజ్యాదిభి స్తేన మునయ స్తర్పితా స్తతః
గృహీత్వా తే వ్రజంతి స్మ మధ్యమార్గేతు మారుతిః
నిరీక్ష్య తా నువాచైవం తాపసాః కుత ఆగతాః
భవంతో నవ్యభూషాభి ర్వసనైశ్చ విభూషితాః
ఇతి మారుతినా పృష్టా స్తేఽప్యూచుః పవనాత్మజమ్.
36-37-38

రామచంద్ర స్థ్సితః పూర్వం తీరే వారినిధేః పునః
రామలింగ ప్రతిష్ఠాంతు కృతవాం స్తేన పూజితాః
ఆయామో వయ మిత్యుక్తో మారుతిః క్రోధసంయుతః
పవనేన సమో వేగే క్షణేనాగా త్తదంతికమ్. 39-40

౩౧-౩౨-౩౩ సర్వాంతర్యామి యయిన రామచంద్రమూర్తియు హను
మంతుని మనస్సులో గలిగిన దురహంకారమును దెలిసికొని, వాని
గర్వపరిహారము చేయదలచి సుగ్రీవునితో నిట్టుల బలికెను సుగ్రీవా!
సుహూర్త సమయము దాటిపోవుచుండెను. హనుమంతు డింతవఱకు
వచ్చి యుండ డందుచే సైకతలింగమును (ఇసుకతో లింగమును) జేసి
స్థాపించెద నని చెప్పి వెంటనే సైకతలింగము నొక దానిని జేసి
స్థాపించెను. (ఆలింగమునకే రామలింగేశ్వరు డని ప్రసిద్ధి గలిగెను.)
౩౪ రామచంద్రమూర్తి రామలింగేశ్వర ప్రతిష్ఠ చేయు కాలమున వైకుంఠ
మునందున్న తన దివ్యకౌస్తుభమణిని మనస్సులో స్మరింపగాఁ గౌస్తుభ
మణి వాయువేగముతో రాముని సన్నిధికి వచ్చి యమూల్యమైన
రత్నములను రాసులుగా సృష్టించి వేసెను.
౩౫ ఇదియునుంగాక కౌస్తుభమణి భక్ష్యభోజ్యాద్యన్న రాసులనుగూడఁ
దత్క్షణమున సృష్టించెను. అప్పుడు రామచంద్రమూర్తి మునులను
స్మరింపగా వారలుకూడ నచటకు యోగశక్తిచే వచ్చిరి.
౩౬-౩౭-౩౮ పిదప రామచంద్రమూర్తి మునులను భక్ష్యభోజ్యాదులచే సంతృ
ప్తులనుగాఁ జేయుటయేగాక వస్త్రభూషణాదులను రత్నములను
గూడఁ బుష్కలముగా నివ్వగా, నా మునులు నూతన వస్త్రభూష
ణాదులచే శోభిల్లుచు రత్నరాసులను మూటలు గట్టుకొని నెత్తిని
బెట్టుకొని స్వస్థానములకు బోవుచుండ మధ్యమార్గములో నమ్ము
నీశ్వరులను హనుమంతుడు చూచి వారల నీవిధముగా బ్రశ్నించెను.
ఓ తాపసోత్తములారా? నూతన వస్త్రాభరణాదులచే మీరలు శోభిల్లు
చుంటిరి మీర లెచ్చటనుండి వచ్చుచుండిరి? అని హనుమంతు
డడుగగా నమ్మునీశ్వరులు హనుమంతునితో నిట్లు చెప్పదొడగిరి.
౩౯-౪౦ ఓ వానరోత్తమా! రామచంద్రమూర్తి యింతకు బూర్వమే
సముద్రతీరమున రామలింగేశ్వరునిఁ బ్రతిష్ఠించెను. ఆ సమయమున
మేము శ్రీరామచంద్రునిచే సువర్ణ భూషణాదులచే సత్కరింపబడి,
మా స్వస్థలములకు బోవుచుంటిమి. అని మునులు చెప్పగా హను
మంతుడు మహాకోపముగలవాడై వాయువేగముగా క్షణకాలములో
శ్రీరాముని సన్నిధికి వచ్చెను.

సమేత్య రాఘవం ప్రాహ మారుతిః క్రోధసంయుతః
రామచంద్ర! త్వయా వ్యర్థం శ్రమితోఽహం ప్రతారితః
ఇత్యుక్త్వాఽఽత్మపదద్వంద్వం వాలంచ భువి తాడయన్
నృత్యంశ్చ బహుధా ప్రాహ రాఘవం మారుతి పున
ఏవం హృది స్థితం చే త్త్వం కింను వారాణసీం తు మాం
వ్యర్థం ప్రేషితవా న్నామ సమానీతం మయామహా
లింగద్వయం వృథేత్యుక్త్వా పాతయామాస భూతలే.
౪౧–౪౨–౪౩–౪౪

నిశమ్య వచనం తస్య రాఘవ క్రోధసంయుతం
ప్రాహైవం మారుతిం సద్యో రామచంద్రోఽపి సాంత్వయన్
౪౫

మారుతేఽద్య కృధా సోఽలం ముహూర్తాతిక్రమాద్భయా
సంస్థాపితం మయా లింగం తదుత్పాట్య మరుత్సుత!
త్వయానీత మిదం లింగం తత్ర సంస్థాపయ ద్రుతమ్
ఇత్యుక్తో మారుతి స్తుష్ట స్సముత్పాటయితుం బలాత్
యతతేస్మ చ తల్లింగం నచచాల చ కించన
తతః కృద్ధో మరుత్సూను ర్బలా ద్వాలేన తత్పునః
సంవేష్ట్య లింగ మాకృష్య ఛిన్నవాలోఽపతద్భువి.
౪౬–౪౭–౪౮

ఏవం నిపతితం భూమౌ మూర్ఛితం పవనాత్మజం
సంస్పృశ్య స్వీయ హస్తేన తముత్థాప్యోపవేశ్య చ
ఛిన్నలాంగూల మప్యస్య దృఢసంధిం చకార సః ౪౯–౫౦

౪౧-౪౨-౪౩-౪౪ హనుమంతు డిట్లు వచ్చి రామచంద్రమూర్తితో నిటులఁ గోపముతో బలికెను. "రామచంద్రా! నీవు నన్ను వ్యర్థముగ శ్రమ పెట్టుటయే గాక వంచించిన వాడవు కూడ నైతివి" అని పలుకుచుఁ దన వాలమును నేలమీద గొట్టుచు గంతులు చిందులు త్రొక్కుచు శ్రీరామచంద్రునితోఁ దిరిగి యిట్లు బలికెను. రామచంద్రా! నీమనస్సులో నిట్టి దుస్సంకల్పమున్న యెడల నన్ను నీవు కాశీపురి కెందుకు వ్యర్థముగ పంపితివి? నేను తెచ్చిన ఈ రెండు లింగములు నేమి చేయవలయును? అని పలుకుచుఁ దన చేతిలోనున్న యా రెండు లింగములను నేల మీద విసరి పడవేసెను.

౪౫ ఇట్లు కోపముతో బలుకుచున్న హనుమంతుని వచనములను రామచంద్రమూర్తి విని. సాంత్వపూర్వకముగా నిటుల హనుమంతునితో బలికెను

౪౬-౪౭-౪౮ హనుమంతా! నీవు కోపగింపకుము. ముహూర్తము దాటి పోవునని యా ముహూర్తసమయమునకు సైకతలింగము నొకదానినిఁ జేసి యిచట ప్రతిష్ఠించితిని. ఇపుడు మిగిలిపోయిన దేమియున్నది. ఆ సైకతలింగమును పెల్లగించి నీవు తెచ్చిన లింగములలో నొక్క లింగము నచట స్థాపింపుము. అని రామచంద్రమూర్తి పలుకుట తోడనే హనుమంతు డా సైకతలింగమును బెకలింప, కొంచెమైనను గదలదయ్యెను హనుమంతుడు మరింతకోపముతో తన బలము కొలది యా లింగమును దన తోకతో జుట్టి లాగుచుండెను. అట్లు తోకతో బలముగా లాగుటవలన హనుమంతుని తోక మధ్యకు తెగి పోయి నేలమీద పడి మూర్ఛిల్లెను.

౪౯-౫౦ ఇట్లు భూమిమీదఁ బడి మూర్ఛిల్లి యున్న హనుమంతుని రామచంద్రమూర్తి తన చేతితో దాకి నిమురుచు నతనిని లేవదీసి కూర్చుండ బెట్టి యతని తెగిపోయిన లాంగూలమును సంధింపజేయఁ బూర్వము వలె దృఢసంధి గలది యయ్యెను. (అనగా రామచంద్రమూర్తి తెగిన ముక్కల నతికింపగా కలుసుకొని పోయెను)

పశ్చాన్మరుత్సుతం ప్రాహ రాఘవో భక్తవత్సలః
నూనం మయా పవనజ! శ్రమితోఽభూ ద్భవా న్వృథా
లింగద్వయే త్వయాఽఽనీతే లింగ మేకం భవా నిహ
సంస్థాపయతు తే నామ్నా ప్రసిద్ధం భువి చాస్తు తత్
అపరం లింగ మప్యత్ర గోపనీయం త్వయా పునః
ఇత్యుక్తః పావని శ్చాహ గతగర్వో రఘూత్తమమ్.
౫౧-౫౨-౫౩

రామచంద్రాఽపరాధం మే క్షమస్వ రఘునందన
యద్భాషితం యచ్చకృతం తత్సర్వం క్షంతు మర్హసి
ఇత్యుక్త్వా మారుతిశ్చాథ రామలింగేశ్వరోత్తరే
స్థాపయామాస చైకంతు స్వనామ్నా లింగయోర్ద్వయోః
రామచంద్ర స్తదా తస్మై దదౌ వర ముత్తమం,
విశ్వనాథ మనభ్యర్చ్య భవతాఽత్ర ప్రతిష్ఠితం
మయా ప్రతిష్ఠితం లింగ మర్చయంతి జనాస్తు యే
తేషాం భవే ద్వృథా రామలింగపూజా మరుత్సుత.
౫౪-౫౫-౫౬

కించ త్వం పతితో యత్ర తత్ర తీర్థ మఘాపహం
భవిష్యతి న సందేహః పావనం పవనాత్మజ
ఇత్యుక్త్వా మారుతే ర్మూర్తిం మూర్తిం స్వీయా మథాఽంశత
తత్ర సంస్థాపయామాస రామచంద్రో వృదారహృత్.
౫౭-౫౮

౫౧ ౫౨-౫౩ పిదప రామచంద్రమూర్తి భక్తవత్సలుడు గాన హనుమంతు నితో నిట్లు బలికెను "హనుమంతా! నా నిమిత్తము నిన్ను నిష్ప్రయో జనముగ జాల శ్రమ పెట్టితిని. నీవు తీసికొని వచ్చిన రెండు లింగము లలో నొక లింగము నిచట స్థాపింపుము. ఆ లింగము నీ పేరుతో భూమియందుఁ బ్రసిద్ధమై యుండుగాక! రెండవలింగమును నిచ్చటనే జాగ్రతగ దాచియుంచుము." అని యిట్లు రామచంద్రమూర్తి చెప్పుటతోడనే హనుమంతుడు తన గర్వమును విడిచి చేతులు జోడించి రామచంద్రమూర్తితో నిట్లుఁ బలికెను.

౫౪-౫౫-౫౬ రామచంద్రా! రఘునందనా! నా యపరాధమును క్షమిం పుము. నేను మాట్లాడిన మాటలను, నా చేతలనుగూడ క్షమింప వలెను. అని పలుకుచు రామేశ్వరమున కుత్తరముగ రాముని యానతి చొప్పున విశ్వేశ్వర లింగమును బ్రతిష్ఠించెను. రామచంద్రమూర్తి పిదప హనుమల్లింగమునకీ క్రింది విధమున వరమిచ్చెను. హను మంతునిచేఁ బ్రతిష్ఠింపబడిన యీ విశ్వేశ్వరలింగమును బూజింప కుండగ నాచే బ్రతిష్ఠింపబడిన లింగమును నెవరు ముందుఁ బూజిం చెదరో వారలకు రామలింగేశ్వర పూజాఫలముండదు. వారల పూజ వ్యర్థము. అని వరము నిచ్చెను.

౫౭-౫౮ ఇదియునుం గాక "నీ వెచ్చటబడితివో యా ప్రదేశము పాప కారకులకు, నపవిత్రులకును. మారుతి తీర్థము పుణ్యతీర్థముగా నుండు గాక". అని యిట్లు చెప్పి హనుమంతుని మూర్తిని తనమూర్తినిగూడ స్వాంశములతో నచట ప్రతిష్ఠించెను.

రామచంద్రమూర్తి తన యంశమున ప్రతిష్ఠించిన రామ విగ్రహ మునకు సేతుమాధవుడని పేరుపెట్టెను. (శ్రీరాముని యర్చామూర్తి యిప్పటికిని గోచరమగుచున్నది.)

౫౯-౬౦-౬౧-౬౨-౬౩ * ♦ పిదప రామచంద్రమూర్తి రామలింగేశ్వరునకు పువ్వులతో పూజచేసి రామేశ్వరుని చేతులుజోడించి విశేషముగా నీక్రింది విధముగ ధ్యానించుచుఁ బలికెను. ఓ రామలింగేశ్వరా! రాక్షసవధను చేయుటను, నీ యాత్మశక్తినిగూడ నాయందు ప్రవేశ పెట్టి నాయుద్యమమును తొందరలో సఫలము చేయుము, ఇట్లు పలు విధముల రామచంద్రమూర్తి ధ్యానింపగా రామలింగేశ్వరాలయము నుండి శంకరుఁడు ప్రత్యక్షమై, రామచంద్రమూర్తినిఁ గౌగలించి యిటులఁ బలికెను రామచంద్రా! నీవే నేను. నేనే నీవు. మన యిర్వురికిని కొంచమైనను భేదములేదు మన యిర్వురకును నెవ్వడు భేదమునుఁ దలంచునో వాడు దుఃఖముల పాలగును. అనిచెప్పి తన పూర్వ వృత్తాంతమునుఁ జెప్పెను.

---

* ♦ పూర్వవృత్తాంతము - ఈ విషయమున నితర రామాయణకథ యిచటు'ననుసంధేయము' రామచంద్రా' పూర్వవృత్తాంతమునొకదానిని చెప్పెదను వినుము. ఏమన నేనొకప్పుడుభూమియందుమలినవస్త్రమును ధరించి, వినోదమునకై బ్రాహ్మణవేషముతో భిక్షుకై తిరుగుచుండగా ఋష్యాశ్రమములోపల మునిపత్నులు నన్నుజూచి మోహించి తమ భర్తలనుగూడ లక్ష్యపెట్టక నన్ను వెంబడించిరి. మునులు నన్ను గుర్తింపలేక కోపావేశముతో "నీకు లింగపతన మగుగాక యని శపించిరి" ఇట్లు శపింపగానే లింగము నేలమీద పడెను. నేను వెంటనే యంతర్ధానము నొందితిని. మునిపత్నులు తమ తావులకేగిరి. ఆ లింగము క్రమముగా వృద్ధినొంది, గగనమునకు వ్యాపించెను. బ్రహ్మదేవుడు భయపడి దాని యంతమును జూడఁబూనెనుగాని. దాని యంతు తెలియదయ్యెను.

౫౯-౬౦-౬౧-౬౨-౬౩ *♦ పిదప రామచంద్రమూర్తి రామలింగేశ్వరునకు పువ్వులతో పూజచేసి రామేశ్వరుని చేతులుజోడించి విశేషముగా నీక్రింది విధముగ ధ్యానించుచుఁ బలికెను. ఓ రామలింగేశ్వరా! రాక్షసవధను చేయుటకు, నీ యాత్మశక్తినిగూడ నాయందు బ్రవేశ బెట్టి నాయుద్యమమును తొందరలో సఫలము చేయుము, ఇట్లు పలు విధముల రామచంద్రమూర్తి ధ్యానింపగా రామలింగేశ్వరాలయము నుండి శంకరుఁడు ప్రత్యక్షమై, రామచంద్రమూర్తినిఁ గౌగలించి యిట్లుఁ బలికెను రామచంద్రా! నీవే నేను. నేనే నీవు. మన యిర్వురికిని కొంచెమైనను భేదములేదు మన యిర్వురకును నెవ్వడు భేదమునుఁ దలంచునో వాడు దుఃఖముల పాలగును. అనిచెప్పి తన పూర్వ వృత్తాంతమునుఁ జెప్పెను.

---

*♦ పూర్వవృత్తాంతము - ఈ విషయమున నితర రామాయణకథ యిచట! ననుసంధేయము! రామచంద్రా! పూర్వవృత్తాంతమునొకదానిని చెప్పెదను వినుము. ఏమన నేనొకప్పుడు భూమియందుమలినవస్త్రమును ధరించి, వినోదమునకై బ్రాహ్మణవేషముతో భిక్షుకై తిరుగుచుండగా ఋష్యాశ్రమములోపల మునిపత్నులు నన్నుజూచి మోహించి తమ భర్తలనుగూడ లక్ష్యపెట్టక నన్ను వెంబడించిరి. మునులు నన్ను గుర్తింపలేక కోపావేశముతో "నీవు లింగపతన మగుగాక యని శపించిరి" ఇట్లు శపింపగానే లింగము నేలమీద పడెను. నేను వెంటనే యంతర్ధానము నొందితిని. మునిపత్నులు తమ తావులకేగిరి. ఆ లింగము క్రమముగా వృద్ధినొంది, గగనమునకు వ్యాపించెను. బ్రహ్మదేవుడు భయపడి దాని యంతమును జూడఁబూనెనుగాని. దాని యంతు తెలియదయ్యెను.

గగనం వ్యాప్య సంస్థితం, తద్దృష్ట్వాచకితో వేధాః, స్తస్యాంతం ద్రష్టు ముద్యతః, పశ్యత స్తస్య కోట్యబ్దై ర్నాంత ము సీచ్ఛ వేధసః, తదా మా మేత్య సవిధి ర్భయా ద్వృత్తం న్యవేదయత్ అకాలే ప్రలయ స్త్వద్య శంభో స్తేన భవిష్యతి, త్రిపురారో వేధసే దత్త శ్ఛేత్తుం సోఽబ్రవీచ్ఛ మాం, కథం తేఽంగం, వారయోయం త్వమేవ హ్యే మర్హసి, తతో మయా ఖం-ఖండాని తస్య చ్ఛిన్నాని రాఘవ, తాని ఖండాని భూమ్యాంచ తత్ర తత్రాపత న్స్థితం, తాని ద్వాదశ లింగాని జ్యోతిస్సంజ్ఞాని రాఘవ, ఓంకార స్సోమనాథశ్చ త్ర్యంబకో మల్లికార్జునః, నాగేశో వైద్యనాథశ్చ కాశీ విశ్వేశ్వర స్త్వహం, కేదారేశో మహాకాలో భీమేశో ఘుసృణేశ్వరః, ఏవ మేకాదశ జ్ఞేయాః జ్యోతిర్లింగా మయాకృతాః. గంధమాదననామ్నో మేరో రీశానదిక్స్థితః, ఆసీచ్చిరం నకస్యాపి మానవస్యాఽక్షిగోచరం, పదుర్ద్వారం పున ర్లింగం తదా స్త్వితితు తాపసాః, తేషులింగేషు సర్వేషు గంధమాదన నామకం, తల్లింగ మత్రపతితం సమీపే వర్తతేఽత్ర తత్, . గంధమాదన లింగం మే పశ్య ద్వాదశ ముత్తమం, త్వత్ప్రతిష్ఠితలింగస్య త్వీశాన్యా మద్య వర్తతే, త్వత్ప్రతిష్ఠితలింగస్య ప్రసాదా త్ఖ్యాతి మేష్యతి, అస్య లింగస్య య జ్జ్యోతి ర్యదీయం త్వత్ప్రతిష్ఠితే, లింగే తు సైకతే వాక్యా న్మమ యాస్య త్వరం విభో, జ్యోతిర్లింగం ద్వాదశమం తథా రామేశ్వరాభిధం, భవత్యత్రజనా స్సర్వే త్వద్వారభ్య రఘూత్తమ, పూజోత్సవాదికం కర్మ యద్య త్కుర్యుర్గిరామమ, తద్వైవలింగేతత్సర్వమస్తురామేశ్వరేసదా-ఇతి.

అప్పుడు బ్రహ్మ నా సన్నిధికివచ్చి "స్వామీ! అకాలప్రళయము సంభవించుచున్నది" అని పలుకగా, నేను త్రిశూలమునిచ్చి దానిని ఛేదింపుమని చెప్పగా, నీ యంగమును నేను ఛేదింప నొల్లను. నీవే ఛేదింపుమన త్రిశూలముతో దానిని బండ్రెండు భాగములుగా ఛేదించితిని. అవి జ్యోతిర్లింగములయ్యెను.

1. ఓంకారలింగము, 2. సోమనాథలింగము, 3. త్ర్యంబకలింగము, 4. మల్లికార్జునలింగము, 5. నాగేశ్వరలింగము, 6. వైద్యనాథలింగము, 7. విశ్వేశ్వరలింగము, 8. కేదారేశ్వరలింగము, 9. మహాకాళలింగము, 10. భీమేశ్వరలింగము, 11. ఘుసృణేశ్వరలింగము, 12. గంధమాదనలింగము ఈ పండ్రెండు సర్వావతారమూర్తు లుద్భవించినవి. గంధమాదనలింగము మేరువుయొక్క ఈశాన్య భాగమున బడి యెవరికిని గానరాకుండనుండి ప్రళయవాయువుచే నది కొట్టుకొనివచ్చి యిచట బడెను. నీవు ప్రతిష్ఠించిన సైకతలింగమున కీశాన్య భాగమునయుండెను. దీని నెవ్వరు నెరుగరు. నీవు సైకతలింగము నిచ్చట బ్రతిష్ఠించుటచే గంధమాదనలింగముకూడ ప్రఖ్యాతిగలదయ్యెను. ఆ జ్యోతిర్లింగమునందున్న తేజస్సు నీ సైకతలింగమునందుగూడ బ్రవేశించినది. నా పండ్రెండవ జ్యోతిర్లింగము రామేశ్వరలింగముగా జెప్పబడుచుండును. పూజోత్సవాదు లన్నియు రామేశ్వరలింగమునకు జరుగుగాకయని పూర్వవృత్తమును శివుడు రామునకు జెప్పెనని యానంద రామాయణ కథ యిచటనను సంధేయము.

రామచంద్ర గిరా తేఽహ మగస్త్య ప్రార్థనావశాత్
సంత్యజ్య వారణాసీంతు సమాగా మిహ తు ధ్రువమ్
త్వల్లింగేఽహం వసామ్యత్ర మదనుగ్రహాత స్తవ
రామేశం యే నమస్యంతి బ్రహ్మహత్యాదిపాతకైః
విముక్తా స్తే భవిష్యంతి రామచంద్ర న సంశయః
మదీయం గాంగ ముదక మిహానీయ జనాః పునః
స్నాతుం యథా సమేయు స్త్వం వరం దేహి రఘూత్తమ
ఏవం నిగదిత స్తేన రాఘవోఽపి, వరం దదౌ,
౬౪-౬౫-౬౬-౬౭

రామేశంతు నిరీక్ష్య సైకత మిదం సంకల్పపూర్వం నరో
నీత్వా గాంగజలే విసృజ్య చ తతో గాంగం సమానీయ కమ్
రామేశం త్వభిషిచ్య తేన జలధే ర్దత్వాఽఽత్మభారం తతో
బ్రహ్మ ప్రాప్స్యతి శంకర ధ్రువ మిదం సత్యం మదీయం వచః.
౬౮

సంకల్పరహితం గాంగం జలం రామేశసన్నిధిం
నాయాస్య త్యాగతం చే త్స్యా త్సంకల్పః ప్రాక్తనోఽభవేత్
నవిచారయితుం శక్యం కారణం తత్ర శంకర
ఏవం వదతి రామేఽత్ర సమాగా త్కుంభసంభవః.
౬౯-౭౦

రామేణ పూజిత స్సోఽపి ప్రాహైవం కుంభసంభవః
రామచంద్ర కృపాసాంద్ర తవాఽనుగ్రహాతోఽధునా
చిరా దపేక్షిత స్సోఽయం విశ్వేశో దర్శనం దదౌ
సంతుష్టోఽహం మహాంశ్చైకం నామ్నా మే లింగము త్తమం

౬౪-౬౫-౬౬-౬౭ రామచంద్రా! నీ మాటమీదను అగస్త్యుని ప్రార్థనము మీదను కాశిని విడిచివచ్చితిని. నీ లింగమున నిచ్చట నివసించెదను. నాయనుగ్రహము వలన నీ రామేశ్వరలింగమును, ఎవరు నమస్కరించెదరో, వారలు బ్రహ్మహత్యాదిపాపముల వలన విముక్తులగుదురు. నామణి కర్ణికాతీర్థమును దీసికొని స్నానమునకు జనులు వచ్చునట్లు, రామచంద్రా! నీవుకూడ వరమునిమ్ము. అని శంకరుడు పలుకగా! రామచంద్రమూర్తి సంతోషముతో నిట్లు బల్కెను.

౬౮ ఈ సేతువు నొద్ద స్నానముచేసి రామేశ్వరుని దర్శించి నియమపూర్వకముగ సంకల్పించి, సేతువుయొక్క యిసుకను భరణిలోనుంచుకొని కాశికి బోయి త్రివేణిలో ఆయిసుకబరిణిని బడవేసి, గంగోదకమును దెచ్చి రామేశ్వరున కభిషేకించి. నరుడు తన బలువును సముద్రున కప్పగించినవాడై బ్రహ్మమును పొంది సుఖించును. నామాట సత్యము.

౬౯-౭౦ ఇట్లు సంకల్పము లేక గంగ రామేశ్వరుని యొద్దకు రాజాలదు. వచ్చెనా! జన్మాంతరసంకల్పమైన యుండి తీరును. ఇందులో కారణమవిచారణీయము. ఇట్లు శ్రీరామచంద్రమూర్తి పలువిధములుగ వరము లిచ్చుచుండగా నచట కగస్త్యుడు వచ్చెను.

౭౧-౭౨-౭౩-౭౪-౭౫ రామచంద్రమూర్తిచేఁ బూజింపబడి యగస్త్యు డిట్లు పలికెను. రామచంద్రా! నీ యనుగ్రహము వలన చిరకాలమునుండి ప్రార్థింపబడుచుండిన విశ్వేశ్వరుడు, ఇప్పటికి దర్శనమిచ్చెను. నాకు మిగుల సంతసమైనది. నేనొక లింగమును నా పేరుతో బ్రతిష్ఠించెద

స్థాపయామ్యత్ర రామేశా దాగ్నేయేఽద్యైవ రాఘవ
ఇత్యుక్త్వా స్థాపయామాస స్వనామ్నా లింగ ముత్తమం
పశ్చా ద్రామేశ్వరం స్తుత్వా విశ్వేశం రాఘవం తథా
కుంభజన్మాః బ్రవీ దేవం రామచంద్ర మిదం వచః.
२०-२१-२३-२४-२५

* రామేశ్వరాభిధం తీర్థం రామసేతుపవిత్రితం
క్షేత్రాణామపి సర్వేషాం తీర్థానామపి చోత్తమం
దృష్టమాత్రే రామసేతౌ ముక్తి స్సంసారసాగరాత్
యో నరో జన్మమధ్యేతు సేతుం భక్త్యాఽవలోకయేత్
తస్య పుణ్యఫలం వక్ష్యే శృణు త్వం రఘునందన
మాతృతః పితృత శ్చైవ ద్వికోటికులసంయుతః
నిర్విశ్య శంభులోకంతు తతో మోక్షం సమశ్నుతే
ఇత్యుక్త్వా రాఘవానుజ్ఞా మవాప్య గతవా న్మునిః
శంకరోపి వరాన్దత్వా త్వంతర్ధానం గతోఽభవత్.
२६-२२-२७-२८

---

* వరాన్దత్వేతి - "రామప్రతిష్ఠితం లింగం రామచంద్రేణ పూజితం, తస్యస్మరణ మాత్రేణయమపీడాపి నో భవేత్, రామప్రతిష్ఠితం లింగం యః పశ్యతి నర స్సకృత్ సనరోముక్తి మాప్నోతి మమ సాయుజ్య మాప్నుయా దితి - స్కాందేప్యేవం ప్రతిపాదితం - గణ్యంతే పాంసవో భూమ్యా గణ్యంతే దివి తారకాః సేతుదర్శనజం పుణ్యం శేషేణాపి న

నని చెప్పి రామేశ్వరున కాగ్నేయభాగమున నొక లింగమును ప్రతిష్ఠించెను. పిదప అగస్త్యుడు రామేశ్వరుని, విశ్వేశ్వరుని, రామ చంద్రమూర్తిని స్తుతించి రామచంద్రమూర్తితో నిటుల బలికెను.

౭౬-౭౭-౭౮-౭౯ *ఓ రామచంద్రా! యీ రామేశ్వరపుణ్యతీర్థము సమస్త మయిన పుణ్యతీర్థములకంటెను సమస్తమయిన పుణ్యక్షేత్రముల కంటెను గూడ నుత్తమమయి యుండగలదు. ఈ రామేశ్వరునిగాని, సేతువునుగాని. నెవ్వడుచూచునో, యతడు సంసారసాగరము నుండి విముక్తుడగును. ఎవ్వడు జన్మమధ్యమున రామేశ్వరుని సేతు వును సందర్శించునో రామచంద్రా! వాని పుణ్యఫలమును, చెప్పె దను వినుము. అతడు తల్లివైపునను తండ్రివైపునను రెండుకోట్ల తరములవారితో సహితముగ శివలోకమునందుండి ముక్తిని బొం దును. అని వరప్రదానపూర్వకముగఁ జెప్పి యగస్త్యుడు రాముని యానతినొంది తిరిగి తన స్థలమునకు వెడలిపోయెను. పిదప శంకరుడు కూడ ♦ వరములనిచ్చి యంతర్ధానము నొందెను.

---

* ♦ వరములనిచ్చి - శంకరుడి క్రిందివిధముగ వరముల నిచ్చెనని తెలియ దగును. (ఎట్లన) "రామచంద్రమూర్తిచే నిచటఁ బ్రతిష్ఠింప బడిన యీ రామేశ్వరుని స్మరించిన మాత్రమున యమపీడ కలుగ నేరదు. శ్రీరామునిచేఁ బ్రతిష్ఠింపబడిన యీ రామేశ్వరలింగమును నెవడుచూచునో: అతడు ముక్తినొందును. నా సాయుజ్యమును బొందును" అని, స్కాంద మహాపురాణమున గూడ రామేశ్వర మహాత్మ్యము విస్తృతముగ జెప్పబడినది. (ఎట్లన) భూమియందలి రేణువులనైనను లెక్క పెట్టవచ్చుననియు, ఆకాశమందలి నక్షత్ర ములనుగూడ లెక్క పెట్టవచ్చుననియు, రామేశ్వరుని సందర్శించి

నళ మాజ్ఞాపయామాన రాఘవ స్సేతుబంధనే
రామాజ్ఞయా సేతుబంధం వానరా స్తు చికీర్షవః
వృక్షా నాచ్ఛిద్య చానీయ తత్ర తత్ర మహోదధౌ
సంస్థాప్యసుదృఢాం స్తంభాం స్తేషు బద్ధ్వా దృఢాం స్తదా
పాశాన్ద్వయోః పార్శ్వయో శ్చ పాతయంతి స్మ తత్ర తే
శిలాశ్చ మహతీః కేచి ద్గిరీ నప్యపరే తదా
ఆనీయ సన్నిధౌ తస్య కపయోఽపాతయ, న్ధృతమ్
హ స్తద్వయేన తు నళ స్త్వనాయాసేన తా శ్శిలాః
మహోదధౌ పాతయంశ్చ సేతుబంధం కరోతి సః.

౮౦-౮౧-౮౨-౮౩

---

గణ్యతే, శ్రీశైలం వేంకటాద్రించ కాశీం శ్రీరంగనాయకం, రామేశ్వరం ధనుష్కోటిం స్వభావా త్తష్టివర్ష గః, నప శ్యేన్నా స్తికతయా గర్దభో భువిజాయతే, పాతుం పాతకినో జనా నశరణా న్పాతుం తమస్సాగరం, జేతుం దానవరాజరావణ ముఖా న్నేతుం పురీం జానకీం, ప్రాప్తుంభూమితలే యశ స్సమధికం త్వాచంద్రతారం తథా, దాతుం శర్మచ రాఘవేణ రచితం సేతుం నమస్కుర్మహే, ఇత్యాదినారామేశ్వరసేతుమాహాత్మ్యం విశేషతః ప్రతిపాదితం గ్రంథవిస్తరభియా నప్రపంచితమితి వేద్యం.

౮౦-౮౧-౮౨-౮౩ పిమ్మట రామచంద్రమూర్తి సేతువును నిర్మించుటకు విశ్వకర్మపుత్రుడగు నలున కాజ్ఞ నిచ్చెను. రాముని యానతిచే వానరు లందరును, సేతువును గట్టుటకు దగిన పరికరములను తీసుకొని వచ్చుచుండిరి. కొందరు చెట్లను నరికి తీసుకొనివచ్చుచుండిరి. మరి కొందరు సముద్రములో నైను తీయుటకు స్తంభములు పాతుచుండిరి. మరికొందరు స్తంభములకు నిరుప్రక్కలయందున నైనుకొరకు తాళ్ళు కట్టుచుండిరి. కొందరు వానరులు పెద్ద పెద్ద బండలు తీసు కొనివచ్చి, యచట బడవేయుచుండిరి. మరికొందరు కొండలను పెకలించి తీసికొనివచ్చి నలుని సన్నిధిలో బడవేయుగా, నతడు అనా యాసముగా, నా శిలలను కొండలను సముద్రములో బడవేయుచు, సేతువును గట్టుచుండిరి.

---

నట్టియు, సేతువును సందర్శించినట్టియు, పుణ్యమును మాత్రము, వెయ్యి ముఖములుగల శేషుడుకూడ లెక్కపెట్టలేడనియు, జెప్ప బడియుండెను. మరియు నచ్చటనే యీక్రింది విధముగ జెప్పబడి యున్నది "శ్రీశైలమును, వెంకటాచలమును, కాశీని శ్రీరంగనాయ కుని, రామేశ్వరుని. ధనుష్కోటిని 60 సం|| వయస్సులోపల ఆస్తిక బుద్ధితో చూడనివాడు గార్దభమై (గాడిదయై) పుట్టునని (చెప్ప బడెను) మరియు నిట్లు చెప్పబడియుండెను. "పాపాత్ములగు దిక్కులేని జనులను రక్షించుటకును. అజ్ఞానమను సముద్రమును, శోషింపజేయుటకును, రాక్షసరాజయిన రావణుడు మొదలగు వారలను జయించుటకును, సీతాదేవిని దిరిగి యయోధ్యకు దీసికొని పోవుటకును, భూమియందు విశేషముగ సూర్యచంద్రాదులున్నంత పర్యంతము. కీర్తిని బొందుటకును, సుఖము నిచ్చుటకును, రామచంద్ర మూర్తిచే నిర్మింపబడిన సేతువు సాధనమయ్యెను. అట్టి సేతువుకు నమస్కారమని చెప్పబడినది. ఈ మొదలగు వచనములచే రామే శ్వర మాహాత్మ్యము, సేతుమహాత్మ్యము చెప్పబడియుండెను. గ్రంథ విస్తర భీతిచే విస్తృతముగ వ్రాయబడలేదని తెలియదగును.

రామాజ్ఞావశ౽ోఽఖిలేకపిచయే శైలా నథానీయతా
న్స్వాస్వైర్నదత్తవతి ప్రభావమహిత స్తాం స్తానథాద్రీన్నళః
పశ్చాద్వామకరేణ వారిధి జలే సంపాతయ న్నశ్రమా
త్సేతుం బంధయతిస్మ వారిధిజలే నోన్మజ్జితా స్తే పునః. ౧౪

1. యేమజ్జంతి నిమజ్జయంతి చ పరాం స్తే ప్రస్తరా దుస్తరే
వార్థౌ తన్నళపాతితా అపి జలే మజ్జంతి నో కించన –
నైతేగ్రావగుణా నవానరగుణానోవారిధేర్వా గుణా
శ్శ్రీమద్దాశరథేఃప్రతాపమహిమాసోయం ప్రధువంమానవాః. ౧౫
2. *ఖలఃకరోతి దుర్వృత్తం నూనం పతతిసాధుషు
దశాననో హరత్సీతాంబంధనం చమహోదధేః
వస్తుతో*మునిశాపేన బద్ధోవారినిధి ర్ధ్రువం. ౧౬

* మునిశాపేనేతి – కదాచన దశాననస్య మునిరక్త పిపాసా సమజని – స్వీయవాంఛాం విజ్ఞాయ మహర్షయో ప్యాత్మరిరక్షయా, సముద్రమధ్యే ప్రవిశేయు రిత్యా దావేవ దశానన స్సంచింత్య సరిత్పతింప్రత్యేవ మావేదయతిస్మ. యది భవానపాంపతే మహర్షీణాం సహాయో భవే త్తదా త్వా మహం నిహన్యామితి– తత స్తదాజ్ఞయా నిశాచరా అపి బహుధా విజృంభితా నానాదేశా న్పరిభ్రమంతో మునీ న్నిహత్య తదీయ రక్త మానయంతిస్మ– ఏవంస్థితే సముద్రమధ్య ప్రదేశే కస్మింశ్చిద్వీపినే తపస్య న్డిండీరమహర్షి ర్మునిదిదృక్షయా కదాచన పంచవటీ మాగతః. తదా, మున్యన్వేషిభి

1. 2. అన్యదీయా ఏవైతా శ్లోకాః.

౭౪ ఇవ్విధముగా వానరులందరును రాముని యానతిచే పర్వతములను పెకలించుకొనివచ్చి తన కిచ్చుచుండగా, గొప్ప ప్రభావముగల నళుడు వాటి నన్నిటిని దన యెడమచేతితో శ్రమము కొంచెమైనను లేక సముద్రములో పడవేయుచు సేతువును గట్టుచుండెను. నళుడు తన చేతితో సముద్రములో బడవేయు కొండలన్నియు నీటిమీదను దేలుచుండెను. (ఇది యాశ్చర్యముగా నుండెను)

౭౫ ఏబండలం నీటిలో బడవేయబడినపుడు,తాము మునిగెడివో? ఏబండలు ఇతరులను ముంచు స్వభావము గలవో? అట్టి బండలు సైతము నళునిచే సముద్రములో బడవేయబడి కొంచెమైనను మునుగుటలేదు. ఈ మునగకపోవుట ఆబండల గుణము కాదు. వానరుల ప్రభావము కాదు సముద్రుని గుణము కాదు. ఇక నేమనగా శ్రీరామచంద్ర మూర్తియొక్క ప్రభావము. అని తెలియదగినది.

౭౬ దుర్మార్గుడెవ్వడో యొకడు చేసినతప్పు నిష్కారణముగా *సాధువుల యందు బడుచుండును. రావణుడు సీత నపహరించుటయా? సముద్రునకు బంధనమా! ఏమియాశ్చర్యము? కాని వాస్తవమునకు ముని శాపమువలన సముద్రునకు బంధనము కలిగెను.

---

* ◆ మునిశాపమువలన - ఏముని సముద్రునకు శాపమిచ్చెనను విషయమున నీక్రింది కథ యనుసంధేయము - పూర్వమొకప్పుడు రావణుడు మునులరక్తమును పానముచేయవలయునని కోరికగల వాడై తన కోరిక మునులకుఁ దెలిసినచో వారలే సముద్రపులంకలలోనో దాగుటకుఁ బోయెదరని తలచి మొదటనే సముద్రునకీ క్రింది విధముగ వర్తమానమంపెను. ఓ సముద్రుడా! నీవు మహర్షులకు స్థలమిచ్చి సహాయము చేసెద వేని నిన్ను జంపెదనని (తెలియజేసెను) పిమ్మట రావణుని యానతి చొప్పున రాక్షసులు విజృంభించి యనేకదేశములను దిరిగి మునులను బాధించి వారిరక్తమును దీసికొని వచ్చుచుండిరి, ఇట్లుండగా, సముద్రమధ్యమున నొక యడవిలో డిండీరమహర్షి తపస్సుచేసికొనుచుండి పంచవటియందున్న మునులను జూడదలచి యమ్మునిపంచవటికి గాగా, ఆసమయమును

తత్కర్మాశు నిరీక్ష్య మారుత సుతః క్రుద్ధో బ్రవీ ద్రాఘవం
శ్రీరామాఽద్య కరద్వయేన తు మయా నీతాస్తు సర్వేచలాః
వామేనైవ కరేణ వారిధి జలేఽనేనాఽఽశు సంపాతితాః
లజ్జాసే సముదేతి తన్నశ మహం హన్మ్యద్య మద్వంచకమ్. ౮౭

తచ్ఛ్రుత్వాహ రఘూత్తమోఽనిలసుతం క్రోధేన తేఽలంపితుః
ప్రాపాఽయం వర మీదృశం తదచలా వార్ధౌ నిమజ్జంతి నో
తస్మాదద్య మహోపకారకృ దయం నూనం నళో మారుతే
మాహాత్మ్యం త్పితు రేత దస్య మహిమా నాభూన్న లజ్జాస్తి తే.
౮౮

ర్నిశాచరై స్సోఽయం డిండీరోఽపి నిగృహీత శ్శృంఖలాభిశ్చ నిబద్ధో దైవా ద్విముక్తో నిజ ప్రాణరిరక్షయా, స్వస్థలమాగతః. పరంతు స్వాభ్యంతరే, డిండీరముని స్తపస్యతీ త్యపాంనిధి రవిజ్ఞాయ, తత్తపః ప్రదేశం, వారిణా నిమగ్నం కృతవాన్. అథ తత్కృతస్య, ప్రజ్వల న్డిండీరో హ్యపాంనిధయే శాప మేవం దదౌ. యథా, మాం నిశాచరా బబంధు, రేవం భగవా నేవ సరిత్పతే త్వాం బధ్నా, త్వితి. తత, స్సోఽపి ముని స్సముద్రడిండీరే త్వాత్మానం సంగోప్య, స్వప్రాణరక్షామకరో, దతో డిండీరముని రితిప్రసిద్ధి రస్యాభూత్. డిండీరముని శాపాదేవసోఽయ మపాంనిధి ర్నిబద్ధ ఇతిక్షేమేంద్ర రామాయణ కథాత్రానుసంధేయా.

౨౧ హనుమంతుడు, తాను, వానరులుగూడ దీసికొనివచ్చిన కొండల నన్నిటిని నలుడనాయాసముగ నెడమచేతితో సముద్రములో బడ వేయుచుండుటవలన కోపించినవాడై శ్రీరామచంద్రమూర్తితో నిటులబలికెను. రామచంద్రా! నేను రెండు చేతులతో తీసికొని వచ్చుచున్న పర్వతముల నన్నిటిని నలుడు తన యెడమచేతితో సముద్రమున నిర్లక్ష్యముగఁ బడవేయుచుండుటవలన నాకు చాల సిగ్గగుచున్నది. కావున నేను నలుని జంపివేసెదను. నాకవమాన మతనివలన గలుగుటచే నిట్లు చేయదలచితిని.

౨౨ ఆ హనుమంతుని మాటలను రామచంద్రమూర్తి విని హనుమంతునితో నిటులబలికెను. హనుమంతా! నీ కోపమును. మరలించుకొనుము. ఈ నలుడు తండ్రివలన నిట్టి వరమును బొందియుండుటచే సముద్రములో శిలలు మునుగుటలేదు. ఇందువలన మనకు మహోపకారమగుచున్నది. తండ్రియొక్క మహిమవలన నితడీపని చేయుచుండెను. ఇందులో నితని మహిమేమియులేదు. కావున నీవు సిగ్గుపడవలసిన పనిలేదు.

---

మహర్షుల రక్తమునకై వచ్చిన రక్కసులు డిండీరమునినిఁ బట్టుకొని గొలుసులచే బంధించిరి. దైవవశమున రక్కసులబారినుండి యీ డిండీరముని తప్పించుకొని తనస్థలమునకు వచ్చెను. కాని సముద్రుడు తన మధ్యమునందున్న మెట్టప్రదేశమున డిండీరముని తపస్సుచేసికొనుచున్న సంగతి తెలియక యామెట్ట ప్రదేశమును సముద్రుడు నీటితో ముంచివేసెను. ఆత్మరక్షణము చేసికొనదలచి తన స్వస్థలమని వచ్చిన యామునికి నాశాభంగము గలుగుటవలన సముద్రునిమీద నాగ్రహముగలవాడై యాముని సముద్రుని క్రిందివిధముగ శపించెను. ఓ సముద్రుడా! నన్ను రక్కసులు పంచవటి కేగినపుడు బంధించినట్లు నిన్ను భగవంతుడే బంధించుగాక యని (శపించెను) పిదప నమ్ముని యాత్మరక్షణమునకై యొక డిండీరములో (పెద్ద సముద్రపు నురుగులో) దాగియుండెను. డిండీరములో (నురుగులో) దాగిన కారణముచేతనే యామునికి డిండీరముని యని ప్రసిద్ధి కలిగెను. ఆడిండీరముని శాపముచేతనే సముద్రుడప్పుడు బంధింపబడె ననియొక శ్రీమద్రామాయణ కథ యిచ్చట ననుసంధేయము.

హంతవ్యో నహిసోయ మిత్యభిహిత స్తూష్ణీం స్థితో మారుతిః
పశ్చాచ్చాశ్చర్యపరేఽచలం స్తనురుహైర్బద్ధ్వా సమానీయ తాన్
తస్మిన్ సేతుకృతే నళాయ వితర త్యశ్రాంతభూతో నళో
వార్ధౌ వామకరేణ పూర్వావదయం నిక్షిప్తవాన్సంస్థితః. ౮౯

ఏవంస్వేన కృతేపి సేతుకరణం పూర్ణం నచాభూద్యతః
పశ్చాన్మారుతనందనోపి నితరా మాలోచ్య శీఘ్రంగతః
కైలాసానయనాయ తం గిరివరం ముత్పాటితుం మారుతా
వుద్యుక్తేసతి పార్వతీతు చకితా ప్రాణేశ్వరం ప్రాహ తమ్. ౯౦

నమోస్తు తే నాథ గిరీశ కస్మా
దయం గిరీంద్రోఽద్య చల త్యకస్మాత్
భయం మమోదే త్యచల ప్రకంపా
న్నిమిత్త మాలోచయతా దముష్య. ౯౧

నిశమ్య తద్వచ శ్శంభు ర్విజ్ఞాయ నిఖిలంచ తామ్
ఉవాచ రామభక్తోఽయం సముద్యోత్పాటితుం గిరిం
యతతేస్మ నభేతవ్య మిత్యుక్తవతి శంకరే
ప్రమథాస్త్వాంజనేయేన యుధ్యంతి స్మాఖిలాశ్చ తే. ౯౨

శ్రీరామ జయరామేతి శ్రీరామభజనం తతః
కుర్వ న్సమీరతనయో నృత్యంశ్చ ప్రమథైస్సమం
యోద్ధు మారబ్ధవా న్సర్వై ర్మహాబలపరాక్రమః. ౯౩

౮౯ హనుమంతా! యితడు చంపదగినవాడు కాడు. అని రామచంద్రమూర్తి చెప్పగా నంతటితో నూరకుండెను. శౌర్యవంతుడయిన హనుమంతుడు పిమ్మట నెచ్చటికో వెళ్ళి రోమమున కొక్కొక్క కొండను గట్టి తీసికొనివచ్చి సేతువు కట్టుచున్న నళున కందించుచుండ వాని నన్నిటినిగూడ నళుడు తన యెడమచేతితో శ్రమము కొంచెముగూడ జెందక సముద్రములో విసిరివేయుచుండెను.

౯౦ ఇవ్విధముగ రోమమున కొక్కొక్క పర్వతమును గట్టి తీసికొని వచ్చుచుండినను సేతువు పూర్తికానందున హనుమంతుడాలోచించుకొని శీఘ్రముగ కైలాసపర్వతమును బెకలించి తెచ్చుటకయి యచ్చటకేగెను ఇట్లు వెళ్ళి హనుమంతుడు కైలాసమునుఁ బెకలించుచుండ పార్వతి పరమేశ్వరునితో నిటుల బలికెను.)

౯౧ నాథా! పరమేశ్వరా! నీకు నమస్కారము. ఈ కైలాసపర్వతమెందు వలననో యాకస్మికముగఁ గదలుచుండెను. నాకు భయము గలుగుచున్నది. ఇట్లు కదలుటకుగల కారణమును నీ వాలోచింపుము. (అని పార్వతి పరమేశ్వరునితోఁ బలికెను.

౯౨ ఇట్లు పార్వతి పలుకగా, శంకరుడువిని పిదప పర్వతము కదలుటకు గల కారణమును దెలిసికొని పార్వతితో నిటులఁ బలికెను. ప్రేయసీ! రామభక్తుడైన హనుమంతుడువచ్చి యీ పర్వతమునుఁ బెల్లగించుటకుఁ బ్రయత్నించుచుండెను. నీవు భయపడవలదు. అని శంకరుడు చెప్పుచుండగ, నీ లోపలనే ప్రమథగణములు హనుమంతునితోఁ గలియబడి యుద్ధముచేయ నారంభించిరి.

౯౩౪ మహాపరాక్రమవంతుడగు హనుమంతుడు "శ్రీరామజయరామ" యని రామ భజన చేయుచు, గంతులు వేయుచు నా ప్రమథగణములతో నందఱితో యుద్ధము చేయుచుండెను.

ఏతస్మి న్నంతరే రామ స్తస్యాగ్రే మారుతేః పునః
ప్రత్యక్షవిషయః ప్రాహ మారుతే శంకరస్య తే
ఈషద్భేదోపి నా స్త్యేవ స ఏవ త్వం త్వమేవ సః
అలం క్రోధేన నిర్గచ్ఛ సాగ్రం తత్సేతు బంధనం
ఇత్యుక్త్వాతస్మి న్వార్యాథ రాఘవోఽదర్శనం గతః.
౧౪-౧౫-౧౬

మారుతి ర్విస్మయం ప్రాప్య కింక ర్తవ్యత్వ మూఢధీః
తతో ద్రుతం వినిర్గమ్య క్షణేనాగా దపాంనిధిం
సేతుబంధోఽతి పూర్ణోఽభూ ద్దృష్ట్వాతం ముద మాప సః. ౧౭

శతయోజన విస్తీర్ణం దశయోజన మాయతం
సేతుబంధన మాసీద్వై సర్వతః పరిశోభితమ్ ౧౮

ఆశ్చర్య రామాయణే యుద్ధకాండే
సప్తమ స్సర్గ స్సమాప్తః.



౯౪-౯౫-౯౬ ఈ సమయన సర్వాంతర్యామియగు రామచంద్రమూర్తియు హనుమంతుని కార్యక్రమమును దెలిసికొని వెంటనే హనుమంతుని యెదుటఁ దాను ప్రత్యక్షమై యిట్లు పలికెను. హనుమంతా! శంకరునకును నీకును గొంచెమైనను భేదములేదు. నీవే, యతడు, అతడే నీవయియుంటివి. కావున నీవు కోపమును వదలి యిచటనుండి బయలుదేరుము. సేతుబంధముకూడ పూర్తియయ్యెను. నీకీయుద్యమ మనవసరమని చెప్పి హనుమంతుని మరలించి తా నంతర్ధానమయ్యెను.

౯౭ పిదప హనుమంతు డాశ్చర్యమునునొంది యేమిచేయుటకు తోచక యచటనుండి బయలుదేరి క్షణములో సముద్రతీరమునకు వచ్చి చూచెను, సేతుబంధముగూడ పూర్తియయ్యెను; ఆ సేతుబంధమును జూచి సంతోషించెను.

౯౮ ఆ సేతుబంధము పదియామడ వెడలుపు, నూరామడ పొడవుగలదిగా నుండి యంతట శోభాయమానముగా నుండెను.

ఆశ్చర్యరామాయణమున యుద్ధకాండమున

సప్తమసర్గము సమాప్తము.



## అష్టమ స్సర్గః

పశ్చా ద్దేకవిచిత్రసంగతి రఘూ ద్గర్వాతిరే కాన్విభో
గత్వా వాక్య మువాచ సేతు మఖిలం కృత్వా నళో రాఘవమ్
ఏకేనైవ మయా న్యబధ్యత మహా న్సేతు స్త్వయం వారిధౌ
గచ్ఛంతు ద్రుత మంబుధే స్తు కపయః పారంపరం స్వేచ్ఛయా. ౧

తద్గర్వం రఘునందనోపి నితరాం విజ్ఞాయ గర్వాంకురం
తస్యోన్మూలయితుం చకార మనసా సంకల్ప మేవం తదా
ఏత ద్గర్వనివారణాయ జలధౌ వేతేన బద్ధోఽధునా
సేతు స్త్వస్తు వియుక్తసంధి రితి తత్సంకల్పమూలా త్తతః ౨
తత్రత్య దృషదాం భిన్నా స్సంధయో ప్యంబుధేః పునః
కల్లోలై స్తా శ్శిలా స్సర్వా వ్రజంతీత స్తత స్తదా. 3

నళ మాహా తతో రామో విశ్వకర్మసుతాఽధునా
నదృశ్యతే సేతు రయం దృఢసంధి శ్శిలాః పునః
విభిన్నసంధయోఽబ్ధౌ తు కల్లోలై ర్యాంతి దూరతః
గత్వా సమీకురు క్షిప్ర మిత్యుక్తోఽథ నళ స్త్వరం
గత్వా నిరీక్ష్య తద్భిన్న శిలాసంధీ స్తు ఖిన్నహృత్
విధాతుం దృఢసంధీ స్తాః క స్తు ముద్యు క్తవా న్దృఢితం
పరంతు తత్ప్రయత్నస్తు విఫలోఽభూ త్తతో నళః
గతగర్వో రఘూ త్తంస మవా ప్యేదం వచోఽబ్రవీత్
కృతేపి బహుధా యత్నే న శిలా దృఢసంధయః
ఇతి తద్వచనం శ్రుత్వా రామః ప్రోవాచ తన్నళం

## అష్టమసర్గ ప్రారంభము

౧ పిమ్మట నొక యాశ్చర్యమయిన సంగతి జరిగెను. (అది యేమనగా) నలుడు వైవిధముగ సేతువును బూర్తిచేసి తనమూలకముగా సేతువు తయారయ్యెనని గొప్ప గర్వము మనస్సునందుగలవాడై రామచంద్ర మూర్తియొద్దకేగి యిటుల బలికెను. రామచంద్రా! నే నొక్కడనే సముద్రమున సేతువును బూర్తిఁజేయగలిగితిని. స్వేచ్ఛగా వానరులిక సముద్రపు టవతల యొడ్డునకుఁ బోవచ్చుననియెను.

౨-3 రామచంద్రమూర్తి యతని మనస్సులోని గర్వమును దెలిసికొని వెంటనే దానిని బోగొట్టదలచి మనస్సునందిటుల సంకల్పించెను. ఇతని గర్వపరిహారమునకై యితను సముద్రమునఁ గట్టిన సేతుబంధనమునగల రాళ్ళసంధులన్నియు విడిపోయి రాళ్ళన్నియుఁ గదలిపోగాక; అని రామచంద్రమూర్తిమనస్సులో నిటుల సంకల్పము గలుగుటతోడనే, ఆ సేతువునందలి రాళ్ళసంధులన్నియు విడిపోయి సముద్రతరంగములచే రాళ్ళు కదలి యిటునటుల కొట్టుకొనిపోవుచుండెను.

౪-౫-౬-౭-౮-౯ పిదప రామచంద్రమూర్తి నలునితో నిటులఁ బలికెను. ఓ నలుడా! యీ సేతువు పూర్తియయినట్లు చెప్పుచుంటివి కాని నీవు కట్టిన సేతువు బ్రద్దలగుచున్నట్లు కన్పడుచుండెను. రాయి రాయి సందులు బాగుగఁ గలుసుకొనక పోవుటచేతను రాళ్ళన్నియుఁ గదలి సముద్రతరంగములచే నిటునటు దూరముగ కొట్టుకొని పోవుచుండినట్లు గన్పడుచున్నది. చూడుమని పలుకగా, ఆ మాటవిని గుండె బ్రద్దలై నలుడు తిరిగి వెళ్ళి సేతువును జూడగా, రాళ్ళసంధులు వ్రాకిచ్చి రాళ్ళు తరంగ వేగముచే నిటునటుల గదలుచుండ నా రాళ్ల సంధుల నతుకుటకై నలుడు తీవ్రముగఁ బ్రయత్నించెను. కాని యతని ప్రయత్నమంతయు విఫలముకాగా, చేయునదిలేక గర్వమంతయు దొలగి రామచంద్రమూర్తిని సమీపించి యిటులఁ బలికెను. రామచంద్రా! నేనెన్నివిధములఁ బ్రయత్నించినను లాభము

రామేతి ద్వే అక్షరే శీఘ్రం సంలిఖ్య శిలయో ర్ద్వయోః
భవా న్సం స్థాపయే త్తత్ర దృఢసంధి ర్భవిష్యతి.
౪-౫-౬-౭-౮-౯

ఇత్యుక్తో గతగర్వ స్స న్నళో గత్వా తథా పునః
చకార దృఢసంధిశ్చ దృషదో స్తు ద్వయో రభూత్
ఏవం సర్వత్ర కృతవా న్సర్వగ్రావ్ణాం స్తదైవ తత్. ౧౦౫
* పంచభి ర్దివసై స్సేతుం బబంధ శతయోజనం
చకార ప్రథమేనాహ్నా యోజనాని చతుర్దశ
ద్వితీయే దివసే చక్రే యోజనానాం తు వింశతిః
త తీయే దివసే చాపి యోజనా న్యేకవింశతిః
ద్వావింశతి శ్చతుర్థే హ్ని పంచమే దివసే నళ
యోజనానాం త్రయోవింశ చ్చకార మహిమాం స్తదా
♦ ఫాల్గుణే బహుళే పక్షే త్వష్టమ్యాం పూర్తి మాప సః
౧౧-౧౨-౧౩-౧౪

---

*♦ ఫాల్గుణ ఇతి. అత్రేద మవధేయం. ఫాల్గుణ బహుళ ప్రతిపద్దివసే శ్రీరామచంద్ర స్సమస్త వానరసహితో ఽంబునిధే స్తీరం ప్రవివేశ. తస్మిన్నేవ దినే విభీషణా యాభయప్రదానం తద్దిన మారభ్య తృతీయాపర్యంతం త్రిషుదివసేషు దర్భశయనం. చతుర్థీమారభ్య త్వష్టమీపర్యంతం పంచసు దినేషు సేతుబంధః తస్మిన్నేవ దినే సువేలారోహణం చేతి వేద్యమ్.

లేకపోయెను. రాయిరాయి సందులు అతుకుటలేదు. ఇది యాశ్చర్యముగ నున్నదని పలుకగా రామచంద్రమూర్తి యిటులఁ జెప్పెను. నలుడా! రెండురాళ్లు కలుసుకొనవలయుననిన, "రామా," అను రెండక్షరములు రెండురాళ్లయందు వ్రాసి కలిపినచో, నవి యతుక్కొనును.

౧౦౫ ఇట్లుచేయుమని చెప్పగా వెంటనే నలుడువెళ్లి రాళ్లమీదను రామ అను రెండక్షరములు వ్రాసి యతికించుటతోడనే యతుక్కొని పోవుచుండెను. ఈ ప్రకారము విడిపోయిన రాళ్లమీద నన్నిటను నిటుల వ్రాసి యతికించెను. సేతువు గట్టిగానుండెను.

*♦ ౧౧-౧౨-౧౩-౧౪ నలుడు నూరామడ పొడవు పదియామడ వెడల్పు గల సేతువునంతను అయిదు దినములలో గట్టెను. మొదటిదినమున పదునాలుగామడ సేతువుకట్టెను. రెండవదినమున నిరువది యామడల దూరము సేతువుకట్టెను. మూడవదినమున నిరువదియొక యామడల దూరము సేతువుకట్టెను. నాలుగవ దినమున నిరువది రెండామడల దూరము సేతువుకట్టెను. అయిదవదినమున నిరువది మూడామడల సేతువు కట్టెను. ఈ సేతువు ఫాల్గుణ బహుళ అష్టమితో బూర్తి యయ్యెను.

---

* ఈ సేతువు ఫాల్గుణ బహుళఅష్టమితో బూర్తియయ్యెననుటలో నీక్రిందివిషయము గమనింపదగినది. ఫాల్గుణ బహుళ పాడ్యమీదినమున రామచంద్రమూర్తి సర్వవానరసమేతుడై సముద్రతీరమునకువచ్చి ప్రవేశించెను. ఆ దినముననే విభీషణునకభయప్రదానము నొసఁగెను. ఆ పాడ్యమి మొదలు తదియ పర్యంతము మూడు దినములు రామచంద్రమూర్తి దర్భశాయియై సముద్రుని శరణుచొచ్చెను. చవితి మొదలు అష్టమి పర్యంతము అయిదు దినములు నలుడు సేతువును నిర్మించెను. అష్టమిదినముననే వీరలు సేతువు దాటి సువేలాద్రి పర్వతమునఁ బ్రవేశించిరి, యని తెలిసికొనదగినది.

ఏతస్మిన్సమయే తత్ర సరటా కాచి దాగతా
శ్రీరామదర్శనేనైన పూర్వస్మృతి ముపాగతా
విముక్త పాపపుంజా సా తత్సేవాం కర్తుమానసా
యథాశక్తి తరంగత్వా లురంతీ సైకతే ద్రుతం
సమేత్య సేతుబంధే స్మిన్ముంచంతీ సికతాం పునః
గత్వా తత్ర లురంతీ సా పునరాగత్య తత్ర తు
విసృజ్య సైకతం త్వేవం కరోతి స్మ ముదాన్వితా. ౧౪౧౬-౧౭

రామచంద్రస్య పదయో రధః పాషాణవేధనం
యథా నభవితా నూనం తథా కర్తుమనా స్తదా
సరటా స్థవిరా సాపి తథా కుర్వం త్యభూ ధ్ధ్రువమ్ ౧౮-౧౯

ఏతస్మిన్సమయే సర్వే వానరాః కోటిశః పునః
నిర్గత్య సేతుమార్గేణ వ్రజంతిస్మ క్రమా ద్భృశం
సరటాచేష్టితం దృష్ట్వా రాఘవోపి తదాశయం
విజ్ఞాయ పాదచార్యేవ సైకతే కల్పితే తయా
వ్రజ న్నాత్మపదద్వంద్వ సమీపం త్వాగతాంచతాం
పరిగృహ్యాత్మహస్తేన నిక్షిప్యా త్మాంగులీ నథ
కృపయా పశ్యతి స్మాऽథో రాఘవస్స్పర్శత స్తు సా
* ♦ సద్యశ్శాపవిముక్తా సా దివం వ్రవాజ తత్క్షణే
అద్యాపి సరటాదేహే దృశ్యంతేऽంగులి ముద్రికాః
లోకేపి ప్రథమానాభూత స్సరటాభక్తి రిత్యలం. ౨౦-౨౩

---

* ♦ శాపవిముక్తేతి - పురా కేయం సరటా? కోవా కిమర్థ మస్యా శ్శాపం దత్తవా నిత్యత్రేయం పౌరాణికీ

౧౫-౧౬-౧౭ ఈ సమయమున నచటకు నొక యుడుత వచ్చి రామదర్శన మగుటచేతఁ బూర్వస్మృతిగలదయి పాపవిముక్తురాలయి యెవ్విధమునైనను దాను గూడ యథాశక్తిగ రామసేవచేయు మనస్సు గలదై యిసుకలో బొర్లాడుచు సేతువుయొక్క మార్గమున, తన శరీరమునందంటుకొనిన యా యిసుకను దులుపుచుఁ దిరిగి యిసుకలోకి బోవుచు దానిలో బొర్లాడి తిరిగి సేతుమార్గములో నా యిసుకను దులుపుచు నీ విధముగఁ జేయుచుండెను.

౧౮-౧౯ ఇట్లు చేయుటలో దాని యభిప్రాయమేమనగా, శ్రీరామచంద్రమూర్తియొక్క పాదములక్రింద గాళ్ళు మొదలగునవి గుచ్చుకొనకుండగ మెత్తగా నుండుటకై యిసుకను దీసికొనివచ్చి యచ్చట యథాశక్తిగఁ బోయుచుండెనని తెలియదగినది.

౨౦-౨౧-౨౨-౨౩ * ఈ సమయమున వానరులందఱును కోట్లకొలది బయలుదేరి సేతుమార్గమున సముద్రపు టవతలియొడ్డునకుఁ గ్రమముగఁ బోవుచుండిరి. ఈ యుడుతయొక్క చేష్టను రామచంద్రమూర్తి కనిపెట్టి దానియభిప్రాయమునుగూడఁ దెలిసికొనినవాడై కొంత దూరము పాదచారియై తాను గూడ సేతువుమీదను నుడుత యేర్పరచిన యిసుకమార్గమున నడచుచుండగా, ఆ యుడుత తన పాదముల సమీపమునకుఁ దిరిగి రాగా, దానియందుఁ గృపగలవాడై యాయుడుతను దనచేతిలోనికిఁ దీసికొని దాని శరీరమున తన చేతివ్రేళ్ళనుంచి దానిని నిమురుచుఁ జూచుచుండగనే, ఆ యుడుత శాపవిముక్తినొంది వెంటనే స్వర్గమునకేగెను ఇప్పటికిని ఉడుతల వీపుమీదను వ్రేళ్ళయొక్క ముద్రలు కనబడుచుండుట కిదియే కారణమనియు, ఉడుత భక్తియని లోకమునఁ బ్రసిద్ధికలుగుటకు దాని భక్తియే కారణమనియు గ్రహింపదగినది.

---

* శాపవిముక్తినొంది - పూర్వమీ యుడుత యెవ్వరు? ఎవడీ యుడుతవుగా నగుమని శాపమిచ్చె? నను విషయమున క్రింది పురాణ

గాథాఽనుసంధేయా- పురా కశ్చన బాడబసుతో వారణాసీం గత స్సకలశాస్త్రాణి సంపఠ్య పున స్స్వదేశ మాగత స్తత్ర తత్ర సభాసు వాదోపవాదైః ప్రతిపక్షా న్నిర్జిత్య సర్వత్ర సర్వైరపి సంశ్లాఘితో నివసతిస్మ. ఏతాదృశ గుణవత్పుత్రవా న్భవా నతీవ ధన్య ఇత్యాత్మానం చ పరేషు సంశ్లాఘయత్సు తత్పితా మమాత్మజోఽయ మనభిజ్ఞ స్తథాఽయం బహుధా భవద్భి స్స్తోతు మనర్హ ఇతి తైస్సహ వదతిస్మ. ఏవం పిత్రా కథనస్య కారణం పుత్రస్తుతౌ తదాయుఃక్షయ ఇతి శాస్త్రానుసరణ మేవ. నతు తస్మి న్విద్వేషః, తదవిజ్ఞాయ విప్రసుత స్స్వజనకే విద్వేషవా న్యేన కేనాపివా విధానే నాత్మపితృహనన మంతరా స్వస్యయశో ననంభవే దితి మత్వా కస్మింశ్చిద్దినే గృహాభ్యంతరే పితరం ప్రచ్ఛన్నతయా లగుడేన తాడయామాస. పుత్రకృత మేవేద మితి విజ్ఞాయ "వ్యాఘ్రో భవేద్భవా" నితి త మాత్మజం శశాప, తతశ్శాపవశా త్కస్మింశ్చిద్విపినే వ్యాఘ్రో భూత్వా తత్ర సంచరతి స్మ. ఏవంస్థితే కార్యవశా త్తత్పితా బాడబో మార్గవశా త్తద్విపినమార్గేణైవ గచ్ఛతిస్మ. తత్ర వ్యాఘ్రరూపీ పుత్ర ఏవ పితరం బాడబం నిహంతు ముద్యతోఽభూత్. తదా బాడబో విజ్ఞాయాత్రాపి హింసామేవ భవా న్కరోతి వేత్యుదీర్య పరేషా మబాధికా సరటా భవ త్విత్యుదీరయామాస. తత స్తేన శాపవిముక్తిం ప్రార్థిత స్సోఽప్యేవ మనుజగ్రాహ. యదా తే రామహ స్తస్పర్శ స్సంభవే త్తదా శాపవిముక్త స్సుగతిం భవా న్ప్రాప్స్యతీతి. తత ఏవ యథాశక్తి రామసాహాయ్యం కృతవతీయం సరటా రామానుగ్రహపాత్రభూతా తత్పాణిసంస్పృష్టా శాపవిముక్తా దివంగతాభూ దితి కథానుసంధేయా.

గాధ యనుసంధేయము. పూర్వము నందొక బ్రాహ్మణపుత్త్రుఁడు కాశికివెళ్ళి సకలశాస్త్రముల నభ్యసించి గొప్పపండితుఁడయి స్వదేశమునకుఁ దిరిగివచ్చి యచ్చటచ్చట సభాస్థలములకేగి వాదోపవాదములచేఁ బ్రతిపక్షులను జయించుచు నన్నిచోట్లయందు నందఱిచే నింతవాఁడు లేడని కొనియాడఁబడుచుండెను. ఇదియునుంగాక యిట్టి గుణవంతుఁడగు పుత్త్రుఁడు నీకు లభించుటచే నీవెంతధన్యాత్ముఁడవని యాబాలకునితండ్రినిగూడ నితరులు గొనియాడుచుండ నాబ్రాహ్మణుఁడు "మాపిల్లవానికేమియురాదు. మీరింతగా వానిని గొనియాడ వలదని" యందఱితో బ్రాహ్మణుఁడు చెప్పుచుండెడివాఁడు. తండ్రి యిట్లు చెప్పుటకుఁ గారణము కుమారుని స్తుతింపఁగూడదను శాస్త్రానుసరణమే కాని కుమారునియందలి ద్వేషముకాదు. ఈ సంగతి కుమారుఁడు తెలిసికొనలేక తండ్రినిఁ జంపితేకాని తనకు దేశములోఁ గీర్తిరానేరదనియు, దన కీర్తికి తండ్రి భంగకరుఁడనియు, దలంచి యొక దినమున తండ్రి బయటనుండి లోపలకు వచ్చుతఱి దుడ్డుకఱ్ఱను బ్రచ్ఛన్నుఁడుగానుండి తండ్రిమీఁద విసిరివేయగా ఆదెబ్బతో తండ్రి కొంతవడి మూర్ఛిల్లి పిదపలేచి "దుష్టమృగముగ నీవు జన్మించెదవు గాక" యని కుమారుని శపించెను. పిదప పితృశాపముచే నతఁడు వ్యాఘ్రమై యొక వనమునందుఁ గ్రుమ్మరుచుండెను. ఇట్లుండ నొక దినమున నతని తండ్రియయిన బ్రాహ్మణుఁడు గ్రామాంతరమునకుఁ బోవుచు నాయరణ్యప్రదేశముననే పోవుచుండ వ్యాఘ్రరూపముగా నున్న పుత్త్రుఁడు తండ్రియగు బ్రాహ్మణునిఁ జంపనుద్యమింపగా బ్రాహ్మణుఁడు తెలిసికొని "యిచ్చటగూడ హింసలే చేయుచుంటివా" యని పలికి యెవ్వరిని బాధింపకుండ నుండు నుడుతవుఁగా నీవు జన్మింపుమని పలుకగా పూర్వస్మృతికలిగి వ్యాఘ్రరూపముతో నున్న యాపుత్త్రకుఁడు శాపవిముక్తి ననుగ్రహింపుమని తండ్రినిఁ బ్రార్థింపగా బ్రాహ్మణుడనుగ్రహించి శ్రీరాముని హస్తస్పర్శము గలుగుటతోడనే నీకు శాపవిముక్తి గలిగి సద్గతిని బొందెదవని యనుగ్రహించెను. అందుచే నిపుడు రామహస్తస్పర్శ కలుగుటచే శాపవిముక్తినొంది సద్గతిని బొందెనని తెలియఁదగును.

పశ్చాన్మారుతివాలినందనభుజారూఢౌ క్రమా ద్రాఘవౌ
సుగ్రీవాది సమస్త వానరయుతౌ తీర్త్వాచ సేతుం క్రమాత్
రక్షోధీశపురాంతిక స్థితసువేలాద్రేస్సమీపం గతౌ
రామస్యాక్షి తదాఽస్ఫుర చ్ఛుభకరం వామేతర త్తస్యవై. ౨౪

శ్రీరాఘవోఽ నుజ మువాచ తతః ప్రహృష్టః
పస్పంద దక్షిణ మిదం నయనం ముహుర్మే
నూనం భవే ద్విజయ ఏవ మమానుజాఽత్ర
గత్వా ప్రవేశయ చమూం ఫలమూలదేశే ౨౫

ఇత్యుక్త స్సోపి తాం సేనాం జలమూలఫలాన్వితే
వనోపకంఠదేశేతు ప్రావేశ్యాచ విభజ్యాచ
గంధమాదన నామానం వామపార్శ్వ స్థితం తథా
సర్వసేనాపతిం నీలం హృత్స్థానేఽంగద మాస్థితం
ఋషభం దక్షిణే పార్శ్వేత త్సైన్యస్య స్థితం తథా
సుషేణం జాంబవంతంచ వేగదర్శిన మాత్మవః
సైన్యేన సహితం గర్భే సంస్థితం సూర్యనందనం
పృష్ఠభాగే స్థితం కృత్వా భ్రాత్రా మధ్యే స్థిత స్స్వయమ్
ఏవం తత్రాఖిలా సేనా గరుడ వ్యూహ మాశ్రితా
లంకాపురాంతికేఽతిష్ఠ న్మోదమానా యుయుత్సయా.
౨౬ — ౨౭ — ౨౮ — ౨౯

ఆశ్చర్యరామాయణే యుద్ధకాండే
అష్టమస్సర్గ స్సమాప్తః.



౨౪ అనంతరము శ్రీరామచంద్రమూర్తి హనుమంతుని భుజముమీదను, లక్ష్మణుడు అంగదుని భుజముమీదను, గూర్చుండి సుగ్రీవాది సమస్త వానరసైన్యములతో క్రమముగ సేతువును దాటి లంకకు సమీపమున నందున్న సువేలపర్వత సమీపమునకుఁ జేరిరి. ఆ సమయమున రామచంద్రమూర్తియొక్క కుడికన్ను అకస్మికముగ శుభసూచకముగ నదరెను.

౨౫ అప్పుడు రామచంద్రమూర్తి లక్ష్మణునితో నిటులఁ బలికెను. లక్ష్మణా! నా కుడికన్ను మాటి మాటికదురుచుండెను. నిశ్చయముగ నాకు విజయమిచ్చుట గలుగును నీవు వెళ్ళి కందమూలఫలాదులు నీరు గల ప్రదేశమును జూచి యచట మన సైన్యమునంతను వ్యూహముగా నుండునట్లు ప్రవేశపెట్టుము.

౨౬-౨౭-౨౮-౨౯ ఇట్లు రామచంద్రమూర్తి చెప్పుటతోడనే లక్ష్మణుడు సైన్యమునంతను ఫలములు నీరు గల యొక యుద్యానవన ప్రాంతమున విడియునట్లేర్పరచి సర్వసైన్యమునకు నీలు నధ్యక్షునిగాఁ జేసి యా సైన్యముయొక్క హృదయస్థానములో నంగదు నుండునట్లును, సైన్యమున కుడమభాగమున గంధమాదనుని, కుడిభాగమున ఋషభుని గర్భమున సుషేణుని. జాంబవంతుని, వేగదర్శిని, తమ తమ సేనలతో నుండునట్లు చేసి సైన్యమునకు వెనుకభాగమున సుగ్రీవుడుండునటుల నేర్పరచి శ్రీరామచంద్రమూర్తి లక్ష్మణునితోఁగూడఁ దాను మధ్య భాగమున నుండెను.

ఇట్లు సమస్తమైన సేనయు గరుడవ్యూహమును దీర్చి లంకాపురమున కనతిదూరములో యుద్ధమును జేయఁ గుతూహలముతో నుండెను.

ఆశ్చర్యరామాయణమున యుద్ధకాండమున

అష్టమసర్గము సమాప్తము.

---

## నవమస్సర్గః

శ్రీరామాగమనప్రవృత్తి మసురాధీశస్య జాయా పున
శ్శ్రుత్వాఽత్యంతభయాన్వితా పతి ముపాచైవంతు మండోదరీ
నాథ! త్వం మనుషే ధ్రువం రఘుపతిం రాజాత్మజం కంచన
త్యక్త్వా తద్భ్రమ మాశు విద్ధి త మిమం రామం జగద్రక్షకమ్. ౧
సీతాస్వయంవరసభాం గతోభూ ద్ధి పురా భవాన్
ఏకవారం గతం తత్ర భవా న్స్మరతు మానసే. ౨
ధనుర్భంగస్య కరణే సమర్థోభూ న్భవా న్నహి
పృథివ్యాం సంస్థితా స్సర్వే రాజాన శ్చక్రవర్తినః
పరాక్రమా త్తు తే భీత్వా దాసభూతా ధ్రువం విభో
తథాపి త్వం ధనుర్భంగం కర్తుం శక్తో భవా న్నహి. ౩-౪
తద్ధనుస్స్పర్శమాత్రేణ రాఘవస్య స్వయం తదా
ద్విధా భగ్న మితి త్వంతు జ్ఞాతవా నపి రాఘవం
మనుషేఽల్పనరం త్వస్మా త్తాశ్చర్యం కిము విద్యతే. ౫
విభో జానకీయం న సామాన్యనారీ
కుదృష్టిం తు తస్యాం త్యజ త్వం నమస్తే
పరా శక్తి రేవ ధ్రువం జానకీ సా
వినాశాయ సీతా సుజాతాఽసురాణామ్. ౬
అల్పమానవపత్న్యాంచ దుర్మతిం త్యాత్మనో బహిః
కోపి ప్రకాశయే న్నైవ సాక్షా చ్చైతన్యరూపిణః
రాఘవస్య కళత్రే తే పత్నీ భావోదయా త్వరం
మౌర్ఖ్యం కిమస్తి భువనే విచారే వేత్తి తద్భవాన్. ౭-౮

## తొమ్మిదవసర్గ ప్రారంభము

౧ రామచంద్రమూర్తి వానరసైన్యముతోఁగూడ సముద్రము దాటివచ్చిన వార్తను మండోదరి విని, మిక్కిలి భయపడినదై, తన భర్తయగు రావణునితో నిటులఁ బలికెను. నాథా! రామచంద్రమూర్తిని నీవు సామాన్యమయిన యొక రాజపుత్రునిగాఁ దలంపుచుంటివి. ఆ భ్రమను విడిచి రాముని జగద్రక్షకునిగాఁ దెలిసికొనుము.

౨ నాథా! నీవు పూర్వము సీతా స్వయంవర సభకుఁ బోయియుంటివి. అచ్చట నీకు జరిగిన యవమానమును మనస్సులో నొకమాఱు జ్ఞాపకము తెచ్చుకొనుము.

3-౪ నీవేమైన నచ్చట ధనువు నెక్కుపెట్టగలిగితివా? భూమి యందున్న రాజులు చక్రవర్తులు నందఱు నీ పరాక్రమమునకు భయపడి దాసులయినమాట వాస్తవమే కాని నీవేమైనను శివధనుస్సు నెక్కు పెట్టుటకు సమర్థుడవైతివా?

౫ నీకుఁగూడ నెక్కుపెట్టుటకు సాధ్యము కాని యా శివధనస్సును రామచంద్రమూర్తి స్పృశించినంతనే రెండు తునకలయ్యెననెడి సంగతిని దెలిసియుండియు నీవు రాముని సామాన్యమానవ మాత్రునిగాఁ దలచుటకంటె వేఱు చిత్రమేమున్నది?

౬ నాథా! యీ జానకి సామాన్యమానవ స్త్రీ వంటిది కాదు. ఆమె యందు కుత్సితదృష్టిని విడిచిపెట్టుము. నీకు నమస్కారము చేసెదను. ఆమె సాక్షాత్పరాశక్తియై యున్నది. రాక్షసులను నాశనము చేయుటకై యీమె పుట్టినది యని దెలిసికొనుము.

౭-౮ నాథా! లోకములో నెట్టి మూర్ఖుడైనను సామాన్యమానవ స్త్రీ యందుగూడఁ దనకు గలిగిన దుష్టబుద్ధిని బయటికి వెల్లడింపడే. అట్టి స్థితిలో, సాక్షాచ్చైతన్యస్వరూపుడగు రామచంద్రమూర్తియొక్క భార్యయందు నీకు వ్యామోహము గలుగుటకంటె మూర్ఖత్వములేదని విచారించిన నీవు తెలిసికొనగలవు.

త్వయాఽద్య క్రియమాణాద్వై ప్రయత్నాన్నాన్య మంతరా
ఫలం మన్య ద్విభో నాస్తి సత్యం వచనం మమ
నిష్కల్మషేణ మనసా సీతాం సమానీయ సత్వరమ్
గత్వా సమర్ప్య రామస్య శరణం తం వ్రజేద్భవాన్. ౯-౧౦
నాథ నూనం సరామోఽపి శరణాగతరక్షకః
విస్మృత్య దోషజాలం తే రక్షిష్యతి న సంశయః
న చైవం క్రియతే నాథ భవతా యది సత్వరమ్
వినాశో భవితా శీఘ్రం సర్వేషాం రక్షసాం చ తే. ౧౧-౧౨
ఇదం శరీరం నహి కేవలం విభో
న భోగవాంఛాపరిపూర్తయేఽభూత్
కిం త్వార్జనాయైవ శరీరమేత
జ్జ్ఞానస్య నూనం భవతి ప్రధానమ్. ౧౩
సంపాద్యాపి శరీరమేతదతులం సంసారబంధద్రుమం
ఛేత్తుం నాథ కుఠారమార్జయతి నో సుజ్ఞానరత్నం తు యః
సంపాద్యాఽపిచ తుచ్ఛభోగనిరతో నూనం భవేద్యో భువి
ప్రాయో మూర్ఖతమో నహి ధ్రువమహో తస్మా
త్సుమూర్ఖాత్పరః. ౧౪

ధ్రువమాత్మకరప్రాప్తరత్నం కాచమణిం తు యః
మత్వా పాతయితుం దూరే యతతే కిం వదామి తమ్. ౧౫

లోకేఽంధస్యగతౌ తు కస్యచన దుష్కూ-పస్య మార్గాంతరే
సంప్రాప్తౌ పతనోన్ముఖే వినయనే తత్రాక్షిమాంస్తం పునః

౯-౧౦½ నాథా! నీవు తలపెట్టిన యీ యుద్యమమువలన సర్వనాశనము తప్ప వేఱుఫలములేదు. నామాటను నీవు విని నిష్కల్మషమైన మనస్సుతో సీతను వెంటనే తీసుకొనివెళ్ళి రామచంద్రమూర్తికి సమర్పించి శాంతిపొందుము.

౧౧-౧౨½ నాథా! రామచంద్రమూర్తి నిశ్చయముగ శరణాగతరక్షకుడు గాన నీ తప్పులను మరచి నిన్ను దప్పక రక్షించును, సందియములేదు. నేను చెప్పిన విధముగ నీవు వేయనిపక్షమున నీవే కాక సర్వరాక్షసులకుఁగూడ వినాశము తప్పదు.

౧౩½ నాథా! యీ శరీరము కేవలము భోగములను గోరికలను బూర్తిచేసికొనుటకై యేర్పడినది కాదు. ఇక నేమనగా, జ్ఞానసంపాదనమునకును ధర్మమును సంపాదించుకొనుటకును శరీరము ప్రధాన సాధనమయినదనియెడి సంగతిని మఱువకుడు.

౧౪ ఇట్టి ధర్మసాధనమైన శరీరమును బొందిగూడ సంసారమను వృక్షమును ఛేదించుటకు సాధనమయిన జ్ఞానమునుగొడ్డలి నెవ్వడు సంపాదింపలేడో, ఒకపక్షమున నట్టి జ్ఞానమును సంపాదించియు తుచ్ఛభోగములయందు లంపటుడై యెవ్వఁడుండునో, అట్టి మూర్ఖునికంటెఁ బరమమూర్ఖుడు వేఱులేడని తెలియుము.

౧౫ నాథా! తనచేతికిఁ జిక్కిన రత్నమును గాజుముక్కనుగాఁ దలచి దూరముగఁ బారవేయువానిఁగూర్చి నేనేమి చెప్పుదును? (అనగా సర్వలోకరక్షకుడయిన రామచంద్రమూర్తి నీ సమీపమునకు వచ్చి యున్నను దెలిసికొనలేక యుంటివని భావము)

౧౬ లోకములో నొక గ్రుడ్డివాడు త్రోవలోఁ బోవుచుండ మార్గమధ్యములోని యొక పాడునూతిలో గన్నుకన్పడక యతడు పడపోవు నంతలో కన్నుగలవాడు గ్రుడ్డివానితో "నాయనా! యిచ్చట పాడునుయ్యి యున్నది. దూరముగా వెళ్లుమని" చెప్పగా నతడు

వక్ష్య త్యేన మథాంధకాఽత్ర పథి దుష్కూపో స్తి దూరంవ్రజే
త్యుక్త స్తేన జనోఽంధకోఽపి నితరాం దూరం వ్రజిష్య త్యరమ్. ౧౬

నేత్రదృష్టియుతో వాఽపి యస్తు కూపే పతిష్యతి
నిరీక్ష్య తం హసే ల్లోకో న నివారయితా భవేత్ ౧౭

నాథ! త్వం బహువార మేక మబలే బ్రహ్మైవ సత్యం జగ
న్మిథ్యేవేతి తదా తదా మమ పున శ్శ్రుత్యంతసారం భవాన్
పూర్వం శ్రావితవా నహో త్వ మధునా తద్వాక్యసుధా ముత్తమాం
పాతుం నో యతసే కుతోఽనృతపదార్థా నీహసే త్వం కథమ్. ౧౮

శ్రీరామో జగదీశ్వరోఽవనిసుతా తత్ప త్న్యభూత్సా పున
స్సాక్షా చ్ఛక్తి రనాది రేవ తవ హో నాథాఽద్యతస్త్వం పునః
పత్నీభావనముద్భవః కథ మభూ త్తేఽమంగళం స్యా త్తతో
నాశో ప్యాశు భవేత్తవాశరపతే సర్వంకషో హ్యుద్యమః. ౧౯

నాథ త్వం త్వధునైవ వా రఘుపతౌ త్యక్త్వాఽరిభావం సతీం
సీతా మర్పయ రామచంద్రవిభవే స్వీయాపరాధం పునః
క్షంతుం ప్రార్థయ తం సదాశ్రితజనప్రీత శ్శరణ్యో హ్యభూ
త్తస్మాత్తేఽభయదాన మాశు వితరే ద్రక్షిష్యతి త్వాం ధ్రువమ్. ౨౦

సంస్మృత్య కార్తవీర్యం తు మానవా నపి మానయ
స్మృత్వా వాలిభుజౌ నాథ! నావజ్ఞేయాశ్చ వానరాః ౨౧

దూరముగ వెళ్లును. (అనగా తప్పుద్రోవ నెవ్వడైనను పోవుచున్నపుడు, ఈ మార్గమున నీవు వెళ్ళవద్దని యెవ్వడైనను దెలిసినవాడు చెప్పినపుడు వినవలయునని భావము.)

౧౭ నాథా! కన్నులుండినవాడు గూడ గ్రుడ్డివానివలె పాడునూతిలోఁ బడపోవునెడల వానిని నెవ్వడు నడ్డగించువాడుండడు ఇంతియే కాక వానినిఁజూచి లోకమంతయు బరిహసించును.

౧౮ నాథా! నీవు నాతో ననేకపర్యాయములు "బ్రహ్మ యొక్కడే సత్యము. జగత్తు మిథ్య, "యని, యుపనిషత్సారమును జెప్పియుంటివి. అట్టి వాక్యామృతమును నీవేల గ్రోలుటకుఁ బ్రయత్నింపవు? అనృత జడ పదార్థములను నీవేల గోరుచుంటివి?

౧౯ నాథా! రామచంద్రమూర్తి సాక్షాజ్జగదీశ్వరుడు. ఆయన భార్య యయిన సీతాదేవి పరాశక్తియయి యున్నది. అట్టి యామెయందు నీకిట్టికోరిక యుదయించుట యెంత యమంగళమైన పనియో తలంపుము. ఆయుద్యమమువలన నీకుఁ దప్పక చేటువాటిల్లగలదు. నీయుద్యమము సర్వనాశకరమైనది.

౨౦ నాథా! నీవిప్పుడైనను రామచంద్రమూర్తియందు విరోధభావమును విడిచి సీతను దీసికొనిపోయి యాయనకు సమర్పింపుము. ఇంత మాత్రముతో జాలదు. నాతప్పును మన్నింపుమనికూడఁ బ్రార్థింపుము. ఆ రామచంద్రమూర్తి యాశ్రితులయందు బ్రేమగలవాడును శరణాగత రక్షకుడును గాన తప్పక వెంటనే నీకభయము నిచ్చితీరును. ఇది నిజము.

౨౧ నాథా! కార్తవీర్యార్జునుని జ్ఞప్తినుంచుకొని మానవజాతినికూడ గౌరవింపవలసి యుండును. మరియు వాలియొక్క భుజపరాక్రమమును స్మృతికి దెచ్చుకొని వానరులనుగూడ నిర్లక్ష్య భావముతో

పుల_స్త్యవంశసంభూతో భవా న్నిత్యాగ్నిహో త్ర్యభూత్
ఏతాదృశో భవా నీదృ క్కర్మ కర్తుం నచార్హతి. ౨౨
త్వా మహం ప్రార్థయే సీతాం రాఘవాయార్పయ ద్రుతమ్
కించ కారాగృహే బద్ధా న్విముంచ దివిజా నరం. ౨౩

నూనం విభో చిత్తసమున్నతిం తే
జానామి పుత్రై స్సురరా డ్జయీతి
బాహూర్ధ్వ తాద్రి స్త్వమితి ప్రభో! తే
భ్రాతా జగద్భక్షక ఇత్యభూద్ధిః. ౨౪

తథాపి రామో బలవా న్సర్వేభ్యోపి న సంశయః
పరదారావమర్శోపి నైహికాముష్మికార్థదః
సంత స్త్వాహా విగర్హంతే ఫలం నాస్తి పరత్రచ
అజీర్ణరోగిణా మాషచక్రాణీవ పరస్త్రియః
నహి జీర్ణయితుం శక్యా భవంతి దనుజేశ్వర. ౨౫-౨౬

వాచం మే శృణుతా ద్భవా న్హితకరం నేదంశ్రుతం చేత్త్వయా
నాశ స్స్యా దిహా తే పరత్ర భవితా దండో యమేన ధ్రువమ్

జాడకుము. (అనగా నిదివరకు నీవు నరుడయిన కార్తవీర్యార్జునుని వలనను, వానరుడైన వాలివలనను, పరాభవము బొందియుంటివి కాన నరులు వానరులు నా కెంతటివారలని తలంపకుమని భావము)

౨౨ నాథా! నీవు పులస్త్య బ్రహ్మవంశములో జన్మించిన వాడవు. ఇది యునుంగాక నిత్యాగ్నిహోత్రివి. ఇటువంటి నీవు జననింద్యమైన యిట్టి దుష్కర్మను జేయ దగవు.

౨౩ నాథా! నేను చేతులు జోడించి ప్రార్థనా పూర్వకముగ వేడుచున్నాను. నీవు సీతను రామచంద్రమూర్తికి సమర్పింపుము ఇంత మాత్రముతో చాలదు. కారాగృహములో బంధించియుంచిన దేవతలను దేవతాస్త్రీలనుగూడ విడిచిపెట్టి వేయుము.

౨౪ నాథా! నీకొక యహంభావముండెను. అది నాకుఁ దెలియును. (అదియేదన) నీ కొడుకు (ఇంద్రజిత్తు) దేవేంద్రునిగూడ జయించి చెరసాలలో బంధింప గలిగెననియు. మఱియు నీవు చేతులతో కైలాసపర్వతము నవలీలగా నెత్తగలిగితివనియు, నీ తమ్ముడైన కుంభకర్ణుడు జగత్తునంతను భక్షింపగలిగినంత సమర్థత గల వాడనియు (నీ కహంభావముండెను)

౨౫-౨౬-౭ మీ రెంత బలవంతులయినను మీ యందఱికంటెనుగూడ రామచంద్రమూర్తియే బలవంతుడు. సంశయము లేదు. ఇదియుంగాక పరదారావమర్శము ఐహికాముష్మికములకు రెంటికిగూడ దూరమయినది. (ఎట్లన) పరస్త్రీకాముకుని సత్పురుషు లిహమున నిందించెదరు. పరమునందును ఫలముశూన్యము. నాథా! అజీర్ణరోగము గలవాడు మాంసచక్రములను (గారెలను) జీర్ణము చేసుకొనలేనట్లు కాముకుడుగూడ పరస్త్రీలను జీర్ణము చేసికొనలేడు. (ఆ పాప మెప్పటికైనను బండి యాత్మ నాశనమునకు హేతువగునని భావము)

౨౮ నాథా! నీకు హితమును గలుగజేయు మాటలనే నేను జెప్పితిని. నేను చెప్పినట్లు నీవు వినకపోయినచో నిచ్చట సర్వనాశనమును, పరమునందు యమదండనము తప్పదు. ప్రాణేశ్వరా! రామచంద్రా!

భో ప్రాణేశ్వర రాఘవః ప్రతిజనేఽన్తర్యామిరూపీ స్థితో
నైవం వేత్తి జనస్తు యో భువి యమ స్తం పాతయే ద్రౌరవే.
౨౭౫

సత్యం వచ్మి శృణు త్వ మాశరపతే వాచం తు నేఽద్యాపి వా
నోచే త్కిం కరవా ణ్యహంచ సదనే దందహ్యమానే తదా
తద్గేహాంతరసంస్థితావనకృతే తద్బంధుమిత్రాదయో
యత్నాత్త్వం స్వగృహాంతరా ద్బహి రరం త్వేహీతి వక్ష్యంతి తే.
౨౮౫

తిరస్కృత్య వచ స్తేషాం నివసే చ్చే ద్గృహాంతరే
భస్మీభావం వ్రజే దాశు సఏవ దనుజేశ్వర. ౨౯౫

నాద్యాపి వ్యతివర్తతే ధ్రువ మిదం కార్యం తత స్త్వంద్రుతం
శ్రీరామస్య సమర్పయాఽవనిసుతాం త్యక్త్వాభిమానం విభో
ఇత్యుక్తో దశకంధరో కుపిత స్తా మాహ మందోదరీం
ధిక్త్వాం గచ్ఛ బహి స్త్వదీయవచసా కిం మేఽపసర్ప ద్రుతమ్.
౩౦౫

ఇతి సంతర్జితా తేన సాపి మందోదరీ తతః
భయకంపితగాత్రాఽగా దంతఃపుర మరం పున
రావణోపి పరం కార్యం చింతయం స్తత్ర సంస్థితః. ౩౧-౩౨

ఆశ్చర్య రామాయణే యుద్ధకాండే
నవమ స్సర్గ సమాప్తః



మూర్తి ప్రతిజనునిలోను అంతర్యామిగా నున్నవాడు. ఈ విష యము గుర్తెరుగని వానిని యముడు తన రౌరవాది నరకకూపములో బడవేయును.

౨౮-౪ నాథా! నేను నిజము చెప్పితిని. ఇప్పటికైనను నామాటను నీవు వినుము. నీవు విననిచో నేను జేయునదిలేదు. లోకములో నొకని యిల్లు తగులబడుచుండును. ఆ సమయమున నా యింటిలోనున్న వారలను బయటికి దీయుటకు వాని బంధుమిత్రాదులు ప్రయత్నించు దురు. నాయనలారా! ఇంటిలోనుండి తప్పించుకుని బయటపడుడని చెప్పుదురు.

౨౯౪ అట్లు చెప్పుచున్న బంధుమిత్రాదుల మాటలను బెడచెవిని బెట్టి తగుల పడుచున్న యింటిలోనే యింటివార లుండినచో వారలే భస్మమయి పోవుదురు. ఎవరును చేయునదిలేదు.

౩౦౪ నాథా! యిప్పటికి గూడ కార్యము మిగిలిపోలేదు. అందువలన వెంటనే యిప్పుడైనను సీతాదేవిని రామచంద్రమూర్తికి సమర్పిం పుము. అభిమానము నుంచుకొనకుము. అని యిట్లు మండోదరి హితబోధ చేయుచుండ రావణుడతి క్రుద్ధుడై మండోదరితో నిటులఁ బలికెను. ఛీ నీవిచ్చట నుండక బయటికిఁ బొమ్ము. నీ మాటలతో నాకుఁ బనిలేదు. దూరముగా వెంటనే తొలగి పొమ్ము. (అని రావ ణుఁడు ధిక్కరించెను.)

౩౧-౩౨ ఇట్లు రావణునిచే భయపెట్టబడి మండోదరి భయముచే శరీర మంతయు వణకుచుండ నంతఃపురమును గూర్చి వెడలి పోయెను. రావణుడును పిదప కర్తవ్యము నాలోచించుచు వచ్చుటనేయుండెను

ఆశ్చర్య రామాయణమున యుద్ధకాండమున

తొమ్మిదవ సర్గము సమాప్తము.

## దశమస్సర్గః

పులస్త్యప్రేషితః కశ్చిత్తదం తేనాస్యథాగతః
దశానన మిదం వాక్యమువాచాంజలిపూర్వకమ్. ౧

గురుర్మమ పులస్త్యస్తే దనుజాధిప! కంచన
సందేశం ప్రేషయామాస వదేయం శృణుతాద్భవాన్. ౨
భూతిం కామయమానైస్తు ద్రష్టవ్యా నహిసర్వదా
చతుర్థ్యాం చంద్రరేఖేవ పరనారీ దశానన. ౩

శ్రీమచ్ఛంకర దివ్యమూర్తనిలసద్గంగాతరంగావళీ
క్రీడోల్లంఘన కృత్త్వదీయ యశసా సంక్షాళితా నైదిశః
సోపి త్వం రఘురామపట్టమహిషీసంబద్ధరాగోఽసి కిం
హా పౌలస్త్యకళంకభూత! మహిజాంశీఘ్రంవిముంచాఽద్యవా. ౪

నిశమ్య వచనం తస్య ప్రాహైవం తం దశాననః
మయా పులస్త్యసందేశ శ్శ్రుతో గచ్ఛ యథాగతం
వద స్వర్గజితో మేఽపి ధర్మేణ కిమితి ద్రుతమ్
ఇత్యుక్తోఽగాద్ద్రుతం సోపి తత్సమీపం యథాగతం. ౫

## పదియవ సర్గప్రారంభము

౧ పిమ్మట పులస్త్య బ్రహ్మ తన శిష్యునిచే రావణునకు సందేశమంప గోరికగలిగి శిష్యుని బంపగా నతడు వచ్చి చేతులు జోడించి రావణునితో నిటులఁ బలికెను. (పులస్త్య బ్రహ్మ రావణుని తండ్రితండ్రి యని తెలియదగినది.)

౨ ఓ రావణా! నాగురువగు పులస్త్యుడు నీకొక సందేశమును నాద్వారా పంపెను. దానిని జెప్పెదను వినుము.

3 రావణా! సంపదను గోరువారలు వినాయక చవితి రోజున చంద్రుని వలెఁ బరస్త్రీని కామపూర్వకముగఁ జూడగూడదు.

౪ రావణా! శంకరుని శిరస్సునందలి గంగయొక్క తరంగముల విలాసమును ధిక్కరించిన యే నీకీర్తిచే దిగంతములు సైతము క్షాళన చేయబడినవో (అనగా గంగాతరంగములవలె తెల్లనైన యే నీకీర్తి దిక్కులన్నియు వ్యాపించెనో) అట్టి నీవు రాముని పట్టమహిషియగు సీతయందు బద్ధానురాగుడవగుటఁ జూడ మహాకష్టము గానుండెను. పులస్త్యవంశమునకు నీవు కళంకము తెచ్చుచున్నావు. కావున నీ విప్పుడైనను సీతను రామునకు బంపివేయుము. (ఇవ్విధముగా నీకు జెప్పుమని మా గురువు చెప్పుమనెనని పులస్త్య శిష్యుడు రావణునకుఁ జెప్పెను.)

౫ పులస్త్య శిష్యుడు చెప్పిన మాటలను రావణుడు విని యతనితో నిటులఁ బలికెను. ఓ శిష్యుడా! మీ గురువు నీద్వారా పంపిన సందేశమును వింటిని. నీవు వచ్చిన త్రోవనే వెంటనే పొమ్ము. మీ గురువుతో నీ క్రింది విధముగ నేను జెప్పితినని చెప్పుము. స్వర్గమును జయించిన నాకీ ధర్మముతోఁ బనిలేదని (నేను జెప్పితినని చెప్పుము) ఇట్లు చెప్పగాఁ జేయునదిలేక యా పులస్త్య శిష్యుడు వచ్చిన త్రోవనే వెళ్ళిపోయెను.

పశ్చాన్మాలీ సుమాలీ చ మాల్యవా న్మాతృబంధవః
మాతామహాః దశాస్యస్య సంమంత్ర్యైతు పరస్పరం
దశాననం బోధయితుం సమేత్యైవ మథాబ్రువన్ ౬-౭

పశ్యేమం జనకాత్మజాపతి రయం సేనాన్వితః క్రూరా నరాః
మూర్ధ్నో నై దశ ధారయన్నపి భవా న్నోపాయసంచింతకః
దుర్మేధాద్యతు కాలయాపన మలం కుర్వ న్స్వమర్థం స్థిత
స్సీతాం దేహి తదీయచాపవిలసద్బాణ ప్రసారా త్పురా. ౮

ఏకః పురా సూర్యసుతస్య దూత స్సమేత్య లంకాం
నిఖిలాం చ దగ్ధ్వా, గత స్తదానీం తవ వీరవర్గైః
హా కిం కృతం ముంచ తతో మహీజామ్,

విరక్తయా నయా కిం తే బహ్వ్యో దివ్యాంగనా స్తవ
సంతి తాభి స్సుఖం భుంక్ష్వ సమాలింగ్య ముహు స్తు తాః. ౧౦

నిశమ్య వచనం తేషాం రావణః ప్రాహ తా న్పునః

దండో రాత్రించరా నూనం కోత్రో మే ధనదః కిల

జగత్త్రియం మదాయత్తం భావి కిం వదత ధ్రువమ్

బంధుభావం సమాలోచ్య యుష్మాం స్తూష్ణీం త్యజా మ్యహమ్

**ఇతః** పర మసంభాష్య యూయం వ్రజత సత్వరమ్. ౧౧-౧౪

౬-౭ పిమ్మట రావణాసురుని తల్లితండ్రియగు మాల్యవంతుడును, అతని సహోదరులగు మాలియు, సుమాలియును, (మాతృబంధువులు) కలసి పరస్పరము నాలోచించి రావణునకు హితబోధ చేయుటకై యచటకువచ్చి యిటులఁ బలికిరి.

౮ రావణా! రామచంద్రమూర్తి వానర సేనాసమన్వితుడై మనలంకకు రానే వచ్చెను. నీవు పదితలలున్నను తగిన యుపాయము నాలోచింపవు. ఇప్పుడుకూడ నింక కాలయాపన చేయుచుంటివేమి? రాముని ధనువునుండి శరపరంపరలు సాగకపూర్వమే సీతను దీసికొనిపోయి రామచంద్రమూర్తికి సమర్పింపుము

రావణా! నీవు బాగుగ మేము చెప్పెడి విషయమును గమనింపుము. సుగ్రీవుని యనుచరుడగు నొకకోతి యిచటకువచ్చి లంకనంతను దహింపజేసి వెళ్ళెనుగదా! నీ వీరత్వ మేమైన నతనిని జేయఁగలిగిన వా? కావున నీవు రామునితో లేనిపోని కయ్యము పెట్టుకొనక వెంటనే సీతను విడిచిపెట్టివేయుము. అందువలన తగువు పోవును.

౧౦ రావణా! నీకు దివ్యాంగన లనేకులుండగా విస్తృతాలగు (నీయందనురాగములేని) యీ సీతతో నీకేమి ప్రయోజనము? నీ కంత కామముగానుండిన నీయం దనురాగముగల దేవతా స్త్రీలతో సుఖమనుభవింపుము. వారిని మాటిమాటికి నాలింగనము చేసికొనుము.

౧౧-౧౭౪ ఇట్లు చెప్పుచున్న మాతామహుల వాక్యములను విని రావణుడు వారలతో నిటులఁ దిరిగి పలికెను. మీరు భయపడవలసిన పనిలేదు, సకల మాయలను గుర్తెరింగిన రక్కసులు నా యాజ్ఞాప్రకారము నడచువారలయి యుండిరి. నాకు ధనమునకా! కొరతలేదు. కుబేరుడే (నవనిధులుగలవాడే) నాకు ధనపుకొట్టుగా నుండెను, మూడు లోకములు నా యధీనములో నుండెను. ఇంకే కావలసినదేమో చెప్పుడు మీ రింతగ నన్ను దూలనాడుచు మాట్లాడినను మీరు నాకు మాతృబంధువులని తలంచి మిమ్ములను విడిచి పెట్టితిని. ఇటు పిమ్మట మాట్లాడకుండగ తొందరగ నిచటనుండి పోవలయును.

ఏవం తిరస్కృతా స్తేన నిరాశా స్తే యథాగతం
వవ్రజు ర్దనుజాధీశో రథారూఢ స్సభా మగాత్
రావణోపి సభాం గత్వా మంత్రయామాస మంత్రిభిః. ౧౩-౧౪

విరూపాక్ష స్తదోత్థాయ రావణం ప్రాహ సాంజలిః
దేవాఽస్మి న్సమయే సత్యం యుయుత్సా శత్రుభి స్తవ
సమీచీనా నభవతి దశానన మహాప్రభో
తత్కారణ మహం వచ్మి కృపయా శృణుతాద్భవాన్. ౧౫-౧౬

సీతారక్షాకృతే పూర్వం లక్ష్మణేన కృతాం భవాన్
రేఖా ముల్లంఘితుం శక్తో నాఽభూ ద్రామస్తు వారిధిం
వానరానీకసహిత స్సముల్లంఘ్యాఽఽగతః ఖలు
త్వత్తోఽప్యతో రామచంద్రో బలవా నితి మే మతిః. ౧౭-౧౮

యావల్లంకాపురీ దగ్ధా నాభూ న్మారుతినా విభో
యావ ద్రామేణ చాఽంభోధౌ సేతుబంధో నవా కృతః
తావదేవ త్వయా సీతా సమర్ప్యా రాఘవాయ హి
అద్యవా జానకీ తస్మై దేయా రక్షోధిప! త్వయా ౧౯-౨౦

యదా సీతా ప్రవిష్టాఽత్ర తదాద్యస్మి న్పురే ధ్రువం
నిమిత్తా న్యతిఘోరాణి దృశ్యంతే దనుజాధిప
ఖరాః స్తనితనిర్ఘోషా వర్షంత్యబ్దాశ్చ శోణితం
ప్రచలంతి చ ఖద్యంతి దేవలింగాని చ ప్రభో

౧౩-౧౪ ఇట్లు రావణునిచే తిరస్కరింపబడి వారలు వచ్చినత్రోవనే వెడలి పోయిరి. పిదప రావణుడును సభాస్థలమునను వెడలిపోయెను. సభను వెళ్ళి కర్తవ్యమునుగూర్చి మంత్రులతో నాలోచించుచుండెను.

౧౫-౧౬ ఈ సమయమున విరూపాక్షుడను మంత్రి సభలోనుండి లేచి. చేతులు జోడించి యిటుల రావణునితోఁ బలికెను. రాక్షసరాజా! నిజముగ నిపుడు శత్రువుతో నీవు యుద్ధము చేయబూనుట మంచిది కాదు. దానికిఁ గారణమును జెప్పెదను వినుము.

౧౭-౧౮ నీవు సీతను దీసికొని వచ్చుటకు పంచవటికి వెళ్ళినపుడు సీతారక్షణమునకై సీతచుట్టు లక్ష్మణుడు గీచినగీటునుగూడ దాటలేక పోతివి గదా! నీ శత్రువయిన రాముడు తానే కాక వానరసైన్యముతో గూడ నూరామడ వెడలుపుగల సముద్రమునుగూడ దాటగలిగెనే కావున మీ యిరువురి తారతమ్యమును విచారించినచో నీకంటె నీ శత్రువగు రామచంద్రమూర్తి మిక్కిలి బలవంతుడని నా యభిప్రాయము.

౧౯-౨౦ రాక్షసరాజా! హనుమంతుడు లంకకు వచ్చి లంకనంతను దగుల పెట్టకపూర్వమే నీవు సీతను బంపివేయవలసినది. అట్లు చేయకపోయినను రాముడు సేతువునుగట్టక పూర్వమయినను సీతను దీసికొనివెళ్లి రామునకు సమర్పించిన బాగుగ నుండెడిది. అట్లును జరుపలేదు. గతమునుగూర్చి విచారించిన లాభములేదు. ఇప్పుడైనను సీతను దీసికొనిపోయి నీవు రామచంద్రమూర్తికి సమర్పించుట మంచిపని యని నా యభిప్రాయము.

౨౧-౨౨-౨౩ రాక్షసరాజా! సీత లంకలోఁ బ్రవేశించినది మొదలుకొని యిచ్చట దుశ్శకునములు మెండుగ గోచరించుచుండెను. వానిని జెప్పెదను వినుము గాడిదలు ఉరుములురుమునటుల శబ్దించుచుండెను. మేఘములు రక్తమును వర్షించుచుండెను. దేవాలయముల

గోష్ఠూద్భవంతి చ ఖరాః పన్నగా నకులైః స్సహ
యుధ్యంతి చైవ మాదీని దృశ్యంతే బహుధా విభో.
२१- २२-२३

వయం తే మంత్రిణ స్తస్మా ద్వదామో హితమేవ తే
ఇత్యుక్తో రావణః ప్రాహ విరూపాక్ష మిదం వచః. २४

పూర్వం యస్య తు బాహావ్ దివిషదా మీశస్య గర్వాపహౌ
సో౽హం నైః నరవానరాంస్తు విబలా న్సవీంక్ష్య భీతో౽స్మికిమ్?
మంత్రీస్యాద్విదుషాం మతి ర్భువి యథాకామాతురాణాం రతి,
ర్మంత్రీస్యాచ్చ యథాతథైవబలినాంమంత్రీ ధ్రువంస్యాదసిః २५
నిశమ్య వచనం తస్య సముత్థాయ మహోదరః
ప్రాంజలిః ప్రణతో భూత్వా ప్రాహేత్థ ద్వచనం తతః. २६
విభో ముఖప్రియా వాచ ప్రథమే ప్రీతిదా స్తతః
పరిణామే భవేయు స్తా శ్రోతు ర్దుఃఖఫలప్రదాః. २७

పరంతు మధురా వాణీ ప్రియా వా రాజతే గృహే
రక్షావిధౌ సంపదాం తు ప్రమాణం నీతివా గ్భవేత్ २८

స్తుతిప్రధానై ర్వచనై స్తు యేషాం స్వామీ వ్రజేత్కష్ట మహాటవీం తు
పశ్చాద్గ్వభోరుద్ధరణే సమర్థాభవంతికింతే దనుజేశ నూనమ్. २९
మూకైవ భవే త్స్వామినిక టే పరమో గుణః
మహాఖ్యా త్స్వామిభక్తానా ముచ్యతే వాగియం మయా. ३०

లోని ప్రతిమలు కదలుచుండెను. మఱియు, ఆవులకు గాడిదపిల్లలు పుట్టుచుండెను. ముంగిసలతో సర్పములు కలియబడి యుద్ధము చేయుచుండెను. ఇట్టి వెన్నియో దుర్నిమిత్తములు కనబడుచున్నవి.

౨౪ రాజా! మేము నీమంత్రులము గాన, నీక్షేమమును గోరవలసినవారలము గాన, నీకు హితమునే చెప్పుచున్నాము. అని చెప్పగా రావణుడు విరూపాక్షునితో నిటులఁబలికెను.

౨౫ విరూపాక్షా! ఎవ్వని బాహువులు దేవేంద్రుని గర్వమును గూడ నడచిననో, అట్టి నేను సామాన్యమానవులకును వానరులకును భయపడెదనా? నిజముగ విచారించినచోఁ బండితులకు, బుద్ధి మంత్రియైనట్లును, కాముకులకు, రతి మంత్రియైనట్లును, బలవంతులగు మాబోట్లకాయుధమే మంత్రియయి యుండెను.

౨౬ రావణుని మాటలను విని మహోదరుడను మంత్రి సభలో లేచి చేతులు జోడించి నమస్కరించి రావణునితో నిటులఁ బలికెను.

౨౭ రాజా! ముఖప్రీతికొఱకై యితరులు చెప్పెడిమాటలు మొదట సంతోషకరములుగా నున్నను తుదకు పరిణామములో దుఃఖహేతువులగును.

౨౮ రాక్షసేశ్వరా! ప్రియమైన మధురమయినమాటలు గృహములో నొప్పుచుండును గాని, సంపదను రక్షించుకొను విషయమున నీతివాక్యములుపయోగపడును కాని, తియ్యనిమాట లుపయోగపడవు.

౨౯ రాజా! ఎవ్వరు స్తుతిప్రధానములగు మాటలచే రాజును వ్యసనమను నరణ్యమునఁ బ్రవేశపెట్టెదరో, వారలు తిరిగి తమ స్వామిని (ప్రభువును) ఉద్ధరించుటకు సమర్థులు కాజాలరు. ఇది నిశ్చయము.

30 ప్రభువుల సమీపమున నతని యనుచరులు మూకీభావమును (మాట్లాడకుండ నుండుటను) వహించి యుండుటయే పరమగుణము. కాని ప్రభుభక్తిపరాయణులుగా నుండువారలు తమ స్వామికి కష్టము గలుగబోవునపుడూరక యుండలేరు గాన నేనుగూడ ప్రభుభక్తుడనగుటచే నీకు జెప్పుచున్నాను.

ప్రభా నదీ శ్రీః ఖలమిత్రతా చ సుకోమలాంగీ వనితా చ లోకే
సదా భవేయుస్థ్సిరయౌవనా నో తథా ద్విషాం నైవ నియతిశ్చ
నూనమ్. ౩౧

అకార్యేపి ప్రవిష్టానాం నృపాణాం సంపదః పునః
శీఘ్రమేవ వినష్టాః స్యుశ్చిరం ప్రాయో భవంతి నో ౩౨
ఆవాభ్యాం తే విభో క్షేమం విచార్యేదంతు కథ్యతే
మైథిలీ దీయతా మాశు నో చేత్ స్యాద్విపదాశు నః
నిశమ్య వచనం తస్య ప్రాహైనం తం దశాననః. ౩౩॥

అలం భియా చ యువయోర్గ్యస్యాగ్రే త్రిదశా అపి
నతిష్ఠంతి శరా మేఽరం ధ్రువం పాస్యంత్యసూన్ రిపోః. ౩౪॥

మదాజ్ఞా శిరసా శక్రముఖై ర్దైవైశ్చ ధార్యతే
భక్తిర్వై శంకరే స్థానం లంకా జన్మాన్వయో విధేః
స్వయం రావణనామాహం గుణాః సర్వే మయి స్థితాః
పరపక్షాశ్రితం వాక్యం మమ శ్రోత్రగతం నహి
శాఖామృగాశ్రయం రామం సంత్యక్తం జనకేన చ
దీనం చ కాననావాసం సమర్థం మనుషే కథమ్
కించ మాం రక్షసామీశం త్రిదశానాం భయావహం
కథం మాం మన్యసే హీనం పక్షపాతేన తద్రిపోః.
౩౫-౩౬-౩౭-౩౮॥

౩౧ రాజా! నదియు, లక్ష్మియు, దుర్జన మైత్రియు, సుందరియగు స్త్రీ యొక్క యౌవనము, శత్రువుల నియతియు, నివి యన్నియు లోకములో నస్థిరములని తెలిసికొన వలయును.

౩౨ అకార్యములోఁ బ్రవేశించిన రాజులయొక్క సంపదలు తొందరలో నష్టమై పోవునుగాని చిర కాల ముండనేరవు.

౩౩½ విరూపాక్షుడును నేనును నీ క్షేమమును జక్కగ విచారించి చెప్పుచుంటిమి సీతను రామచంద్రమూర్తికిఁ దిరిగి యిచ్చివేయుము. అట్లు నీ విష్టుడైనను సీతను వదలక పోయినచో నీకేకాక లంకాపురవాసు లందఱకుగూడ చేటు వాటిల్లును. ఇట్లు మహోదరుడు చెప్పగా రావణుడు వానితో నిట్లుఁ బలికెను.

౩౪½ మహోదరా! విరూపాక్షుడు నీవును భయపడవలసిన పనిలేదు. నాముందు దేవతలు సైతము నిలచుటకు భయపడియెదరు. నా బాణములు శత్రువుల ప్రాణములను శీఘ్రములోనే బలిగొనును.

౩౫-౩౬-౩౭-౩౮½ మహోదరా! దేవేంద్రుడు మొదలగువారలే నా యాజ్ఞను శిరసావహించెదరు, భక్తియా నాకు శంకరునియందు. నే నుండెడి స్థానమా లంక, నా జననమా బ్రహ్మవంశమున, నా నామమా రావణుడు, (లోకములను ఏడ్పించువాడను), గుణము లన్నియు నొకచోటనే ప్రోగయి, నాయందున్నవి. పరపక్షము నాశ్రయించి చెప్పెడి మీ మాటలు నా చెవిని దూరవు. కోతిమూకనాశ్రయించుకొని యున్నవాడును, తండ్రి వెడలగొట్టగా నడవులపాలయియున్నవాడును, దిక్కులేనివాడు, నగు నొక సామాన్యమానవుడయిన రాముని సమర్థునిగా నీ వెట్లు దలంచుచుంటివో, తెలియకుండ నున్నది రాక్షసుల కందఱకు ప్రభువునయి దేవతలకు సంతతము భయమును గలుగజేయు నన్ను హీనునిగా తలంచుట జూడ, నీకు శత్రువుమీద పక్షపాతమేదియో యున్నట్లు నేనూహించెదను,

అథ తం రావణం రుష్టం విజ్ఞాయ సమహోదరః
రావణేనాఽభ్యనుజ్ఞాతో ప్రీడితోఽగా న్నికేతనం ౭౯

పశ్చా ద్దశాననోఽమాత్యై ర్మంత్రయిత్వా విశేషతః
లంకాయాం కారయామాస రక్షా మప్యతులాం ద్రుతమ్
ప్రహస్తాద్యసుర శ్రేష్ఠాం శ్చతు ర్ద్వారేషు గుప్తయే
ససైన్యా న్థాపయామాస లంకా రక్షావిధే స్తదా. ౮౦-౮౧

ఆశ్చర్య రామాయణే యుద్ధకాండే
దశమ స్సర్గ స్సమాప్తః.

---

ఏ కా ద శ స్స ర్గః

శ్రుత్వా దు స్తరసాగరం తు కపిభి స్సంతీర్ణ మబ్ధౌ పున
స్సేతోర్బంధన మప్యపూర్వమతులంచాఽఽకర్ణ్యపంక్త్యాననః
ఆహూయాఽథ శుకం చ సారణమపి ద్వౌమంత్రిణౌ ప్రాహ తౌ
శీఘ్రం వానరవాహినీం ప్రతి యువాం గంతుం యతేథాం
ముభౌ. ౧

తత్ర వానరవాహిన్యాం ప్రవిశ్యోభావపి ద్రుతం
తత్రత్యవానరానీకే యే చ ముఖ్యాః ప్లవంగమాః
సుగ్రీవస్య చ రామస్య సచివా స్తత్ర యే స్థితాః
మహాశూరా శ్చ యే తత్ర కపీనా మంతరే స్థితాః
అదృష్టౌ కపివాహిన్యాం ప్రవిశ్యోభౌ ద్రుతం గతౌ
తేషాం బలం చ మానం చ విజ్ఞాయాఽఽగంతు మర్హథః.
౨-౩-౪

3౯-౪ పిదప మహోదరుడు రావణునకుఁ దనమీదను కోపము వచ్చినట్లు తెలిసికొని రావణుని యనుజ్ఞనొంది లజ్జపడుచు నింటికి వెడలి పోయెను.

౪౦-౪౧౪ పిదప రావణుడు సభలోనున్న మంత్రులతో నాలోచించి లంకాపుర రక్షణమునకై తగిన యేర్పాట్లను జేసెను. ప్రహస్తుడు మొదలగు సేనాపతులను నాలుగు ద్వారములయందుఁ దగిన సైన్యములతో లంకా రక్షణమునకై సిద్ధముగ నుండునట్లేర్పాటు చేసెను.

ఆశ్చర్య రామాయణమున యుద్ధకాండమున
పదియవ సర్గము సమాప్తము.

---

## పదునొకటవ సర్గ ప్రారంభము.

౧ దుస్తరమైన సముద్రమును సయితము వానరులు దాటినట్లును, సముద్రమున నపూర్వమైన సేతువును గట్టినట్లును, రావణుడు వినియుండుటచే శుక సారణులను మంత్రులను రప్పించి వారలతో నిటుల చెప్పెను. ఓ శుక సారణులారా! మీరలు వానర సైన్యముండిన చోటునకు వెళ్ళుటకుఁ బ్రయత్నింపుడు.

౨-3-౪ ఓ శుక సారణులారా! మీర లచ్చటకు వెళ్ళి వానర సైన్యమున బ్రవేశించి యా వానరులలో నెవ్వరు ముఖ్యులుగా నుండిరో, సుగ్రీవునకు రామునకును మంత్రులుగా నెవ్వరుండిరో, మఱియు వానరులలో మహాశూరు లెవ్వరో యీ సంగతుల నన్నింటిని నెవ్వరికి మీరలు గుర్తింప బడకుండునట్లు కపివేషములతో నచట బ్రవేశించి వానరుల బలమును వారల పరిమాణమును దెలిసికొని రావలయును.

ఇత్యుక్త్వా రాక్షసౌ సద్యః కపిరూపధరా వుభౌ
గత్వా సముద్రతీరేషు వనేషూపవనేషు చ
సంస్థితం వానరబల మసంఖ్యేయం నిరీక్ష్య తౌ
ప్రవిశ్య కపివాహిన్యాం శనైః ప్రచ్ఛన్నతాం గతౌ
అమితం వానరబలం సంఖ్యాతుం చాఽక్షమౌ స్థితౌ. ౫-౬

ఏతస్మిన్నంతరేతత్ర వీక్ష్య తౌ ద్వౌ విభీషణః
గృహీత్వా తా వుభౌ నీత్వా ప్రాహ రామ మిదం వచః. ౭

శ్రీరామచంద్ర! కపివేషధరా వమీ ద్వౌ
లంకాధిపస్య సచివౌ శుకసారణాఖ్యౌ
చారా విమౌ ప్లవగవేష ముపాశ్రితౌ ద్వౌ
ద్రష్టుం ప్లవంగమబలం ధ్రువ మాగతౌ స్తః, ౮

పశ్చాత్తౌ వ్యథితౌ కృతాంజలిపుటౌ శ్రీరాఘవం ప్రాహతుః
పంక్త్యాస్యప్రహితౌ బలం తవ పరిజ్ఞాతుం త్విహావా ముభౌ
ఆగావాఽత్ర న సంశయో రఘుపతే చారా విమౌ ద్వౌ భవా
నావాం రక్షతు తే నమోఽస్తు కృపయా నౌ మోచ
యాఽస్మా ద్విభో. ౯

ఇత్యుక్త శ్శుకసారణౌ ప్రతి హాస న్ప్రాహాఽథ తౌ రాఘవో
దృష్టం చే న్నిఖిలం బలం వయ మమీం సమ్య గ్యువాభ్యాం పునః
దృష్టా శ్చే త్సుపరీక్షి తాయది కృతం కార్యం యువాభ్యాంవిభోః

౫-౬ ఇట్లు రావణుడు చెప్పుట తోడనే వారలిరువురును వానర వేషము
లను ధరించి వెళ్ళి, సముద్ర తీరముల యందును, వనోపవనముల
యందును, నివసించి యున్న యసంఖ్యాకమయిన యపారమైన
వానర సైన్యమును వారలు చూచి వారల సైన్యములో తాముకూడ
కపిరూపములతో ప్రవేశించి ప్రచ్ఛన్నులుగ నుండి యపారమయిన
వానరులను లెక్కింప నసమర్థులయి యుండిరి.

౭ ఈ సమయమున కపివేషములతో నచ్చట నున్న శుక సారణులను
విభీషణుడు కనిపెట్టి వారలను బట్టుకొని తీసికొని వెళ్ళి రామచంద్ర
మూర్తితో నిట్లు బలికెను.

౮ ఓ రామచంద్రా! వానర వేషములను ధరించిన వీర లిరువురును రావ
ణుని మంత్రులగు శుకసారణు లను వారలయి యుండిరి. వీరలు కపి
వేషములను ధరించి మన వానరబలము నంతను బరిశీలించి పోవుటకు
వచ్చియుండిరి.

౯ ఇట్లు తమ గుట్టునంతను విభీషణుడు రామచంద్రమూర్తితో చెప్పిన
పిదప వారలు తమను జంపుదురని కడు విచార వ్యసనములను బొంది
శ్రీరామచంద్రమూర్తితో చేతులు జోడించి యిట్లు బలి
కిరి. "రామచంద్రా! నిశ్చయముగ విభీషణుడు చెప్పినట్లులనే రావ
ణుడు పంపగా మీ వానర బలమును బరీక్షించుటకు వచ్చిన వార
లము. ఇందుకు సందియము లేదు కాని చారులుగా వచ్చిన మమ్ముల
నిరువురను రామచంద్రప్రభూ! రక్షింపుము. నీకు నమస్కారము.
ఈ విభీషణుడు మమ్ములను బ్రతుక నీయడు. కావున నితని చేతిలో
నుండి మమ్ములను విముక్తులను జేయు"మని ప్రార్థించిరి.

౧౦ ఇట్లు శుకసారణులు తనను ప్రార్థింపగా రామచంద్రమూర్తి
మందహాసము చేయుచు నిట్లు వారితో బలికెను. శుకసారణు
లారా! మీర లిచట జూడవలసిన దంతయు జూచినపక్షమునను
మఱియు మమ్ముల నందఱను జక్కగ బరీక్షించుట పూర్తియైన
పక్షమునను, మీ ప్రభువు చెప్పిన పనియంతయు జక్కబెట్టి,

గంతవ్యం చ యథాగతం న చ భయం మత్తోఽస్తి వాం
చారయోః ౧౦॥

యద్వా కించి దిహాఽస్త్యదృష్ట మపి చే ద్భూయోఽర్హాథో
వీక్షితుం
కించాఽయం తు విభీషణోఽపి యువయోః కార్త్స్న్యేన సందర్శ
యేత్

భేత్తవ్యం నహి జీవితం ప్రతి విముక్తాస్త్రౌ గృహీతావపి
ప్రాయో నైవ వధార్హతా ముపగతౌ స్యాతాం హి దూతౌ
సదా ౧౧॥

వాచ్యో మే వచసా నిశాచరపతి ర్మానసం భవద్భ్యాం పున
స్సీతాం మే హృతవా నభూత్కిల భవాన్దృష్ట్వాపురా యద్బలమ్
త త్సందర్శయ రాక్షసైస్సహ బలం లంకేశ్వర త్వం ద్రుతం
కల్యే శ్వ స్త్వయి భీషణం మమపునః క్రోధంవిమోక్ష్యామ్యహమ్.
౧౨॥

ఇత్యుక్తౌ రాక్షసౌ తౌ ద్వౌ జయేతి ప్రతినంద్య తమ్
ఆగత్య నగరీం సర్వ మూచతూ రావణం ప్రతి. ౧౩॥

రాజం స్త్వత్సహజేన తత్ర నితరా మావాం గృహీతౌ తతో
రామేణాఽమిత తేజసా తు కృపయా ముక్తౌ వభూవాఽధిప
తత్ర త్యే ష్వఖిలేషు పూరుష వరా శ్చత్వారఏవాఽవస
న్సౌమిత్రి శ్చ విభీషణ శ్చ కపిరా డ్రామ శ్చ శత్రు స్తవ. ౧౪॥

యెడలను మీరలు వచ్చిన మార్గమున వెళ్లిపొండు. గూఢచారులగు మీకు నావలన భయమేమియు లేదని తలంపుడు.

౧౧౫ ఓ శుకసారణులారా! ఇచ్చట నింకను జూడదగినది యుండినచో మీరలు చక్కగఁ జూచి వెళ్ళవలయును. మీకుఁ దెలియని విషయములను మా విభీషణుడు మీతోఁగూడ వచ్చి యన్నిటిని మీకుఁ జూపించును. మీ జీవితమునుగూర్చి భయపడకుడు. నిరాయుధులుగ నుండు చారులను బట్టుకొనినను జంపబడరని తలంపుడు.

౧౨౫ మీ ప్రభువయిన రావణునితో నేను జెప్పినానని యిట్లు మీరలు చెప్పవలయును, (ఏమన) ఏబలమును జూచుకొని నీవు సీతనపహరించితివో, ఓ లంకేశ్వరా! ఆ బలమును నీవు చూపింప సమయము వచ్చినది. రేపటిదినము ప్రాతఃకాలమున భయంకరమయిన నా క్రోధమునంతను నీమీదను వదలిపెట్టెదను. (అని రామచంద్రమూర్తి రావణునితో జెప్పుడని శుకసారణులకు జెప్పెను)

౧౩౫ ఇట్లు చెప్పుటతోడనే యారక్కసు లిరువురును "జయ, విజయీభవ," అని పలుకుచు రామచంద్రమూర్తిని గొనియాడుచు క్షణమాత్రములో లంకకు వచ్చి రావణునితో నిటులఁ బలికిరి.

౧౪౫ రాక్షసరాజా! నీవు చెప్పినట్లు మేమిరువురము వానరసైన్యములోఁ బ్రవేశించి వారలను బరీక్షింపుచుండగా, నీ తమ్ముడైన విభీషణుడు మమ్ములను బట్టుకొని చంపనుద్యుక్తుడై నంతలో ధర్మాత్ముడయిన యా రామచంద్రమూర్తి కృపతో మమ్ములను విభీషణునిబారినుండి వదలిపెట్టింపగా, ప్రాణములతో దిరిగి యిచటకు రాగలిగితిమి. అచ్చటనున్న వారలందఱిలో పురుషశ్రేష్ఠులు నలువురుండిరి. 1 రామచంద్రమూర్తి, 2 లక్ష్మణుడు, 3 సుగ్రీవుడు, 4 విభీషణుడు, (అని తెలిసికొనుము.)

చత్వారోఽమితవిక్రమా స్తవ పురీం లంకామిమాం తే ధ్రువం
శక్తాస్స్థూలయితుం క్షమా హ సకలా స్తిష్ఠంతు శాఖామృగాః
హృష్టా వానరవాహినీ జలనిధే స్తీరే విభో దక్షిణే
యుద్ధోత్సాహయుతా స్థితాఽల మధునా నైరేణ రామేణ తే. ౧౫

శమం విధాయ రాజం స్త్వం సీతాం రామాయ దేహ్యరం
నోచే దరం విభో! నూనం సర్వేషాం సంభవే ద్విపత్ ౧౬

నిశమ్య వచనం తస్య రావణః ప్రాహ సారణం
సర్వలోకభయా ద్వాపి నాహం దాస్యామి జానకీం
భవా నలం పరిత్రస్తో వానరై ర్నిర్గతోఽసివా
జానక్యాః ప్రతిదానం త్వం మన్యసే సాధు సారణ. ౧౭–౧౮

ఇత్యుక్త్వా శుకసారణద్వయయుతో నిర్గత్య సోఽప్యుత్తమం
ప్రాసాదం ద్రుత మాత్మనో రిపుబలం ద్రష్టుం సమారుహ్యవై
దృష్ట్వా భూమితలంప్లవంగమబలై స్సంపూర్ణ మాహాఽథ తం
నామ్నా సారణ మాత్మమంత్రిణ మిదం వాక్యం తు రక్షోధిపః. ౧౯

కే శూరా స్తు మహాబలా స్త్వపిచ కే తేషాం వదే ద్వై భవాం
స్తత్రత్యప్లవగేషు సారణ! వదే స్త్వం కే ప్రధానా అపి
కేవా తేషు తు యూథపా వద మమేత్యుక్తోఽబ్రవీ త్సారణో
ముఖ్యజ్ఞోఽథ వనౌకసాం త మవద న్ముఖ్యాం స్తదైవంవిభుమ్. ౨౦

౧౫ పైన చెప్పబడిన యీ నలుగురు గూడ నపారమైన బలముగల వారలు. వారలు నలుగురు మా తమే నీలంకనంతను సమూలముగ నశి పజేయుటకుc జాలుదురు. ఇతర వానరు లందఱు నట్లుండరనియు. వానర సైన్యమంతయు సముద్ర దక్షిణతీరమున యుద్ధోత్సాహమున సంతోషముతో నుండెను. కావున మనము వారలను జయించుట కష్టము గావున రామునితో నీవు వైరము మానుట మంచిది.

౧౬ రాక్షసరాజా! నీవు శాంతించి యిప్పుడైనను సీతను దీసికొని వెళ్ళి రామచంద్రమూర్తికి శీఘ్రముగ సమర్పింపుము. అట్లు చేయుని యెడల నీకే కాక మా కందఱకుcగూడ ముప్పువాటిల్లుట నిశ్చయము.

౧౭-౧౮ ఆమాటలు విని రావణుడు సారణునితో నిటుల బలికెను. సారణా! లోకములన్నియు నేకమయి నన్ను భయపెట్టినను గూడ నేను సీతను దిరిగియిచ్చుట మాత్రము కల్లయని తెలిసికొనుడు మీరు వారలను జూచి భయపడితిరో, లేక వానరులచేజయింప బడిన హేతువుచేతనో, సీతను దిరిగి రామున కిచ్చివేయుట మంచిదని తలంచు చుంటిరని నేను దలచుచుంటిని.

౧౯ ఇట్లు చెప్పి రావణుడు శుక సారణులనుగూడ వెంటనిడుకొని శత్రు సైన్యమును జూచుటకై తన మేడపై నెక్కి సముద్రతీరభూమి యంతయు వానర సైన్యములతో నిండి యుండుటను జూచి సార ణునితో నిటులc బలికెను.

౨౦ ఓ సారణుడా! ఆవానర సైన్యములలో మహాశూరు లెవ్వరో మరియు వారిలో మహాబల పరాక్రమవంతు లెవ్వరో, ఇంక నచ్చటి వారలలోc బ్రధానులెవ్వరో, మఱియు, వారిలో యూధనాయకు లెవ్వరో, నాకు జెప్పుమని రావణు డడుగగా సారణుడు ముఖ్యులయిన వార లను దెలిసినవాడు గాన వారిని జెప్ప నారంభించెను.

ధర్మోన్నోచలతే చ యత్ర నితరాం యో నాతివర్తేత తం
యో వేదాఽత్మభువో స్త్ర మప్యసదృశం భింద్యాచ్ఛరై
ర్యోఽంబరం
యస్మా ద్భీతిమవాపమృత్యురధికం యస్యోత్తమో విక్రమో
యజ్జాయాఽపహృతా త్వయా రఘుపతి స్తే సమ్ముఖే సంస్థితః.
తద్దక్షిణే పార్శ్వతలే తు యోఽభూ [ ౨౧
జ్జాంబూనదాభో రుణనేత్రయుక్త
సఏవ రామస్య సహోదరోఽభూ
త్సౌమిత్రి నామాఽమితవిక్రమశ్చ. ౨౨

ఆయోధనేఽతి కుశలో బలవా న్దుర్జయ శ్చ సః
రామస్య తు బహిఃప్రాణ స్తదర్థే జీవితం త్యజేత్ ౨౩

సవ్యపార్శ్వే స్థిత స్తస్య లంకారాజ్యేఽభిషేచితః
విభీషణోఽనుజ స్తేఽభూ జ్జ్ఞాతపూర్వో హి తే విభో. ౨౪

మధ్యేస్థితం విద్ధి దశాననప్రభోరవే స్తనూజం కపిరాజ్యపాలకం
హత్వా తు రామ స్తవ మిత్రతాం గతం శక్రాత్మజం తత్పద
మస్య దత్తవాన్. ౨౫
సోఽయం కోటిసహస్ర వానరపతి ర్భ్రాతా సమో విక్రమే
యుద్ధోత్సాహయుతోఽస్తి రాక్షసవిభో సర్వేపి శాఖామృగాః
తస్యాఽఽజ్ఞాం పరిపాలయంతి నితరాం శ్రీరాఘవార్థే పునః
ప్రాణాం స్త్యక్తు మపిధ్రువం హి కపయ స్సిద్ధా స్తదీయాజ్ఞయా.
౨౬

౨౧ రావణా! ఎవ్వనినుండి ధర్మము చలింపదో, ఎవడు ధర్మము నతిక్రమింపడో, ఎవడు బ్రహ్మాస్త్రమును గూడ నెఱుగునో, ఎవడు తన బాణముచే నాకాశమును గూడ భేదింప గలడో, ఎవ్వనికి మృత్యువు సయితము భయపడునో, ఎవ్వని పరాక్రమము నిరుపమానమయినదో, ఎవ్వని భార్యను నీవపహరించితివో, ఆ రాముడే నీ కెదురుగ నున్నవాడు.

౨౨ ఆ రామునకు కుడిప్రక్క నున్నవాడును, బంగారుకాంతి గలవాడును, ఎఱ్ఱటి కన్నులు గలవాడునగు నతడు రామునకు సహోదరుడగు లక్ష్మణుడు. అతడు కూడ రామునివలె నమిత బలవంతుడని తెలిసికొనుము.

౨౩ ఆ లక్ష్మణుడు యుద్ధముచేయుటలో మిక్కిలి కౌశల్యముగలవాడు, మిక్కిలి బలవంతుడు. యుద్ధములో నెట్టివారికిని గెల్వరానివాడు. రామునకు బహిః ప్రాణమయినవాడు. రాముని విషయమై తన జీవితమునుగూడ వదలిపెట్టుటకు సిద్ధముగ నున్నవాడు.

౨౪ రామున కెడమప్రక్క నున్నవాడు రాక్షసరాజుగ లంకాపురమునకు, రామచంద్రునిచే నభిషేకము చేయబడిన, నీ తమ్ముడగు విభీషణుడే. అతడు నీకు విదితమైనవాడే.

౨౫ క్రోతుల నడుమ కొండవలె నున్నవాడు వానరరాజగు సుగ్రీవుడు. రామచంద్రమూర్తి నీకు మిత్రుడయిన వాలినిఁ జంపి యతనిరాజ్యమును సుగ్రీవునకిచ్చెను

౨౬ రాజా! ఆ సుగ్రీవు డనేకకోట్ల వానరులకు రాజును, అన్నయగు వాలితో సమానమైన పరాక్రమము గలవాడును, నీతో యుద్ధము చేయుట కుత్సాహముతో నున్నవాడునయి యుండెను. వానరులందరు నతని యాజ్ఞను బరిపాలింతురు. రామకార్యమునకై సుగ్రీవానతిచే నందఱును తమ ప్రాణములను విడుచుటకుఁగూడ సంసిద్ధులయి యుండిరి.

బధ్వా స్వీయకరద్వయం రఘుపతే ర(గేస్థితం వానరం
శైలాకారతమం తు విద్ధి నగరీం దగ్ధ్వా గతం మారుతిమ్
యో బాల్యేత్వత్తు మియేష భాస్కరమపి (భ్రాంత్యాఫలస్యాధిప!
(ప్రాయ స్తు (త్రిసహ(స్రయోజనపథం గత్వా క్షణేనాఽంబరే.
౨౭

తత్సమీపే స్థితం విద్ధి వాలిసూనుం మహాబలం
సోఽయం పి(తా సమో రాజ న్బలే వా వి(క్రమేఽపి వా. ౨౮
బలా(గే సంస్థితం విద్ధి నీలం నామ చమూపతిం
యస్య నాదేన లంకేయం వేపతే మహతా విభో
సహ(స్రయూథపాధ్యక్ష స్సోఽయం హ్యమితవి(క్రమః. ౨౯
యో దైవాసురసంయుగే దివిషదా మీశస్య సాహ్యం మహత్
కృత్వా ప్రాప్య వరా న్బహూ న్సురపతే రాయోధనేఽమర్షణః
యో మృత్యోరపి నోద్విజే దపిచ యో ఋక్షేశ్వరోఽభూద్విభో
వృద్ధం జాంబవదాహ్వయం త మధప! త్వం విద్ధి ఋక్షేశ్వరమ్
౩౦

తదంతికస్థితా న్సర్వా యూథపా స్తా న్వదా మ్యహమ్
రాక్షసానా మధీశ! త్వం విజానీహి (క్రమేణ తాన్. ౩౧
రంభో యూథపతిః (ప్రమా థ్యథ మహావీరో గవాక్ష స్తథో
వి(క్రాంతః పనసో గజశ్చ గవయో మైందోఽమృత(ప్రాశకః
తాద్బృ గ్గే వ ద్వివిద స్తత శ్శతబలి ర్వీర స్సుషేణో నళః
స ర్వేవానరయూథపా స్తవ పురీం త్వాత్పాటితుం తే క్షమాః. ౩౨

౨౭ రాజా! చేతులు జోడించి రాముని కెదురుగఁ బెనుగొండవలె నున్న వాడు నీ లంకను తగులబెట్టి సీతను జూచివెళ్ళిన హనుమంతుడు. అతడు పుట్టుటతోడనే క్షుద్బాధకు తాళజాలక. యేదియో పండని భ్రమపడి క్షణములో మూడువేలామడల దూరము పైకెగిరి. సూర్యుని మ్రింగబోయిన మహా బలశాలి.

౨౮ రాజా! వానికి సమీపములోనున్న వాడు మహా బలపరాక్రమశాలి యగు వాలి పుత్త్రుడయిన అంగదుడు. అతడుకూడ బలపరాక్రమములలో తండ్రితో సమానుడు.

౨౯½ రాజా! వానరసైన్యమున కంతటను ముందు నిలవబడినవాడు నీలుడను సేనానాయకుడు. అతడు బొబ్బరిల్లునప్పుడు మన లంక యంతయు కంపించును. అతడు వేలయూథనాయకుల కధిపతియయిన సేనాపతియు, మహా బలశాలియునై యుండెను.

౩౦½ రాజా! ఎవ్వడు దేవాసుర యుద్ధములో దేవేంద్రునకుగూడ గొప్ప సహాయముచేసి యతనివలన ననేకములయిన వరములను బొందెనో, మఱియు, యుద్ధములో దుస్సహుడో, ఎవడు మృత్యువునకుగూడ భయపడడో, ఎవడు ఎలుగుబంట్ల కన్నిటికిని రాజో, ఆ ముసలి భల్లూకము జాంబవంతుడను ఋక్షరాజు (ఎలుగుబంట్లకు ప్రభువు.)

౩౧½ ఆ జాంబవంతునకు సమీపములో నున్న వారలందఱును యూథనాథులు (ఒక్కొక్క సైన్యమునకు ప్రత్యేకముగ నధిపతులు) రాక్షసరాజా! వారి పేర్లను వినుము.

౩౨½ రంభుడు, వాని తర్వాత నున్నవాడు ప్రమాథియను యూథనాథుడు, పిమ్మట మహా వీరుడగు గవాక్షుడు, వాని పిదప పరాక్రమశాలియగు పనసుడు, పిమ్మట గజుడు. గవయుడు, పిమ్మట అమృతము త్రాగినట్టి మైంద ద్వివిదులు, అనతరము శతబలి, వాని తర్వాత మహా వీరుడగు సుషేణుడు. పిదప నలుడు. ఈ పైవారలందఱును యూథపతులు. రాజా! పై యూథపతులే నీలంక నంతను బెల్లగించుటకు గూడఁ జాలియుండిరి.

ఇత్యుక్త్వా రావణః క్రుద్ధో ఘూర్ణయ న్నయనే ఽరుణే
ప్రాహ తౌ సన్నికర్షా న్మే గచ్ఛతం త్వరితం యువామ్ 33౫

ఇత్యుక్తౌ రాక్షసౌ సద్యో జయేతి ప్రతినంద్య తం
దూరా దపసృతౌ తూర్ణం తావుభౌ శుకసారణౌ. 34౫

విద్యుజ్జిహ్వం సమాహూయ మాయావిద మనంతరం
ప్రాహ తం మాయయా ఽఽత్మానం తాం రాఘవస్య ప్రియాం ద్రుతం
మోహయిష్యావహే తస్మా చ్ఛిరో మాయామయం భవాన్
పరిగృహ్యాఽఽశు రామస్య సశరం చాప ముత్తమం
నిర్గచ్ఛేతి తదుక్త స్స విద్యుజ్జిహ్వ స్తథాఽకరోత్
35-36-37

ఉభా వశోకవనికాం గతౌ దీనాం మహీసుతాం
అపశ్యతాం తత స్సీతా ముపసృత్యాఽఽహ రావణః. 38

భద్రేఽనేకవిధం మయా ప్రతిదినం త్వం సాంత్వ్యమానా ఽప్రియం
సంశ్రిత్యైవ సునిష్ఠురం. తు వచనం మాం ప్రత్యవోచః పురా
భర్తా తే నిహతో మయాఽఽహవతలే తస్యోత్తమాంగం మయా
నూనం దర్శయితుం తవాత్ర సుభగే చానీత మన్వీక్ష్య
తామ్. 39

మూర్ఖే సంత్యజ దుర్మతిం మృతిమతా కిం త్వం కరిష్యస్యహో
సర్వాసాం మమ దేవి పట్టమహిషీ స్త్రీణాం భవ త్వం ద్రుతమ్
హంతుం మాం సముపాగత స్తవ పతి ర్వారాంనిధే రుత్తరం
తీరం వానర వాహినీపరివృతో భ్రాత్రా స్వదా స్తంగతః. 40

౩౩ ఇట్లు సారణుఁడు చెప్పగా రావణుడు క్రుద్ధుడై కన్ను లెఱ్ఱజేసి త్రిప్పుచు శుకసారణులతో నిటులఁ బలికెను ఓ శుకసారణులారా! మీరలు శత్రుపక్షము నాశ్రయించి మాట్లాడుచుంటిరి కాన నాదగ్గర నుండి వెడలిపొండని హుంకరించెను.

౩౪ ఇట్లు రావణుఁడు భయపెట్టగా, శుకసారణులు "జయ విజయీభవ" అని రాజును గొనియాడి యచ్చోటునుండి దూరముగఁ దొలఁగి పోయిరి.

౩౫-౩౬-౩౭ పిమ్మట రావణుఁడు మాయలమారియగు విద్యుజ్జిహ్వుఁడను రక్కసునిఁ బిలచి, వానితో నిటులఁ బలికెను. ఓరీ విద్యుజ్జిహ్వుడా! మన మిర్వురము సీతయొద్దకుఁ బోయి యామెను మాయతో మోహింపచేయ వలయును. కాన నీవు మాయామయ మయిన రామశిరస్సును గల్పింపుము. రాముని ధనుర్బాణములను గల్పించి, వానిని జేతఁబట్టుకొని నావెంటరమ్ము. అని చెప్పగా, అటులనే మాయామయమగు రామశిరస్సును ధనుర్బాణములను గల్పించి సిద్ధముగ నుండెను.

౩౮ పిమ్మట రావణ విద్యుజ్జిహ్వులిరువురును. బయలుదేరి యశోకవనమునకేగి దీనురాలయిన యా జానకినిఁ జూచిరి. పిమ్మట రావణుడు సీతను సమీపించి యిటులఁ బలికెను.

౩౯ ఓ జానకీ! నేను బ్రతిదినము నిన్ననేకవిధములుగ బ్రతిమాలి చెప్పితిని. కాని నీ వెవ్వనిమీద నాధారపడి పరుషవాక్యములనుగూడ నన్నుఁ బలికితివో, ఆ నీ భర్తయగు రాముని యుద్ధరంగములో నేను జంపివేసితిని. నీవు నమ్మిక గలుగుటకై యారాముని శిరమును, ధనుర్బాణమునులగూడ నిచటకు దెచ్చితిని చూడుమనెను.

౪౦ ఓ మూఢురాలా! నీవు దురభిప్రాయము నిప్పుడైనను వదలుము. మృతినొందిన వానితో నింక నీకేమి ప్రయోజన మున్నది? ఇంకను మృతుడైన వానిమీదబడి యేడ్చుట యాశ్చర్యముగా నున్నది. ఇప్పుడైనను నాయంతఃపుర స్త్రీలకందఱికి నీవు పట్టమహిషివిగా నుండుము. నీభర్త యెట్లు చచ్చెనో వినుము. వానరసైన్యములతో గూడ నీభర్త సముద్రప్రటవతిలియొద్దునకు వచ్చెను. అప్పటికి సూర్యాస్తమయ మయ్యెను.

పశ్చా త్ప్రహ స్తప్రహితాశ్శరా స్తే
న్శాఖామృగా న్సంహరంతి స్మ నూనమ్
తస్మి న్నిశీథే ఽంతర మన్వవేక్ష్య
చిచ్ఛేద రామస్య శిరః ప్రహస్తః ౪౧
విభీషణః ప్రహస్తేన సగృహీతో మహాఽనుజః
తతో ఽవశిష్టా స్సైనికా స్తే పలాయితాః. ౪౨

సుగ్రీవో హనుమాంశ్చాపి రాక్షసై రభ్యుపాన్వత
ఏవం సర్వే మృతా స్తేషాం విముంచాఽఽశా మితః పరమ్ ౪౩

విద్యుజ్జిహ్వ స్తథాఽఽహూయ ప్రాహైనం దనుజాధిపః
త్వయాఽఽనీతం శిర స్తస్య భూమిజాయై ప్రదర్శయ. ౪౪

ఇత్యుక్త స్సోఽపి రామస్య శిర స్త్వానీయ సత్వరం
దర్శయామాస సీతాయై సశరం చాపి తద్ధనుః. ౪౫

సీతా వీక్ష్య శిర శ్చ కార్ముకమపి ప్రాణేశ్వరస్యాఽఽత్మనో
భర్తు స్తత్సదృశం ముఖం చ నయనే కేశాం స్తదీయాం స్తతః
చిహ్నై రప్యఖిలై స్తు తత్ప్రతిశిరో విజ్ఞాయ సా దుఃఖితా
క్రోశంతీ కురరీ యథా బహువిధం స్వీయాం జగర్హే జనిమ్. ౪౬

సంస్మృత్యాఽపిచ కైకయీం బహుతదా త్వేవంజగర్హే చసా,
కైకేయి! త్వ మితః పరం భవ ముదం ప్రాప్తా యతో మేపతిః,
నూనం భాస్కరవంశభూషణ మయం రక్షోధిపేనాఽఽహత
స్తస్మా త్త్వం కులమూలనాశనకరీజాతాఽసి నూనం భువి ౪౭

౪౧ పిమ్మట నా సేనాపతియగు ప్రహస్తుడు పంపిన రక్కసులు వానరుల నందఱిని రాత్రియందు సంహరించిరి. ఇది నిజము ప్రహస్తుడా యర్ధరాత్రి సమయముననే యవకాశమును జూచుకొని రాముని శిరస్సును ఛేదించెను.

౪౨ నా సోదరుడగు విభీషణునిగూడ ప్రహస్తుడే చంపివేసెను. పిమ్మట నీ మఱఁది యగు లక్ష్మణుడు మిగిలిన వానరులతో సహా పారి పోయెను.

౪౩ సుగ్రీవుని హనుమంతునిగూడ రాక్షసులు ముట్టడించి చంపివేసిరి. ఇవ్విధముగ నందఱును మృతినొందిరి. ఇటు పిమ్మట వారల యాశను విడిచిపెట్టుము (అని రావణుడు సీతతోఁ జెప్పెను.)

౪౪ పిదప రావణుడు దూరముగ నిలబడియున్న విద్యుజ్జిహ్వుడను రక్కసునిఁ బిలచి "ఓరీ నీవు తీసికొనవచ్చిన రామశిరస్సును సీతకుఁ జూపింపుము" అని వానితోఁ జెప్పెను.

౪౫ ఇట్లు చెప్పుటతోడనే రాముని శిరస్సును ధనుస్సునుగూడ వెంటనే తీసికొనివచ్చి విద్యుజ్జిహ్వుడు సీతకు, జూపించెను.

౪౬ సీతాదేవి తన ప్రాణేశ్వరుని శిరస్సును ధనుర్బాణములనుఁ జూచి యా శిరమునందలి ముఖమును భర్తయొక్క ముఖమునుగాను, నేత్రములు భర్త నేత్రములనియు వెండ్రుకలు రామునివే యని గుర్తులచే దానిని భర్తృశిరమునుగా దెలిసికొని మిక్కిలి దుఃఖపడి యాడులేడివలె నేడ్చుచు తన జీవితమును నిందించుకొనుచుండెను.

౪౭ ఇంతియే కాక, సీతాదేవి తన సవతి యత్త యయిన కైకనుగూడ నీ క్రింది విధముగ దూషింపదొడగెను. ఓ కైకయి! సూర్యవంశ భూషణమగు నా భర్తను రక్కసులు చంపివేసినందున నిటుపిమ్మట నీవు మహాసంతోషముతో నుండుము. ఇట్టి పని నీవు రాముని నిర్హేతుకముగ నడవులపాలు చేసినందున జరుగుటచే నీవు నిజముగ కులనాశనమునకై పుట్టియుంటి వని చెప్పదగును.

య శ్చీరవసన స్సాకం మయా ప్రస్థాపితో వనం
తేన తే విప్రియం కిన్ను కృతం కలహకారిణి. ౮౮

ఇత్యుక్త్వా విలలాప భూమితనయా మూర్ఛాంగతా సా క్షణం
చైతన్యం పున రేత్య రాఘవశిర శ్చాఽఽఘ్రాయ చాహాఽథ సా,
భార్యాదోషనిమిత్తకా పతిమృతి స్స్యా దిత్యవన్యాం శ్రుతే
ర్మద్దౌర్గుణ్యవశా దభూత్తవ మృతి ర్ధర్మానురక్తే రపి. ౮౯
మగ్నాం దుస్సహశోకరూపజలధౌ త్రాతుం తు మా ముద్యత
స్త్వం చాఽప్యద్య హతోఽస్యభాగ్య మధునా నష్ట్యా మ్యహం కి మ్మము,
శ్వశ్రూ ర్మే భవతా హతేన తు యథా ధేను ర్వివత్సా కృతా
దీర్ఘాయు స్తన యై ర్ద్విజైస్తు కథితం మిథ్యాఽభ్యభూ త్తద్వచః. ౯౦

కిం మాం న ప్రతిభాషసే సహచరీం న ప్రేక్షసే కిన్ను మాం
మత్పాణిగ్రహణే పురాఽద్య భవతా యత్సంశ్రుతం తత్స్మర,
ప్రాణేశాఽద్య సుదుఃఖితాం నయ చ మాంలోకాంతరం త్వం ద్రుతం
కల్యాణై రుచితాయ దంగ మధునా శ్యేనై స్తుతత్కృష్యతే. ౯౧
కౌసల్యా తవ సాత్త్వికం వధ మిమం రక్షోవశస్థాం చ మాం
శ్రుత్వా తత్క్షణమేవ భిన్నహృదయా సా జీవితాశాం త్యజేత్,
మద్దోషో రఘునా ప్రహస్తహతకేనైవం హతోఽసి ప్రియా
నాఽహం తే కులపాంసనీ తవ పునర్మృత్యో ర్నిదానం హాఽస్మ్యహమ్. ౯౨

౪౮ ఓ కలహాకారిణి! ఏ రామచంద్రుని నారబట్టలను గట్టింపజేసి నాతోగూడ నడవులపాలు నీవు చేసితివో, ఆ రామచంద్రమూర్తి నీకుఁ జేసిన యపకార మేమిటో చెప్పుము.

౪౯ ఇట్లు సీత కైక నుద్దేశించి పలుకుచు విలపించి క్షణకాలము మూర్ఛితురాలయి తిరిగి కొంత తెలివినొందినదై రామశిరస్సును దగ్గరకుఁ దీసికొని యాఘ్రాణించుచు నిటులఁ బలికెను. లోకములో భర్త యకాల మరణమునకు భార్యయొక్క దోషమే మూలమని విని యుండుటచే నాథా! ధర్మాభిమానివగు నీయొక్క యకాలమరణము నకు నాదోషమే కారణ మయియుండెను.

౫౦ నాథా! సహింపశక్యముకాని దుఃఖసముద్రములో మునిగియున్న నన్నుద్ధరించుటకుఁ బ్రయత్నించు నీవుకూడ రక్కసులచే హతుడ వయితివి. నా దురదృష్టమునుగూర్చి యింక నేను జెప్పవలసిన దేమి యున్నది. నా యత్తయగు కౌసల్య, స్మృతినొందిన నీచేత దూడలేని యావువలెఁ జేయఁబడెగదా! నాచేతిని జూచి దీర్ఘసుమంగలీత్వము నాకు, నీకుఁ బూర్ణాయుర్దాయమున్నదని చెప్పిన జ్యోతిష్కులమాట లన్నియు నసత్యము లయ్యెగదా.

౫౧ నాథా! నాతో మాట్లాడవేల? నీ సహచారినగు నన్నుఁజూడవేమి? నా పాణిగ్రహణసమయమున నీవు ప్రతిజ్ఞాపూర్వకముగ బలికిన వాక్యములను స్మరింపుము. ప్రాణేశ్వరా! ఇప్పుడు దుఃఖములోనున్న నన్నుగూడ నీవుపోయిన లోకాంతరమునుగూర్చి తీసికొనిపొమ్ము. నాథా! యే నీశరీరము సుగంధద్రవ్యములచే నలంకరింపదగినదో, ఆశరీరమిపుడు డేగలు మొదలగు వానిచే నాకర్షింపఁబడుచున్నది గదా! ఎంతకష్టము.

౫౨ నాథా! కౌసల్యాదేవి నీవు నిద్రించుచుండగా రాక్షసులు వధించిన సంగతిని నేను రాక్షసుని వశమునందున్న విషయమును, విని యా క్షణముననే గుండె బ్రద్దలై జీవితమును వదలిపెట్టును. నాథా! నా నిమిత్తమయి యొక తుచ్ఛరాక్షసునిచే హతముచేయ బడితివా? నీకు నేను బ్రియురాలను గాను. ఇక నేమని వంశనాశకురాలను. నీ పాలిట మృత్యువ నయితిని; ఇదినిజము.

ఏతస్మి న్నమయే ప్రహ స్తదనుజః పంక్త్యాననస్యాఽంతికం
సంప్రాప్యాఽఽహ వచోవిభో! సపది తే కార్యాంతరం వర్తతే
తస్మా దాశు సభాం ప్రతి త్వ మధునా సిర్గచ్ఛతా న్మంత్రిణ
స్సర్వే తత్ర వసంతి మంత్రణకృతే హ్యావశ్యకం మంత్రణమ్ ॥౩

ఇత్యుక్త స్సోఽ ప్యగా త్తూర్ణం దశాస్య స్తేన సంయుతః
విద్యుజ్జిహ్వోఽప్యగా త్పశ్చాద్దశాస్యగమనో త్తరం ॥౪

ఆశ్చర్యరామాయణే యుద్ధకాండే
ఏకాదశ స్సర్గ స్సమాప్తః.

---

## ద్వాదశ స్సర్గః

అంతర్ధాన మవాప రాఘవశిర శ్చాపంచ పశ్చాద్గతే
పంక్త్యాస్యే సరమా సమేత్య శనకై స్సంమోహితాం భూమిజామ్
ప్రాహైవం మృదుభాషిణీ ప్రియసఖీ మాశ్వాసయంతీ ముహుః
ప్రాణేశ స్తవ నో హతో ధ్రువమిదం మాయామయం రక్షసః. ౧

శ్రీరామేణ సురక్షితా స్తు కపయ స్తిష్ఠంతి వారాంనిధే
స్తీరే దక్షిణఏవ సోదరయుతో భర్తా తవాఽఽర్యే ధ్రువమ్
జీవత్యేవ న సంశయోఽత్ర మహితే నో రక్షసాఽయం హతో
మాయావి ద్దశకంధరేణసహజా మాయా ప్రయుక్తా త్వయి. ౨

౫౩ ఈ విధముగ సీత విలపించు సమయమున ప్రహస్తుడు రావణుని సమీపమునకు వచ్చి యిట్లు పలికెను. నాథా! యిప్పుడు కార్యాంతర మున్నది అందువలన మీరు సభకు శీఘ్రముగ రావలయును. మంత్రణమునకై మంత్రు లందరు నచ్చట నుండిరి. ఆలోచన మవసరముగాన బయలుదేరుడు.

౫౪ ఇట్లు ప్రహస్తుడు చెప్పుటతోడనే రావణుడును ప్రహస్తునితో గూడ బయలుదేరి సభకు వెంటనే వెళ్ళెను. పిమ్మట రావణుని వెంట వచ్చిన విద్యుజ్జిహ్వుడును రావణుడు వెళ్లుటతోడనే తానుగూడ వెళ్ళెను

ఆర్ష రామాయణమున యుద్ధ కాండమున
పదునొకటవ సర్గము సమాప్తము.

---

## పండ్రెండవ సర్గ ప్రారంభము.

౧ రావణుడు వెళ్ళిన పిదప రాక్షసమాయచే కల్పింపబడి సీత యొద్దకు దీసికొనిపోబడిన రాముని శిరస్సు ధనుస్సుకూడ నంతర్ధాన మయ్యెను. సరమ యను విభీషణుని భార్య సీత యొద్ద కేతెంచి మూర్ఛితురాలయి యున్న సీతను గాంచి యోదార్చుచు నిట్లు పలికెను ఓ ప్రియసఖీ! నీ ప్రాణేశుడగు రామచంద్రమూర్తి మృతి నొందలేదు. రావణుడు రాముని శిరమును నీకు జూపించినదంతయు రాక్షసమాయ యని తెలిసికొనుము.

౨ వానరు లందరు రామచంద్రమూర్తిచే సురక్షితులయి యుండిరి. వారలందరు సముద్రము దాటి యివతలియొడ్డునకు వచ్చియుండిరి. రామలక్ష్మణులు జీవించియుండిరి. సందియములేదు. రామచంద్ర మూర్తిని రాక్షసు లెవ్వరును జంపలేరు. మహా మాయికు డగు రావణుడు తన సహజమయిన రాక్షసమాయను నీదగ్గర ప్రయోగించెను. కాని సత్యముకాదు.

నూనం తే శుగితఃపరం న భవితా దేవి ధ్రువం రాఘవో
లంకా మాగతవా న్ప్లవంగమమహానీకాన్విత స్సానుజః
మారాదీ శ్శృణు మద్వచో౽ద్య సుభగే దృష్టోమయా రాఘవ
స్సుగ్రీవాదిసమన్వితో౽ద్రిశిఖరే తిష్ఠం స్తు సౌధాగ్రతః. 3

యోద్ధుం సిద్ధవ దాస్థితో రఘుపతి శ్శాఖామృగై రన్విత
స్తస్మాదేవ దశాననో౽పిసచివై రాహూతవా౽౽శ్వగాత్
భేరీనాద మిమం శృణు ప్రియసఖి ప్రాసాసిహస్తా హయా
నారుహ్యా౽౽శు పదాతయో౽పిబహవో యాంత్యద్యరాజాధ్వని.

ఘంటానాం శృణు నాద మద్య సుభగే ఘోషంహయానాంతథా
సన్నాదం తుములం శృణు త్వ మధికం రాత్రించరాణాం పునః
యుద్ధోద్యోగ మయం నిశాచరపతి ర్జానంకరోత్యద్యత
చ్ఛి త్వాం శోకహారీ వ్రజే డుపచ భీరాగాద్ధ్రువం రక్షసామ్. ౫

రామో౽త్యంతపరాక్రమో౽సురపతింహత్వా౽౽హవే తేపతి
ర్జానంత్వాంపున రేష్యతి ధ్రువమహంసీతే౽చిరాత్త్వాంపునః
ద్రక్ష్యామ్యంకగతాం రఘూత్తమవిభో ర్వేణిం చ తే రాఘవో
నూనంమోచయితా భవేత్తదధునా శోకంవృథా మాకురు.

నూనం తావకపద్మసన్నిభముఖే వైధవ్యహేతూన్యలం
చిహ్నాన్యేవ న సంతి కిన్ను విఫలం రోదిష్యలం త్వం పునః
కించ త్వం శృణు రాజపట్టమహిషీ సౌఖ్యాన్వితా త్వం పున
శ్శీఘ్రం వై భవితాసి లక్షణమిదం సంధృశ్యతే త్వన్ముఖే! ౭

3 దేవి! నిశ్చయముగ నిటుపిమ్మట నీకు దుఃఖముండబోదు. రామచంద్రమూర్తి వానరసైన్యముతోడను సోదరునితోడను లంకకేతెంచెను. నీవు దుఃఖింపకుము. నామాట వినుము- నేను మేడమీదనుండి పర్వతముపైనున్న వానరసమేతుఁడయిన రామచంద్రమూర్తిని జూచితిని.

౪ ఓ సఖి! రామచంద్రమూర్తి వానరసేనలతోఁగూడ యుద్ధమునకు సన్నద్ధుఁడై వచ్చుచుండెనని తెలిసియే రావణుఁడు మంత్రులచే నాహ్వానింపబడి వెంటనే యిచటనుండి వెళ్ళెను. భేరీలు మ్రోగుచుండెను వినుము. ఓ ప్రియసఖీ! ప్రాసము కత్తి మొదలగు నాయుధములను ధరించి గుఱ్ఱపు రౌతులు కాల్బలము గూడ రాజమార్గమునఁ బోవుచుండెను.

౫ ఓ సఖి! రథములయందలి చిఱుఘంటలధ్వని వినుము. మఱియు గుఱ్ఱముల సకిలింతలు రాక్షసుల గల్లంతును గూడ వినుము. దీనిని బట్టి చూచినచు రాముఁడిప్పుడు యుద్ధప్రయత్నమును జేయుచుండెను. అందువలన శోకనాశకమగు లక్ష్మి నిన్ను బొందును. రాక్షసులకు భయకాలము సంభవించెను.

౬ దేవి! యపార పరాక్రమముగల నీభర్తయగు రామచంద్రమూర్తి రావణుని సంహరించి శీఘ్రములో నిన్ను దీసికొని పోఁగలఁడు. నీవు రామచంద్రమూర్తియొక్క యొడిలోఁ గూర్చుండగా నేను జూడఁగలను. చిరకాలమునుండి జడగా నల్లుకొని పోయిన నీవేణిని (నీజడను) రామచంద్రమూర్తి విప్పఁగలఁడు. అందువలన నీ విప్పుడు దుఃఖింపకుము.

౭ దేవి! నిజముగ పద్మమువలె శోభిల్లుచున్న నీముఖమునందు వైధవ్యహేతువులగు లక్షణములుగూడ గనుపింపవు. నీవు వ్యర్థముగ నేల దుఃఖించెదవు? ఇదియునుం గాక, నింకొక సంగతిని జెప్పెదను వినుము. రాణిపొందదగిన సౌఖ్యములను శీఘ్రకాలములోఁ బొందఁగల లక్షణములు గూడ నీముఖమునందు గనుపడుచున్నవి.

ఏవం సుసాంత్వితా సీతా మహాహర్ష మవాప్య సా
సరమాం మాహ తా మేత ద్వచశ్శోకాపనోదినీం. ౮
ఏతస్మి న్సమయే తు రామకుశలం శ్రుత్వా సఖి! త్వంధ్రువం
మా మానందయసి త్వదీయవచసోఽహం జీవితాశాం పునః
ప్రాప్నోమి ప్రియవాదిని ధ్రువ మహం వర్తే ఋణస్థా తవ
ప్రాయ స్త్వత్సదృశీ నచాస్తి భువనే క్షేమంకరీ మేఽపరా. ౯

సంశ్లాఘ్య బహుధా సీతాం సరమా తదనంతరం
ఆపృచ్ఛ్య తాం యయౌ రాజ్ఞో జ్ఞాతుం త్వౌత్యాయికీం కృతిమ్.
రావణోఽపి సభాం గత్వా మంత్రయిత్వా చ మంత్రిభిః
పూర్వద్వారే ప్రహస్తం చ ద్వారే దక్షిణదిక్స్థితే
మహోదరం మహాపార్శ్వం పశ్చిమద్వారి మాయినం
పుత్త్ర మింద్రజితం చాఽపి స్వాదిదేశాఽవితుం పురీం
ఉత్తరస్యాం పురద్వారి వ్యాదిశ్య శుకసారణౌ
స్వయంచాపి దశగ్రీవః పాతుం పశ్చా దగమత్ సః.
౧౦-౧౧-౧౨-౧౩
మహావీర్యం విరూపాక్షం మధ్యమేఽ స్థాపయ త్తదా
ఏవం నిధాయ నగరీరక్షణం రాక్షసేశ్వరః
ఆత్మానంతు కృతార్థం చ మత్వాఽంతఃపుర మవ్రజత్. ౧౪

ఆశ్చర్యరామాయణే యుద్ధకాండే
ద్వాదశస్సర్గస్సమాప్తః

౯ ఇట్లు సరమ యొక్క వార్తచే సీతాదేవి యు మిగుల సంతసించి తన శోకమును బోగొట్టిన యా సరమనుగూర్చి యిట్లు బలికెను. ఓ ప్రియసఖి! ఇట్టి సుఖసమయమున శ్రీరామచంద్రమూర్తి క్షేమముగా నున్న శుభవార్తను జెప్పి నన్నానందింపజేసితివి. నీమాట వినిననేను మరల జీవితాశ గలదాననైతిని ఓ ప్రియవాదిని! నీవు చేసిన యుపకారమునకు నీకు సర్వదా నేను ఋణగ్రస్తురాలనై యుండవలసినదే; ముల్లోకములలో నా క్షేమమును గోరు నీ సమానురాలు మఱియొకతె లేదని చెప్పగలను.

౧౦-౧౧-౧౨-౧౩ పిమ్మట సరమయును సీతాదేవిని బహువిధములగొనియాడి యామె యనుజ్ఞను బడసి రావణుడు తొందరగా సభకు వెళ్ళి పోయిన యత్యావశ్యక కార్యమేదియో తెలిసికొని వచ్చుటకై వెళ్ళెను. రావణుడును సభకు శీఘ్రముగ బోయి మంత్రులతో నాలోచనము చేసి పురరక్షణమునకై పూర్వద్వారమున ప్రహస్తుని దక్షిణ ద్వారమున మహాపార్శ్వమహోదరులను, పశ్చిమద్వారమున మహా మాయికుడును తన పుత్త్రుడునయిన ఇంద్రజిత్తుని, పెక్కురక్షసులతో నుండునట్లు నియమించి యుత్తరద్వారమున శుకసారణులను మంత్రులను గూడ తనతో నుండుటకు నిశ్చయించి మహాబల పరాక్రమముగల విరూపాక్షుని మధ్య గుల్మమున నుండునట్లు నియమించెను.

౧౪ ఇవ్విధముగా రావణుడు లంకారక్షణమునకై యేర్పాటుచేసి తన యంత కృతార్థుడు మఱియొకడెవ్వడును లేడని తలంచి పిమ్మట తన యంతఃపురమున కేగెను.

ఆశ్చర్యరామాయణమున యుద్ధకాండమున
పంద్రెండవ సర్గము సమాప్తము.

# త్రయోదశస్సర్గః

పశ్చాద్రాఘవ నేన సహ దనుజాధీశానుజస్సాంజలి
ర్గత్వా మే సచివా విభీషణయుతా గత్వా తు లంకాపురీమ్
పంక్త్యాస్యస్య గృహే ప్రవిశ్య నితరాం జ్ఞాత్వా విధానం పున
స్త్వాగత్యాహ మమాబ్రువంశ్చ సకలం శత్రోర్విధానం శృణు. ౧

పూర్వద్వార ముపాశ్రితోఽసురచమూయుక్తః ప్రహస్తోఽపర
ద్ద్వారం దక్షిణ మాశ్రితోఽస్తి చ మహాపార్శ్వోఽన్వితః కైశ్చన
ద్వారం పశ్చిమ మింద్రజిత్త్వవతి హై రాత్రించరై రన్వితో
ద్వారం చోత్తరమాస్థితో దశముఖోఽనేకై ర్వృతో రాక్షసైః. ౨

మధ్యగుల్మం విరూపాక్షో బలేన మహతా వృతః
ఆస్థితోఽభూ దుదీక్ష్యైతా న్నాయయు స్సచివా మమ. ౩

విక్రాంతా బలినశ్చ తత్ర దనుజాః పంక్త్యాననస్య ప్రియాః
సర్వే యుద్ధవిశారదా నిరుపమా వీర్యే చ తేజస్యలమ్
ఏతస్మి న్బలవర్ణనే తు భవతా మన్యు ర్న కార్యో విభో
భీత్యై తే కథితం నహి ధ్రువ మిదం శక్తో భవా న్సంగరే. ౪

యత్కార్యం భవతాఽద్య వచ్మ్యహ మిదం శ్రీరామచంద్రప్రభో
వ్యూహ్యేదం కపిసైన్య మద్య తు భవా న్యోద్ధుం వ్రజే ద్రావణమ్
ఇత్యుక్తో రఘునందనోఽర్కతనయం ప్రాహైవ మద్యైవ త
చ్ఛత్రూణాం ప్రతిఘాతకర్మ భవతా చింత్యం సఖే సత్వరమ్. ౫

# పదమూడవ సర్గ ప్రారంభము

౧ పిదప విభీషణుడు చేతులు జోడించి రామచంద్రమూర్తితో నిటులఁ బలికెను. రామచంద్ర ప్రభూ! నా మంత్రులు నలువురు పక్షిరూపముతో లంకలోని రావణ సైన్యములో ప్రవేశించి వారల విధానము నంతను దెలిసికొని యిచటకు వచ్చి శత్రు పన్నాగమునంతను నాకుఁ జెప్పిరి.

౨ ఆ విధానమును చెప్పెదను రామచంద్రా! వినుము. గొప్ప రాక్షస సైన్యముతో సేనానాయకుఁడగు ప్రహస్తుడు తూర్పు ద్వారమును గాచుచుండెను. మహాపార్శ్వుడు, మహోదరుడు మొదలగు కొందఱు రక్కసులతో దక్షిణద్వారమున నుండెను. పడమర ద్వారమును ఇంద్రజిత్తు రక్కసులతోఁగూడి కాపాడుచుండెను. అనేక రాక్షస వీరులతో గూడి రావణుడే యుత్తరద్వారమును రక్షింపఁబూనెను.

౩ విరూపాక్షుడు గొప్పసైన్యముతో గూడి నగర మధ్య ప్రదేశమును గాపాడఁబూనెను. ఆ ప్రకారము శత్రువులుండఁగా నా మంత్రులు చూచివచ్చిరి.

౪ రామచంద్రా! లంకలోని యారక్కసు లందఱును గొప్ప పరాక్రమము గలవారలును బలవంతులును, రావణుని మెప్పుబడసిన వారలును యుద్ధములో నారితేరిన వారలును బలమునందును తేజస్సునందునను నిరుపమానులునై, యుండిరి. శత్రుబలమును వర్ణింపుచుంటినని నీవు కోపింపకుము. నిన్ను భయపెట్టుటకై నేనిటుల జెప్పుటలేదు. నీవు, దేవతలనుగూడ యుద్ధమున జయింపగలవు.

౫ రామచంద్రా! నీ విపుడు చేయవలసిన పనిని జెప్పెదను వినుము. ఈ వానరసైన్యము నంతను నాలుగువిధములుగ విభజించి (నాలుగు ద్వారములయందు నుండునట్లు చేసి) పిదప రావణునితో యుద్ధమునకు వెడలుము. ఇట్లు విభీషణుడు చెప్పగా రామచంద్రమూర్తి యాలోచించి సుగ్రీవునితో నిటులఁ జెప్పెను. సుగ్రీవా! శత్రువుల నెదుర్కొనుటకుఁ దగినసాధనము మిత్రమా! నీ వాలోచింపుము.

పూర్వద్వారి తు నీల మంగద మథో ద్వారే తథా దక్షిణే
ద్వారే పశ్చిమ ఏవ వాయుతనయం ప్రావేశయ త్వం ద్రుతమ్
యత్ర స్థాస్యతి రక్షసా మధిపతి స్తద్ద్వారఏవోత్తరే
స్థాస్యావ్యాశరనాయకేన సహవై యోద్ధుం త్వహం సానుజః. ౬

సుగ్రీవ! త్వ మయం దశాస్యసహజో గుల్మే తథా మధ్యమే
వృద్ధో జాంబవదాహ్వయోఽపిచ తథా ఋక్షేశ్వర స్తిష్ఠతాత్
కార్యం మానుషరూప మాహనిత లే నాపి ప్లవంగైః కదా
నూనం స్వ స్వ స్వరూపం తదాకృతిధరా యోత్స్యామహే వై
రిపూన్. ౭

ఇత్యుక్త్వా పున రేవ మాహ రవిజం శ్రీరామచంద్ర ప్రభు
స్సుగ్రీవాఽద్య సువేలపర్వత మిమం త్వారోహ మిచ్ఛామ్యహం స్తినే
వత్స్యామోఽత్ర నిశా మిమాం నయ మమీ సర్వేఽపి లంకా
మిమాం

ద్రక్ష్యామో దశకంధరస్య నిలయం రమ్యం తథాఽద్రిం
వయమ్. ౮

ఏవం తేన నిగద్య రాఘవవిభు ర్నామ్నా సువేలం గిరిం
సౌమిత్ర్యర్కసుతాశరేశసహజై రారోఢుమైచ్ఛ త్తదా
పశ్చా దంగదవాయునందనగజా నీలో గవాక్షో హరో
రంభో ఋక్షపతిః పరే చ బహవ శ్చక్రు స్తదారోహణమ్. ౯

ప్రాకారైః పరివారితాం చ దనుజైః పూర్ణాం శుభాం తత్పురీం
సర్వే తచ్ఛిఖరస్థితాస్తు దదృశు స్తాం రాఘవోఽవేక్ష్య సః

౬ సుగ్రీవా! గొప్పసేనలతో నలుడు తూర్పుద్వారమున నుండునట్లును, దక్షిణద్వారముకడను అంగదుడు వానరసైన్యముతో నుండునట్లు నేర్పరచి, మహాపరాక్రమశాలియయిన ఆంజనేయుని పడమటిద్వారమునందును. వెంటనే ప్రవేశపెట్టుము. రావణుని జంపు వంతు నాది కాన వాడుండెడి యుత్తరద్వారమున లక్ష్మణసమేతుడనై నే నుండగలను.

౭ సుగ్రీవా! నీవును విభీషణుడును, ఋక్షరాజయిన జాంబవంతుడును సేనామధ్యభాగమునందుండి రక్షింపవలయును. ఇదియునుంగాక వానరులెవ్వరును యుద్ధసమయమున మనుష్యరూపమును ధరింపరాదని చెప్పవలయును. ఎవ్వడైనను, ఈ నియమము తప్పరాదు. నేను, లక్ష్మణుడు, విభీషణుడు, అతని నలువురు మంత్రులు మొత్తము మేము ఏడుగురు మాత్రము మనుష్యరూపముతో యుద్ధము చేసెదము.

౮ ఇట్లు చెప్పి తిరిగి సుగ్రీవునితో రామచంద్రమూర్తి యిటులఁ బలికెను. సుగ్రీవా! లంకను జూచుటకై సువేలపర్వతము నెక్కుటకు గుతూహలముగా నుండెను. ఈ పర్వతమును మన మెక్కి యీ రాత్రి యిచటనే యుండుదము. లంకను జూచుటయు రావణుని నిలయమును పర్వతమును జూచుటయుగూడ సంభవించును.

౯ ఇట్లు సుగ్రీవునితోఁ జెప్పి రామచంద్రమూర్తి వెంటనే లక్ష్మణుని తోడను సుగ్రీవ విభీషణులతోడను సువేలపర్వతము నెక్కెను. వార లిటుల నెక్కుచుండగా వారి వెంట, అంగదుడు హనుమంతుడు, గజుడు, నీలుడు, గవాక్షుడు, హరుడు, రంభుడు, జాంబవంతుడు ఇంక మఱి కొందఱుగూడ పర్వతము నెక్కిరి.

౧౦ ఇట్లు కొండ యెక్కిన పిమ్మట రామచంద్రమూర్తియు, వానరులును త్రికూటపర్వతశిఖరమునందనేక ప్రాకారములతో గూడి రక్కసులతో నిండియున్న యా లంకాపురినిఁ జూడఁ గలిగిరి.

ప్రాసాదావళి మాశ్వలంకృతతమాం రత్నై ర్నిబద్ధాం తథా
త్రైకూటశిఖరేస్థితాం చ నగరీం సంప్రాప్తవా న్విస్మయమ్ః ౧౦

లంకాగోపురశృంగసంస్థిత మలం రత్నాంచితాభూషణం
శ్వేతచ్ఛత్రసుశోభితం దశముఖం సంవీక్ష్య సూర్యాత్మజః
తచ్ఛైలాగ్రతలా త్తు గోపురతలే త్వాప్లుత్య తస్యోపరి
ప్రాహైవం దనుజేశ్వరం ప్రతి తదా నిర్భీక మేవ ద్రుతమ్॥ ౧౧

రేరే రాక్షస! రాఘవస్య తు సఖా దాసోఽస్మి నామ్నా త్వహం
సుగ్రీవోస్మి న మోక్ష్యసే త్వ మధునా నూనం మయా రావణ
ఇత్యుక్త్వా మకుటం తదీయ మధికం చాఽఽకృష్యతం చావనా
పుత్రాపాస్యశు చ పాతయి న్కరయుగేనాఽ తాడయ త్తం ముఖే
౧౨

పరస్పరం ముష్టితలప్రహారైః కరాగ్రఘాతై రపి బాహుయుద్ధం
కపీంద్రరాత్రించరనాయకౌ ద్వౌ ముహూర్త మేవాఽకురుతా
మలం తౌ. ౧౩

పశ్చా త్సూర్యసుతప్రహారవివశో నిష్పిష్ట దేహ స్తదా
పఙ్త్యాస్యోహ్యాదిభీషిమా న్నిజ మథాఽఽరబ్ధుం చ మాయా
బలమ్। సుగ్రీవోపరి నై యదాఽయతత త ద్విజ్ఞాయ

లంకాపురి యందలి మేడలవరుస మిక్కిలి యలంకరింపఁబడి రత్నములచేతను కట్టబడిన గోడలు గలదియై యుండెను. త్రికూట పర్వత శిఖరమునం దొప్పుచుండిన నగరమును, అట్టి ప్రాసాదములను రామచంద్రమూర్తి చూచి యాశ్చర్యపడెను. (లంకాపట్టణము నూరామడలపొడవు. మూఁడామడల వెడల్పుగలదని తెలియదగినది)

౧౧ లంకయం దొక గొప్పమేడ గోపురముమీద నున్న వాఁడును, రత్నాభరణములచే నలంకరింపబడిన వాఁడును, శ్వేతచ్ఛత్రముచే శోభిల్లుచున్న వాఁడు నగు రావణుని, సుగ్రీవుఁడు పర్వతముమీదనుండి చూచి యా పర్వతశిఖరమునుండి రావణుఁడున్న గోపురముమీఁదికి నురికి రావణునితో నిటుల నిర్భయముగ వెంటనే పలికెను. (సుగ్రీవుఁడు రావణుని మీఁదికి దుమికిన కారణమేమనగా, రాముని యెదుట రాజోపచారములతో రావణుఁ డుండుటకు సహింపలేక యట్లు దుమికెనని తెలియదగినది).

౧౨ ఓరీ క్రూరుఁడా! రామచంద్రప్రభువునకు, ఆయన యభిప్రాయమున నేను మిత్రుఁడను, నా యభిప్రాయమున నేనాయనకు దాసుఁడను నాపేరు సుగ్రీవుఁడని చెప్పుదురు. ఓరీ రావణా! నీవు కంటబడితివి. కాన నా నుండి నీవు విముక్తుఁడవు కాలేవు. అని పలుకుచు వాని మీఁద దుమికి వాని రత్న కిరీటములాగి నేలపై కొట్టి తన రెండు చేతులతో వానినిపట్టి క్రిందపడవేసి వాని ముఖమునందు చెంపదెబ్బలం విసిరి కొట్టెను.

౧౩ పిదప సుగ్రీవుఁడు, రావణుఁడు నిర్వురును, బరస్పరము, కలియబడి పిడికిలిపోట్లు పొడుచుకొనుచు, చేతులతో చీరుకొనుచు, ముహూర్త కాలము బాహుయుద్ధముఁగూడ జేసిరి.

౧౪ ఇట్లు వీరలిరువురును కొంతసేపు యుద్ధముచేసిన పిదప సుగ్రీవుని యొక్క పిడికిలి పోట్లుచేతను, దెబ్బలచేతను, రావణుఁడు పరవశుఁడై శరీరమంతయు పిండిపిండిగ జేయబడినవాఁడయి మనమునందు భీతి నొందియు, నిక బాహుయుద్ధముతో సుగ్రీవుని జయింపలేనని తలచి

తూర్ణం హరిః। ఖం చోత్ప్లుత్య జగామ రామసవిధం
ప్రాప్యాఽఽహవే స ద్వ్యశః. ౧౪

గతవృత్తం తు సుగ్రీవః ప్రాహ రామాదిభి స్తతః
పరిష్వజ్య రవే స్సూనుమువాచ రఘునందనః. ౧౫

సుగ్రీవాఽద్య మయాఽనిగద్యభవతానూనం కృతం సాహసం
నైత త్సాహసకర్మ రాజభి రలంకార్యం కదాపి ధ్రువమ్
ఆపన్నేత్వయి సీతయా మయి పునః కార్యం కి మన్యై రితి
ప్రోక్తే తేన తదాఽబ్రవీ ద్రఘుపతిం సూర్యాత్మజ స్తం పునః.
౧౬

శ్రీరామచంద్ర! తవ శత్రుం మహాం నిరీక్ష్య భార్యాపహారక మముం దశకంధరం తు, జాన న్స్వశక్తి మధికాం పర దుస్సహాం చ, తూష్ణీం భవామి చ కథం కిల మర్షయామి.
౧౭

ఇత్యేవం నిగదంత మర్కతనయం సంశ్లాఘ్య రామ స్తతః, ప్రాహైవం సహజం తు లక్ష్మణ! మహ త్ప్రాప్తం భయం రక్షసామ్, వాతా వాంత్య తిదుస్సహా జలధరాః క్రూరాః క్షితిః కంపతే, కించాస్యాం నిశి చంద్రమా శ్చ నితరాం నో శోభతే పూర్వవత్. ౧౮

వానిపయి తన మాయాబలము నుపయోగింప యత్నింపగా, నా సంగతిని సుగ్రీవుడు తెలిసికొని యంతదనుక యుద్ధములో తనకేకీర్తిలభించి యుండుటచే, అచ్చోటునుండి యొకగంతులో రాముని సన్నిధికి వచ్చి చేరెను. (యుద్ధమునందు కీర్తియనగా రావణుని జంపుటకు సుగ్రీవుడొకడే చాలునను కీర్తిని సుగ్రీవుడే పొందెనని తెలియదగును)

౧౫ పిదప సుగ్రీవుడు జరిగినవృత్తాంతమును రామచంద్రమూర్తి మొదలగు వారితోఁ జెప్పగా, రామచంద్రమూర్తి సుగ్రీవునిఁ గౌగలించుకొని యీ విధముగఁ బలికెను.

౧౬ సుగ్రీవా ! నేనిట్టివిధముగఁ జేయుదలచితినని నాతోఁ జెప్పకయే, నీవిట్టి సాహసపు పని చేయుట మంచి పనికాదు. రాజులగు వారలిట్టి సాహసపు పని నెప్పుడును జేయగూడదు ఏమి సాహసమందువా? నీకేమైన నచట ఆపద సంభవించిన యెడల నాకు సీతతోగాని యితరులతోగాని యేమిపని? తుదకు నా దేహమయినా నాకేల ? (మిత్రుని శత్రువునకు బలి చేసి నేనేమని జీవింతునని భావము) ఇట్లు రామచంద్రమూర్తి పలుకగాఁ దిరిగి సుగ్రీవుడు రామచంద్రమూర్తితో నిటులఁ బలికెను.

౧౭ రామచంద్రా ! నీభార్య నపహరించి నీయెదుట దీవితో నుండుటను జూచి నాశక్తి సామర్థ్యములు శత్రువులకు సహింప శక్యముకానివని తెలిసియుండియు, నే నెటుల నుపేక్షించి యుండగలను? నే నెట్లు సహింపగలను ? (అని సుగ్రీవుడు చెప్పెను.)

౧౮ ఇట్లు చెప్పుచున్న సుగ్రీవుని రామచంద్రమూర్తి కొనియాడి, పిదప లక్ష్మణునితో నిటుల బలికెను లక్ష్మణా! రాక్షసులకు నాశనము గలిగించు ప్రలయచిహ్నములు కన్పించుచుండెను. వానిని జెప్పెదను వినుము. వాయువు దుమ్ము రేచుచు, నతిదుస్సహమై వీచుచుండెను. మేఘములు రక్తమును వర్షించుచు నతిక్రూరములై యుండెను. భూమి కంపించుచుండెను. ఇదియునుంగాక యీ రాత్రి భాగమున చంద్రుడు పూర్వమువలె ప్రకాశించుటలేదు.

శ్వః ప్రభాతే వయం సర్వే వ్యూహ మాశ్రిత్య సత్వరం
అభియామ దశాస్యస్య పురీం వానర సంవృతాః ౧౯

ఇత్యుక్త్వా తస్మి న్నిశాం తత్ర యాపయిత్వా సుహృజ్జనైః
ప్రభాతే హరిభి స్తస్మా ద్రాఘవో౽వతతార సః. ౨౦

తత శ్శాఖామృగబలం సన్నహ్య రఘునందనః
అచోదయ త్తదైవా౽౽జే స్ససుగ్రీవో మహాబలః. ౨౧

పశ్చా ద్రామవిభు ర్బలేన మహతా లంకాపురీం ప్రస్థిత,
స్తం యాంతం త్వనుయాంతి సూర్యతనయో రాత్రించ
రేశానుజః, సౌమిత్రి ర్హనుమా న్నళో౽౦గదముఖా వీరా
స్తదా రాఘవమ్, వృక్షా న్భూమిరుహాం స్తు కేచన శిలా
స్సంగృహ్య యాంతి స్మ తే! ౨౨

స్వాం స్వాం స్థాన ముపాశ్రితా శ్చ కపయో౽ తిష్ఠం స్తదా
రాఘవో, లంకాద్వార మథో త్తరం తు బలవా నాసాద్య
సౌమిత్రిణా, సంయుక్త స్తు రురోధ యత్ర దనుజాధీశ
స్స్వయం సంస్థిత, స్తద్ద్వారం పరిరక్షితుం నహి పరో
రామా త్సమర్థో భవేత్. ౨౩

పూర్వద్వార ముపాశ్రితో హరిచమూనాథ స్తు నీల స్తదా
మైందేన ద్వివిదేన సాక మవస ద్ద్వారం తతో దక్షిణమ్
తారేయ స్తు రురోధ పశ్చిమమహాద్వారం హనూమాం స్తథా
సుగ్రీవ స్త్వవతిస్మకైశ్చన యుతో గుల్మం తథామధ్యమమ్. ౨౪

౧౯ లక్ష్మణా! రక్కసుల కరిష్ట చిహ్నములు కన్పడుచున్నందున వెంటనే రేపటి యుదయముననే మనము వానరసేనలతో బోయి లంకను ముట్టడింపవలయును,

౨౦ ఇట్లు రామచంద్రమూర్తి లక్ష్మణునితోఁ జెప్పి సుగ్రీవుడు మొదలగు మిత్రులతోగూడ నచ్చటనే యారాత్రి గడపి ప్రాతఃకాలమున వానరులతోగూడ సువేల పర్వతమునుండి క్రిందికి దిగెను.

౨౧ పిమ్మట రామచంద్రమూర్తి సుగ్రీవాదులతోఁగూడి వానరసైన్యమంతను లంకను ముట్టడించుటకు ప్రేరేపించెను.

౨౨ అనంతరము రామచంద్ర ప్రభువు గొప్ప సైన్యముతో లంకకుఁ బ్రయాణమై పోవుచుండగా, శ్రీరామచంద్రుని వెంట సుగ్రీవుడు, విభీషణుడు, లక్ష్మణుడు, హనుమంతుడు. అంగదుడు మొదలగు వానర వీరులును. జాంబవంతుడు మొదలగు నెలుగుబంట్లును, గొప్ప గొప్ప చెట్లను, గొండలను, పర్వత శిఖరములను, గొందఱు తీసికొని సంతోషము కొలది రామునికంటె ముందు నడచుచుండిరి.

౨౩ పిమ్మట వానరులు తమ తమ స్థానములఁ బ్రవేశించిరి. (అనగా వారి వారి నియమిత స్థానముల కేగియుండిరి) రామచంద్రమూర్తి లంక యుత్తరద్వారమును లక్ష్మణునితోఁ గూడఁజేరి రావణుడు స్వయముగనుండు నా ద్వారమును నిరోధించెను. రామచంద్రమూర్తి తనకంటె నితరుడెవ్వడు నుత్తరద్వారమును గాపాడలేడు కాన తానే స్వయముగ నచటకు వెళ్ళెను.

౨౪ వానరసేనానాయకుడగు నలుడు మైందద్వివిదులతో గూడి తూర్పు ద్వారమునడ్డగించెను. అంగదుడు తన సేనలతో దక్షిణద్వారము నడ్డగించెను. సుగ్రీవుడు కొందఱు వానరవీరులతోగూడి మధ్యభాగమునుఁ గాపాడుచుండెను,

కేచి త్తత్ర దశద్విపాధికబలాః కేచిత్ త్రయోఽప్యుచ్ఛ్రితాః,
కేచి న్నాగసహస్ర సద్బలయుతా స్తాదృక్ష్వేవం గోపురీ,
లంకాదుష్ప్రసహాపి సాఽఽవృతతమాఽభూ త్సర్వతో
వై మహత్, శక్తోఽభూ చ్చ తదా స శాచరచమూహృ
ద్దేశ నిర్భేదకః. ౧౫

ఏవం తన్నిజసైన్య మాశరవధే రామో నివేశ్య క్రమా
త్సమ్మంత్ర్యాథ విభీషణాదిభి రలం నిశ్చిత్య కార్యక్రమమ్,
సంస్మృత్యాపిచ రాజధర్మ మనదత్తారేయ మాహూయ తం
గత్వా సౌమ్య! దశాననం వదతు మే వాక్యాద్భవా
న్నిర్భయమ్. ౧౬

రేరే రావణ నష్టచేతన! గతశ్రీక! త్వయా యత్కృతం
పాపం పూర్వ మభూ న్మహర్షిషు తథా దేవేషు యక్షేష్వపి
తస్య త్వం ద్రుత మేవ భోక్ష్యసి ఫలం దారాహృతేః కర్శితం
ధృత్వా దండ మహం వసామి నగరీద్వారే త్వదీ
యేఽధునా. ౧౭

చౌర్యా ద్భూమిసుతాహృతౌ తు భవతా పూర్వం ప్రయుక్తా
చ యా, మాయా తా మధునా ప్రదర్శయ శరై ర్లోకం
త్విమం మామకైః, కుర్యాం నూన మరాక్షసం ద్రుత
మహం సీతాం సమర్ప్యాఽఽశు మే, నో చే న్మాం శరణం
వ్రజే ద్యది భవా న్యాస్యంతకస్యాఽంతికమ్. ౧౮

౨౫ ఆ వానరులలోఁ గొందఱు పది యేనుగుల బలముగలవారును, మఱి కొందఱంతకంటె నెక్కువ బలముగలవారును. కొందఱు వెయ్యి యేనుగుల బలముగలవారును నయియుండిరి. అట్టి వానరులు కోట్ల కొలది లంకాపురమును నంతటను జుట్టడించి గొప్ప కోలాహలము జేయుచుండిరి. ఆ ధ్వని వినుటతోడనే రక్కసుల గుండెలవిసియు చుండెను.

౨౬ ఇవ్విధముగ దమ సేనలన్నిటిని రామచంద్రమూర్తి వారి స్థానము లందు ప్రవేశపెట్టిన పిమ్మట, ముందు జేయవలసిన కార్యమును విభీషణాదులతో నాలోచించి, రాజధర్మము ననుసరించి, రాయబారముగ రావణునియొద్దకు నెవనినైనఁ బంపుటకు నిశ్చయించి పిదప వీరుడయిన యంగదుని జూచి యిటులఁ బలికెను. అంగదా! కోటదాటి లంకలోఁ బ్రవేశించి రావణుని సమీపించి నిర్భయముగా నేను జెప్పితినని నా మాటలుగా నిట్లు చెప్పుము.

౨౭ ఓరి బుద్ధిహీనుఁడా! రాజ్యభ్రష్టుఁడా! రావణా! నీవు పొగరుచేఁ బూర్వము దేవతలకు, యక్షులకు, మహర్షులు మొదలగు వారికిని ద్రోహము చేసితివి. ఆ పాపఫలములను శీఘ్రముగనే నీవనుభవింప గలవు వారి కపకారము చేసితే. నీవేల వచ్చితివందువా? నీవు నాభార్య నపహరించుటచే నా శోకముచే నిన్ను దండించుటకై నీ లంకాద్వారమున యమునివలె దండము ధరించి వచ్చి నిలిచియున్న వాడను.

౨౮ ఓరీ రావణా! సీతను దొంగతనముగ నపహరించి తీసికొని వచ్చుటలో నే మాయనుపయోగించితివో, ఏ బలమును నమ్మి మోసగించి తెచ్చితివో, ఆ మాయను బలమును నిపుడు నాయందు జూపింపుము. నీవు సీతను దిరిగి నాకు సమర్పించి నన్ను శరణము నీవు పొందుము. అట్లు చేయవేని నా బాణములచే లోకమున రాక్షసులనువారు లేకుండ జేయుదును, ఇంతియేకాక నీవు చచ్చుటకూడ నిశ్చయము.

ధర్మాత్మా తు విభీషణో మమ పున స్సంప్రాప్తవా న్సన్నిధిం
లంకైశ్వర్య మయం హ్యకంటక మతః పూర్వం మయా
ప్రాపితః, శక్యం రాజ్య మధర్మతో నునుభవితుం నూనం
క్షణం నో త్వయా, యుద్ధే త్వం నిహతో మయాఽఽశు
భవితా స్యత్యంతపూతః పునః. ౨౯

పూర్వం రావణ ! నే పరోక్షవిషయే సీతా హృతాఽభూ
త్త్వయా, మూర్ఖాద్వా యదివాఽఽధిపత్యరభసా త్కర్మాతి
నీచం కృతమ్, భూజాతా పరిముచ్యతాం చ భవతా
భూయో మమాద్యాపివా, నోచే త్త్వ త్త్రిశతాన్వితోంతక
పురం యాస్య స్యరం త్వం పునః. ౩౦

ఇత్యుక్త్వ శ్శక్రపౌత్రో గగన మతిలఘురాప్లుత్య గత్వా చ
లంకాం, నిర్భీకో రాక్షసేశాలయ మపిచ గత స్తత్ర
మంత్రైర్వృతం తమ్, పంక్త్యాస్యం వీక్ష్య సర్వం రఘుపతి
కథితం వక్తుకామోఽవద త్తం, దూతోఽహం రాఘవ
స్యాఽంగద ఇతి చ జనా మాం వదంత్యాశరేశ ౩౧

ఏవం త్వాం రఘునందనోఽవద దిదం శ్రావ్యం త్వయా త
ద్వచో, మూర్ఖాద్వాఽప్యథ వాఽధిపత్యరభసా దజ్ఞానతో
వా త్వయా, రేరే రావణ భూమిజా త్వపహృతాఽభూ
న్మే పరోక్షే పురా, విజ్ఞానం సముపేత్య భూమితనయా
త్వద్యాపి వా ముచ్యతామ్. ౩౩

౨౯ (నీవు లంకారాజ్యమెట్లనో దక్కదని చెప్పుచుండెను) ఓరీ ధర్మాత్ముడయిన విభీషణుడు నా సన్నిధికిఁ జేరెను గాన, లంకా రాజ్యము నింతకు పూర్వమే యతనికి వాగ్దత్తము చేసితిని అది నీ కెట్లయిన దక్కదు, ఎలననగా, ధర్మాత్ముడుగా నుండువాడే రాజ్యమును బాలింప నర్హుడు కాని, యధర్మపరుడగు నీ వొక క్షణ మయినను అనుభవింపదగవు. నీవు శరణు పొందనిచో నాచే జంప బడినవాడవై నీవు చేసిన పాపమునకు శిక్ష నిచటనే యనుభ వించుటచేఁ బవిత్రుడవై వీరస్వర్గమునకు బోగలవు.

౩౦ ఓరీరావణా! మూర్ఖత్వముననో రాజుననియెడి పొగరుచేతనో, నా పరోక్షమున నీవు సీత నపహరించితివి. ఆ చేసినపని కడు నీచపుపని. ఇప్పుడైనను సీతను నాకు దిరిగి పంపివేయుము. అట్లు చేయువేని నీ నూరుగురుపుత్రులతో నీవు తొందరలో నాచే జచ్చుట నిక్కము.

౩౧ ఇట్లు రామచంద్రమూర్తి చెప్పగా, అంగదుడు వెంటనే యాకాశ మున కెగిరి లంకలో బ్రవేశించి నిర్భయుడై రావణుని గృహమునకరిగి యచ్చట మంత్రిపరివారముతో గూడియున్న రావణునితో రామ చంద్రమూర్తి చెప్పిన మాటలను చెప్పఁదలచి వానితో నిట్లని యెను. రావణా! నేను రామచంద్ర ప్రభువుయొక్క దూతను. నన్నంగదుడని జనులు చెప్పుదురు.

౩౨ రామచంద్రమూర్తి నీతో నిటులఁ దనమాటలుగాఁ జెప్పుమనియెను, ఆయన చెప్పినదానిని చెప్పెదను వినుము. ఓరీరావణా! నీవు మూర్ఖ త్వముననో, యజ్ఞానముచేతనో, లేక రాక్షస ప్రభువుననియెడి పొగరుచేతనో, నా పరోక్షమున సీత నపహరించితివి- ఇప్పటికైనను, తెలివి తెచ్చుకొని సీతను విడిచి పెట్టుము.

నోచేత్త్వాం సుత బంధుమిత్ర సచివై ర్హంతా స్మ్యహం సత్వరం,
లోకా శ్చాపి హతే త్వయి ధ్రువ మరం ప్రాప్స్యంతి
నిర్భీకతాం, వైదేహీం యది చేన్న దాస్యసి భవే న్నాశో
ధ్రువం తే ధ్రుతమ్, కించైషా నగరీ నిశాచరయుతా
త్వన్మూలతో నశ్యతి. ౩౩

పశ్చా దంగద మేవ మాహ దనుజాధీశో ఽభ్యసూయాన్వితో,
యోఽ దాహ్యత్ర పురా కపిః ప్లవగ! తల్లాంగులతో య
శ్చ మే, బద్ధో ఽభూ త్తనయేన నో భవసి కిం నూనం త్వ
మేవాఽద్య సః, పృష్ట స్త్వేవ మథాఽంగదో దశముఖం
ప్రాహాతిరోషాన్వితః. ౩౪

యస్తు త్వత్పురదీపనం తు కృతవా న్యోఽక్షం సుతం తేఽ
వధీత్, సోఽన్యో హి ధ్రువ మాశరేశ! హనుమన్నామా
నచాఽహం తు సః, ఇత్యుక్తో దశకంధరోఽతికుపిత స్త్వం
కో న్వితి ప్రాహ తం, సోఽప్యేవం నిజగాద రామభవనే
వార్తాహరోఽహం త్వితి. ౩౫

తచ్ఛ్రుత్వా వచనం తతో దశముఖః ప్రాహాఽంగదం తం పునః
పూర్వం త్వత్ర సమాగత స్స హనుమా న్కుత్రస్థితో
బ్రూహి మే, ఇత్యుక్తోఽ వద దాశరేశ్వర మిదం
తారాసుతో నిర్భయం, త్వత్పుత్రేణ నిబద్ధ ఇత్యల
మభూ త్సంతాడ్య నిష్కాసితః. ౩౬

బహుధా వానరై ర్ధ్యానం పరాభూతో మరుత్సుతః
గతవా న్యత్ర కుత్రాఽభూ దస్మాభి ర్జ్ఞాయతే నహి. ౩౭

౩౩ నేను జెప్పినట్లు సీతను విడిచిపెట్టక పోయినచో నిన్ను పుత్రమిత్ర సహితముగా నేను జంపివేయుదును. నీవు చచ్చినయెడల లోకము నిర్భయముగ నుండగలదు. నీవు సీతను విడువని పక్షమున నీకు నాశనము నిజము. ఇంతియే కాక నీమూలకముగా లంకయు, రక్కసులుగూడ నశింపగలరు.

౩౪ పిమ్మట రావణుడు కోపముతో, అంగదుని గూర్చి యిటులఁ బలికెను. ఓ వానరా! పూర్వ మే కోతితోఁ కాల్చబడెనో, మఱియు, ఏ కోతిని నాకుమారుఁడగు నింద్రజిత్తు బంధించెనో, వాడే నీవు కాదుగదా? అని రావణుఁడడుగఁగా, అంగదుడు కోపాతిశయముతో నిట్లు పలికెను.

౩౫ రావణా! నీలంకనంతను దగులబెట్టి నీయక్షకుమారుని జంపి వెళ్ళిన కోతిని నేను కాదు అతఁడు మఱియొకఁడు. అని అంగదుడు పలుకుటచే రావణుడు మిక్కిలి కోపగించి నీ వెవ్వడవని యడుగగా, రామచంద్రమహారాజుగారి యింటిలో నుత్తరములు మోసికొను దూతను నేనని యంగదుడు సమాధానము చెప్పెను.

౩౬-౩౭ ఆ మాటలు విని రావణుఁ డంగదునితోఁ దిరిగి యిటులఁ బలికెను.

అంగదా! పూర్వ మిచ్చటకు వచ్చిన యా వానరు డిపుడెచ్చట నుండెనో నీకు తెలియునా? యని యడుగగ నిర్భయముగ, అంగదు డిటుల జెప్పెను. రావణా! ఆ వానరుడు నీ కొడుకుచే బంధింపబడెనని తెలిసికొని వానరు లందఱు వానిని జావచితుకఁ గొట్టి యనేక విధముల భయపెట్టి వెడలగొట్టిరి. అందువలన హనుమంతుడు వానరులచే నవమానింపబడి యెచ్చటికి వెళ్ళిపోయెనో నాకు తెలియదని యంగదుడు పలికెను. (అనగా నిపుడిచ్చటకు వచ్చినవాడు హనుమంతునికంటె యెక్కువవాడు సుమాయని భావము.)

కించైత చ్ఛృణు రాక్షసేంద్ర నగరీం యో దగ్ధవాం స్తే వనం,
యే నోత్ఖాత మభూ త్తవాఽక్ష మవధీ త్తూర్ణంచ
యో వానరః, సోఽస్మిన్వీరవరేషు రావణ! కదా
సంభావ్యతే నో ధ్రువం, గాత్రే కర్మణి తత్ప్లవంగహత
క శ్చేత్ స్తతః ప్రేష్యతే. ౩౮

కించేదం శృణు యోఽంబుధిం సమతర ద్రక్షాంసి యోఽ
పీపిష, ద్యోఽపశ్య జ్జనకాత్మజాం చ కుశలం యోఽవీవద
త్తత్పతేః, సోఽయం మారుతనందన స్తు న కదా
ప్యాదిశ్యతే సంగరే, కిం త్వస్మాభి రయం ప్రవృత్తికథనా
యేత స్తతః ప్రేష్యతే. ౩౯

రేరే వానర! కో భవా న్కపిపతే స్సూనుః కపీశ స్తు కః,
హాహాహూ త్రేసమయేఽంబుధీన్ప్రతిగతో భూయ స్సమాగా
చ్ఛ యః, తం జానా మ్యధునాఽస్తి కిం సుఖయుత శ్శ్రీరామ
చంద్రప్రభో, రుష్టే స్వ స్తియుత స్తు కోను భవితా భూమ్యా
ముతాఽన్యత్ర వా. ౪౦

పశ్చా దేవ మువాచ వాలితనయం రాత్రించరాధీశ్వర,
స్సాధిక్షేప మహో కిమస్తి సుమహ త్కార్యం తదీయం భువి,
సంకేతా ద్ధతవా న్హి వాలిన మతిప్రాచీనచాపం స్వయం,
శ్శైవం భగ్న మభూ త్పురంతు నిహతా వృద్ధాఽఽసురీ కాచన.
౪౧

౩౮ ఓ రావణా! మఱియు నీ విషయము వినుము. ఏహనుమంతుడు నీ పట్టణము నంతను దగ్ధము చేసెనో, ఎవడు నీ కుమారుని జంపెనో, ఎవడు నీయశోకవనము నంతను బెల్లగించివైచెనో, ఆ వానరుని మా సైన్యములో నెప్పుడు వీరులను గణనచేయునప్పుడు వీరునిగా భావింపము. నిరంతరమాయల్పవానరుని దూతనుగా మాత్రము పంపుచుందుము.

౩౯ మఱియు దీనిని వినుము. రావణా! ఏ వానరుడు శతయోజన విస్తీర్ణమయిన సముద్రమును దాటెనో, ఏ వానరుడు సీతను జూచి భర్తయొక్క కుశలవార్తను నామెకుఁ జెప్పెనో. ఆ వానరుని మే మెప్పుడు యుద్ధముచేయుటకై యాజ్ఞాపింపము. ఇక సేవనగా దూరమేగి వార్తలను జెప్పుటకై యిటు నటు పంపుచుందుము.

౪౦ (ఈ క్రింది తాత్పర్యము ప్రశ్నోత్తర రూపకముగా చదువతగినది) అప్పుడు రావణుఁడిట్లనెను. ఓరీ నీ వెవ్వడవు? అంగదుడిట్లనెను. నేను వానరరాజయిన వాలియొక్క కుమారుడను. రావణుడు - ఆ వాలి యెవడు? అంగదుడు - ఎవడొక దినమున పగటిభాగముననే సప్తసముద్రములకు వెళ్ళి తిరిగి రాగలిగెనో, యతడు - రా - అతడైతే నేనతని నెరుగుదును కాని యతడిపుడు సుఖముగ నుండెనా? అం - రామచంద్రమూర్తికి ఆగ్రహమును గలుగజేసిన వాడెవడు భూమి మీద సుఖముగనుండును?

౪౧ పిమ్మట రావణు డంగదునితో నాక్షేపణపూర్వకముగ నిటుల బలికెను. నీ ప్రభువగు రాముడుచేసిన ఘనకార్యమేమున్నది? నీవు రామునిఁ బొగడెదవు. వాలిని చెట్టుచాటునుండి చంపినందున నందులో గొప్పతనమేమియు లేదుగదా! శివధనువు ముట్టుకొనుట తోడనే తానంతనదియే విరిగెను. ఇందులో మాత్రము రాముని మహిమ యేమున్నది?

సప్తాంభోధి పరీత భూధర మహాశేషం భుజాభూషణం,
రహో లీలార్థ మలంచకారత మహం తస్యాలయం చాచలమ్
యోఽహం హో ధృతవాన్పురా భుజయుగే నైతస్య మే
విక్రమం, నూనం వేద్మ్యహ మేవ కేవల మలం జానాతి
నాఽన్యః కపే. ౪౨

* తచ్ఛ్రుత్వా వచనం తతో దశముఖం ప్రాహాఽంగద
స్సస్మితో, వాలీ త్వాం తు పురా కదాచన తు యః కృ
త్వాఽఽత్మకక్షాంతరే, *సంధ్యా మర్చ్చయతిస్మ సప్తసు
మహాత్స్వబ్ధిష్వరంభ్రామయన్, సోఽప్యే కేనశరేణ యేన
నిహత స్తం మన్యసేఽల్పం త్వహో. ౪౩

---

సంధ్యామర్చ్చయతిస్మేతి.

* వాలినో రావణస్య పరాభవవృత్తాంతోఽ యమ
మన్యత్ర ప్రపంచితః, తత్రాఽనుసంధేయః. తథాహి
"తతోఽతి బల మాసాద్య జిఘాంసు రరిపుంగవం,
సాగరే ధ్యాన మాసీనం పశ్చాద్భాగే శనై ర్యయౌ,
ధృతస్తేనైవ కక్షేణ వాలినా దశకంధరః, భ్రామయిత్వా
చ చతుర స్సముద్రాన్ రావణం హరిః, కిష్కింధాం
స్వాం యయౌ వేగా దగ్రే కృత్వాఽంగద శిశుం,
క్రీడిత్వా తం చుంబనం దాతుం దోర్భ్యాం కట్యాం
న్యవేశయత్, తదా బాహ్వో శ్చంచలత్వా త్కక్షా
త్స పతితో భువి, ప్రేంఖస్యోపరి పుత్రస్య బబం
ధాఽథ చిరం తు తం, ఆసీ త్సోఽంగదమూత్రస్య
ధారాధారాతానన శ్చిరం, స్వయ మేవతతో వాలీ చిర
కాలే గతే సతి, దదా వాజ్ఞాం దశాస్యాయ తేన
సఖ్యం చకార సః" ఇతి.

౪౨ ఓ వానరా! సప్తసముద్రములచే వ్యాప్తమయిన యీ భూమినంత
నే శేషుడు ధరించుచుండెనో, ఆ శేషుని బాహుభూషణముగా
జేసికొనిన శంకరునకు నివాసస్థానమయిన కైలాసపర్వతమును విలా
సముగా రెండు చేతులతో నెత్తిన నాయొక్క భుజపరాక్రమము
సంగతి కేవలము నా కొకనికే తెలియునుగాని రెండవ వానికిఁ
దెలియదు.

౪౩ * ఆ మాటలు విని యంగదుడు నవ్వుచు రావణునితో నిటుల బలిఁ
కెను. రావణా! యే వాలి పూర్వము నిన్నొకప్పుడు తన చంకలో
బెట్టుకొని ముహూర్తమాత్రములో సప్తసముద్రములు తిరిగి సంధ్య
వార్చివచ్చెనో, ఆ వాలి నొక బాణముచే జంపిన రామచంద్ర
మూర్తిని సామాన్య మానవునిగా నీవు తలంచుచుంటివి. ఎంత యాశ్చ
ర్యముగా నున్నది.

---

* వాలి తన చంకలో నిన్ను బెట్టుకొని - వాలివలన రావణు నకుఁ గలిగిన పరాభవ వృత్తాంత ముత్తర యెక్కువగా విస్తరించి చెప్పబడియున్నది. అది యెట్లన - "రావణు డొకప్పుడు శత్రుజయ మునుగోరి బయలు వెడలి సముద్రపు టొడ్డున సంధ్యావందనము చేసికొనుచున్న వాలి వెనుక భాగమున వెళ్ళి కలియబడగా, వాలి రావణుని తన చంకలో నిమిడ్చికొని చతుస్సముద్రములను ద్రిప్పి తన కిష్కింధకురాగా, అంగదుడు తండ్రి కెదురు వచ్చెను. వాలి యంగదుని దన రెండు చేతులతో నెత్తుకొనబోవగా నతని చంకలో నున్న రావణుడు క్రిందపడెను పిమ్మట వాలి తన పుత్రుని యుయ్యాల తొట్టిపైన బుట్టబొమ్మనుగా రావణునిఁ గట్టెను. ఇట్లు కట్టగా అంగదుని మూత్రధారలచే రావణుడు తడుపబడిన ముఖముగల వాడగుచు నిట్లు కొంతకాల ముండెను. ఇట్లు చిరకాలము గడచిన పిదప రావణునకు వెళ్ళిపోవుట కాజ్ఞనిచ్చెను. అంతటితో నప్పటి నుండియు రావణుడు సఖ్యముచేసికొనెను.

కిం చేదం శృణు వారిధిం సమతర ద్వృద్ధూతపవాఽ(శ్రమం
గోష్పాదేన సమం వివేశ చ పురీం లంకాం స్వగేహం యథా
భూజాతాం చ దదర్శ తే వన మనాయుూ రూపం మ ప్యాచర
త్త్రైస్యం చాపి జఘంన తాదృశే మహాం కిం వచ్మి రావం పునః
౭౪

తచ్ఛ్రుత్వా క్రోధ సంయుక్తో వానరం ప్రాహ రావణః,
లోకరావణ నప్యవ్యత్వా త్వాం పూరం కిం భీషయ స్యహో,
ఆస్ఫాలక త్వాం మ నానాస విక్రమం మే ధ్రువం కపే! ౭౫॥

శక్రం మూల్యకరం తథా పాము గృహే సమ్మార్జకం మారుతం,
సూర్యం తు ప్రతిహారిణాం హుతవహం గేహే సదా
పాచకమ్, సోమం ఛత్రధరం తథా వరుణ మప్యాసేచకం
వేశ్మని, ప్రాణావో యత్కృతి స్సురానత్రాతవ మే. గే
నరిం స్తాషి కమ్. ౭౬॥

దేవా శ్చాపి జితా మయా శివగిరి ర్ద్వాభ్యాం కరాభ్యాం పురా
కైలాసోపిసముద్ధృతో భవ దలం యేనా(శ్రమంవానర !
తస్యాగ్రే మమ కత్థసే కము ముథా తౌ రాఘవౌతు క్షణే
హంత్వా సూర్యసుతం విభీషణ మహం త్వత్యామి శేషా
న్కపీన్. ౭౭॥

౪౪ రావణా ! మఱియొక సంగతినిఁ జెప్పెదను వినుము. ఏ రామచంద్ర మూర్తియొక్క దూతయే శతయోజన విస్తీర్ణమయిన సముద్రమును గోష్పాదముతో సమానముగ దాటి, తనయింటిలోఁ బ్రవేశించు నట్లు లంకలోఁ బ్రవేశించి, సీతను సందర్శించి, నీ యశోకవనమును నామరూపములు లేకుండజేసి, నీ సైన్యమును హతముచేసెనో, ఆ రామునిగూర్చి యిక చెప్పవలసిన దేమియున్నది ?

౪౫ ఆమాటలు విని రావణుడు మండిపడి యంగదునితో నిటులఁబలికెను. ఓరీ ! లోకములన్నిటిని గగ్గోలుపెట్టిన నన్నుగూడ నీవు భయపెట్టు చుంటివా ? ఎంత యాశ్చర్యము? నీవు పిల్లవాడవు గాన నా పరాక్ర మము నెఱిగియుండవు, నేను జెప్పెదను వినుము.

౪౬ ఓరీ ! దేవేంద్రుడు ప్రతినిత్యము నాకు పుష్పమాలికలు తీసికొని వచ్చి యిచ్చుచుండును. వాయుదేవుడు నాగృహమునందు కస వూడ్చుచుండును. సూర్యుడు ద్వారపాలకుడుగా నుండును. అగ్ని హోత్రుడు నాయింటిలో వంటవాడుగా నుండెను. చంద్రుడు నాకు గొడుగుపట్టువాడుగా నుండెను. వరుణదేవుడు నీళ్ళు చల్లు వాడుగ నుండెను. ఇట్లే తలుచుగ దేవతలందఱును నాకు దాస్యము చేయుచుండగా, నాపరాక్రమము తెలిసికొనకుండగ, సామాన్య మానవుని నాముందు స్తుతించెద వేమి ?

౪౭ ఇదియుగాక దేవతలను పలుమార్లు జయించితిని కైలాసపర్వత ములు రెండు చేతులతోనే యవలీలగా నెత్తితిని. అట్టిపరాక్రమశాలి నగు నాముందు వ్యర్థముగా రామలక్ష్మణులనుగూర్చి యేమి పొగ డెదవు ? ఆరామలక్ష్మణులను, సుగ్రీవుని, విభీషణుని, హతమార్చి మిగిలిన వారలనందరను భక్షించెదను.

*శ్రుత్వా తద్వచనం ప్రహస్య నితరాం ప్రాహాఽంగద స్తంపున
ర్జానం వేత్సి దశాస్య! కిం బలి మహాం పాతాళలోకం
గతః, +పాశై రేన బలేర్భ్వా నతితరాం సంమార్జితోఽభూ
త్పురా, కించ త్వం +కృతవీర్యనందన సుతక్రీడా మృగోఽభూః
పురా. * ౨౮౪

---

* పాశైరేన బలే రిత్యత్ర పౌరాణికీ కథేయ మత్రాను సంధేయా తథాహి = "ఏకదా జైత్రయాత్రార్థం విసృత్య దశాననః, పశ్య న్నానావిధం స్స్వైరా స్వయా పాతాళ ముత్తమం. తత్ర దృష్ట్వా పురం రమ్యం బలేః కోటిరవి ప్రభం తత్తేజోహత తేజ స్తు పుష్పకం న చచాల నై. తత స్స్వయం యయౌ తూష్ణీ మేకఏవ దశాననః, పురం ప్రవిశ్య తద్ద్వారి సందదర్శచ వామనం, కోటి సూర్య ప్రతీకాశం పీతకౌశేయ వాసనం, చతుర్భుజం సపత్నీకం ద్వారరక్షణ తత్పరం, ప్రాహ తం తు దశగ్రీవం కోఽత్ర రాజాఽస్తి మే వద, ఇత్యుక్త స్తద్దశాస్యేన నోత్తరం ప్రాహ వామనః, తదా తు బధిరం మత్వా స వివేశ బలే ర్గృహం, తత్ర దృష్ట్వా బలిం పత్న్యా వ్యపారి క్రీడన తత్పరం, తస్థౌ తత్ర క్షణం తూష్ణీం బలేర్లక్ష్మీం విలోకయన్ తదా బలేః కరా ద్దూరం క్రీడాపాశో పతద్భువి, త మానేతుం దశాస్యం తం బలి రాజ్ఞాప యత్తదా, రావణోఽపి త మానేతుం యయౌ పాశాంతికం జవాత్, ప్రోద్ధర్తుం [illegible]

౭౮౫. ఆరావణుని మాటలను విని యంగదుడు నవ్వుచు రావణునితో నిటులబలికెను. రావణా! నీ బలపరాక్రమములు నాకుఁ దెలియును. నీ వొకప్పుడు 1♦ బలిచక్రవర్తితో యుద్ధము చేయఁగుతూహలముతో వెళ్ళి యాతని దగ్గర నిల్వబడగా బలిచక్రవర్తి పాచికలాడుచు క్రిందపడిపోయిన పాచికను నిన్ను తెమ్మనగా, ఆ పాచిక నెత్తబోయి దాని క్రిందను వ్రేళ్ళునలిగి నీ వేడ్చుచుండగా, వాని దాసీలు వచ్చి నిన్ను రక్షించిరిగదా! ఇదియునుంగాక నీవు 2✱ కార్తవీర్యార్జునునితో యుద్ధము చేయబోవగా, అతడు నిన్ను బంధించి తనకొడుకునకు క్రీడామృగమునుగా జేసె ననుసంగతిగూడ నాకుఁదెలియును.

---

1♦ దీనివిషయమై యీ పురాణగాథ యిచ్చట ననుసంధేయము. (ఎటన) ఒకప్పుడు రావణుడు దిగ్విజయార్థము బయలుదేరి యనేక వీరులను జయించుచు పాతాళలోకమునకు వెళ్ళెను. కోటిసూర్య ప్రకాశమానమైన యా నగరమునుజూచి యా తేజస్సుచేతవాని పుష్పకము నిస్తేజస్కమై కదలకపోగా, మెల్లగా తాను పాదచారియై బలిచక్రవర్తి యింటికి బోవుచుండెను. ఆయన గృహముయొక్క బహిర్ద్వారమున ద్వారపాలకుడుగా నున్న వామనమూర్తి కోటి సూర్యప్రకాశమానుడై పీతాంబరమును ధరించి చతుర్భుజములు గలిగి సపత్నీకుడై ద్వారమును గాపాడుచుండెను. అట్టి వామనమూర్తిని జూచి రావణుడు "ఇచ్చట రాజెవ్వడని" వామనుని బ్రశ్నించెనుగాని యతడు వీనికి ప్రత్యుత్తర మీయకపోయెను. రావణుడా ద్వారపాలకుని చెవిటివానినిగా భావించి తాను బలిచక్రవర్తి సమీపమున కేగెను. ఆ సమయమున బలిచక్రవర్తి పాచకలాడుచుండెను. అతని చేతిలోని పాచిక యొకటి యరుగుక్రింద పడగా, దానిని తీసికొని మ్మని రావణునితో జెప్పెను రావణుడు పాచికను దీసికొని వచ్చుటకై వెళ్లి తన యొక్క చేతితో నెత్తగా పైకి లేవనందున నిరువది చేతులతో నెట్టకేలకు బలాత్కారముగా పాచిక నెత్తెను కాని యా పాచిక బరువయి దానిక్రింద రావణుని వ్రేళ్ళు పడి నలిగి కేకలు బయటికి తీసికొనలేక యేడ్చుచుండగా బలిచక్రవర్తి రావణుని బలవంతముగ ముందుకు వచ్చి తన కాలితో

పాశం కరేణ న చచాల సః, వింశద్భాహుభిః క్రమేణాऽసౌ యామాన త్పాశ మచాలయత్, తావ దంగుళయ స్తస్య పాశ భారేణ పీడితాః,న స్రక్షము పాశతలా చూర్ణితా రుధిరా ప్లుతాః, తదా చుక్రోశ దీర్ఘం స చిరకాలం దశాననః, తతో విహస్య దాస్యా తం పాశ మానాయ్యాపై బలిః, ధిగ్ధిక్కృత్వా రావణం తం గృహే స్వస్యాऽసయ ద్బహిః, తతో ధృత్వా రాజదూతై స్తదుచ్ఛిష్టైస్తు పోషితః, అశ్వానాం శకృతం నీత్వా ప్రాక్షిప త్ప్రత్యహం బహిః, నర్తనం కారయిత్వా తం కబళించ దదు స్స్త్రియః, ఏకదా ద్వారపం నత్వా ప్రార్థయా మాస తం పునః, తేన స్వపాదలగ్న స్స న్పాదాంగుష్ఠేన క్షేఽర్పితః, తదాऽతిముదితో లంకాం, చిరకాలేన రావణః యయా మనేనిజం జన్మ ద్వితీయ మివ రావణః, ఇతి.

కృతవీర్యనందనసుతక్రీడామృగ ఇత్యత్రాపీయం పౌరాణికీ గాథానుసంధేయా– "ఏకదా రావణో దిగ్విజయే హైహయ పత్తనం, బహిర్గతం నృపం జ్ఞాత్వా సహస్రార్జుననామకం, మధ్యాహ్నే రావణ శ్చక్రే రేవాయాం శివపూజనం, అథ స్తస్మి న్నర్మదాయాం భుజపాశై శ్చసేతువత్, సంభయా మాస నీరౌఘం జలక్రీడాం గతోऽర్జునః, వేష్టితో యుత నారీభి స్తతోऽయం రావణం తదా, ధ్యానస్థం ప్లావయామాస జ్ఞాత్వా తత్కర్మ రావణః, ముక్త్వా ధ్యానాదికం సర్వం యుద్ధం చక్రేర్జునేన సః, తేన బద్ధో దశగ్రీవః కంఠే రంతుం సుతాయ తం, దదౌ దశాననం ప్రీత్యా కాష్ఠసర్పితవాన్ సివత్. కియత్కా లాంతరేణైవ పులస్త్యేన విమోచితః, ఇతి.

నా పాచికను దెప్పించి "ఓరి రావణా పాచిక నెత్తలేని నీవా నా మీదకు యుద్ధమునకు వచ్చితివని, రావణుని చివాట్లు పెట్టి తన దాసీలచేతను రావణుని తన గృహమునుండి బయటకు గెంటించెను. ఇట్లు బయటకు గెంటింపబడిన రావణుడు ప్రాణములతో బయటపడెను. కాని రాజమాతలు వానిని బట్టుకొని వానిచేత సేవ చేయించుకొనుచు ఎంగిలియన్నము పడవేసి పోషించుచు వానిచే గుఱ్ఱపులద్దెను బయట పారవేయించుచుండిరి - మరియు బలిచక్రవర్తి దాసీలు బుట్టబొమ్మవలె నున్న రావణునిచే నృత్యము చేయించుచు మాధవ కబళము వేయుచుండిరి. ఇట్లు కొంతకాలము బలిచక్రవర్తి దాసీలచే బాధింపబడుచు నొకదినమున ద్వారపాలకుడుగ నున్న వామనుని దగ్గరకువచ్చి నమస్కరించి తన్నెట్లయినను లంకకు బంపుమని ప్రార్థింపగా, ఆ వామనమూర్తి కరుణించి రావణుని తన కాలిబొటన వేలుసందున నిరికించి యాకసముమీదికి నెగురవేయగా లంకలో వచ్చి పడెను. అప్పుడు రావణుడు తనది రెండవ జన్మగా భావించెను. 2 * రావణుడు కార్తవీర్యార్జునునకు క్రీడా మృగమయ్యెనను విషయమున నీ క్రింది పురాణగాథ యనుసంధేయము. ఒకప్పుడు రావణుడు గర్వముతో కార్తవీర్యార్జునునితో యుద్ధము చేయుటకై వాని పట్టణమునకై పోయెను. ఆ సమయమున కార్తవీర్యార్జునుడు నర్మదా నదికి జలక్రీడల నిమిత్తము వెళ్లెనని తెలుసుకొని మధ్యాహ్న సమయమైనందున తాను శివపూజ చేసికొనుటకై యా నర్మదానదికే రావణుడు వెళ్ళెను. ఇట్లు వెళ్ళి రావణుడు శివపూజ చేసికొనుచుండగా, అతడున్న ప్రదేశమునకు దిగువభాగములో పదివేలమంది స్త్రీలతో జలక్రీడలాడుచున్న కార్తవీర్యార్జునుడు తన సహస్రబాహువులతో నదిలోని నీరును ఆనకట్టవలె నరికట్టగా నీరు పొంగి ధ్యాననిష్ఠుడై యున్న రావణుని ముంచివేయుగా పిదప రావణుడు ఆ కృత్యమును కార్తవీర్యార్జునునిదిగా తెలిసికొని ధ్యానమును వదలి కార్తవీర్యార్జునునితో యుద్ధము చేయుటకై వెళ్ళెను. కార్తవీర్యార్జునుడు రావణుని బంధించి కుమారునకు క్రీడా మృగమునుగా జేసెను. పిదప పులస్త్యుడా సంగతిని తెలిసికొని కార్తవీర్యార్జునుని వద్దకు వచ్చి వానిని ప్రతిమాలి తన మనుమడైన రావణుని విడిపించి తీసికొని పోయెను.

కించాఽహం తవ పూర్వవృత్త మధికం జానామి తే విక్రమమ్
1* శ్వేతద్వీపగతాంగనా కరయుగై స్సంతాడితాస్యో
భవాన్, ♦ కించేశప్రపదాతిభారవినమత్కైలాసశైలార్దితః
కించాబద్ధ్య 3* పురాఽద్రిణా చిర మభూ ద్రాజ్ఞా భవా
న్పీడితః॥ ౪౬

1* శ్వేతదీపగతాంగనాకరయుగైరితి - తద్ద్వీపగతప్రమదాకరతాడనవృత్తాంతో స్యాత్ర ప్రపంచితోఽయ మత్రానుసంధేయః - తథాహ - ఏకదానాగదం దృష్ట్వా నత్వా సప్రచ్ఛ రావణః, భగవన్బ్రూహి మే తత్త్వం కుత్ర సంతి మహాబలాః, యోద్ధు మిచ్ఛామి బలిభి స్త్వం జానాసి జగత్త్రయం, ధ్యాత్వా ముని శ్చిరం ప్రాహ శ్వేతద్వీపనివాసినః మహాబలా మహాకాయా స్తత్రయాహి మహామతే, విష్ణుపూజారతా యే వై విష్ణునా నిహతా శ్చ యే, తఏవ తత్ర సంజాతా అజేయాశ్చ సురాసురైః, తచ్ఛ్రుత్వా రావణో వేగా న్మంత్రిభిః పుష్పకేణ సః, యోద్ధుకామో యయౌ గర్వా చ్ఛ్వేతద్వీపాంతికం ముదా, తత్ప్రభాహతతేజస్కం పుష్పకం నచచాల తత్ త్యక్త్వా విమానం ప్రయయౌ స్వయమేవ దశాననః,
ప్రవిశన్నేవ తద్ద్వీపం ధృతో హస్తేన యోషితా, గచ్ఛంత్యా కస్యచి ద్దాస్యా పుష్పా ణ్యానయితుం వనాత్, తయా పృష్టః కుతః కోఽసి కేన వా ప్రేషితో భవాన్, ఇత్యుక్త్వా లీలయా

౪౮-౫ * రావణా! మరియు నీ పూర్వవృత్తాంతమును, నీ పరాక్రమమును నేను బాగుగ నెరుగుదును. చెప్పెదను వినుము. ఒకప్పుడు నీవు 1* శ్వేతద్వీపమునందున్న స్త్రీలచే కొట్టబడితివిగదా! ఇదియునుంగాక నీవు 2* కైలాసపర్వతము నెత్తినపుడు దానిపైనున్న శంకరుడా గ్రహించి తన పాదాంగుష్ఠముచే కైలాసమును నదుముగా దాని భారముచే కైలాసము క్రిందపడి నలిగిపోబడితివిగదా? ఇదియుంగాక, పూర్వము 3* అద్రియను వానిచే నీవు కారాగృహమున బంధింపబడితివిగదా! నీ పరాక్రమము నాకు తెలియునని అంగదుడు హేళన చేసెను.

---

1* శ్వేతద్వీపమునందున్న స్త్రీలచే- శ్వేతద్వీపవాసులగు స్త్రీలు రావణుని చెంపదెబ్బలు కొట్టిరను విషయము క్రింది కథవలన విస్తృతముగా తెలియదగినది (అదియెట్లన) ఒకప్పుడు రావణుడు నారదుని జూచి నమస్కరించి మునీంద్రా! నీవు త్రిలోకసంచారివి కాన త్రిలోకములందలి సర్వమును నీవు తెలిసికొనుండువు. నేను యుద్ధము చేయుటకు దగిన బలశాలు రెచ్చటనుండిరో, యథార్థము నాకు చెప్పుమని యడుగగా, నారదుడు కొంచె మాలోచించి రావణునితో నిటుల చెప్పెను. రావణా! నీతో యుద్ధము చేయదగిన మహా బలశాలురు శ్వేతద్వీపమునందుండిరి. వారలెవ్వరనగా పూర్వజన్మములో విష్ణుపూజ చేసినవారలును, విష్ణుమూర్తిచే చంపబడినవారలును, ఉత్తర జన్మలో శ్వేత ద్వీపములో పుట్టి యుండిరి, ఆ ద్వీపవాసులు సురాసురులకు గూడ నజేయులు. నీవచ్చటికి వెళ్ళుమని నారదుడు చెప్పగా, రావణుడు సంతసించి వేగముగా మంత్రులనుగూడ గొందరను తీసికొని పుష్పకవిమానము నెక్కి యుద్ధకాముడై శ్వేత ద్వీపమును సమీపించెను కాని యా ద్వీపప్రభావముచేతను తేజోహీనమై విమానము కదలకపోగా విమానము నచ్చట వదలి స్వయముగ పాదచారియై పట్టణములో ప్రవేశింపబోగా, పూల కోసము పోవుచున్న యొక స్త్రీ వానిని చేతితో బట్టుకొని 'నీ వెవ్వడవు? ఎవడు పంపగా నిచటకు వచ్చుచుంటివి? చెప్పుమని యడుగు

స్త్రీభి ర్హసంతీభి ర్ముహుర్ముహుః, ముఖేషు తాడితో హస్తై ర్భ్రామితోఽధోముఖం చిరం, ధృత్వైకం తత్పదం తాభిః క్షిప్తః కందుకవ న్ముహుః,పరస్పరంతు క్రీడంత్యో రావణేనస్థితా స్తతః, ఏతయా లీలయా క్షిప్తః పదేన దశకంధరః, పపాత పరలంకాయాం క్రౌంచాయా శ్చైచకందరే, కృచ్ఛ్రా త్తాభి ర్విసృష్టో మహాశ్చర్య ముపేయివాన్, చింతయామాస మనసా దుర్మతి స్త్వాశరాధిపః, విష్ణునా మోహతా యుద్ధే తేషా మేతా దృశం బలం, తథాఽత్ర నిహత స్తేన శ్వేతద్వీపం వ్రజా మ్యహం, మయి విష్ణు ర్యథా కుప్యే త్తథా కార్యం కరో మ్యహమ్, ఇతి నిశ్చిత్య మనసా స్వదేహం తా జహార సః, ఇతి.

2 ♦ కైలాసశైలార్ద్రిత ఇతి - అత్రేయం కథాఽనుసంధేయా-ఏకదా దశాననః పుష్పక మారుహ్య స్వర్గాదిలోకేభ్య స్సమాగచ్ఛతిస్మ తద్విమానే క్రమా ద్వినిర్గత్య కైలాసశిఖరోపరి తపస్యతో గిరిశస్యోపరి సతి సమాగతే, విలోక్య నందీ విచార్య మనసా తద్గర్వపరిహారాయ తదీయం విమానం తతో నిశ్చలం చకార-కంచ పశ్చా త్త దపసారయ నేద మగ్రే చలతీతి దశకంధరో నందినా ప్రోచ్యమానోపి తద్వచన మనాదృత్య "కైలాసమేవ దూరే సంస్థాప్య పుష్పక మనేనైవ పథా చాలయామి" ఇత్యుదీర్య తథాకర్తుమనా దోర్భ్యా మచలం సముద్ధృతవాన్, తత శ్శంకరోపి సర్వం విదిత్వా తద్గర్వపరిహారం కర్తుకామో నిజపాదాంగుష్ఠవినమితం త మకరోత్-తస్యాధస్థితో

చుండగా, మఱికొందఱు స్త్రీలుకూడ వచ్చి చుట్టుడించి విలాసముగ రావణుని కాలితో బంతిని తన్నినట్లు తన్నుచు బంతులాటక్రింద బెట్టిరి. మఱికొందరు చెంపదెబ్బలు కొట్టుచుండిరి. కొందరు వాని కాళ్ళు బట్టి గిరగిర త్రిప్పుచు బంతివలె విసరివేయుచుండిరి. ఇట్లు పరస్పరము రావణుని బంతిగా చేసి యాటలాడుచుండ, వారి చేతులలోనుండి తప్పించుకొను విధము లేక విచారపడుచుండ నంతలో నొకస్త్రీ రావణుని తన కాలితో విసరితన్నగా నారావణు డాతన్నుతో తనలంక సమీపములో నున్న పరలంకలో క్రౌంచ యను తన తోబుట్టువుయొక్క పాకీదొడ్డిలో వచ్చిపడెను. దాని కాశ్చర్యపడి రావణుడు తనమనము నందిటులఁ జింతించెను. విష్ణుమూర్తి చేతులలో జచ్చినవారలు కాన శ్వేతదీపవాసులకిట్టి బలము చేకూరెను. కాన నేనుకూడ విష్ణుమూర్తిచేతిలో జచ్చితినేని శ్వేతద్వీపములో బుట్టగలను. కాన నిపుడు చేయవలసిన పని యేమనగా విష్ణుమూర్తికి నామీద నాగ్రహము వచ్చునట్టి పనులను జేయవలయునని తాను మనస్సులో నిశ్చయించుకొని సీతను హరించెనని యొడి పురాణగాధ యిచ్చట ననుసంధేయము.

2 ♦ రావణుడు కైలాసపర్వతముక్రిందపడి పీడింపబడెనను దాని విషయమున క్రిందికథ యనుసంధేయము. ఒకప్పుడు రావణుడు పుష్పకవిమానము నెక్కి స్వర్గాదిలోకములనుండి వచ్చుచుండెను. ఆ విమానము కైలాసపర్వతము మీద తపస్సుచేయుచున్న శంకరుని మీదుగా వచ్చుచుండగా, నందీశ్వరుడు చూచి యా విమానమును కదలకుండజేసెను. ఇంతియేకాక నీ విమానమును దూరముగా దీసికొనిపొమ్మని రావణునితోఁ జెప్పెను. కాని రావణుడా మాటలను లక్ష్యపెట్టక కైలాసపర్వతమును దూరమునందు పెట్టి యీ మార్గముననే పోయెదనని బదులు చెప్పి తాను దిగివచ్చి కైలాసపర్వతమును తన భుజములతో నెత్తగా, శంకరుడా సంగతినిదెలిసికొని రావణుని గర్వపరిహారము చేయదలచి తన కాలి బొటనవ్రేలితో కైలాసము నదిమిపెట్టగా, దాని క్రిందనున్న రావణుడు

రేరే హీన దశాస్య! రాఘవ మపి త్వ మ్మన్యసే వా నరమ్
కిం గంగాపి నదీ శతక్రతుగజోప్యల్పో గజః కిం భవేత్
కిన్నార్య శ్యబలా త్రిలోకవిజయీ వాతాత్మజః కిం కపిః
రేరే మూఢమతే ప్రగల్భవచనైః కాలం వృథా మాకురు॥
౫౦౪

సువేలా ద్దాగతోఽస్మ్యద్య రామ దూతోఽహ మంగదః
భూమిజాం వా శిరో వా తే ముంచతా త్సత్వరం భవాన్.
౫౧౪

రేరే మూఢమతే! కథన్ను భవతా రామో ప్యభూ ద్విస్మృత్తో
యుద్రామస్య శర స్త్వదీయ సహజానాసావనాపంకిలః
పశ్చా త్తత్ర దూషణ త్రిశిరసాం సంక్షాళిత శ్శోణితై
రద్యాఽపి త్వ మహో న ముంచసి భవన్మోఘ్యం వచో
మే శృణు. ౫౨౪

---

దశాననో భృశం నిపీడిత శ్చిరం తత్రైవ స్థితవా నంతతఃపర
మనేకధా స్తుతిభి స్తోషయిత్వా తత స్తేన విమోచిత ఇతి.

* అద్రిణా నిపీడిత ఇతి – అత్రేయం కథాఽనుసంధేయా
పురా కదాచి దద్రినామకం కశ్యపాత్మజ మతిబలినం విజాన
న్దశానన స్తేన యోద్ధు మగాత్, సోపి రావణ మాబధ్య
కారాగృహే పాతయిత్వా బహుధా సంపీడ్య తత స్సజ్జనకేన
పరిసాంత్విత స్తం విముక్తవా నితి.

౫౦॥ ఓరీ రావణా! రామునిగూడ నీవు సామాన్యమానవునిగా దలచుచుంటివా? గంగ కూడ నొక సామాన్య నది వంటిదేనా? దేవేంద్రుని యైరావతము కూడ నొక సామాన్య గజమేనా? ఊర్వశి యను నప్సరస కూడ నొక సామాన్య స్త్రీ వంటిదేనా? సర్వలోకములను జయింపగల హనుమంతుడుకూడ నొక కోతిగా నెన్నబడ వలసిన వాడేనా? ఓరీ మూఢా! ఇక వ్యర్థపు మాటలచేఁ గాలమును గడపకుము.

౫౧॥ నేను సువేల పర్వతమునుండి వచ్చిన రామదూతను. నన్నంగదుఁడందురు. ఇక మాటలతోఁ బ్రయోజనము లేదు సీతనైనను విడిచి పెట్టుము. లేక నీ శిరస్సునైనను విడిచి పెట్టుము. (అనగా సీతను విడువక పోయిన నీ శిరస్సును రామచంద్రమూర్తి ఛేదించు నని భావము.)

మఱియు నిటులఁ బలికెను.

౫౨॥ ఓరీ మూఢా? ఏ రాముని బాణము నీ చెల్లెలి ముక్కు చెవులను దెగనరికి పిదప నీ సోదరులగు ఖరదూషణాదులగు పదునాలుగువేల రక్కసులను క్షణములో దెగటార్చెనో, ఆ రాముని గూడ మరచితివా? ఏమి యాశ్చర్యము! ఇప్పటికిని నీవు మూఢత్వమును వదలి పెట్టకపోతివి. నేను జెప్పెడుమాటలను వినుము.

---

నలిగిపోవుచు కొంతకాలమటులుండి యనేకవిధముల శంకరునిస్తుతించి యెట్టకేలకు వాని వలన విముక్తుడై తన లంకకేగెనని యొకకథ యిచ్చట ననుసంధేయము.

8. అద్రి యను వానిచేఁ బీడింపబడెనను విషయమున నీ క్రింది కథ యనుసంధేయము. పూర్వము నందొకప్పుడు కశ్యపుని కుమారుడైన అద్రి యను నతడు మహాబలశాలి యని రావణుడు విని వానితో యుద్ధము చేయుటకై వెళ్ళెను. అతడు రావణుని గట్టిగా బంధించి కారాగృహములోఁ బడవేసి యుంచగా, రావణుని తండ్రి యయిన విశ్రవసు మొదలగు వారలు అద్రిని బ్రతిమాలి రావణుని విడిపించుకొని తీసికొని వెళ్ళిరను కథ యిచ్చటఁ దెలిసికొనదగినది.

సీతాం ముంచతు సత్వరం రఘుపతి స్సంసేవ్యతాం నైత్వయా లంకారాజ్య మిదం చిరం భవతు తే భోజ్యం తదైవ ధ్రువమ్, రేరే రావణ దుర్దశాం తవ పురీ లంకేయ మా ప్నోతు మా, మద్వాక్యం నశృణోషి చేత్కపిహతః ప్రాప్స్య స్యరం తత్ఫలమ్. ౫౩౪

రే రక్షఃకులఘాంత! మామక మిదం వాక్యం శ్రుతం నోయది ప్రాయ శ్శ్వోగ్ర మిదం త్వదీయ మఖిలం చాపో మహీజా పతేః, నారాచై ర్నిహతం ద్రుతం క్షితితలే త్వాపాతితం సత్వరం, భూతైః కాకశివాదిభిః కబళితం నూనం భవే దాశర! ౫౪౪

రేపంక్త్యాననా! రాఘవో నహి పురా దృష్ట శ్శ్రుతో వా న కిమ్ భూజాతాపహృతౌ విలంబ మవిధాయైవ వాగతః కిం భవాన్ కించాధ్వన్యపి విశ్రమం క్షణ మపి త్వం ప్రాప్య కిం నాగతః స్సంచింత్యాత్మని సర్వ మప్యసుర! తే సంరక్షణీయం కులమ్. ౫౫౪

రేనిశాచరనాథ! త్వం మైథిలం ముంచ సత్వరమ్
కింత్వమారభ్యతే మిథ్యాపౌరుషస్య ప్రగల్భతా. ౫౬౪

పశ్య వానరరాజస్య సేనాం త్వ మ్మహతీ మిమామ్
కిన్నరో ద్గీత దో స్తంభ విక్రమాం సక్రమం పునః ౫౭౪

శ్రుత్వా తద్వచనం నిశాచరపతిః క్రుద్ధో౽బ్రవీ దంగదమ్
రేరే ధిగ్ధి గలం వచోభి రధునా యేనా౽౽హత స్తే పితా

౫౩౪ (నేను జెప్పునదేమనగా) నీవు సీతను వెంటనే విడిచిపెట్టుము. రాముని సేవింపుము. నేను జెప్పినట్లు నీవు చేసితివేని, లంకా రాజ్యము నీకు చిరకాలము మనుభవనీయమైయుండును. ఓరీ రావణా! నీ లంకాపురి దుర్దశపాలు కాకుండ నుండునట్లు చూచుకొనుము. నా మాటలు నీవు వినకపోయినచో, వెంటనే వానరులు నిన్ను హతమార్చెదరు. దుష్కృతిననుభవించెదవు.

౫౪౪ ఓనీరాక్షసకులాంతకా! నా మాటలు నీవు వినకపోతివేని జరుగబోవుదాని జెప్పెదను వినుము. రామబాణముచే నీ తలలు ఛేదింపబడి భూమియందుఁ బడి కాకులు, గ్రద్దలు మొదలగు భూతములచే కబళింపబడుట నిశ్చయము.

౫౫౪-౫౬౪ ఓరీ రావణా! శ్రీరామచంద్రప్రభువును నీ వెప్పుడైనను జూచియుండలేదా? చూడకపోయినను వినియయినను౦డలేదా? సీతను నీవపహరించి తీసికొనివచ్చునపుడు నీవాలస్యము చేయకుండగ నెందులకై పరుగిడివచ్చితివో, యాలోచించుకొనుము ఇదియునుంగాక, సీతనెత్తుకొని వచ్చునపుడు మార్గములోగూడ నొకక్షణమయిన నెచ్చటను, విశ్రమింపకుండగ నెందునకైవచ్చితివి? ఇదంతయు రామచంద్రమూర్తి చూచినచో చంపివేయునని భయముచేత నేగదా! కాననీవిదియంతయు బాగుగ నాలోచించుకొని రాక్షస కులమును గాపాడుకొను ప్రయత్నములో నుండుము. ఓ రాక్షసనాయకా! నామాటవిని సీతను విడిచిపెట్టుము. నీవు వ్యర్థముగ మిథ్యా పౌరుషమును బ్రకటించుట కారంభించెదవు?

౫౭౪-౫౮౪ లంకను జుట్టడించియున్న యీ గొప్పవానరసైన్యము నొకమారు చూడుము ఆ సైన్యము కిన్నరులచే గొనియాడబడిన బహు పరాక్రమముగలదికాని సామాన్యమయినదికాదు. అవలంబించిన ప్రయోజనము లేదు. ఇట్లు చెప్పుచున్న యంగదుని మాటలను విని రావణుడాగ్రహించి యంగదునితో నిట్టుల బలికెను. ఓరీయంగదా?

తస్యాహో పితృహంతకస్య భవతా దాత్యం కి మంగీకృతం
నిర్మానా తవ వీరవృత్తి రభవ త్కిం భాషసే త్వం వృథా
౫౮।

దూత స్స్యా న్నహి భూతలే నృపతినా వధ్యః కదాపీత్యముమ్
ధర్మం సంశ్రితవా నహం కటువచస్సంభాషిణం త్వాం
పునః, నోహా న్మర్యంగద రే కపే! మమ పున ర్ధర్మస్వభావోఽ
ధునా, నూనం త్వా మవతిస్మ గచ్ఛతు భవా న్నిర్గమం
త్యాజ్యో దుర్మతే! ౫౯।

శ్రుత్వా తద్వచనం దశానన మిదం ప్రాహాంగద స్సస్మిత
స్త్వేఽహో ధర్మపరత్వ మాశరపతే సీతాహృతౌ య
త్పునః, నాశ్రా వ్యద్య త దేత దాశరవిభో స్సందృశ్యతే
తే మయా, ధర్మః కిం పరదారకాంక్షణ మహో మూర్ఖ్యం
త్వదీయం ధ్రువమ్ ౬౦।

ఇత్యంగదవచోఘాతపీడితోఽథ దశాననః
భృత్యా న్నాజ్ఞాపయా మాస ముఖేఽయం తాడ్యతా మితి.
౬౧।

తథేతి రాక్షసా స్తేపి నైకే శస్త్రాస్త్రధారిణః ॥
తాడ్యయం ద్రుమపు స్సోపి రాక్షసా న్వీక్ష్య తా న్భృశం,
క్రుద్ధ స్సమ్మర్దయామాస పుచ్ఛేన క్షణమాత్రతః,
కించరాత్రించరేశస్య సంతాడ్య చ ముఖే ప్యలం,
ముహు ర్ముహుః కరాభ్యాంతు కరపాదౌ తదీయకౌ,
పుచ్ఛేన పూర్వ మాబధ్య తత స్తూడ్డీయ వేగవాన్,
ప్రాసాదమస్తక శ్శైలే సువేలే రాఘవం యయౌ.
౬౨-౬౩-౬౪

పౌరుషహీనమగు నీ మాటలను కట్టిపెట్టుము. నీదియు నొక బ్రతుకేనా? నీ తండ్రి నే రాముడు చంపెనో, నీ పితృవును జంపిన యా రామునకు దూతత్వము నెటుల నంగీకరించితివి? నీ జీవితము పౌరుషహీనమయినది. వ్యర్థముగ నేల బ్రేలెదవు?

౫౮౪ ఓరీ వానరా! రాజగువాడు దూతను జంపగూడదను ధర్మము నమసరించి కర్ణకఠోరముగా మాట్లాడుచున్నను నిన్ను జంపకుండగ విడిచిపెట్టితిని. నిశ్చయముగా నా కుండెడి ధర్మస్వభావమే నిన్నిపుడు రక్షించెను. నీవిక నిచ్చట బ్రేలక యిచ్చటనుండి శీఘ్రముగ నడువుము.

౫౯౪ ఆ మాటలు విని యంగదుడు తిరిగి రావణునితో నిటుల నవ్వుచు బలికెను. రావణా! నీ ధర్మబుద్ధి మిక్కిలి యాశ్చర్యకరముగా నుండెను. ఏలనన, సీతను దొంగిలించి తీసికొనివచ్చునపుడు నేను వినవని యీ ధర్మబుద్ధి యిపుడు నా విషయమై నీకు కలుగుట యాశ్చర్యమే. పరదారాపహరణము ధర్మము కాబోలు. నీ మూర్ఖత్వము నిశ్చయముగ మిక్కిలి యాశ్చర్యకరమయినది సుమా?

౬౧౪ ఇట్లంగదుడు పరుషముగ మాట్లాడుచుండ నా వాక్యము లనియెడి శరాఘాతములచే రావణుడు మిక్కిలి పీడింపబడి యంగదుని నచటనుండి చెంపదెబ్బలు కొట్టి గెంటివెయ్యుమని దూతల కాజ్ఞాపించెను.

౬౨-౬౨-౬౩-౬౪ రావణుఁ డట్లాజ్ఞాపింపగా, నటులనే చేయుదు మని రక్కసులు చెప్పుచు వెంటనే శస్త్రధారులయి యంగదునిమీదఁ గలియబడగా, అంగదుడు వారలనుజూచి యాగ్రహించి తనతోకను బెంచి యారక్కసులను జావచితుక కొట్టుటయేగాక రావణుని రెక్కలు గట్టిగ పట్టుకొని యతనిని చెంపదెబ్బలం గూడ గొట్టి వేగముగ పైకెగురుటలో నచటి మేడగూడ పునాదులతో గదలెను. పిమ్మట, అంగదుడు, రామచంద్రమూర్తి యొక్క సమీపమునకు వచ్చుచుండ మేడకూడ నతనిమీద నుండెను గాని యతని కా సంగతియే తెలియదయ్యె. ఇట్లు నెత్తిమీద మేడతో గూడ రామచంద్రమూర్తి సమీపమునకు వచ్చి నమస్కరించెను.

ప్రాసాదమ స్తకం వీక్ష్య తారేయం రాఘవ స్తదా
ప్రాహ తం కిం కృతం బాల ప్రాసాదోఽయం కథం త్వయా
లంకాపురా త్సమానీతః పూర్వమేవ మయా పురీ
లంకేయ మర్పితా చాభూ న్మిత్రా యాస్మై తతో ధ్రువం
మిత్రవ స్త్విద మద్యాహం తదిదం నన్వశోభితే.

౬౫-౬౬

ఇత్యుక్త శ్చకిత స్సోపి సిరీక్ష్యో ర్ధ్వాత్ష మాం స్తు తం
విస్మయం పరమం ప్రాప్య ప్రాహ తం రాఘవం వచః
రామచంద్ర! మయా ప్యేత న్నజ్ఞాతం మ స్తకేన మే
సముత్పాటిత ఏవాఽయ మానీతోఽభూ త్తవాంతికం,
పున ర్నీత్వా పురే తస్మి న్ప్రాసాదం తు యథాస్థితం,
సంస్థాప్య పున రాయామి దేవేత్యుక్త్వా నివృత్య చ,
రాఘవానుజ్ఞయాగత్వా పునర్లంకాం యథాస్థితం,
ప్రాసాదం స్థాపయిత్వా చ తత్క్షణే రాఘవం ప్రతి,
సమాగత్యనమస్కృత్య సర్వం తస్మై న్యవేదయత్.

౬౭-౬౮-౬౯-౭౦-౭౧

యుద్ధకాండే త్రయోదశస్సర్గ స్సమాప్తః

చతుర్దశస్సర్గః,

పశ్చాద్రామవిభుః ప్లవంగమయుతో యోద్ధుంవినిష్క్రాంతవా,
న్రామాజ్ఞావశతోఽథ వానరవరా స్సర్వేపి లంకాపురీమ్,
రుద్ధ్వా దుష్ప్రసహం మహానినద మప్యబ్ధే ర్నినాదంయథా,
కుర్వంతోపిచ పాదపై స్తు దనుజాన్సంతాడయంత స్థితాః. ౧

౬౫-౬౬ ఇట్లు నెత్తిమీదను బెట్టుకొని వచ్చి నమస్కరించి నిల్వబడియున్న యంగదునింజూచి యాశ్చర్యపడి రామచంద్రమూర్తి వానితో నిట్లు పలికెను. ఓరీ! బాలకా! నీ నెత్తిమీద బంగారు మేడ యేమిటి! లంకాపురమునుండి యీ మేడ నెట్లు తీసికొని రాగలిగితివి? లంకారాజ్యమునంతను నే నిదివరకే విభీషణునకిచ్చితినిగదా; అందు వలన మిత్రుని వస్తువగు దీనిని స్పృశింపను.

౬౭-౬౮-౬౯-౭౦-౭౧ అనియిట్లు రామచంద్రమూర్తి పలుకగా, కన్నులు పైకెత్తి తన తలమీద నున్న మేడను జూచి యంగదు డాశ్చర్యపడి చేతులు జోడించి శ్రీరామునితో నిటులం బలికెను. రామచంద్రా! నే నెగిరివచ్చుచున్నప్పుడు వేగమున నీ మేడ కూడ వచ్చిన సంగతియే నాకుం దెలియదు. నా శిరమునకు దాకి పెల్లగిలి వచ్చినది కాబోలు. నేను దీనిని లంకకుం దిరిగి తీసికొనిపోయి పూర్వ మున్నచోటుననే పెట్టి వచ్చెద నని చెప్పి యచటనుండి మేడతోగూడ లంకకు వెళ్లి పూర్వమున్న చోటుననే పెట్టి క్షణములో దిరిగి రాముని సన్నిధికి వచ్చి నమస్కరించి తిరిగి మేడను లంకలోం బెట్టివచ్చిన సంగతిని జెప్పెను.

ఆశ్చర్యరామాయణమున యుద్ధకాండమున
పదుమూడవసర్గము సమాప్తము.

---

## పదునాల్గవసర్గ ప్రారంభము

౧ అనంతరము రామచంద్రమూర్తి సర్వవానర సమేతుడై యుద్ధమునకై బయలుదేరెను. పిదప శ్రీరామచంద్రుని యానతిచే లంకాపురమునంతను ముట్టడించిరి. ఆ వానరుల కోలాహలము రెండవ సముద్ర ధ్వని యనునట్లుండెను. వానరులు పెద్ద పెద్ద చెట్లను బెల్లగించి తీసికొనివచ్చి చెట్లతో ద్వారములయొద్దనున్న రక్కసులను జావ జితుక గొట్టుచుండిరి.

సర్వద్వారతతిం రురోధ చ తత శ్శాఖామృగాణాం గణః
ప్రాకారం ప్రతి దుద్రువుశ్చ హరయః కేచి త్తు సౌధం చ తమ్,
దృష్ట్వా తత్కపిచేష్టితం తు దనుజా స్త్రాసం పరం విస్మయం
ప్రాపుః కేచన సార్ధ్ర మూర్ఛా మధికం యుద్ధోత్సుకా దానవాః ౨

దృష్ట్వా వానరవాహినీం పున రలం భీత్యా తు హాహాకృతిం,
చక్రుః కేచన రాక్షసా స్త్వపసృతాః కేచి త్తత శ్చాఽపరే
గత్వా రావణమందిరం సవినయా స్త్వావేదయ న్రావణం,
రుద్ధాం తై నగరీం ప్లవంగమబలై శ్శ్రీరాఘవాభ్యా మపి. 3

శ్రుత్వా తద్వచనం నిశాచరపతిః క్రుద్ధః ప్లవంగైః పురీం
రుద్ధాం వీక్ష్య చిరం విచింత్య హృదయే ధైర్యం సమాలంబ్య చ,
క్షిప్రం తై ప్రబలాం నిశాచరచమూ మాజ్ఞాపయామాస సా,
నిర్గత్యాఽఽశు దిశో దశాపి నినదై స్సన్నాదయంతీ గతా. ౪

కేచి త్తేషు హయైః పరే వరగజైః కేచి ద్రథై ర్నిర్గతాః
ద్యౌ శ్చాపి పృథివీ తదీయనినదై స్సంపూరితాఽభూ ద్ధ్రువమ్,
రామార్థే నిజజీవితా న్యపి పరం సంత్యక్తు కామా రణే,
వృక్షైరద్రిభి రాశు తేఽపి హరయో మృత్వాంసుభి స్సంస్థితాః. ౫
పూరయంత శ్చ పరిఘా న్నాదయంతో దిశో దశ
ప్రాకారం భేదయంత శ్చ తాడయంతో ఽసునా న్స్థితాః. ౬

౨ పిమ్మట వానర సమూహము లంకాద్వారము లన్నిటిని ముట్టడించిరి. కొందఱు ప్రాకారములను బడగొట్టుటకై పరుగిడుచుండిరి. ఈ వానర చేష్టలనుజూచి రాక్షసు లాశ్చర్యమును భయమునుగూడ బొందిరి. యుద్ధకాములగు కొందఱు రక్కసులు మాత్రము తమకు యుద్ధము చేయు సమయము దొరికినదిగదాయని సంతసించుచుండిరి.

3 రెండవ సముద్రమా యనునట్లంతము లేకుండ నుండిన యా వానర సైన్యమును గొందఱు రక్కసులు చూచినమాత్రముననే భయపడి హాహాకారములు చేయుచుండిరి మఱికొందఱు పాఱిపోవుచుండిరి. మఱికొందఱు రావణుని సమీపించి లంకను వానరులు ముట్టడించిన విషయములను విన్నవించిరి.

౪ ఆరక్కసులిట్లు చెప్పగా రావణుడు మండిపడుచు వారలు తనకు జెప్పినది నిజమో కాదో యని స్వయముగ దెలిసికొనుటకై మేడ పైకి వెళ్ళి లంకను వానరులు ముట్టడించినట్లు చూచి తన హృదయమున గొంతతడవు చింతించి పిదప ధైర్యమువూని ప్రబలులగు రాక్షసులను యుద్ధమునకై యాజ్ఞాపింపగా వారలు వెంటనే బయలుదేరి దశదిశలు ప్రతిధ్వని యిచ్చునట్లు సింహనాదములు చేయుచు యుద్ధమునకై వెళ్ళిరి.

౫-౬ రాక్షసులలో గొందఱు గుఱ్ఱములమీదను మఱి కొందఱు ఏనుగుల మీదను కొందఱు రథములమీదను బయలుదేరిరి. ఆ రక్కసుల సింహనాదములచే భూమ్యంతరిక్షములు పూరింపబడెను. ఆపక్షము నందున్న వానరులు రామునివిషయమై తమ జీవితములను గూడ విడిచిపెట్టుటకు సంసిద్ధులైయుండిరి పిమ్మట వానరులు పెద్ద పెద్ద కొండలతోను చెట్లతోను మట్టితోను కందకమును బూడ్చి వేయుచుండిరి. మఱియు దశదిశలు మ్రోగునట్లు వానరులు కేకలు వేయుచు ప్రాకారమును బడగొట్టుచు, అడ్డమువచ్చిన రక్కసులను జావచితుక గొట్టుచుండిరి.

ఏతస్మి న్సమయే మహాహవ మభూ చ్ఛాఖామృగాణాం తథా
తద్రాత్రించర సంచయస్య కలహో దైవాసురో వై యథా,
శ్రీరామో జయతీ త్యుదీర్య హరయో రాత్రించరాం స్తాం
స్తతో, వృక్షై రద్రి శిలాభిరప్యవిరళం జఘ్ను ర్నఖై ర్ముష్టిభిః.
రాత్రించరాశ్చ నిస్త్రింశై ర్గదాభి శ్చ పరశ్వధైః
ఆత్మనామకథం ముక్త్వా ఘ్నంతిస్మ బహుధా కపీన్, ౮

సుగ్రీవః ప్రఘసేనాపి హనూమా న్జంబుమాలినా
విరూపాక్షేణ సౌమిత్రి ర్మైందో వై వజ్రముష్టినా
తథా ప్రతపనాఖ్యేన నళశ్చాఙ్గదో నయుధ్యత
యుయుధే౽థ సుషేణ శ్చ విద్యున్మాల్యసురేణ చ
సుప్తఘ్నయజ్ఞకోపాద్యాః పంచ రామేణ సంగతాః
అయుధ్యంత మహాకాయా నిశాచరవరా స్తదా. ౯-౧౦-౧౧

గదయా మేఘనాదేన తాడితో వాలినందనః
జఘాన పాదపేనైవ రథం సాశ్వం ససారథిం
నళః ప్రతపనం చా౽౽శు పాతయామాస భూతలే. ౧౨-౧౩

తలేన ప్రమమాథా౽౽శు హనూమా న్జంబుమాలినం
సుప్తఘ్నాదీని రక్షాంసి రామేణ నిహతాని చ
మైందో౽పి ముష్టినైవా౽౽శు వజ్రముష్టిం నిహత్య సః
అశ్వాంశ్చ సారథిం చా౽పి ముష్టినైవ జఘాన సః ౧౪-౧౫

౭ ఈసమయమున వానరులకును రక్కసులకును గొప్ప పోరాటము జరుగుచుండెను. వానరుల, రక్కసుల పోరాటము చూడ పూర్వము దేవదానవుల పోరాటము జ్ఞప్తికి వచ్చుచుండెను. వానరులు రక్కసులను చెట్లతోను పెద్ద బండలతోను, గోళ్లతోను నశింపజేయుచుండిరి.

౮ రక్కసులుకూడ వానరులను తీసిపోకుండ గదలచేతను గండ్ర గొడ్డళ్ళచేతను తమ బిరుదు నామములను జెప్పుచు వానరులను దును మాడుచుండిరి.

౯-౧౦-౧౧ అంగదుడింద్రజిత్తుతోడను, విభీషణుడు మిత్రఘ్నుడను రక్కసునితోడను, సుగ్రీవుడు ప్రఘసుడను రక్కసుతోడను, లక్ష్మణుడు విరూపాక్షుడను రక్కసునితోడను, మైందుడు వజ్రముష్టియనువానితోడను, నళుడు ప్రతపనుడనువానితోడను, యుద్ధము చేయుచుండిరి. సుప్తఘ్నుడు యజ్ఞకోపుడు మొదలగు బలవంతులైన వారలయిదుగురు రామునితో యుద్ధము చేయుచుండిరి.

౧౨-౧౩ ఆద్వంద్వయుద్ధములో నింద్రజిత్తు గదతో వాలిపుత్రుడయిన యంగదునిఁ గొట్టగా, ఆ దెబ్బను సహించుకొని యంగదుడు గొప్ప చెట్టును విసరివేయగా, ఇంద్రజిత్తురథము గుఱ్ఱములు, సారథియు గూడ నొక దెబ్బతో నుగ్గునుగ్గయ్యెను. ఆ సమయముననే నళుడు ప్రతపనుడను రక్కసుని నేలఁగూల్చెను.

౧౪-౧౫ హనుమంతుడు జంబుమాలియు చేయు యుద్ధములో హనుమంతుడు జంబుమాలిని నొక్కవ్రేటున హతముచేసెను. శ్రీరామచంద్రమూర్తితో యుద్ధముచేయు సుప్తఘ్నుడు మొదలగు నైదుగురు రక్కసులు శ్రీరామచంద్రుని బాణాగ్నిలో రూపుమాపిరి. మైందుడు వజ్రముష్టియను రక్కసుని నొక పిడికిలిపోటుతోఁ జంపుటయే కాక పిడికిలిపోట్లతోనే యతని గుఱ్ఱములను రథమును సారథినిగూడ హతము చేసెను.

రథచక్రేణ నీలోపి నికుంభస్య శిర స్తథా,
సారథే రపి చిచ్ఛేద ద్వివిదో వ్యశనిప్రభం,
సాలేన తాడయామాస తేన సోపి మృతింగతః,
సుషేణో గిరిశృంగేణ విద్యున్మాలిన మాహవే,
పాతయామాస మహతా భిన్నహృచ్చ మమార సః ౧౬-౧౭

తదాసీ త్తుములం యుద్ధం కపీనాం రక్షసా మపి
రక్షసాం వానరాణాం చ శరీరేభ్యోఽసృగాపగాః
కేశ శాద్వల భూయిష్ఠా స్స్రవంతిస్మ విశేషతః. ౧౮-౧౯

రక్షసాం చ ప్లవంగానాం యుధ్యతా మ స్తగో రవిః
నిశాయుద్ధ మభూ త్తేషా మన్యోన్యం బద్ధవైరిణాం
ఏతస్మి న్సమయే ఘోరే రాక్షసోఽసీతి వానరా
హరి శ్చాసీతి రక్షాంసి జఘ్ను రన్యోన్య మాహవే. ౨౦-౨౧

క్రమా చ్ఛాఖామృగా ఏవ రాక్షసా న్దశనై స్తతః
వ్యదారయ న్విశేషేణ క్షోభయామాసు రాశరాన్. ౨౨

దృశ్యాదృశ్యతయా స్థితా న్రఘుపతి స్సౌమిత్రి రప్యాహవే
బాణైః పన్నగసన్నిభై ర్వినిహతా న్ద్వౌ చక్రతు శ్చాశరాన్
దుర్ధర్షో యమశత్రు సారణ శుకా స్తద్వజ్రదంష్ట్రి శ్శరై
శ్శ్రీరామేణ హతాః, పరేత్వపసృతా శ్శేషాయుషః
శ్చాఽఽహవే. ౨౩

౧౬-౧౭ నీలుడు తనతోఁ బోరాడుచున్న నికుంభుని శిరస్సును, అతని రథ చక్రముతోనే బద్దలుగొట్టి పిదప దానితోనే యతని సారథిఁ గూడఁ దెగటార్చెను. ద్వివిదుడు తనతోఁ బోరాడుచున్న అశని ప్రభుడను రక్కసుని నొక చెట్టుతోఁగొట్టి తెగటార్చెను. సుషేణుడు తనతో యుద్ధము చేయుచున్న విద్యున్మాలి యను వానిని పర్వత శిఖరముతో నొక దెబ్బగొట్టగా, వాఁ డాదెబ్బతో గుండె బ్రద్దలయి చచ్చెను.

౧౮-౧౯ అప్పుడు రక్కసులకును, వానరులకును సంకుల యుద్ధము జరిగెను, రక్కసులయొక్క వానరులయొక్క శరీరములనుండి రక్తనదులు ప్రవహించుచుండెను. ఆ నదులలో రక్కసుల కేశములే యొక నీటి నాచుగ నుండెను.

౨౦-౨౧ ఇవ్విధముగ వానరులు, రక్కసులు సంకుల సమరము చేయుచుండ సూర్యాస్తమయమయ్యెను, కాని వారలు యుద్ధమాపక రాత్రి భాగమునఁగూడ యుద్ధము చేయుచునే యుండిరి. పరస్పరము బద్ధవైరులయి చేయుచున్న యీ ఘోరనిశాయుద్ధమున నొకరి నొకరు గుర్తించుకొనలేక రక్కసులును భ్రాంతితో వానరులే వానరులను జంపుకొనుచుండిరి. ఇట్లే వానరులును భ్రాంతితో రక్కసులే రక్కసులను జంపుకొనుచుండిరి.

౨౨ ఆరాత్రి యుద్ధములో క్రమముగా వానరులే రక్కసులను పండ్లతోఁ గొరికి, గోళ్ళతో జీరి నెక్కువగ హతమార్చుచుండిరి.

౨౩ రామలక్ష్మణు లిరువురుకూడ యుద్ధములో చీకటిలో కన్పడి కన్పడ కుండ నుండిన రక్కసుల నందఱను తమ వాడి బాణపరంపరలచే హతము చేయుటయేగాక తమతో బోరాడుటకు వచ్చి యుద్ధము చేయుచున్న దుర్ధరుడు, యజ్ఞశత్రువు, శుకసారణులు, వజ్రదంష్ట్రుడను నీ యైదుగురిని శరపరంపరలచే హతమార్పగా మిగిలినవారు తొలగి పారిపోయిరి.

౨౪

తదా వాలిసుత శ్చాఽపి మేఘనాదస్య సారథిం
తురంగా న్నిజఘానాఽఽశు హతాశ్వో రావణి ర్ద్రుతం
సంత్యజ్య తు రథం సద్య స్తోఽన్తర్ధాన మాస్థవాన్
అంగదస్య తు త త్కర్మ తుష్టువు శ్చ సురా అపి. ౧౪-౧౫

ఏవం దశాస్యతనయో వాలిపుత్రేణ నిర్జితః
దారుణం క్రోధ మాపన్న శ్శరవర్షం వవర్ష సః
అదృశ్య ఏవ భూతానా మంతరిక్షే స్థిత స్తతః
రాఘవౌ వానరాం శ్చాఽపి పీడయ న్నిశి తై శ్శరైః.
౧౬-౧౭

శరపాతాంతరే రామః పతితోఽభూ త్తతఃపరం
లక్ష్మణోఽపి పపాతాఽఽశు శరబంధేన మూర్ఛితః
నిశ్చేష్టౌ రాఘవౌ తత్ర శయానౌ హరయోఽఖిలాః
పరివార్య స్థితా (ప్రాప్య విషాదం పరమం తదా. ౧౮-౧౯

పౌనఃపున్యతఏవ మాశరపతే సూన్యుశ్శరై ర్మర్మసు,
ధ్యావేతౌ నృపపుత్రకౌ నిహతవాం స్తద్రాఘవౌ మూర్ఛితౌ
నిశ్చేష్టౌ పరివార్య తస్థు రనఘా శాఖామృగా రాఘవౌ
కుర్వంతః పరిదేవనంతు బహుధా త్యక్త్వారణం చింతయా ౩౦
ఈక్షంతోఽపి దిశోఽంతరిక్షమపి తే వాతాత్మజాతాదయో
మాయాచ్ఛన్న మలం నచైవ దదృశు పజ్క్త్యానవస్యాత్మజమ్
పశ్చా దింద్రజితాఽఽత్మన శ్శరచయై ర్బద్ధౌ రణే రాఘవౌ
దృష్ట్వా హృష్టమనా నిశాచరవరా నుచ్చైస్స్వరేణాహ సః
౩౧

౨౪-౨౫ ఇంద్రజిత్తుతో అంగదుడు యుద్ధముచేసి వాని రథమును, గుఱ్ఱములను, సారథిని హతమార్పగా, ఇంద్రజిత్తు విరథుడైనను తన మాయాప్రభావముచే నంతర్ధానము నొందెను. అంగదుని శౌర్యమును పనిని దేవతలుకూడ కొనియాడిరి.

౨౬-౨౭ ఇవ్విధముగ నింద్రజిత్తు అంగదునిచే యుద్ధములో పరాభవింపబడుటచే విశేషముగ క్రోధముగలవాడై యెవరికిని గన్పడకుండ నంతరిక్షమునం దుండి వానరులమీదను, రామలక్ష్మణులమీదను శరవర్షమును వర్షించుచుండెను. ఆ బాణములచే వారలు కడు బాధలు పడుచుండిరి. నాగాస్త్రమును రామలక్ష్మణులమీదను ప్రయోగించెను.

౨౮-౨౯ ఆ బాణవర్షము తమమీద నెక్కువగ వర్షించుచుండుటచేతను, ఇంద్రజిత్తు నాగాస్త్రి ప్రయోగముచే యుంటచేతను, రామలక్ష్మణులిరువురుకూడ మూర్ఛితులై భూమియందుఁ బడిరి. ఇట్లు భూమియందు నిశ్చేష్టులయిపడియున్న రామలక్ష్మణులను వానరులందఱు చుట్టుకొనియుండిరి, వానరు లందఱు మిక్కిలి విచారముతో నుండిరి.

30 ఇంద్రజిత్తు శరపరంపరలచే నెడతెగకుండ రామలక్ష్మణులను గొట్టుటవలన మూర్ఛితులై, నిశ్చేష్టులయి పడియున్న వారలను (రామలక్ష్మణులను) వానరులందరు చుట్టుకొని యుద్ధమును విడిచి విచారముతో విలపింప దొడగిరి.

31 హనుమంతుడు మొదలగు వానరులు శత్రువగు నింద్రజిత్తు కన్పడు నేమో చంపివేయుదమని నలుదిశలను ఆకసమును బరిశీలించి చూచిరి. కాని రాక్షసమాయచే ప్రచ్ఛన్నుడైయున్న యతడు కన్పడకపోయెను. పిదప ఇంద్రజిత్తు తన నాగపాశములచే వైవిధముగ రామలక్ష్మణులను బంధించినహేతువుచే సంతోషపడుచు దన యనుచరులగు రక్కసులతో నీక్రిందివిధముగ బలికెను.

పతిస్మాచ్ఛరబంధనా త్తు దనుజా నే తా పున రా గ్రతరా
శక్యా మోక్షయితుం సురై రపి పరై ర్వాపి ధ్రువం వానరాన్
యూథేశా నపి సర్వరం మను శర్రై ర్విద్ధ్వా స్వధాతుం యతే
ఇత్యుక్త్వాసశితైశ్శరై స్తు సతరాంవివ్యాధ శాఖామృగాన్॥ 32

నీలం వాలిసుతం గవాక్షశరభౌ వాతాత్మజం ఋక్షపం
మైందం చ ద్వివిదం చ యూథపవరా నన్యాంశ్చ సంతాడ్య సః
లంకాం తు ప్రవివేశ ... మహా పురం సంప్రాప్య తస్మై హతౌ
నాగా స్త్రేణ తు రాఘవా వథ సుతం గ్యాలింగ్య తుష్టా వసః 33

సంహృష్టో దశకంధరో౽థ మహిజాసంరక్షిణీం రాక్షసీ.
మాహయామైవ మువాచ తౌ నృపసుతౌ ద్వౌ రాఘవౌ త్వాహవే,
నూనం మత్సుతమేఘనాదనిహతౌ మత్పుష్పకే భూమిజా,
మారోప్య త్రిజటే త్వ మాశు మహిజాం నీత్వాతు తౌ దర్శయ
34

ఏవం రావణచోదితా ద్రుత ముపాదాయాథ తత్పుష్పకం
సీతాం శోకవనస్థితాం తు మహిజాం మారోప్య తత్పుష్పకే
తస్యై దర్శయితుం సనాచు సవిధం రామస్య తద్రాక్షసీ
దృష్ట్వా తౌ జనకాత్మజాపి పతితౌ భూమ్యాం రురోదాధికమ్.35

పరివార్య తు తౌ తత్ర సంస్థితాం శ్చింతయా౽న్వితాన్
నిరీక్ష్య శోకసంతప్తా మూర్ఛితా౽భూత్ క్షణం తు సా. 36

3౨ ఓరక్కసులారా! సోదరులగు రామలక్ష్మణు లిర్వురును నా శర బంధములచే బద్ధులయిరి. బద్ధులయియున్న వీరి శరబంధమును ఇంద్రాది దేవతలు సయితము వదలించలేరు. ఇది నిక్కము. ఇంక కొందఱు వానరయూథపతు లుండిరి. వారలనుగూడ హతము సేయుటకు ప్రయత్నించుచున్నానని చెప్పి వానర సేనానాయకులను గూడ మిక్కిలి తన బాణ వర్షముచే ముంచివేసెను. (అనగా చావ గొట్టెను)

33 పిదప ఇంద్రజిత్తు నీలుని అంగదుని, గవాక్షుని, శరభుని, హనుమతుని, జాంబవంతుని, మైందద్వివిదులను, ఇతర యూథనాయకులను గూడ తన బాణపరంపరలచేఁ జితుకగొట్టి లంకకుఁ దిరిగివెళ్ళి తండ్రిని సమీపించి వానితో రామలక్ష్మణులు తన నాగాస్త్రముచే బద్ధులయి మూర్ఛిల్లి పడియుండిరను విషయము చెప్పగా, రావణుడు సంతోషపడి కొడుకును కౌగలించుకొని పొగడెను.

3౪ పిమ్మట రావణుడు సంతోషముతో నుండి సీతాదేవినిఁ గాపాడుటకై యశోకవనమునందుంచిన త్రిజట మొదలగు వారిని రప్పించి యిట్లు చెప్పెను. రామలక్ష్మణులిరువురు యుద్ధభూమిలో నా కుమారుడగు నింద్రజిత్తుచేఁ జంపబడిరి. ఓ త్రిజటా! సీతను పుష్పక విమానముమీదను గూర్చుండబెట్టుకొని తీసికొని వెళ్ళి రామలక్ష్మణుల నామెకుఁ జూపింపుము. (అని చెప్పెను.)

3౫ ఇట్లు రావణునిచేఁ బ్రేరేపింపబడిన త్రిజట వెంటనే పుష్పక విమానమును దీసికొనివెళ్ళి యశోకవనమునందున్న సీతాదేవిని దానిమీద నెక్కించుకొని రామలక్ష్మణుల నామెకు జూపించుటకై తీసికొని వెళ్ళగా, నిశ్చేష్టులయి పడియున్న గాయములతో నిండియున్న రామలక్ష్మణులను సీతాదేవి చూచెను

3౬ ఇదియుంగాక నిశ్చేష్టులయి పడియున్న రామలక్ష్మణులను చుట్టుకొని యచట విచారముతో నిండియున్న వానరులనుగూడ జూచి రామలక్ష్మణుల కపాయమేదియో కలిగినదని నిశ్చయించి యనేకవిధములుగ విలపింప దొడగును. (సీత యీక్రిందివిధముగ విలపించెను)

కన్యాలక్షణవి ద్ద్విజైర్మమ పురా య ద్దీర్ఘ సౌభాగ్యకం
ప్రోక్తం తద్వితథం కథ న్ను భవితా కేశా స్సమా స్సంస్థితాః,
స్నిగ్ధా శ్చాంఽగుళయ స్సుమ మమ పున, ర్దంతా స్త్వలం
సంగతాః, జంఘేంఽగ్రోమశివనే కథ మహో దౌర్భాగ్య
మిాదృ గ్భవేత్. 32

లోకే దృష్టిపథం గతో రఘుసుతే స్సంగ్రామభూమౌ పున
ర్జీవ న్నైవ నివర్తతేహి నితరాం కాలోఽపి ప్యాదేయః కిల,
నో శోచామి పతిం త్వహం నచ పున స్సౌమిత్రిముఖ్యానపి,
ప్రాయ స్త జ్జననీం తథా మమ పున శ్శ్వశ్రూం తు శోచా
మ్యహమ్. 33

ఇత్యేవం పరిదేవనం కృతవతీం భూమ్యాత్మజాతాం ప్రతి
ప్రాహైవ త్రిజటా విషాద మధునా మాగా స్త్వ మజ్ఞానసే,
భర్తాఽయం తవ జీవతి ధ్రువ మిదంతత్కారణం వచ్మ్యహం,
యద్యేవం సుభగే విమాన మధునా త్వాం ధారయేన్నైవహి.
34

సంగ్రామే నిహతే విభౌ క్షితిసుతే! యోధా స్తదానీం పున
ర్నష్టే పర్యుత్సుకతాం వ్రజంతి విగతోత్సాహా భవేయు శ్చతే,

౩౭ కన్యాలక్షణములను బాగుగ గుర్తెరిగిన జ్యోతిష్కులు పూర్వము నాకు దీర్ఘ సౌమంగల్య సౌభాగ్యములు చెప్పియుండిరి. అదియంతయూ వ్యర్థమెట్లగును? (త్రికాలజ్ఞులు చెప్పినవి యసత్యము లెట్లయ్యెనని భావము) ఇదియునుం గాక. సాముద్రిక శాస్త్ర ప్రకారము దీర్ఘ సౌమంగల్యము గలవారికుండవలసిన లక్షణములన్నియూ నాకుండెను గదా? కేశముల కొన లెచ్చుతగ్గు లేకుండనుండెను. వ్రేళ్ళు వంకర లేకుండనుండెను. మఱియు కలియకుండ నుండెను. పలువరుసకలసి యెడము లేకుండనుండెను. పిక్కలు రోమరహితములుగా నుండెను. ఇట్టి దీర్ఘ సుమంగళీత్వ లక్షణములుండగా నాకిట్టి దౌర్భాగ్య మెటుల వచ్చెనని విలపించెను.

౩౮ మఱియు సీత యిటుల విలపించెను. (ఏమన) రణరంగములో నా భర్త కంటబడిన శత్రువు తిరిగి బ్రతికి యవతలకుఁ బోలేదుకదా? కాలమహిమయేమి? దీనినిబట్టి విచారించిన కాల మజేయము. నేను నా భర్తను గూర్చికాని, నా మఱఁదియగు లక్ష్మణుని గూర్చికాని, యంతగ దుఃఖపడుటలేదు. ఇక నేమన నా భర్తగారికి తల్లియును, నాకత్తయునగు పెద్దదైన కౌసల్య పుత్రదుఃఖము నెట్లు సహింప గలదా? యని యామెను గూర్చి విశేషించి దుఃఖపడుచుంటినని విలపించుచుండెను.

౩౯ ఇట్లు విలపించుచున్న సీతాదేవిని నోదార్చుచు త్రిజట యామెతో నిటులఁ బలికెను. తల్లీ! నీవు దుఃఖింపకుము. నీ భర్త జీవించియే యుండెను. ఇది నిక్కము దానికిఁ గారణమును జెప్పెదను వినుము. నిజముగా నీభర్త కపాయము సంభవించేయెడల దౌర్భాగ్యురాల వగు నిన్ను పుష్పక విమానము మోయదు. (అనగా, ఇట్టి నీ వెక్కిన పక్షమున విమానము కదల నేరదని భావము.)

౪౦ ఓదేవీ! నిజముగా తమ ప్రభువున కపాయము వాటిల్లినచో యోధులగువారలు సంతసముగ నుండరు. వారలుత్సాహరహితులై యుందురు. ఇచ్చట వానరసైన్యము తొందరపాటుతో నుండుటలేదు.

ఉద్విగ్నా న భవ త్వసౌ కపిచమూ స్తస్మాదిమౌ నో హతౌ,
పశ్య త్వం పరిశీలనేన న మయాఽప్యుక్తం తవాఽగ్రేఽనృతమ్. ౪౦

కించేదం శృణు దేవి తౌ తు మహతీ లక్ష్మీ శ్శ్రితై వాఽధునా
నూనం దేవి గతాయుషాం తు భవితా వైరూప్య మాస్యేష్వలమ్
శోకం సంత్యజ వచ్మి హేతు మపరం నో రాఘవౌ సంగరే,
శక్యౌ జేతు ముభా వపి త్రినయన బ్రహ్మాదిభి ర్వా సురైః ౪౧

శ్రుత్వా త ద్వచనం ముదం హ్యుపగతా సీతా తతోఽభూ
త్పురీం, లంకాం పుష్పక మప్యరం త్రిజటయా ప్రావేశితం వై పునః
తస్మా త్సాఽప్యవరుహ్య త త్త్రిజటయా పశ్చా దశోకే వనే,
మందం రాత్రిచరీభి రేవ మహిజా ప్రావేశితాభూ త్క్రమాత్ ౪౨

ఆశ్చర్య రామాయణే యుద్ధకాండే
చతుర్దశ స్సర్గ స్సమాప్తః

---

## పంచదశ స్సర్గ

పశ్చా త్తచ్ఛరబంధ బద్ధవిగతజ్ఞానౌ తు తౌ రాఘవౌ
శ్రుత్వా పంక్తిముఖానుజ శ్శుచ మవాప్యాగత్య తత్సన్నిధిమ్
దృష్ట్వా తచ్ఛరతల్పగౌ నృపసుతౌ వేవం శుశోచాఽధికం
యౌ ద్వా వాశ్రితవా నహం త్వగతిక స్తౌ ద్వౌ ప్రసుప్తౌ వితి. ౧

అందువలనగూడ రామలక్ష్మణులు హతులు కాలేదు. నీవు కూడ పరిశీలించి చూడుము. నేనెప్పుడు నీముందు అనృతమును జెప్పి యుండలేదు.

౪౧ దేవీ ! మఱియొక సంగతినిఁ జెప్పెదను వినుము. రామలక్ష్మణుల ముఖశోభ యేమాత్రముకూడ తగ్గలేదు. నిజముగ మృతినొందిన వారల ముఖమునందు వికార రూపమేర్పడును అందువలన నీవు శోకింపకుము. నీకు మఱియొక కారణముకూడ జెప్పెదను, రామ లక్ష్మణులను యుద్ధములో చతుర్ముఖునులుగల బ్రహ్మకాని మూడు నేత్రములుగల శంకరుడు కాని జయింపలేరు. ఇతరుల సంగతి యేమి చెప్పవలయును ?

౪౨ ఆ త్రిజట చెప్పిన మాటలను సీత విని యామె మనశ్శాంతి సంతోష ములు కలదికాగా, త్రిజట తిరిగి యామెను విమానముతో నశోక వనమునకుఁ దీసికొని వెళ్ళెను. సీత విమానమునుండి దిగుటతోడనే రాక్షసస్త్రీలు వచ్చి యామెను దీసికొని వెళ్ళి యథాస్థానమున ప్రవేశపెట్టిరి.

ఆశ్చర్యరామాయణమున యుద్ధకాండమున

పదునాల్గవ సర్గము సమాప్తము.

---

## పదునైదవ సర్గ ప్రారంభము

౧ పిదప రామలక్ష్మణులు శరబంధముచే బద్ధులై తెలివిలేకుండ పడియుండి రని విభీషణుడు విని మిక్కిలి దుఃఖపడుచు వారల సమీపమునకు వచ్చి శరతల్పమునందున్న వారలను చూచి యీక్రింది విధముగ విల పించెను. ఏమన) ఏ రామలక్ష్మణులను దిక్కులేని నేనాశ్రయించి తినో, ఆ రామలక్ష్మణులకే యిట్టి యాపదసంభవించెను గదా యని (విలపించెను.)

కించైవం విలలాప సోఽహా మధునా జీవన్నపి క్ష్మాతలే
నూనం స్యాంమృతకల్ప ఏవ రిపు రద్యాఽభాత్సకామో ధ్రువమ్
ఇత్యేవం విలపంత మాశరపతే రాశ్యాస్య వై సోదరం
సుగ్రీవోఽథ సుషేణ మాహ వచనం కర్తవ్య మాలోచ్య సః. ౨

హత్వా రావణ మాహవే సహసుతం శక్రో యథా స్వశ్రియం
భూజాంత్రాన్ముహా సూనాగోము మధునా తో రాఘవో మత్పురీమ్
నీత్వా తత్ర సుషేణ! రక్షతు భవా నేవం తదావేదితః
ప్రాహైవం శ్వశురోఽపి తస్య మనసా సంచింత్య సూర్యాత్మజమ్ ౩

పురా దైవాసురే యుద్ధే నిహతా న్శస్త్రై స్సురాన్
నిరీక్ష్యాఽఽంగిరస పశ్చా దోషధీభి శ్చికిత్సితాన్
అకరో దోషధీ రాశు తా ఏవాఽఽనయితుం భవాన్
ద్రోణాచలస్థితా స్సర్వాః ప్రేషయే ద్వానరా న్విభో
తాసు సంజీవినీ ముఖ్యా విశల్యాకరణీ తథా
తే ద్వేచాఽఽనయితుం క్షిప్రం ప్రేషయేతి జగాద సః. ౮-౫-౬

ఏతస్మి న్సమయే మహీధరచయం సంచాలయ న్సాగరే
సర్వస్య జ్జలవాహ్ని మంబరగతం క్షిప్యం స్తదా మేదినీం
స్పృశన్గాం శ్చాపిన కంపయ న్జగతే ద్వేగేన శౌర్యక్షత్రి స్తదా
తత్రాగత్యతు రాఘవో నిజకర ద్వంద్వేన సంస్పృష్టవాన్. ౪

౨ మఱియు విభీషణుడిటుల విలపించెను. (ఎట్టన నేనిక భూమిమీద జీవించియున్నను నిశ్చయముగ మృతప్రాయుడనే. నాశత్రువగు రావణుడు నిజముగ చరితార్థుడయ్యెను. అని యిట్లు విలపించుచున్న విభీషణుని సుగ్రీవుడోదార్చి పిదప తన మామయైన సుషేణునితో నిటులఁ జెప్పెను.

3 సుషేణా! నీవు రామలక్ష్మణులను వానగరమునకు (కిష్కింధకుఁ) దీసికొని పోయి యచటఁ గాపాడుచుండుము. నేను రావణునితో యుద్ధముచేసి వాని నెట్లయినను జంపి సీతాదేవినిఁ దీసికొని వచ్చెదను. పూర్వము దేవేంద్రుడు రాక్షసులచే నపహరింపబడిన స్వర్గలక్ష్మినిఁ దిరిగి తీసికొని వచ్చినటులనే నేను దెచ్చెదను. సందియము లేదని చెప్పుచున్న సుగ్రీవునితో సుషేణుడు చక్కగ నాలోచించి యిటులఁ బలికెను.

౪-౫-౬ వానరరాజా! పూర్వము దైవాసుర యుద్ధము జరిగినపుడు రాక్షసులు దేవతలను హతముచేయగా, బృహస్పతి, (దేవగురువు) విచారించి సంజీవిని మొదలగు నోషధులచే దేవతలను చికిత్సచేసి జీవింపజేసెను. ఆయోషధులు ద్రోణగిరియందున్నవి. వానినిఁ తీసికొని వచ్చుటకు వెంటనే తగిన వానరులను నీవు పంపవలసినది. (తుదకు ఓషధులన్నిటిలోను సంజీవిని, విశల్యకరణి, అనునోషధులు రెండును ముఖ్యములు. ఆరెండిటిని వానరులను బంపి తెప్పింపుమని, సుషేణుడు చెప్పెను.

౭ ఈ సమయమున తన గమనవేగముచే, పర్వతములు సైతము నూగులాడునట్లు చేయుచు సముద్రజలము నల్లకల్లోలము చేయుచు మేఘములను చెల్లాచెదరు చేయుచు భూమిని కంపింపఁజేయుచు నిట్టి మహావేగముతో గరుత్మంతుడచటకు వచ్చి రామలక్ష్మణులను తన రెక్కలతోఁ దాకెను.

పశ్చాత్తే శరఘాతపన్నగవరా శ్రీరాఘవాంగస్థితా
స్తార్క్ష్యాగమనం నిరీక్ష్య చకితా దూరం తదా దుద్రువుః
మైస్తౌ రాఘవలక్ష్మణౌ తు నితరాం బద్ధౌ వభూతాం పురా
కించ స్పర్శతఏవ తస్య నితరాం స్నిగ్ధౌ వభూతాం చ తౌ. ౮

వైనతేయ కరస్పర్శా ద్యథా సుప్తోత్థితౌ తథా
రాఘవా వుత్థితౌ సద్య స్తయో స్తేజోఽప్యభూన్మహాత్
వీర్యం బలం తథోత్సాహో బుద్ధి శ్చ ద్విగుణం త్వభూత్. ౯౫

పశ్చాదేవ మువాచ తార్క్ష్య మనఘు శ్రీరామచంద్రోపి తమ్
శ్రీమ న్నష్ట దశకంధరాత్మజభవం కష్టం ప్రసాదా త్తవ
దూరీభూతమభూ ద్యథా దశరథంతాతం తు నే త్వాం పున
ర్దృష్ట్వా మే హృదయం ప్రసీదతి మహా న్దివ్యాకృతిః కోభవాన్
౧౦౫

శ్రుత్వాత ద్వచనం ప్రహృష్టహృదయ స్తార్క్ష్యోఽబ్రవీద్రాఘవం
శ్రుత్వా వాం శరబంధ మాశు యువయో స్సాహ్యాంవిధాతుం
త్వహామ్, సంప్రాప్తోఽస్మి యువాం శ్రితా నహిశరా మాయా
బలా ద్రావణే, స్సర్పాఏవ శరా బభూవు రవరే నో మోచ
యిష్యం త్యమూన్. ౧౧౫

ఏతస్మా చ్ఛరబంధనా త్ప్రన రిహా మన్మోచితౌ వై యువామ్
క ర్తవ్యో నహి నిత్య మాహవతలే నూనం ప్రమాద స్త్వయా.

౮ ఆ గరుత్మంతుని రాకను జూచియే భయపడి రామలక్ష్మణుల శరీరములయందు బాణములుగా గుచ్చుకొని యున్న నాగాస్త్రములు (సర్పములు) పారిపోయెను. ఏ నాగాస్త్రములచే రామలక్ష్మణులు బద్ధులైయుండిరో (ఆ నాగాస్త్రములు పారిపోయెను) ఇంతియేకాక గరుత్మంతుడు రామలక్ష్మణుల శరీరములను స్పృశించుటచేతను వారి శరీరములు పూర్వముకంటె శోభిల్లుచున్నవై వ్రణరహితములయి యొప్పుచుండెను.

౯౹౧౦ గరుత్మంతుని హస్తస్పర్శచేతను రామలక్ష్మణులు నిద్రనుండి లేచిన వారలవలె దిగ్గున లేచిరి. గరుత్మంతుని స్పర్శచేతను వారలకు తేజస్సు, బలము, వీర్యము, ఉత్సాహము, బుద్ధి మొదలగునవి ద్విగుణములయ్యెను.

౧౦౹ పిమ్మట శ్రీరామచంద్రమూర్తి గరుత్మంతునితో నిటుల బలికెను. శ్రీమంతుండా! రావణుని వలన మాకు కలిగిన కష్టము నీ యనుగ్రహము వలన నివృత్తియాయెను. ఓ మహాత్మా! నిన్ను జూడ మా తండ్రియు దశరథుని జూచినటులనే నా హృదయము సంతోషించుచుండెను. దివ్యపురుషుడవగు నీ వెవరవో నాకు జెప్పవలయును. (అని రామచంద్రమూర్తి యడిగెను.)

౧౧౹ ఆ మాటలు విని గరుత్మంతుడు సంతోషించినవాడై రామచంద్రమూర్తితో నిటుల బలికెను. రామచంద్రప్రభూ! మీరలు నాగాస్త్రబద్ధులైయున్న సంగతినివిని మీకు సహాయము చేయుటకై నేనిచ్చటకు వచ్చితిని. మీ శరీరముల నాశయించినవి కేవలబాణములు కావు. అవి సర్పములే ఇంద్రజిత్తుయొక్క మాయాప్రభావముచేతను బాణరూపములతో మీ శరీరము నాశ్రయించినవి. వీనిని నాకంటె నితరులెవ్వరును వదలింపలేరు.

౧౨౹ రామచంద్రా! యీ శరబంధమునుండి పైకారణమువలన నేను స్వయముగ వచ్చి మిమ్ములను నాగాస్త్రబంధనమునుండి విడిపించితిని. నీవెప్పుడును రాక్షసుల విషయమై పరాకుగా నుండకుము. ఎందు

సర్వే రాత్రిచరాః స్వభావకుటిలా మాయావినస్తే త్వయా
విశ్వాస్యా నహి రావణం ససుతం హత్వా ప్రియాం ప్రాప్స్యసి
౧౨॥

దాసభూతే మయి విభో ప్రసాదం కర్తుమర్హసి
అనేన దాస్యవిధినా కృతార్థోఽహం న సంశయః
* మదభీష్టం చ భవతా పూరితం పౌర్వికం స్మర
ఇతః పరం నసంభాష్యం మయాఽత్ర రఘునందన
అనుజ్ఞాం దేహి మే స్వామి న్నమయే మా మనుస్మర
ఇత్యుక్త్వా రాఘవౌ నత్వా ప్రవిశ్య గగనే యయౌ.
౧౩-౧౪-౧౫

---

* ♦ మదభీష్టమితి – తదభీష్ట మనేన కిం పూరిత మిత్యాశంకా సముదేతి–అత్రేదం సమాధేయమ్–కించ, అత్రేంద్రజితా నాగాస్త్రప్రయోగే కృతే రామలక్ష్మణా వజ్ఞాతగారుడాస్త్రౌ వా, ఆహోస్విద్విస్మృతతదస్త్రౌ వా, నాద్యః తస్యకౌశిక ప్రసాదలబ్ధనిఖిలశస్త్రాస్త్రత్వాత్, నద్వితీయః, సకలశస్త్రాస్త్ర స్మృతిమతో రామస్య తస్యైతస్య విస్మృతే రసంభవాత్, కథ మనాహూతోఽయ మాగత ఇత్యాశంకాయా అపి అగ్రే వక్ష్యమాణ మేవ సమాధేయం–అత్రేదం రహస్యం – పురాఽవతితీర్షౌ రామాదిత్వేన మహావిష్ణౌ వైనతేయ మంతరా శంఖ చక్రాదీ నప్యాత్మనా సహాఽవతారాయాఽఽజ్ఞాపయతి సతి "త్వో మమాఽప్యాగంతు మాజ్ఞాం దేహీతి" వైనతేయేనాభి

వలన ననగా, రాక్షసులు కుటిలస్వభావముగలవారును మాయికులు గాన వారి నెప్పుడును నమ్మియుండగూడదు నేను దివ్యదృష్టితో జెప్పుచున్నాను. నీవు తప్పక రావణుని పుత్రమిత్ర పరివారయుతు నిగాఁ జంపి సీతను దిరిగి పొందగలవు.

౧౩-౧౪-౧౫ ♦ రామచంద్రప్రభూ! నేను నీ దాసుడను. నాయందు నీ వనుగ్రహమును జూపింపుము. ఈ విధముగా నేను నీకు దాస్యము చేయుటచేఁ గృతార్థుడనైతిని సందియములేదు. నా కుండెడి కోరికను నీవీ విధముగఁ బూర్తిచేసినందుకుఁ గృతజ్ఞుడను. పూర్వపు సంగతిని జ్ఞప్తికి తెచ్చుకొనుము. ఇంతకంటె నెక్కువగ నేను మాట్లాడుటకు వీలులేదు. నాకిక ననుజ్ఞనిమ్ము. అవసరము కలిగినపుడు నన్ను స్మరింపుము, అని చెప్పి రామలక్ష్మణులకు నమస్కరించి యంతరిక్షమునుఁ బ్రవేశించివెళ్లెను.

---

♦ నా కోరికను బూర్తిచేసితివి - ఇచ్చట నొక యాశంక కలుగును (ఏమన) గరుత్మంతునకుండిన కోరిక యేమి? రామచంద్రమూర్తి యా కోరిక నెటులఁ బూర్తిచేసెను? అను విషయమున క్రిందిగాథ యనుసంధేయము - ఇచ్చట నింద్రజిత్తు రామలక్ష్మణులను నాగాస్త్రముచే బంధించినపుడు రామలక్ష్మణులు గారుడాస్త్రమును బ్రయోగించినచో వెంటనే నాగాస్త్రబంధము తొలగిపోవును. కదా! యటుల చేయకపోయిన కారణమేమి? 1 రాయలక్ష్మణులకు గారుడాస్త్ర విషయము తెలియదా? 2 లేక, మొదట గారుడాస్త్ర విషయము తెలిసినను, పిదప మరచిరా? అను ప్రశ్న కలుగును. కాని రెండు ప్రశ్నలు సమంజసములు కావు విశ్వామిత్రుని యనుగ్రహముచే రామలక్ష్మణులు సకల దివ్యాస్త్రప్రయోగోప సంహారములను దెలిసికొనినవారలుగాన గారుడాస్త్ర ప్రయోగము విషయము తెలియదని చెప్పుట సరికాదు. సమస్త శస్త్రాస్త్రముల స్మృతిగల రామలక్ష్మణులు గారుడాస్త్ర విషయము మరచినారనుట యంతకంటె సరికాదు. కాన రామచంద్రమూర్తి గరుడాస్త్రమునేల ప్రయోగింపలేదనియు ఆహ్వానము లేకుండగ గరుత్మంతుడెట్లు వచ్చెనను నా శంకకు సమా

దృష్ట్వా తౌ విరుజౌ ప్రహృష్టమనస శ్శాఖామృగా యూథపాః
లాంగూలా న్యధువ శ్చ కేచన ప రే నేదు శ్చ భేరీః ప రే
ఆజఘ్ను శ్చ మహీరుహా న్సుమహత స్తూ త్పాట్య చాఽఽ-
స్ఫోట్య తే, లంకాద్వార ముపాయయుః పున రలం
యుద్ధోత్సుకా స్తేఽఖిలాః, ౧౬

వానరాణాం మహానాదా న్నిశమ్య సదసి స్థితః
దశాననోఽబ్రవీ త్తత్ర సంస్థితా న్సచివా న్పునః
నినాదోఽయం సుమాఽఽశంకాం రాక్షసా జనయ త్యలమ్
రామలక్ష్మణయో ర్నాగబద్ధయో ర్వనచారిణామ్
దుఃఖకాలే కథం హర్ష స్సంభూతో జ్ఞాయతాం ద్రుతమ్
ఇత్యుక్తా స్తే ద్రుతం గత్వా ప్రాకార మధిరుహ్య తే
విముక్తౌ రాఘవౌ వీక్ష్య సమేత్యాఽఽహు ర్దశాననమ్.
౧౭-౧౮-౧౯

---

సంప్రార్థిత స్తేనైవం భగవా నువాచ మమైతావతైవాలమితి, తతో నహి క్షణ మపి వినా త్వయాఽత్ర వస్తు మిచ్ఛామీతి పున రుక్తో నిర్బంధిత శ్చ భగవా నేవ మనుజగ్రాహ, యదా శత్రుభి ర్నాగాస్త్రం ప్రయుజ్యతే తదా గారుడాస్త్ర మహం నప్రయోక్ష్యే, త్వమేవతదవసర మవేక్ష్య మదంతికమాగత్య నాగాస్త్ర మవధూయ తద్రూపేణ సేవాం మమ విధాతు మర్హసీతి, తదాజ్ఞప్తత్వాద్వైనతేయ స్స్వయ మేవ సాక్షా

౧౬ రామలక్ష్మణులు తిరిగి యారోగ్యవంతులగుటవలన వానరులు వానర సేనాధిపతులుగూడ మిక్కిలి సంతోషించినవారలైరి. వారిలో గొందఱు సంతసముతో తమ తోకల నాడించు వారలును, మఱి కొందఱు సింహనాదములను జేయువారలును, మఱికొందరు భేరీలను ప్రయోగించువారలయి యుండిరి. కొందఱు పెద్ద పెద్ద చెట్లను బెల్లగించి భుజములం జఱచుకొనుచు యుద్ధాభిలాషులయి లంకా ద్వారమునకుఁ దిరిగి వచ్చిరి.

౧౭-౧౮-౧౯ వానరుల కోలాహలమును సభలోనున్న రావణుడు విని యచ్చట నున్న మంత్రులతో నిటులఁబలికెను ఈ వానర కోలాహలము నాకు సంశయమును గలుగఁజేయుచున్నది. (ఏలనన) రామలక్ష్మణులు నాగపాశబద్ధులైయుండ వానరులందఱును దుఃఖముతో నుండవలసిన ఈ సమయమున వీరలకు సంతోషమెట్లు కలిగెనో, మీరలు కారణము దెలిసికొనుడని చెప్పగా వారలు ప్రాకారము నెక్కి రామలక్ష్మణులు నాగపాశ విముక్తులయినట్లుచూచి తిరిగి రావణుని యొద్దకువచ్చి రామలక్ష్మణులు నాగపాశ విముక్తులయినట్లు వారలు చెప్పిరి.

---

భావముగ నీ క్రింది రహస్య విషయ మిచటఁ దెలిసికొనదగినది. పూర్వము శ్రీ మహావిష్ణువు భూమియందవతరింపదలచి శంఖచక్రములకు, తన పాన్పయిన శేషునకు, భూమియందు అవతరించవలసినదిగాఁ జెప్పుచుండగా, వాహనమయిన గరుత్మంతుడు "నేను భూమియందవతరించి నీ సేవచేసుకొను నవకాశము గలుగఁజేయుమని నిన్నువిడిచి క్షణమైన నుండలేనని" భగవంతుని ప్రార్థింపగా, భగవంతుడిటుల ననుగ్రహించెను. (ఏమన) శత్రువులవలన నాగాస్త్ర ప్రయోగము జరిగినప్పుడు నేను దానికిఁ బ్రతిక్రియ గారుడాస్త్రమును ప్రయోగింపను, నీవే యా సమయమును గనిపెట్టి నాయొద్దకు వచ్చి నాగాస్త్రబంధమును దొలగింపజేసి యవ్విధముగ నా సేవను జేయుము. అని యాజ్ఞాపింపబడినందున గరుత్మంతుడే సాక్షాత్తుగ నిచటకు

తతో విషణ్ణో దశకంధరోఽథ ధూమ్రాక్ష మాహాఽమిత విక్రమం తమ్, బలేన యుక్తో మహతా వధాయ రామస్య నిర్యాహి రణాయ శీఘ్రమ్. ౨౦

దశాననవచ శ్శ్రుత్వా నమస్కృత్య చ రావణం
బలేన మహతా యుక్తో రథారూఢోఽయయౌ చ సః. ౨౧

స్వసైన్యం వీక్ష్య ధూమ్రాక్షం వానరా యుద్ధకాంక్షిణః
వినేదుః పాదపై ర్ఘోరం యుద్ధం చక్రు ర్నిశాచరైః
రాక్షసా దారితాః కేచి త్పాగే రాశీకృతా ద్రుమైః
దన్తై ర్విదారితాః కేచి చ్చూర్ణితా శ్చ పరేఽద్రిభిః
వానరై స్తాడితా స్సర్వే కేచి ద్వై విప్రదుద్రువుః. ౨౨-౨౩½

స్వసైన్యం విద్రుతం వీక్ష్య ధూమ్రాక్షో ముసలై స్తథా
పట్టిసై ర్భిండివాలై శ్చ దారయామాస వానరాన్
శిలాం తు మహతీం పశ్చా దానీయాఽమితవిక్రమః
హనూమా న్పాతయామాస ధూమ్రాక్షస్య రథోపరి
పపాత తత్ప్రహారేణ రథో భువి హయై స్సహ
గిరిశృంగ మథాఽఽనీయ ధూమ్రాక్షస్య శిరోఽన్తరే
పాతయామాస హనుమాం స్తేన భూమ్యాం పపాత సః.
౨౪- ౨౫-౨౬-౨౭

దిహాగత ఇతి వేద్యం - వాల్మీకిరామాయణే” నచకౌతూహలం కార్యం సఖిత్వం ప్రతీత్యాదినాపీద మేవ సూచితమితి వేద్యమ్.

౨౦ పిదప రావణుడు విషాదమునొంది ధూమ్రాక్షునిఁ బిలిచి యిట్లు చెప్పెను. ధూమ్రాక్షుడా! నీవు బహుపరాక్రమశాలివి కావున తగిన రాక్షససైన్యమును వెంటబెట్టుకొని యుద్ధములో వానర సహితముగా రామలక్ష్మణులను వధించుటకు బయలుదేరుము.

౨౧ ఇట్లు రావణుడు చెప్పగా ధూమ్రాక్షుడు సంతోషించి వెంటనే గొప్ప రాక్షససైన్యమునుగూడ వెంటబెట్టుకొని రథారూఢుడై యుద్ధభూమికి వెళ్ళెను.

౨౨-౨౩½ యుద్ధకాములయిన వానరులు సైన్యసమేతుడై వచ్చుచున్న ధూమ్రాక్షునిఁజూచి సింహనాదములు చేయుచు వృక్షములు తీసికొని వానితో రాక్షసులను బాదకొట్టుచు ఘోరయుద్ధమును చేయుచుండిరి. వానరులు కొందరు రక్కసులను గోళ్ళతో చీల్చివేయుచుండిరి. కొందఱు రక్కసులను చెట్లతో గొట్టి రాశిగాఁ బడవేయుచుండిరి. కొందరు రక్కసులను పండ్లతో గొరికి చంపుచుండిరి. కొందఱు వానరులు కొండలు విసిరి రక్కసులను చూర్ణము చేయుచుండిరి. మొత్తముమీద రక్కసులందఱు వానరులచే హతము చేయబడిరి. మిగిలినవారలు కొందఱు పారిపోయిరి.

౨౪-౨౫-౨౬-౨౭ ఇట్లు తనవెంటవచ్చిన రక్కసులగుంపు చెల్లాచెదరయి పోగా, ధూమ్రాక్షుడు క్రుద్ధుడై ముసలములతోను, పట్టిసములను నాయుధములతోను, భిందివాలములను శస్త్రములతోను వానరులను జీల్చి చెండాడుచుండెను. ఈ సమయమున హనుమంతుడు పెద్దబండ నొకదానినిఁదీసికొనివచ్చి ధూమ్రాక్షునిరథముమీదను విసరిపడవేయగా, ఆ దెబ్బతో రథము గుఱ్ఱములు సారథియునుగూడ హతమయ్యెను. పిమ్మట హనుమంతుఁడు పర్వతశిఖరమును పెకలించుకొని వచ్చి ధూమ్రాక్షుని తలమీదను గొట్టగా, ఆ దెబ్బతో ధూమ్రాక్షుడు భూమియందు తుత్తునియలైపడి మృతినొందెను.

---

వచ్చెనని తెలియదగును. వాల్మీకిరామాయణమునగూడ గరుత్మంతుడు రామునితో జెప్పుటలో "మనకుండెడి సఖ్యము విషయమిచ్చట సంభాషింపతగినది కాదు" అని సూచనము చేయబడెను.

శ్రుత్వా తం నిహతం దశాననవిభుః క్రుద్ధో భుజంగో యథా
నిశ్వస్యోష్ణమథాంతికస్థ మసురం తం వజ్రదంష్ట్రం పునః
ప్రాహైవం ప్రహత సాద్య గచ్ఛతు భవాన్ రాత్రించరై రన్వితః
ప్రోక్త స్త్వేవ మథో నిశాచరయుతో యోద్ధుంతు వజ్రాజ సః. ౨౮

వజ్రదంష్ట్రో వృతో క్రుద్ధో [illegible] నిర్గత
[illegible] శేషతః
తత శ్శాఖామృగా క్రుద్ధా స్తలైశ్చ చరణై రపి
ముష్టిభి ర్జానుభి శ్చాపి ద్రుమై శ్చాఽజఘ్ను రాక్షసాన్,
హరి ర్యథా క్షుద్రమృగాం స్తథాఽంగద
శ్చకార యుద్ధం పితృతుల్యవిక్రమః
ప్రగృహ్య శైలం విపులం త్వథాఽఽశరే
నిపాతయామాస తతో మహాసురః ౨౯-30-3౧

హతశేషా స్తు దనుజా దుద్రువూ రాక్షసేశ్వరమ్
వజ్రదంష్ట్రం హతం ప్రాహు ర్విభవే తే నిశాచరాః, 3౨

విషణ్ణో రావణః పశ్చా దకంపన మువాచ సః
భవా న్జేష్యతి కాకుత్స్థౌ వానరాం శ్చ రవే స్సుతం
రథ మాస్థాయ నిర్యాహి యోద్ధు మాశరసంయుతః
ఇత్యుక్తోఽకంపన శ్చాపి రథారూఢో బలాన్వితః
నిర్యయౌ తస్య సవ్యం తు నయనం వ్యస్ఫుర త్తదా
మహోత్పాతా వినిష్క్రాంతా స్థానాదృత్య సోఽవ్రజత్.
33-3౪-3౫

౨౮ ఇట్లు ధూమ్రాక్షుడు హతుడయినట్లు రావణుడు విని తోక త్రొక్కిన త్రాచుపామువలె బుసలుకొట్టుచుఁ బిదప తన సమీపములోనున్న వజ్రదంష్ట్రునితో నిట్లుఁబలికెను. వజ్రదంష్ట్రా! నీవు రాక్షస సైన్యముతోఁగూడి యుద్ధమునకై బయలుదేరుము. అనిచెప్పగా వజ్రదంష్ట్రుడు తథాస్తని చెప్పివెంటనే రక్కసులను వెంటబెట్టుకొని యుద్ధమునకు వెళ్ళెను.

౨౯-30-3౧ వజ్రదంష్ట్రుడు కాలాగ్నివలె మండిపడుచు వానరులమీదను బాణవర్షము కురిపించుచుండెను. కాని వానరులంతకంటె క్రుద్ధులయి చెంపదెబ్బలతోను పాదతాడనములతోను పిడికిలి పోట్లతోను మోకాలి పోట్లతోను చెట్లతోను వాని వెంటవచ్చిన రక్కసులను హతము చేయుచుండిరి. "సింహము క్షుద్రమృగములను హతముచేసినట్లు" రక్కసులగుంపును అంగదుడు హతముచేయుచు నొక పెద్ద కొండను దీసికొనివచ్చి వజ్రదంష్ట్రుని మీద బడవేయుగా దానితో వజ్రదంష్ట్రుడు హతమయ్యెను.

3౨ చావగా మిగిలిన రక్కసు లచ్చట నిలువలేక రావణుని సమీపమునకు బరుగిడి వజ్రదంష్ట్రుడుకూడ జచ్చెనను వార్తను రావణునకుఁ జెప్పిరి.

33-3౪-3౫ రావణుఁడా మాటవిని చాల విషాదమునొంది పిదప దగ్గరనున్న యకంపనుడను వానితో నిట్లుఁబలికెను అకంపనా వానరులను వానరరాజును రామలక్ష్మణులనుగూడ నీవు జయింప సమర్థుడవు. కావున రక్కసులతోఁగూడి రథారూఢుడవై యుద్ధమునకు బయలుదేరుము. అని చెప్పుటతోడనే అకంపనుడు రాక్షస సైన్యముతో గూడి రథారూఢుడై యుద్ధభూమికి బయలు దేరెను. కాని యతని యెడమకన్ను బయలుదేరుట తోడనే యదరుటయే కాక యనేకములగు నుత్పాతములు (అరిష్ట చిహ్నములు బయలుదేరెను. వాని నన్నిటిని లక్ష్యపెట్టక శీఘ్రముగ వెళ్ళెను.

గత్వా రణభువం సోపి శరై రాశీవిషోపమైః
క్రోధా దభ్యహన త్తీవ్రం వానరా న్యూథపా న్రణే. ౩౬

హరయ స్తత్ర న స్థాతుం శక్తా యోద్ధుం తు కింపునః
భగ్నా స్తస్య శరై స్సర్వే దిశో దశ విదుద్రువుః
ఏతస్మి న్నంతరే వీరో మారుతి శ్శృంగ ముత్తమమ్
ఉత్పాట్య తం గృహీత్వాఽఽ ఘువేగేనాఽఽగత్య రక్షసః
చిక్షేప తస్య శిరసి పపాత చ మహాంగ సః, ౩౭-౩౮½

చమూపతిం హతం వీక్ష్య రాక్షసా వ్యథితా స్తతః
త్యక్తప్రహరణా శ్శేషా లంకా మేవ ప్రదుద్రువుః, ౩౯½

తతో దేవగణా స్సర్వే సుగ్రీవప్రముఖా శ్చ తే
రాఘవం చ మహాబాహుం మారుతిం తుష్టువు స్తదా. ౪౦½

హతశేషా స్తతో గత్వా రాక్షసా స్తు దశాననం
అకంపనవధం ప్రాహు రభూ ద్దీనముఖ స్తు సః ౪౧½

ఆశ్చర్యరామాయణే యుద్ధకాండే
పంచదశ స్సర్గ స్సమాప్తః.

---

## షోడశ స్సర్గ

యుద్ధే వినిహతం శ్రుత్వా రాక్షసేశ స్త్వకంపనం
విచార్య బహుధా ప్రాహ ప్రహస్తం నికటస్థితమ్. ౧

౩౬ ఇట్లు వెళ్ళి యకంపనుడు మహాకోపముతో పర్వతతుల్యములయిన బాణములతో తీవ్రముగా వానరులను వానరయూథ నాయకులను గూడ గొట్టుచుండెను.

౩౭-౩౮ వానరులెవ్వరు నకంపనునిముందు యుద్ధము చేయుటకు సమర్థులు కాకపోవుటయే కాక నుండుటకు గూడ సమర్థులు కాకపోయిరి. వానరులు పదిదిక్కులకుఁ బారిపోవుచుండిరి. ఈ సమయమున మహావీరుడగు హనుమంతుడు గొప్ప పర్వతశిఖరము నొకదానిని బెల్లగించి తెచ్చి యకంపనుని నెత్తిమీద విసరివేయగా దానితో నతడు చచ్చెను.

౩౯ సేనానాయకుడయిన యకంపను డిట్లు హతుడగుట తోడనే పిదప నచటనున్న రక్కసులు దుఃఖపడుచు దమ యాయుధములను గూడ నచటనే విడిచి చావగా మిగిలినవారలు లంకకుఁ బారిపోయిరి.

౪౦ పిమ్మట దేవతలు సుగ్రీవుడు మొదలగు వానరులు రామలక్ష్మణులను మహాబల పరాక్రమశాలి యగు హనుమంతునిఁ బొగడిరి.

౪౧ హతశేషులగు రక్కసులు పిదప రావణుని యొద్దకేగి యకంపనుడు చచ్చిన వృత్తాంతమును జెప్పగా, నతడు విచారగ్రస్తుడయ్యెను.

ఆశ్చర్యరామాయణమున యుద్ధకాండమున
పదునైదవ సర్గము ముగిసెను.

---

## పదునాఱవ సర్గ ప్రారంభము

౧ అకంపనుడు యుద్ధములోఁ జచ్చిపోయినట్లు దూతలవలన రావణుడు విని మిక్కిలి విచారపడి, పిదప సమీపములోనున్న ప్రహస్తునితో నిట్లనఁ బలికెను.

నూనంత్వద్య భవా నహం మమ సుతో భ్రాతా కనిష్ఠ స్తథా
తత్పుత్రౌ రిపుణాఽఽహవే పున రలం యోద్ధుం సమర్థా స్త్వమీ
తస్మా ద్వానరవాహినీభి రధునా యోద్ధుం వ్రజ త్వాం పున
ర్వీక్ష్యైవాఽఽశ్వభివిద్రుతా స్స్యు రథవా మోక్ష్యంత్యసూ
న్వానరాః. ౨

శోకో వాఽప్యద్యతువా ధ్రువం హి భవితా జాతస్య మృత్యు స్తతో
గేహే న్వై మరణా ద్గదేన శుభదా శూరస్య యుద్ధే మృతిః,
శ్రుత్వా తద్వచనం ప్రహ స్తతనుజో ప్యాహాఽథ పంక్త్యాననం
రాజ న్పూర్వగతం ప్రతి త్వ మధునా చింతాం విముంచ
ధ్రువమ్. 3

పూర్వం పంక్తిముఖాధ్య! మే బహు ధనం * దత్త్వా చ
సన్మాన్య మామ్, సంతృప్తం త్వకరో ద్భవా నవసరే మత్తః
ఫలాకాంక్ష్యలమ్, కాలేఽస్మి న్నృణమోచనం మమపున
ర్యుక్తం తతోఽహం పున, ర్గారా న్పుత్రహితాం స్త్వదర్థ
మధునా త్యక్త్వాఽజి మేష్యా మ్యరమ్. ౪

---

* కాలేఽస్మి న్నృణమోచనంత్వింతి - అత్రేద మవధే యమ్ - అత్ర దశాననం ప్రతి త్వదీయధనానుభవా త్త్వదర్థ మఖిలం సంత్యజ్యాఽంతతః ప్రాణా నపి వితీర్య త్వదీయఋణం విమోచయేయ మితి ప్రహస్తేన ప్రతిపాదితం - భారతయుద్ధే ప్యేవం సందృశ్యతే- తథాహి దుర్యోధనేన "స్వపక్షే యోద్ధు మాగచ్ఛత మితి" భీష్మద్రోణౌ సంప్రార్థితౌ తావేవ మూచతుః" "అర్థస్య పురుషోదాసోదాసోర్థో నా స్తికస్యచిత్"

౨ ఓ ప్రహస్తా! యిపుడిక శత్రువులతో యుద్ధముచేయదగిన సమర్థతగల వారము మన మైదాఱుగురు మాత్రమే యుంటిమి. (వారెవరన) నీవు, నేను, ఇంద్రజిత్తు, కుంభకర్ణుడు, కుంభకర్ణుని పుత్రులగు కుంభ నికుంభులునై యుండిరి. అందువలన నీవిపుడు యుద్ధమునకై బయలు దేరుము. నిన్ను జూచుటతోడనే భయపడి వానరులు పరుగులిడుదురు. లేక గుండెలు బ్రద్దలయి చచ్చిపోదురు.

౩ ప్రహస్తా! మనమిక మరణమునకును భయపడవలదు (ఏలనన) "జాతస్య మరణం ధ్రువ" మ్మను న్యాయముచే పుట్టినవానికి నేడో రేపో యెప్పుడో యొకప్పుడు మరణము తప్పదు - శూరుడైనవాడు రోగముతో తీసికొని తీసికొని యింటిలో చచ్చుటకంటె యుద్ధములో చచ్చుట శ్రేయస్కరము అని చెప్పగా ప్రహస్తుడు రావణునితో నిట్లు పలికెను. రాజా! పూర్వము జరిగినదానికి నీవు వగవకుము.

౪ రావణప్రభూ! నీవింతకు పూర్వము ధనకనక వస్తువాహనములను విశేషముగ నాకిచ్చుటయు, నన్ను బహువిధముల గౌరవించుటయు, నావలన సమయమువచ్చినపుడు ఫలమును గోరియేకదా చేసితివి. ఇట్టిస్థితిలో నీకీకష్టసమయమున ♦ నీ ఋణమును నేను దీర్చుకొనుట నాకు న్యాయము కావున దారపుత్రాదులను తుదకు ప్రాణముల మీద నాశను విడిచి యిప్పుడే యుద్ధమునకుఁ బోవుదును.

---

♦ నీ ఋణమును నేను దీర్చుట నాకు న్యాయము - ఇచ్చట నీ క్రింది విషయము గమనింపదగియున్నది. (ఏమన) నీ ధనమును నే ననుభవించుటవలన నీ కొఱకై సర్వమును విడిచి తుదకు ప్రాణములను గూడ నిచ్చి నీ ఋణ విమోచనము చేసెదనని ప్రహస్తుడు చెప్పెను. ఇటులనే భారతయుద్ధమునగూడ గన్పడుచున్నది (ఎట్లన) తన పక్షమున యుద్ధము చేయుటకు సమ్మతమని దుర్యోధనుడు భీష్మద్రోణులను ప్రార్థింపగా వారలు దుర్యోధనునితో నిటుల బలికిరి. దుర్యోధనా! "అర్థమునకు పురుషుడు దాసుడు కాని అర్థము పురుషునకు దాసుడు కానేరదు." ఈ న్యాయము ననుసరించి నీ

ఇతి న్యాయ మనుసృత్య త్వద్ధనభోగేన వయం త్వదీయాఏవేతి, కించ, తే తథైవ చక్రుః - పరంతు స్వాయ మధర్మపక్షే యోత్స్యామో వయ మితి తే విదంత్యేవ, కించ యుద్ధకాలే ప్రతిదినం ధర్మరాజస్య జయో స్త్వితి ధ్యాత్వైవ యోద్ధుం తే ప్రవవృజుః, ప్రకృతే రావణ స్త్వధర్మే ప్రవర్తత ఇతి జానన్నపి ప్రహస్త "స్తస్య ధర్మాధర్మవిచారేణ మమ కిం ఫల మితి, సంచింత్య తత్పోషిత మదీయ దేహస్య తత్కార్యావసరే విని యోగఏవ ధర్మ ఇతి నిశ్చిత్య చ, స్వధర్మం స్వయ మాచరతిస్మ- ఏవంచ రాజ్ఞా క్రియమాణానాం పాపానాం తదనుచరా నోత్తర వాదిన ఇతి ధర్మోపదేశేన వేద్యతే-నన్వేవం స్థితే విభీషణకృతం కార్య మసమీచీన మేవేతి చోద్యతే నహి విభీషణస్యార్జిత మస్తి,నాపి పిత్రార్జితం, సర్వ మపి రావణార్జిత మేవ, తతో భీష్మ ద్రోణావివ విభీషణోపి కథం న ప్రావర్తత? నహి నమయో కేవలం ముఖపరావృత్తి రేవైవ, కింతు శత్రుపక్షప్రవేశేన స్వామి ద్రోహ శ్చే త్యాశంకాసము దేతి-తథాపీద మత్ర సమాధేయమ్. భీష్మద్రోణౌ ధర్మస్వభావావపి రజోగుణభూయిష్ఠావేవేతి తదీయచర్యయైన విస్పష్టం భవతి, శ్రీకృష్ణ స్త్వవతారమూర్తి రితి జ్ఞాత్వాపి పుష్పైః పూజనీయం భగవంతం నిరాయుధం బాణై ర్బాధితవా న్భీష్మః, నేదం సాత్వికలక్షణం భవితు మర్హతి. విభీషణ స్తు జాత్యా రాక్షసోపి ప్రకృత్యా సాత్వికః ధర్మనిష్ఠ శ్చ, తతఏవ సీతాపహరణక్షణ మారభ్య రావణతిరస్కార పర్యంతం నయభయాభ్యాం యావత్కథనీయం తావద్బోధనం

ధనమును మే మనుభవించుట వలన మేము నీకు దాసులమై యుండ వలసినదేయని చెప్పి యటులనే చేసిరి, కాని తాము అధర్మ పక్షములో యుద్ధము చేయబోవుచున్నామని వార లెరిగియుండియు ప్రతిదినము ధర్మరాజునకు జయము గలుగ వలయునని తలంచుచునే యుద్ధమునకుఁ బోవుచుండెడి వారలయి యుండిరి. ప్రకృతమున రావణు డధర్మముగఁ బ్రవర్తించుచుండెనని ప్రహస్తుడు తెలిసికొనినవాడై యుండియు, రావణుని ధర్మాధర్మములను విచారింప నాకేమిపని యని యాలోచించి యతనిచేఁ బోషింపబడిన తన దేహమును అతనికి పనిబడినప్పుడు వినియోగించుటయే తన ధర్మమని నిశ్చయించి తన ధర్మమును దా ననుష్ఠించెను. ఇందువలనఁ దెలియబడు ధర్మమేమనగా రాజుచేసిన పాపములకు భృత్యులు ఉత్తరవాదులు కారని తెలియబడుచున్నది. ఇట్లుండ, విభీషణుడు చేసిన పని యేమాత్రము సమంజసముగ లేదని కొందరు ఆశంకించెదరు. (ఏలనన) విభీషణునకు స్వార్జితము కాని, పిత్రార్జితము కాని యేమియు లేదు. సర్వము రావణార్జితమే, కావున భీష్మద్రోణులవలె విభీషణుడుగూడ నేల ప్రవర్తింపలేదు ? సమయము వచ్చినప్పుడు ముఖము చాటువేయుటయే కాక శత్రుపక్షమునచేరి స్వామిద్రోహమునుగూడ జేసెనని యాశంకించెదరు, కాని యా యాశంకకు క్రిందివిధముగ సమాధానము చేసికొనదగినది. (ఎట్లన) భీష్మద్రోణులు ధర్మస్వభావము గలవార లయినను రజోగుణ భూయిష్ఠులయి యుండిరని వారల చర్యచేతనే స్పష్టపడును. (ఎట్లన) పూలచేఁ బూజింపదగిన శ్రీకృష్ణ భగవానుడు నిరాయుధుడై యుండినను నతనిని బాణముచే భీష్ముడు బాధించెను. ఇది సాత్విక లక్షణము కాదు. విభీషణుడో జాతిచే రాక్షసుడైనను స్వభావముచే సాత్వికుడును, ధర్మనిష్ఠుడునై యుండెను. అందువలననే సీతను రావణు డపహరించి లంకకుఁదీసికొనివచ్చిన క్షణము మొదలు, రావణుడుతనను దూషించి వెడలగొట్టు పర్యంతము నయ భయములచే నెంత వరకుఁ జెప్పవలయునో, అంత

ఇత్యుక్త్వా దశకంఠరం బలయుత స్తూర్ణం ప్రహస్త స్తతో,
నిర్గత్యాఽఽశు రథం సువర్ణరచితం చాఽఽరుహ్య సేనాపతిః
వ్యూఢేనైవ బలేన మన్త్రిభి రపి ద్వారా త్తు పూర్వా త్తతో,
నిష్క్రాన్తో మహతా సువాద్యనినదేనాఽబ్ధిం యథా
పూరయన్. ౫

ఏతస్మి న్సమయే వవౌ చ పరుషో వాయు స్తదాఽఽకాశత,
స్థూలాశ్మాఽప్యపత న్నివాశ్చనినదంచక్రు స్తదా సారథేః,
హస్తా త్తోత్ర మరం పపాత తురగా స్స్ఖాలిత్య మాపుశ్చ తే,
కించాఽస్యోపరి దక్షిణాముఖతయా గృధ్రో నిలీనో ధ్వజే.
౬

యథాఽనలం తు శలభ స్సోఽపి వానరవాహినీం,
వివేశాఽఽశు ప్రహస్తోఽయం కాలేనైవ ప్రచోదితః. ౭

మహాశైలసమాకారం ప్రహస్తం వీక్ష్య రాఘవః,
విభీషణ మువాచేదం వచనం సస్మిత స్తదా. ౮

---

ప్రతి కథితవానే వాఽయమ్, పరంతుతత్కథనం వ్యర్థ మభూత్. "గురో రప్యవలిప్తస్య కార్యాకార్య మజానతః, ఉత్పథం ప్రతిపన్నస్య పరిత్యాగో విధీయత, ఇతి వచన మనుసృత్య అంతత స్తం విసృజ్య రాఘవం శరణం యయౌ, సామాన్యవిశేషయో ర్విరోధే విశేషస్యైవ గ్రాహ్యత్వా దితి వేద్యమ్.

౫ ఇట్లు ప్రహస్తుడు రావణునితోఁ జెప్పి వెంటనే తన సైన్యము నాయత్తము చేసికొని రథారూఢుడై సైన్యమును వ్యూహముగా నేర్పఱచుకొని మంత్రిపరివారములతో గూడి తూర్పు ద్వారము నుండి బయలుదేరి సముద్రము ప్రతిధ్వనించునటుల వాద్యఘోషములు సింహనాదములు చేయుచుండ యుద్ధభూమికి వెళ్ళుచుండెను.

౬ ఈ సమయమున సుడిగాలి వీచుచుండెను. ఆకాశమునుండి పిడుగులు పడుచుండెను. నక్కలు కూయసాగెను. ఇంతియేకాక సారథి చేతిలోనుండి గుఱ్ఱములను తోలునట్టి కొరడా క్రింద పడిపోయెను. మఱియు గుఱ్ఱములు తొట్రుపడుచుండెను. మఱియు, ప్రహస్తుని రథము మీదను గ్రద్దవ్రాలెను.

౭ ఇట్టి దుశ్శకునములు కలిగినను వానిని లక్ష్యముచేయక ప్రహస్తుడు మిడుత యగ్నిలోఁ బ్రవేశించునట్లు మృత్యువుచేఁ ప్రేరేపింపబడి వానరసైన్యములోఁ బ్రవేశించెను.

౮ పిదప రామచంద్రమూర్తి గొప్ప పర్వతాకారముగల ప్రహస్తునిఁ జూచి మందహాసము చేయుచు విభీషణునితో నిటులఁబలికెను.

---

పలుకుఁ జెప్పి చూచెను. కాని యతని ధర్మోపదేశమంతయు వ్యర్థమయ్యెను. "గురువైనను కార్యాకార్యములను గుర్తింపక యధర్మములోఁ బ్రవేశించిన యెడల వానిని విసర్జించుట న్యాయ" మను మనువచనము ననుసరించి తుదకు విభీషణుడు రావణుని విడిచి రాముని శరణుపొందెను. సామాన్య విశేషధర్మములకుఁ బరస్పర విరోధము కలిగినపుడు విశేషధర్మమునే గ్రహింపవలయునని తెలియవలెను.

కో౽యం భీమమహాతను ర్వదతు మే రాత్రించరేశానుజే,
త్యక్తః ప్రాహ విభీషణో రఘుపతిం సో౽యం ప్రహస్తా
హ్వయః, సైన్యే త్వస్య బలం త్రిభాగ మవస చ్ఛాస్త్రాస్త్ర
పాండిత్యవా,న్ప్రఖ్యాత శ్చ పరాక్రమే రఘుపతే సో౽యం
పరై ర్దుర్జయః. ౯

గర్జంత మాపతంతం తం సమీక్ష్య చ బలం మహత్,
పుష్పితా న్పాదపా న్ధృత్వా శిలా శ్చ మహతీ స్తదా,
యోద్ధుకామాః ప్లవంగా స్తే దనుజా న్పర్య వారయన్. ౧౦॥

పశ్చా ద్వానరరక్షసాం తు తుములం యుద్ధం ప్రవృత్తం తదా
చత్వార స్సచివాస్తు తస్య బలిభి స్తారాదిభి స్సంహృతాః,
తత్కర్మా౽౽శు నిరీక్ష్య రాక్షసచమూనాథ శ్శరై ర్వానరా
న్సంగ్రామే౽ర్దితవా న్ప్లవంగరుధిరవ్యాప్తా బభూవ క్షితిః
౧౧॥

ప్రహస్తా ద్భీతి మేత్యా౽౽శు ప్లవంగా స్తు దిశో దశ
విదుద్రువు స్తదా నీలః ప్రహస్త మభినిర్యయౌ ౧౨॥

నీల స్తేన గదాయుధై ర్వినిహతః క్రుద్ధో భుజంగో యథా
నిశ్వస్యా౽౽శు గతశ్శిలాం సుమహతీం చా౽౽నీయ తస్యోపరి
చిక్షేపా౽౽శరవాహినీపరిబృఢ స్తేన ప్రహారేణ వై
క్షిత్యా మాశు పపాత చా౽౽ప చ మృతిం సో౽యం
ప్రహస్తః పునః ౧౩॥

౯ ఓ విభీషణా! మహాభయంకరమయిన గొప్ప శరీరముగల యీ రక్కసు డెవ్వడు? అని యడుగగా, విభీషణుడు రామచంద్ర మూర్తితో నిట్లుఁ జెప్పెను. ఓ రామచంద్రా! ఈ రక్కసుడు ప్రహస్తుడను పేరుగల సర్వసేనాపతియయి యుండెను. లంకలో నున్న రాక్షససైన్యములో మూడువంతులు సైన్యము ఇతనియధీనములో నుండెను. ఇతడు శస్త్రాస్త్రములలో నాఁతితేరినవాడున్ను పరాక్రమములో ప్రఖ్యాతిగలవాడును శత్రువులకు దుర్జయుఁడునై యుండెను- (అని విభీషణుడు చెప్పెను.)

౧౦౪ పిదప గర్జించుచు వచ్చుచున్న యీ ప్రహస్తుని, ప్రహస్తుని వెంట వచ్చుచున్న సైన్యమును, వానరులు చూచి కొందఱు పెద్దపెద్ద బండలను మఱికొందఱు పుష్పించియున్న గొప్ప చెట్లనుఁ జేతపుచ్చుకొని యుద్ధకాములై రక్కసులనందఱను జుట్టుడించిరి.

౧౧౪ అనంతరము వానరులకును రక్కసులకును ఘోరమయిన సంకుల యుద్ధము జరిగెను. ఆ యుద్ధములో ప్రహస్తునిమంత్రుల నలువురను తారుడు మొదలగు వానరయూధపతులు గోళ్ళతోఁ జీల్చి చెండాడిరి. వానరులు రక్కసులను హతము చేయుచుండ ప్రహస్తుడు చూచి సహింపలేక తన బాణవర్షముచే వానరులను హతము చేయుచుండెను. యుద్ధభూమియంతయు వానరుల రక్తముచే తడుపబడెను.

౧౭౪ పిదప వానరులు ప్రహస్తునివలన భయపడి దశదిశలకుఁ బారిపోవుచుండిరి. నీలుడు పిమ్మట ప్రహస్తునితో యుద్ధము చేయ మొదలిడెను.

౧౩౪ ప్రహస్తుడు నీలుని గదాయుధములతోఁ గొట్టఁగా నీలుడు తోక త్రొక్కిన త్రాచుపామువలె పగబట్టి నిట్టూర్పువిడుచుచు వెంటనే యొక గొప్ప రాతిబండను దీసికొనివచ్చి ప్రహస్తునిమీద విసిరివేయగా, ఆ దెబ్బతో ప్రహస్తుడు భూమియందుఁబడి మృతినొందెను.

తస్మింశ్చాఽపి హతే నిశాచరచమూనాథేఽవశిష్టా ద్రుతం
గత్వా రావణ మాశరా వినిహతం ప్రాహుః ప్రహ స్తం తతః
క్రుద్ధః ప్రాహ నిశాచరా న్దశముఖో గత్వాఽహ మేవ స్వయం
బాణౌఘై ర్విపినం యథాఽగ్నిభి రలం శత్రూ న్దహేయం
ధ్రువమ్. ౧౮౫

రామం సానుజ మద్య వానరచయం హత్వాతు తచ్ఛోణితై
ర్భూమిం తర్పయితుంవ్రజామ్యనుచరై స్త్వానీయతాంవాహనమ్
ఇత్యుక్త్వాఽనుచరైర్ద్రుతం పునరథాఽఽనీతం సమారుహ్యతం
సౌవర్ణం రథ మాశరైః పరివృతో నిష్క్రాంతవా న్నంగరమ్.
౧౭౫

ఏవం హైమరథం నిశాచరపతి స్త్వారుహ్య భేరీరవైః
క్రవ్యాదానుచరారవ స్తవచయై స్సంపూజ్యమాన స్తదా
దుష్ప్రేక్ష్యోఽంశుభి రర్యమేవ దనుజై ర్ముఖ్యై ర్వృతస్సత్వరం,
భూతై శ్శంభురివాఽఽవృతో ద్రుత మగా త్సంగ్రామ భూమిం
పునః. ౧౮౫

దృష్ట్వా తం రఘునందనోదశముఖంజ్ఞాత్వాఽఽగతం తం పునః
ప్రాహైవం సహజం నిశాచరపతి ర్దిష్ట్యాఽద్య దృష్టో మయా
భూజాతాహరణోత్థరోషం మధునా మోక్ష్యామి తస్మి న్నితి
ప్రోక్త్వాఽఽదాయ ధను శ్శరేణ సహితం సంగ్రామభూమౌ
స్థితః ౧౭౫

౧౪ చావగా మిగిలిన రాక్షసులు రావణునియొద్దకువెళ్ళి రాక్షస సర్వసేనాధిపతియగు ప్రహస్తుడుకూడ హతుడయ్యెనని చెప్పగా, నా వార్తను రావణుడు విని విచారమును కోపమునుగూడ బొంది యచ్చటి రక్కసులతోఁ నిటులఁ బలికెను. రక్కసులారా! యిక మీ వలన లాభములేదు. నేనే స్వయముగా యుద్ధమునకుఁ బోయి, దావాగ్ని వనములను గాల్చినట్లు వానరసైన్యమును నా బాణాగ్నిచేఁ గాల్చివచ్చెదను.

౧౫ రక్కసులారా! వానరసేనలనే కాక రామలక్ష్మణులను గూడ నేను హతముచేసి వారల రక్తధారచే సమరభూమిని సంతృప్తి పరచెదను. అనుచరులతో రథమును దీసికొనిరమ్మని చెప్పవలయునని చెప్ప, వారలు వెంటనే రథము సాయత్తపరచి తీసికొనిరాగా, ఆ సువర్ణరథము నెక్కి రక్కసులచే నావృతుడై యుద్ధమునకేగెను.

౧౬ ఇట్లు బంగరు రథము నెక్కి రావణుడు రణభేరీలు ఘోషిల్లుచుండ రక్కసులు, అనుచరులును స్తోత్రపాఠములు చేయుచుండ, సూర్యుడు కిరణములచే దుష్ప్రేక్షుడయినటుల తేజఃపుంజములచే దుష్ప్రేక్షుడయి రక్కసులచే నావరింపబడి, భూతలముచే నావరింపబడిన రుద్రుడో యనునటుల యుద్ధభూమికి జేరెను.

౧౭ రామచంద్రమూర్తి యా వచ్చుచున్నవాడు రావణుడని తెలిసుకొని లక్ష్మణునితో నిటులఁబలికెను. లక్ష్మణా! యీ రావణుడు దైవవశమున నాకంటబడెను. సీత నపహరించుటవలన నాకుఁ గలిగిన కోపమువంతను నిపుడు వీనిమీద విడిచెదను. జూడుమని చెప్పి వెంటనే ధనువునందు బాణముల నెక్కుపెట్టి రావణునితో యుద్ధము చేయ సిద్ధముగ నుండెను.

పశ్చాత్ త్వం జ్ఞేయముఖోఽపి బాణనివహైః శాఖామృగాన్ దారయన్
సుగ్రీవం తు నిరీక్ష్య దారుణశరైః స్వరతాడయామాస తమ్
సుగ్రీవో వ్యచలాగ్ర మున్నతి మథాఽఽనీయాశు రక్షో పరి
క్షిప్రం పాతితవాన్ స్వరైస్త మచలం చిచ్ఛేద పఙ్క్త్యాననః ౧౮

రాత్రించరేశ నిశితాశుగ భిన్నగాత్రా
శాఖామృగా భువి నిపేతు రపేతసంజ్ఞాః
కేచి ద్దిశో దశ విదుద్రువు రార్తనాదాః
కేచి చ్ఛరణ్య మనఘం ప్రయయు శ్చ రామమ్॥ ౧౯

ఏతస్మి న్నమయే సమీరణసుతో గత్వాఽఽహ పఙ్క్త్యాననం
రే రే రావణ! భూమిజాపహృతిజం భుఙ్క్ష్వాఽద్య పాపం ఫలమ్
ఇత్యుక్త్వాఽఽశు తదీయవక్షసి తలేనాఽఽతాడయ త్తేన వై
మూర్ఛాం ప్రాప్య రథే పత త్పున రసౌ వాశ్వాస్య,
యోద్ధుం గతః॥ ౨౦

తతో దశాననః ప్రాహ మారుతిం విస్మయాన్వితః
శ్లాఘనీయో భవా న్నూనం వీర్యేణ మమ మారుతే
ఇత్యుక్తః ప్రాహ తం వాక్యం సస్మిత పవనాత్మజః
ప్రహారేణ మదీయేన యు స్త్వం జీవసి రావణ
ధి గస్తు మా మితి ప్రోక్త శ్శనై రపససార స ౨౧-౨౨

తతో నీల స్సమాలోక్య గిరిశృఙ్గం సమూలకం
సమానీయ తు చిక్షేప సుగ్రీవవరతోఽపరి

౧౮½ పిమ్మట రావణుడు శరవర్షముచే వానరులను జీల్చి చెండాడుచు మార్గములో గన్పడుచున్న సుగ్రీవునిఁజూచి దారుణమయిన బాణములచే నతనినిఁ గొట్టెను. ఆదెబ్బతోఁ గనలి సుగ్రీవుడు పరుగెత్తుకొని వెళ్ళి యొక పర్వతశిఖరమును దీసికొనివచ్చి రావణునిమీద విసిరివేసెను. కాని దానిని రావణుడు తుత్తునియలు చేసెను.

౧౯½ పిదప రావణునిశరవర్షముచే వానరులలో గొందఱు ఛిన్నగాత్రులయి భూమియందు చైతన్యము లేక పడియుండిరి. మఱికొందఱు దశదిశలకుఁ బరుగులిడిరి. కొందరు ఆర్తనాదములు చేయుచు రాముని శరణు పొందిరి.

౨౦½ ఈ సమయములో హనుమంతుడు చెప్పటనుండియో పరుగులిడుచు వచ్చి రావణునితో నిటులఁ బలికెను. రావణా ! సీత నపహరించుట వలన సంభవించిన పాపఫలమునంతను నిపుడనుభవించుమని పలుకుచు హఠాత్తుగ వచ్చి పిడికిలితో దృఢముగ రావణుని రొమ్ముమీద పొడవగా, ఆదెబ్బతో రావణుడు రథముమీదను బడి కొంతవడి మూర్ఛిల్లెను. కాని వెంటనే తెప్పరిల్లుకొని యుద్ధమునకు మరల దిగెను

౨౧-౨౨ పిమ్మట రావణుడు హనుమంతుని బలపరాక్రమముల కాశ్చర్యపడి యతనితో నిటులఁ బలికెను. హనుమంతా ! నీబలపరాక్రమములకు నేను మెచ్చితిని. నీవు నానిమీద దగినవాడ వేయుని చెప్పగా, హనుమంతుడు నవ్వుచు రావణునితో నిటులఁబలికెను. ఓరీరావణా! నా దెబ్బకు నీవింకను బ్రతికి యుండుటచే నా పరాక్రమము కడు నింద్యమయినది నీచే పొగడ దగినయది కాదని చెప్ప, రావణుడు హనుమంతునకు భయపడి మెల్లగా నచోటునుండి తొలగి మఱియొక చోటునకు పోయెను.

౨౩-౨౪½ పిదప నీలుడు పర్వతశిఖరము నొక దానిని పెల్లగించి తెచ్చి రావణునిమీద విసిరివేయగా, అగ్నిశృంగములు రావణుడు బాణ [illegible]

శరైః ర్భిన్నంతు త త్కృత్వా శరేణా౽తాడయ త్కపిం
తత్ప్రహారేణ నీలో౽పి పపాత భువి మూర్ఛితః
నచ ప్రాణై ర్వియుక్తో౽భూ త్పితుః పుణ్యా చ్చమూపతిః
౧౩-౧౪

శరవర్షం వవర్షా౽థ దశాస్యోపరి లక్ష్మణః
ఛిత్వా తా న్నిశితై ర్బాణై ర్నిశాచరపతి స్తతః
ఉత్ససర్జ మహాశక్తిం మయదత్తాం విభీషణే
ఆపతంతీం మహాశక్తిం సౌమిత్రి స్తు నిరీక్ష్య తాం
భ్రాతృదత్తాభయః సో౽యు మిత్యాలోచ్య మహామతిః
తస్యా౽గ్రే సంస్థిత స్తస్య తనుం శక్తి ర్వివేశ సా. ౧౫- ౧౬-౧౭

యావల్లోకే భువి సంస్థితో ధ్రువ మహో మాయోద్భవా శ్శక్తయ, స్తాసా మాశ్వర్థతాం గతస్య భగవ చ్ఛేషాంశ భూతస్య తు, శక్త్యాఽఽతిం న్వనయా తథాప్యయ మలం మానుష్యభావస్థితే, స్సౌచ్ఛక్త్యా౽౽శుపపాత మూర్ఛిత ఇవ ప్రాణై ర్వియుక్తో యథా. ౧౮

ఆదాతుం పతితం దశాస్యహతకో హస్తై స్సుమిత్రాసుతం యత్నం వై కృతవాం స్తథాపి దనుజాధీశో వ్యశక్త స్వభూత్ సర్వేషాం జగతాం నిదాన మసుర స్వల్పః కథం లోలయే త్సాక్షా ద్విష్ణుమివ్యక్తి ... గతమద్ధ స్తూష్ణీం స్థితో రావణః
౧౯

ముచే నీలుని గొట్టగా, ఆదెబ్బతో నీలుడు భూమియందుఁ బడి మూర్ఛితుడయ్యెను. అతనితండ్రి పుణ్యమువలన నతడు ప్రాణము లను మాత్రము బాయలేదు.

౭౫-౭౬-౭౭ లక్ష్మణుడు పిదప రావణునిమీద శరవర్షమును గురిపించెను. కాని రావణుఁడు తన బాణములచే వానినన్నిటిని మధ్యనే ఛిన్నభిన్నములుగా జేసెను. ఇంతలో విభీషణు డచటకు రాగా మయుడు తన కిచ్చిన శక్తియను నాయుధమును విభీషణుని మీదఁ బ్రయోగింపగా, మహాజ్వాలలతో మండిపడుచు విభీషణుని మీదకు వచ్చుచున్న మహాశక్తిని జూచి లక్ష్మణుడు వెంటనే విభీషణుని ముందు తాను నిలవబడెను. అట్లు నిలవబడుటకుఁ గారణమే మనగా, తన యన్నగు రామచంద్రమూర్తి విభీషణున కభయ మిచ్చి యున్నందున శక్తిచే నతడు చచ్చునని వెరచి తన ప్రాణము నడ్డమువేసెను. ఆ శక్తి లక్ష్మణునిమీదను బడి వెంటనే యతనిని బడ వేసెను. (మయుడు రావణున కిచ్చిన శక్తి యొకనిని మాత్రమే చంప గలదని తెలియదగును.)

౭౮ లోకములో మాయవలన బయలుదేరు శక్తులెన్నియుండునో,ఆశక్తులు కన్నిటికిఁ బ్రభువయిన శేషాంశసంభూతుడగు లక్ష్మణుని రావణుని చేఁ బ్రయోగింపబడిన శక్తిమాత్ర మేమిచేయగలదు ? ఏమియూ చేయలేనిమాట నిజమేకాని మనుష్యవేషముతో లక్ష్మణుడుండి నందున, ఆశక్తిచే పడి మూర్ఛితుడై ప్రాణముపోయిన వానివలె నుండెను.

౭౯ పిమ్మట రావణుడు భూమియందు బడియున్న లక్ష్మణుని, తనచేతులతో నెత్తి దీసికొనిపోవుటకుఁ బ్రయత్నించెను, కాని కొంచెమైనను లక్ష్మణుని నటనుండి కదల్చలేకపోయెను. (ఎందువలననగా) సమస్త లోకములను ధరించెడి విష్ణ్వంశసంభూతుడగు లక్ష్మణుని, అల్పుడగు రావణుడెట్లు కదల్పగలడు ? తుదకు రావణుడు కదల్పలేక సిగ్గుపడి యూరక యుండెను.

సౌమిత్రిం పతితం నిరీక్ష్య హనుమాన్ క్రుద్ధ స్తదాఽఽగత్య త
త్వం త్ర్యక్ష్యాస్యోరసి వజ్రముష్టిభి ర్బలం సంతాడయామాస సః
తేనాస్యై శ్శ్రవణై ర్వమం స్తు నయనై శ్చాస్యై ర్దశాస్యో బహు
ప్రాయోఽసౌ విగతస్మృతి ర్నిపతిత స్తస్మిన్ రథే మూర్ఛితః. ౩౦

పశ్చా దాదాయ సౌమిత్రిం బాహుభ్యాం మారుతి స్తతః
రామాంతికం త మనయ త్తేనాఽకులమానసః ౩౧
సౌమిత్రి వక్షసి శక్తి ర్విసృజ్యాఽథ తు లక్ష్మణమ్॥
దశాననరథం ప్రాగా ద్దశాస్యోపి క్రమా త్తతః ౩౨
ప్రాప్య సంజ్ఞాం తతం దుద్రావ రాఘవం యోద్ధు మిచ్ఛయా
దశాననం రథస్థం తం నిరీక్ష్య రఘునందనః
సమారుహ్య మరుత్సూను మభిదుద్రావ రావణమ్॥ ౩౩-౩౫
కాలరుద్ర ఇవ క్రుద్ధో రాఘవో నిశితై శ్శరైః
తథాశ్వధ్వజసూతాంశ్చ వివ్యాధ చ్ఛత్రచామరాన్
కించ తం వజ్రకల్పేన శరేణ దశకంధరం
తథా మరుత్వా నచలం వివ్యాధ క్రుద్ధమానసః॥ ౩౬-౩౮

శ్రీరామాశుగతాడితో దశముఖో మూర్ఛాంగత స్స్యందనే
నిస్సంజ్ఞో నిపపాత తస్య తు కరా చ్చాపః పపాత క్షితౌ
కించైతస్య కిరీట మాశు విశిఖై నైకేన రామ స్తత
శ్ఛిత్వా ప్రాహ దశాననం ప్రతి వచ స్త్వాశ్వాసపూర్వం
తథా॥ ౩౯

౩౦౫ పిదప భూమియందుఁ బడియున్న లక్ష్మణుని హనుమంతుడు చూచి మండిపడి వేగముగ బోయి వజ్రతుల్యమయిన తన పిడికిలితో రావణుని రొమ్మునఁ బొడిచెను ఆ పోటుతో రావణుడు నవరంధ్రముల వెంట రక్తము వెడలఁగక్కుచు స్మృతిలేక రథముమీదనే మూర్ఛిల్లి పడిపోయెను.

౩౧౫ పిమ్మట హనుమంతుడు తన బాహువులతో లక్ష్మణుని నెత్తుకొని రాముని యొద్దకుఁ దీసికొనిపోయెను.

౩౨-౩౩-౩౪౫ పిమ్మట లక్ష్మణుని నాశ్రయించియున్న మహాశక్తి యతనిని విడిచి రావణుని రథమును జేరెను. పిదప రావణుడు క్రమముగా దెలివినొంది రాముని మీదికి యుద్ధముచేయఁబోగా, రామచంద్రమూర్తియు రథారూఢుడయి వచ్చిన రావణునిఁ జూచి తాను హనుమంతు నెక్కి రావణునితో యుద్ధము చేయసాగెను.

౩౫-౩౬౫ రామచంద్రమూర్తి కాలరుద్రునివలె మండిపడుచు మిక్కిలి తీక్ష్ణమయిన బాణములచే రావణుని రథమును గుఱ్ఱములను ధ్వజమును సారథిని హతముచేసి రావణుని ఛత్రచామరములను గూడ తుత్తునియలుగాఁజేసి పిదప, దేవేంద్రుడు తన వజ్రాయుధముచే పర్వతమును గొట్టినట్లు, రావణుని వజ్రతుల్యమయిన బాణముచే గొట్టెను.

౩౭౫ ఇట్లు రామబాణముచేఁ గొట్టబడి వెంటనే రావణుడు మూర్ఛిల్లి తెలివిలేనివాడై పడిపోయెను. అతని చేతిలోనుండి ధనుర్బాణములు గూడ క్రిందపడెను. మఱియు రామబాణములచే నతని కిరీటముగూడ దెగగొట్టబడియెను. పిదప రావణునితో సాంత్వపూర్వకముగా రామచంద్రమూర్తి యిటులఁ బలికెను.

శేషే రావణ! మచ్ఛరేణ నితరా మాపీడిత స్త్వం తతో
లంకా మధ్య గతో ఽసి చే న్మమ బలం శ్వో ద్రక్ష్యసి త్వం ధ్రువమ్
ఇత్యుక్త్వో దశకంధరో హతమహాదర్పో గృహం ప్రాప్తవా
నాత్మన్యేవ విచింతయచ్చ బహుధా స్విన్నచేతా స్తదా॥ ౩౮

తద్ఘోరం విధివాక్య మద్య ఫలితం మర్త్యా ద్భయం స్యా దితి
ప్రాయో దేవనిశాచరాదిభి రవధ్యత్వం మయా ప్రార్థితమ్
నో మర్త్యా దనరణ్యభూపహతక శ్శాపం దదౌ మే పురా
శప్తోఽహం కిల రంభయాపి చ పురా శప్త స్స్వయం నందినా॥ ౩౯

ఇతి సంచింతయ న్నాసీ త్స్వగృహాభ్యంతరే పునః
దశాననో మృతిం తస్మా ద్రాఘవా న్నిశ్చికాయ సః॥ ౪౦

తతో రామ స్సమాగత్య మూర్ఛితం పతితం చ కౌ
స్పృష్ట్వానుజం స్వహస్తేన సమాశ్వాస్య శుశోచ స॥ ౪౧

సుషేణో రాఘవం ప్రాహ శీఘ్రం ద్రోణగిరిస్థితామ్
సంజీవినీం సమానేతుం ప్రేషయ త్వం మరుత్సుతమ్
సూర్యోదయా త్పూర్వ మేవ స్థాతవ్యోఽత్ర మరుత్సుతః॥ ౪౨

తచ్ఛ్రుత్వా న్మారుతినందనం రఘుపతిః ప్రాహైవ మద్య ద్రుతమ్
గత్వా ద్రోణగిరిం సమానయ తతో తచ్ఛైలస్థితా స్త్వోషధీః
త్వత్తో నాస్త్యపరస్సఖా మమ భవా న్మిత్రా సమోఽభూ ద్గతో
వత్సేమం సహజం భవా న్మమ పున స్సంజీవయ త్వంజసా॥ ౪౩

౩౮. ఓరీ రావణా! నా బాణముల దెబ్బలచే నీవు మిక్కిలి బాధింప బడితివి. నీ విప్పటికి లంకకుపొమ్ము. నా బలపరాక్రమములను రేపటి దినమునఁ జూడఁగలవు. అనిచెప్పగా నారావణుడు తనదర్పమునువిడిచి చేయునదిలేక తన గృహమునకేగి మనస్సులో పరిపరివిధముల నాలోచింపసాగెను.

౩౯. రావణుడు తన మనస్సులో నిట్లు తిరిగి తలచెను పూర్వము బ్రహ్మదేవుడు చెప్పినవాక్యము (మనుష్యునివలనమాత్రము భయము నీకుగలదని చెప్పిన విధివాక్యము) నేటికి సఫలమయ్యెను. దేవతలు మొదలగువారివలన చావులేకుండ వరము బొందితిని కాని మానవుని వల్లను చావులేకుండ వరము బొందకపోతినిగదా? ఇదియునుంగాక సూర్యవంశీకుడైన అనరణ్యుడు "నా వంశములో బుట్టినవాని వలన నీకు జావుతప్పదని" శాపమిచ్చెను. రంభా నందికేశ్వరులవలన గూడ నిట్లే శపింపబడితిని.

౪౦. ఇట్లు రావణుడు తన గృహములో విచారపడుచుండి తుదకు రాముని వలన తనకు మరణము తప్పనిదేయని నిశ్చయించుకొనెను.

౪౧. పిదప రాముడు వచ్చి మూర్ఛితుడై పడియున్న సోదరుని జూచి మనుష్యభావము నాశ్రయించి బహువిధముల దుఃఖించెను.

౪౨. సుషేణుడు పిదప రామునితోఁ నిటులఁ బలికెను. రామచంద్రా! లక్ష్మణునకు వచ్చిన భయములేదు. ద్రోణగిరియందున్న సంజీవిని మొదలగు నోషధులను దీసికొనివచ్చుటకు వెంటనే హనుమంతునిఁ బంపుము. సూర్యోదయము కాకపూర్వము హనుమంతు డోషధులను దీసికొని రావలయునుసుమా!

౪౩. పిదప రామచంద్రమూర్తి హనుమంతునితో నిటులఁజెప్పెను. ఆంజనేయా! నీవు ద్రోణగిరికివెళ్ళి యచ్చటనున్న సంజీవిని మొదలయిన యోషధులను వెంటనే తీసికొనిరావలయును. నీకంటె పరమమిత్రుడు నాకింకెవ్వడును లేడు. ఇదియునుంగాక వేగముగ బోవుటలో నీవు నీ తండ్రితో సమానుడవు. నాయనా! నీ వెట్లయినను నా సోదరుని బ్రతికింపుము.

సూర్యోదయా త్పూర్వే వా౽త్ర స్థాతవ్యం చ పున స్త్వయా
సుషేణకథితం వాక్యం త్వయా౽పి శ్రుతమేవ హి॥ ౪౪

శ్రుత్వా తద్వచనం తథేతి మరుత సూనుర్వినిష్క్రాంతవా
న్పంక్త్యాస్యో౽పి నిశమ్య తద్వికలహృ త్తత్కాలనేమ్యాలయం
గత్వా తేన సదర్ఘ్యపాద్యవిధినా సంపూజితః ప్రాహ తమ్
కష్టం కాలవశా న్మయాపి సముభౌ త్పుత్రా శ్చ భృత్యా హతాః
౪౫

సౌమిత్రి స్తు నిపాతితో భువి మయా శక్త్యా రిపు స్సంగరే
తస్యోజ్జీవన హేతవే ద్య మరుత సూనుస్తు సంజీవనీమ్
ఆనేతుం వ్రజతి ప్రమతం త్వ మధునా మధ్యే మహర్షి ర్యథా
భూత్వా తస్య సమాచారా౽౽శ్రమతలే ప్రత్యూహాకాలా
త్వయా. ౪౬

శ్రుత్వా తద్వచనం దశాననవిభుం తత్కాలనేమి స్తతః
ప్రాహైవం శృణు మే వచో౽సురపతే! కార్యం త్వదీయం పున
ర్నూనం తు క్రియతే మయా నచ పునస్త్వాం దర్శయిష్యామ్యహమ్
మారీచస్య గతి ర్మమాపి భవితా శీఘ్రం నచద్వాపరః ౪౭

పంక్త్యాస్యా౽౽ంజలిపూర్వకం సవినయం త్వాం ప్రార్థయామి
ప్రభో, పుత్రా స్తే నిహతా స్తథైవ సుహృదః పౌత్రా
స్తథా బంధవః, నైకే రాత్రిచరా హతా స్త్వ మధునా
తా న్ఘాతయిత్వా౽౽శరాన్, కిం జీవ స్యనయా తు భూమి
సుతయా కిం రాజ్యభోగై శ్చ కమ్ ౪౮

౪౪౫ హనుమంతా! నీకింకొక సంగతి చెప్పవలయును. సూర్యోదయము కాకపూర్వము నీవిచటను నుండవలయునుసుమా! సుషేణుడు చెప్పిన మాటను నీవుకూడ వినియేయుంటివిగదా!

౪౫౫ ఇట్లురామచంద్రమూర్తిచెప్పగా విని హనుమంతుడు రామచంద్రా! అదియెంతపని, అట్లనే చేయుదుమని చెప్పి వెంటనే బయలుదేరుచుండెను రావణుడు గూఢచారుల వలన హనుమంతుడోషధులకై ద్రోణగిరికిఁ బోవుచున్నట్లు విని వికలమనస్కుడై వెంటనే కాలనేమి గృహమునకు వెళ్లి యతనిచేఁ బూజింపబడి యిట్లు పలికెను. ఓ కాలనేమీ! కాలవశముచే నాకు గూడ కష్టము సంభవించెను. నా పుత్రులు భృత్యులు అందరు హతమైరి.

౪౬౫ నా శత్రువయిన లక్ష్మణుని నేను మయుఁడిచ్చిన మహాశక్తిచే నేలఁ బడగొట్టితిని. కాని యతనిని బ్రతికించుటకై సంజీవిని మొదలగు నోషధులను దెచ్చుటకై హనుమంతుడు ద్రోణగిరికిఁ బోవుచుండెను. నీవు నాకిపుడు చేయవలసిన సహాయమేమనగా, అతడు బోవు మార్గమధ్యమున నీవొక యాశ్రమమును రాక్షసమాయచే గల్పించి నీవు మహర్షివలె వేషము వేసికొని హనుమంతుని కెట్లయినను కాలవిలంబమును విఘ్నమును గలుగఁజేయవలయును.

౪౭౫ ఇట్లు రావణుడు చెప్పగా విని కాలనేమి రావణునితో నిటులఁ జెప్పదొడగెను, రాక్షసరాజా! నీవు నామాట వినుము. నీవు చెప్పిన పనిని జేయుదును. కాని నిన్ను నేను దిరిగి చూడను. పూర్వము నీచేఁ బంపబడిన మారీచుని గతియే నాకు గూడ వెంటనే పట్టును. సందియము లేదు.

౪౮౫ రావణప్రభూ! చేతులు జోడించి వినయపూర్వకముగాఁ బ్రార్థించి చెప్పుచున్నాను వినుము. నీపుత్రులు పౌత్రులు బంధువులు రక్కసులు నీ మూలకముగా హతులైరి. నీవిందఱను జంపించి జీవించిన ప్రయోజన మేమియున్నది? ఇదియునుగాక యీ సీతతో కాని రాజ్యభోగములతో కాని యిక ప్రయోజన మేమియుండును?

సారం తేఽద్య వదామి రాక్షసవిభో భూమ్యాత్మజాతాం భవా
న్నీత్వా యచ్ఛతు రాఘవాయ విభవే రాజ్యం త్వదీయం పున
ర్దేహి త్వం తు విభీషణాయ సహజాయాఽథ వనం సంశ్రితః
ప్రాప్యైకాంత మనస్యయానసతయా రామం భజస్వాఽఽత్మనః
రనా।

ఏవం చేత్కృతపూర్వపాపనిచయో నశ్యేద్ధ్రువాఽజ్ఞే పున
స్త్వాం రాఘుస్తదలం భజస్వ తమరం, పూర్వం తత స్త్వం పునః
ముక్తిం ప్రాప్స్యసి భూమిభారహరణార్థాయాఽవతీర్ణం హరిం
రామం విద్ధి పరాత్పరం చ దనుజోఽస్మాల్లక్ష్మణం చాఽధిప, ॥౧౪॥

శ్రుత్వా తస్య వచోఽమృతేన సదృశం జజ్వాల పఙ్క్త్యానన
ప్రాహైనం మమ శాసనం త్వమధునా ధిక్కృత్య సంభాషసే
త్వామద్యైవ నిహన్మి దుర్మతి మరం శత్రో స్తు కించి ద్భవా
నాదాయ ప్రలపత్యలం త్వితి దశాస్యోక్త స్తమాహాఽఽశరః
॥౧౫॥

క్రోధేనాఽల మధీశ్వరాఽద్య కథితం వాక్యం మయా తే పున
ర్ధ్యానం నో యది రోచతేఽహ మధునాగత్వా కరిష్యామి తత్
ఇత్యుక్త్వా ప్రయయౌ ద్రుతంతు దనుజః పార్శ్వం హిమాద్రేర్గత
స్తత్ర చ్ఛాత్రవృతోఽసురో మునిరివాఽఽసీదాశ్రమే కల్పితే
॥౧౬॥

౪౯ు రావణా! నీకు సారాంశమును జెప్పెదను వినుము. నీవు సీతను దీసికొనివెళ్ళి రామచంద్ర ప్రభువునకు సమర్పించి లంకారాజ్యమును నీసోదరుడైన విభీషణునకు సంతోషపూర్వకముగానిచ్చి నీవు వనమున నేకాంతముగా నితర చింతలేకుండగ రామచంద్రమూర్తిని మనస్సులో ధ్యానము జేసికొనుచు జక్కగా కాలము గడుపుము. వైరభావమును విడిచిపెట్టుము.

౫౦ు రావణా! నేను జెప్పినట్లు నీవాచరించినచో నీవు పూర్వము చేసిన పాపములన్నియు, అగ్నిసంపర్కముచే తూలరాశి (దూది) దగ్ధమయినట్లు దగ్ధమయిపోవును. కావున శ్రీరామచంద్రమూర్తిని భజింపుము శ్రీరాముని భజించుటవలన నీకు ముక్తి చేకూరును. రాముడు సామాన్యమానవుడని భావింపక భూభారహరణార్థమై భూమియందవతరించిన శ్రీమహావిష్ణువని తెలసికొనుము. రాక్షసులను సమూలముగా నశింపజేయుటకై యతడవతరించెను.

౫౧ు ఇట్లు కాలనేమి యమృతతుల్యమయిన మాటలు చెప్పగా విని రావణుడు మండిపడి యిట్లతనితోఁ బలికెను. ఓరీ! కాలనేమీ! నా శాసనమును ధిక్కరించి మాట్లాడుచుంటివా? ఇప్పుడే నిన్ను జంపివేయుదును. నీవు నా శత్రువువలనఁ గొంచెమేదియో ఫలమును బొంది యిట్లు ప్రేలుచుంటివని తలచెదనని పలుకగా కాలనేమి యిట్లు తిరిగి చెప్పెను.

౫౨ు మహాప్రభూ? నీవు కోపగింపకుము. నేను జెప్పినమాట నీకు రుచింపక పోయినచో నేనిప్పుడే వెళ్ళి నీవు చెప్పిన ప్రకారము నేనాచరించెదను. అని చెప్పి వెంటనే కాలనేమి క్షణమాత్రములో హిమాలయప్రాంతమునకు వెళ్ళి యొక యాశ్రమమును మాయచే గల్పించి తానొక మునివేషమును ధరించి శిష్యపరివృతుడై యాశ్రమములో నుండెను.

గచ్ఛ న్నానుతనందనోఽగ్ఘ్యాస మహారమ్యం తదీయాశ్రమం
దృష్ట్వా చింతయ దాత్మనా నహిం పురా దృష్టోమయాఽ
త్రాఽఽశ్రమః, మార్గో భ్రంశితఏవ నాఽత్ర విశయో
యద్వా ప్రవిశ్యా ఽఽశ్రమం, దృష్ట్వైత న్మని మంబు
చాఽత్ర నీరారాం పీత్వా వ్రజేయం గిరిమ్. ౫౩

ఇత్యాలోచ్య తదాశ్రమంప్రతి గతో నత్వా మునిం ప్రాహ తమ్
భో బ్రహ్మం స్తృషయాఽర్దితో హ మిహాచే దస్త్యంబు మే
కథ్యతాం మే, తస్యైత ద్వచనం నిశమ్య ముని రప్యాహాఽ
నిలస్యా ఽత్మజం, పాయం మే త్వ మిదం కమండలుగతం
పీత్వా ఫలం చాఽద్యతామ్. ౫౪

భూతం భావి చ వేద్మ్యహం స్వతపసా సౌమిత్రి రద్యోత్థిత
స్స ర్వోపి ప్లవగా స్త దత్ర మధురం నీరం నిపీయాఽపిచ
భుక్త్వా త్వం చ ఫలాని చాఽఽప్నుహి సుఖం నిద్రా త్వరా
మహాస్తు తే, త చ్ఛృత్వా హనుమా న్మనిం ప్రతి తతః
ప్రాహాఽర్దిత స్తృష్ణయా. ౫౫

నో శామ్య త్యధునా కమండలుజలే నేయం తృషా మే మునే
తస్మాద్దర్శయ మేజలం బహుమునేయత్రాఽస్తివాచ్యంత్వయా
ఇత్యుక్తో ముని రాత్మశిష్య మవద న్నీత్వా తటాకం త్విమం
త్వం సందర్శయతా దముష్య తృషయా సంపీడితస్య ద్రుతమ్.
౫౬

౫౩౪ హనుమంతుడు ద్రోణగిరికి వెళ్ళుచు మధ్యమార్గమున రమ్యముగానున్న యొక గొప్ప యాశ్రమమును జూచి మనస్సులో నిట్లనాలోచించెను. నేను బూర్వము ద్రోణగిరికి వెళ్ళినపుడు మార్గమధ్యమున నీ యాశ్రమము గన్పడలేదు. నే నేమైనను మార్గము తప్పితినేమో, యింతకు సందియములేదు. ఎట్లయినను నేనీ యాశ్రమములో బ్రవేశించి యిందులో నున్న మహర్షిం జూచి యుదకమేమైన నిచ్చట నుండినచోఁ ద్రాగి ద్రోణగిరికిఁ బోవుదునని తలంచెను.

౫౪౪ ఇట్లు మనస్సులో హనుమంతుడాలోచించి యా కాలనేమి యాశ్రమములోనికి వెళ్ళి మునివేషముతో నున్న కాలనేమిని బ్రశ్నించెను. ఓ మునీశ్వరా! నాకు దాహముగా నుండెను. ఇచ్చట జలమెచ్చట నుండెనో నాకుఁ జెప్పవలసినదనుచుండగా, నతని మాటవిని ముని యిట్లు చెప్పెను. నాయనా! జలము నా కమండలములో నున్నది. నీవు నీరు త్రావి ఫలములనుగూడ భుజింపుము.

౫౫౪ ఓ మార్గస్థుడా! నా తపోబలముచే భూతభవిష్యద్వర్తమానములను గుర్తెరుగుదును. ఇప్పుడు లక్ష్మణుని నిమిత్తము ఓషధికొఱకు నీవు వెళ్ళుచుంటివియని కూడ నాకు దెలియును. కాని యతడు లేచెను, వానరులుకూడ లేచిరి కావున తొందరలేదు. నీరు త్రాగి మధురమైన ఫలములను భుజించి సుఖముగాఁ గొంతతడవు విశ్రమింపుము. తొందరపడకుము, అనుటతోడనే హనుమంతుడు తిరిగి బలికెను.

౫౬౪ ఓ మునీశ్వరా! నీ కమండలు జలముతో నాకు దాహము తీరదు. అందువలన నెచ్చట జలము విశేషముగా నుండునో, ఆ ప్రదేశమును జూపుము అని చెప్పుటతోడనే మునీశ్వరుడు తన శిష్యునితో నిట్లుఁ జెప్పెను. శిష్యా! తటాకమునకు నీ వితనినిఁ దీసికొని వెళ్ళి జలమును జూపింపుము. ఇతడు చాల దాహముతో నుండెనని చెప్పెను,

పశ్చాదేవ మువాచ మారుతసుతం తత్కాలనేమిః పున
ర్గత్వా తత్ర సరోవరే నేత్రయుగళం పీత్వా జలం మేఽంతికమ్
ఆగచ్ఛ త్వాం సముపైమ్యహం మంత్ర మపి తే సర్వార్థసిద్ధిప్రదమ్
వక్ష్యామీతి మరుత్సుత స్తదుదితః ప్రాగా త్తటాకాంతికమ్. ౫౭

ప్రావిశ్యాథ జలాశయం పవనజో యావత్పిబ త్యాగతా
కాచి ద్వై మకరీ తు తత్పద మరం జగ్రాహ సోప్యాశు
తాన్, హస్తాభ్యాం మకరీం వ్యదారయ దలం ప్రాణై
ర్వియుక్తాథ సా, ముక్త్వా శాప మదృశ్యతాథ మకరీ
దివ్యాంగనారూపిణీ. ౫౮

పశ్చాదేవ మువాచ తం పవనజం సా దివ్యరూపాంగనా
పూర్వం మారుతినందనాహ మభవం స్వర్గే ధాన్యమాలిన్యహమ్
శప్తా కేనచి దీదృశీ తు మకరీ జాతా ప్రసాదా చ్చ తే
ముక్తాఽద్యాస్మ్యహ మాశ్రమే తు భవతా దృష్టో ముని
ర్నైష ధ్రువమ్. ౫౯

కాలనేమి ర్మహామాయో దనుజాధిపచోదితః
మార్గమధ్యేఽంతరాయం తే కర్తుం తు మునిరూపధృత్
కల్పయిత్వాఽఽశ్రమం త్వేకం మాయయా తత్ర తిష్ఠతి
జహి దుష్టమిమం శీఘ్రం కాలనేమిం త్వ మాశరం
ఇత్యుక్త్వా సాఽప్యగా త్స్వర్గం మారుతి శ్చాఽఽశ్రమం గతః
నిరీక్ష్య మారుతిం సోపి దేహి మే గురు దక్షిణామ్
ఇత్యుక్తో మారుతి శ్శీఘ్రం ముష్టినా హతవా న్మునిం
తేన ముష్టిప్రహారేణ కాలనేమి ర్మమార సః. ౬౦-౬౧-౬౨-౬౩

౫౭ పిదప కాలనేమి హనుమంతునితో గూడ నిటులఁబలికెను, నీవు కొలను దగ్గరకు వెళ్ళి కన్నులు మూసుకొని కొలనులోని నీరును ద్రాగుము. ఆలస్యముచేయక వెంటనే యిటకురమ్ము. నీవు వచ్చినపిదప నీకొక సిద్ధమంత్రమును గూడ నుపదేశించెదను. ఆ మంత్రము సర్వార్థసిద్ధికరమైనది. అని చెప్పగా. వెంటనే యతని శిష్యునివెంట హనుమంతుడు కొలను దగ్గరకు వెళ్ళెను.

౫౮ పిదప హనుమంతుడు కాలనేమి చెప్పిన విధముగనే కన్నులు మూసికొని కొలనులో దిగి నీరు త్రాగుచుండగా, ఒక మొసలి హనుమంతుని కాలుపట్టుకొని లోపల కీడ్చుకొని పోవుచుండగా, హనుమంతుడు తన రెండు చేతులతో బట్టుకొని దానిని జీల్చిజంపెను. ఆ మొసలి ప్రాణములను విడిచిన పిదప దివ్యరూపమును ధరించి యొక దివ్యాంగనగానయ్యెను.

౫౯ పిదప హనుమంతునితో నా దివ్యాంగన యిట్లు పలికెను. హనుమంతా! నేను పూర్వము ధాన్యమాలిని యను నొక గంధర్వ స్త్రీనై యుంటిని. ఒకానొకని శాపముచే నిట్లు మొసలి నైతిని. నీ యనుగ్రహముచే శాపవిముక్తి నొందితిని. నీచే నిపుడాశ్రమములో జూడబడినవాడు మునీశ్వరుడు కాడుసుమా!

౬౦-౬౧-౬౨-౬౩ అతడెవ్వడో చెప్పెదనువినుము. మహామాయికుడైన కాలనేమియే యిట్లు మునివేషముతోనుండెను. రావణుడు పంపగా మధ్య మార్గమున నీకు విఘ్నము చేయుటకై మునివేషమును ధరించి యొక యాశ్రమమును గూడ గల్పించుకొని యిచ్చట నుండెను. వాడు దుర్మార్గుడు, రాక్షసుడు. వానిని వెంటనే చంపుము. ఇట్లు చెప్పి యా దివ్యాంగన (దేవతా స్త్రీ) స్వర్గమునకేగెను. హనుమంతుడును కాలనేమియొద్దకురాగా, హనుమంతుని జూచి కాలనేమి యిట్లనెను. మంత్రము నుపదేశించెదను కాన గురుదక్షిణ నిమ్మనగా, ఇదిగో యిచ్చుచుంటినని చెప్పి హనుమంతుడు పిడికిలితో వాని రొమ్ములో నొకపోటు పొడవగా, ఆపోటుతో వాడు చచ్చెను.

పశ్చాత్ క్షీరనిధిం గతః పవనజో దృష్ట్వా చ తస్యాంతికే
ద్రోణాద్రిం త్వనిరీక్ష్య తత్ర మహతీం సంజీవినీ మోషధీం
ఉత్పాట్యాఽచలమేవ మూర్ధని వహన్ ప్రత్యాహకృత్వాలకాన్
జిత్వాఽగ్రేణ పథా సమేతి చ పున స్సాకేతమార్గా ద్ధ్రుతమ్
౬౪

కైకేయీతనయో రాత్రౌ దుస్స్వప్నం వీక్ష్య సత్వరం
బహి రాగత్య గగనం పశ్యతి స్మ తదంతరే
ఆయాంతం గిరిణా వీక్ష్య మహాభూత మితి భ్రమాత్
శరేణ పాతయామాస తచ్ఛిరస్థం గిరిం పునః. ౬౫

మారుతి శ్చాఽపి తం వీక్ష్య రాఘవోఽయ మితి భ్రమన్
ప్రాహ తం భరతం రామ! కథ మత్రాఽఽగత స్త్వితి
కించైవం ప్రాహ తం భూయో దశాస్యేన జితో భవాన్
నాగతః కిన్న్వితి ప్రోక్తో భరత స్తం నిశాచరం
మత్వా ధనుషి సంధాయ శరం త్యక్తుం సముద్యతః
శరహా స్తం తు భరతం నిరీక్ష్య పవనాత్మజః
భుభుక్కుర్వం స్తదా ప్రాహ భరతం వినయాన్వితః.
౬౬-౬౭-౬౮

నాఽహం రాత్రిచర స్సమీరణసుతో నామ్నా హనూమా
న్విభోః, దూతో భూమిసుతాపతే ర్నమ బలం పశ్యేతి
వాచం పునః, శ్రుత్వా తం భరత స్తదాఽఽహ తవ

౬౪ పిదప హనుమంతుడు క్షీరసముద్రమునకేగి యా సమీపములో నున్న ద్రోణగిరినిఁ జూచెను. కాని సంజీవిని మొదలగు నోషధులచ్చట నతనికెంత వెదకినను గన్పడనందున, ఆ పర్వతమునే పెకలించి నెత్తిమీదఁ బెట్టుకొని తీసికొని రాబోవునంతలో, అచ్చటఁ గావలియున్న కోట్ల కొలది గంధర్వులు హనుమంతుని మీదను గలియబడగా, పర్వతమును నెత్తియందే యుంచుకొని వాలమును బెంచి యాతోకతో గంధర్వులనుఁ జితుకకొట్టి గగన మార్గముగా హనుమంతుడు వేగముగా, అయోధ్యా పట్టణముమీదుగా వచ్చుచుండెను.

౬౫ ఆరాత్రి సమయమున నందిగ్రామములో నున్న భరతుడు దుస్స్వప్నమును గని లేచి బయటకు వచ్చి యాకసము వంక చూచుచుండ నా సమయమున గగనమార్గముగ కొండ నెత్తిమీద బెట్టుకొని వచ్చుచున్న హనుమంతునిజూచి యేదిరో యది పెనుభూతమని భ్రమించి వెంటనే ధనుస్సునందు బాణ మెక్కుపెట్టి కొట్టగా, ఆ దెబ్బతో హనుమంతుని నెత్తిమీదనున్న కొండ క్రిందబడెను.

౬౬-౬౭-౬౮ హనుమంతుడును, ఆ భరతునిఁజూచి రాముడని భ్రమపడి "రామచంద్రా! నీ విచటికెట్లు వచ్చితివని భరతునిఁ బ్రశ్నించుటయే కాక, నీవేమైన రావణునిచే జయింపబడి రాలేదుగదా! యని పలుకగా, భరతుడతనిని రక్కసునిగాఁ దలచి మఱియొక బాణమును ధనువునందెక్కుపెట్టి యతనిని గొట్టనుద్యమించు నంతలో, హనుమంతుడు భుభుక్కారము చేసి వినయపూర్వకముగా భరతునితోఁ నిటులఁబలికెను.

౬౯ నేను రాక్షసుడను కాను. వాయునందనుడను హనుమంతు డను పేరుగలవాడను. మఱియు రామచంద్రమూర్తికి దూతను. నామీదికి నీవేల యీ దూకుచున్నావు. నాబలమును జూపించెదను చూడుమని చెప్పునంతలో భరతుడు హనుమంతునితోఁ దిగిన యిట్లనియెను.

తద్రామేణ జాతః కథం, సంబంధో వద మే సవిస్తర మితి
ప్రోక్త స్త మాసతః ఖలమ్. ౬౯

శ్రుత్వా తన్ముఖతః ఖలం తు భరత స్సంప్రాప్య హర్షం శుచం
పశ్చా ద్వ్యాపతితం గిరిం సజలరేణుం దా న్మరుత్సూనవే
సోఽపి గిరి శ్చ గిరిం వహ న్స్వశిరసా గత్వా పురాఽరోదయా
త్సౌమిత్రిం ప్లవగా నజీవయ దరం సంజీవినీమూలతః. ౭౦

భరతస్య నివేద్యాఽఽశు చరితం రాఘవాయ సః
తదీయానుజ్ఞయా శైలం పునర్నీత్వా యథాస్థలే
సంస్థాప్య పున రాగచ్ఛ స్తత్క్షణో జీవిత స్త్వితి
సంశ్రావ్య భరతాయాఽఽశు లంకాం ద్రుత ముపాయయౌ
సర్వా నా కార్యచ తతో భరతోఽథ నృపోత్తమాన్
రాఘవస్య సహాయార్థం లంకాం గంతుం చ తై స్సహ
సమాలోచయతిస్మాఽఽశు మంత్రిభి శ్చ తదాపునః. ౭౧-౭౨

ఇత్యాశ్చర్యరామాయణే యుదకాండే
షోడశస్సర్గ స్సమాప్తః

---

## సప్తదశస్సర్గ

పశ్చా త్ప్రహి దశాననో ఽప్యనుచరా నేత ద్వచః ఖన్నహృ
ద్గత్వా యాయ మరం మహాబలయుతౌ మైరావణైరావణౌ
సంశ్రావ్యాఽఖలవృత్త మాసయత తా వేవం ప్రభూక్తా స్తు తే
గత్వా తా వవద ద్దశాననవచ స్సుప్రశ్రయం రాక్షసాః ౧

నాయనా! నీవును మా రామచంద్రమూర్తికిని సంబంధ మెట్లు కల సెనో చెప్పుమని యడుగగా హనుమంతుడు జరిగిన వృత్తాంతము నంతను సంక్షిప్తముగా జెప్పెను.

౭౦ హనుమంతునిద్వారా రామచంద్రమూర్తి వృత్తాంతమునంతను విని విచారపడి భూమియందు బడిపోయిన ద్రోణగిరిని తన బాణము చేతనే హనుమంతునకు దిరిగి యందిచ్చెను. హనుమంతుడు పిదప ద్రోణగిరిని నెత్తిన బెట్టుకొని సూర్యోదయమునకు బూర్వమే రాముని సన్నిధికేగి సంజీవిని మొదలగు నోషధులచే లక్ష్మణుని వానరులనుగూడ బ్రతికించెను.

౭౧-౭౨ భరతుని చరిత్రనుగూడ హనుమంతుడు రామచంద్రమూర్తికి జెప్పి రామాజ్ఞచేఁ దిరిగి యా పర్వతమును దీసికొనివెళ్ళి యథాస్థలమున బ్రవేశపెట్టి వచ్చుచు మధ్యమార్గములో, అనగా అయోధ్య దగ్గరకు వచ్చి 'లక్ష్మణుడు బ్రతికినాడని' భరతునితో కేకవేసి చెప్పి క్షణ కాలములో లంకకుఁ దిరిగివచ్చెను. భరతుడు పిదప సామంతరాజుల నందఱను బిలిపించి రామునకు సహాయమునకై మీరు సైన్యములతో వెంటనే బయలుదేరవలయునని తన మంత్రులతో నాలోచించు చుండెను.

ఆశ్చర్య రామాయణమున యుద్ధకాండమున
పదునాఱవసర్గము సమాప్తము.

---

## పదునేడవసర్గ ప్రారంభము

౧ పిదప రావణుడు ఖిన్నుడయి తన యనుచరులతో నిట్లు పలికెను. ఓ రక్కసులారా! మీరలు తొందరగా పాతాళ లోకమునకు వెళ్లి మహాబల శాలురగు నైరావణ మైరావణులకు నిచటి నా కష్టమును వివరించి యిచ్చుటకు వారలను దీసికొని రండని రావణుడు చెప్పగా, వారలు వెంటనే యచటకేగి వారలతో సవినయముగ రావణుని కష్టదశను జెప్పిరి.

శ్రుత్వా తద్వచనంతు విహ్వలహృదా ప్రావోచతాం తాన్వవో
లంకా మేత్య నిశి ధ్రువం తు సహజా వావాం తు తౌ రాఘవౌ
హృత్వాఽఽనీయ బలిం దదావ త దిదం గోప్యం దశాస్యంవినా
నాఽన్యేషాం కథనీయ మిత్యభిహితా గత్వాఽవదం స్తే ప్రభుమ్
౨

విభీషణస్య సచివా భూత్వా శకునయ స్తదా
రావణాలోచితం కార్యం విజ్ఞాయ ద్రుత మాగతాః
విభీషణాయ త త్ప్రాహు స్తత స్సంచింత్య తే పునః
సుగ్రీవప్రముఖా స్సర్వే ప్రాకార మివ వానరాన్
పరికల్ప్య ముఖద్వారే హనూమంతం నివేశ్య చ
సేనామధ్యస్థితౌ రామలక్ష్మణౌ తౌ న్యవేశయన్
జాగరూకా శ్చ పశ్యంతో దిశో దశతు తే స్థితాః. ౩-౪-౫-౬

పాతాళా దథ నిర్గతౌ నిశి పున ర్మైరావ ణైరావణౌ
లంకా మేత్య దశాననంపున రవేక్ష్యాఽఽశ్వాస్య కార్యక్రమమ్
తస్మై సర్వ మనూద్య సంగరభువం గత్వా ప్లవంగైః కృతమ్
వ్యూహం వీక్ష్య సువిస్మితౌ న్యపతతాంమధ్యేఽంబరా త్తౌపునః ౭
ఏవం ద్వా ववరుహ్య మోహకరజ స్సైన్యే వికీర్య ద్రుతం
కృత్వా మోహవశం ప్లవంగమబలం పశ్చా చ్ఛిలాభ్యంతరే
తిష్ఠంతౌ రఘుపుంగవా వపి తథా కృత్వాఽథ తౌ రాఘవౌ
హస్తాభ్యాం పరిగృహ్య చాఽంబరతలం తూత్ప్లుత్య తౌ జగ్మతుః
తస్మాఽవరుహ్య గగనా ద్రాక్షసౌ తౌ తు రాఘవౌ
పాతాళ మాత్మనో స్థానం నిన్యతు స్త్వ క్రమా న్నిశి. ౮-౯

౨ రక్కసులు చెప్పిన మాటలను విని ఐరావణ మైరావణులు విచారపడి వారలతో నిట్లుఁ బలికిరి. ఓ దూతలారా! యీ రాత్రికి మేమిర్వురము లంకకువచ్చి రామలక్ష్మణుల నిర్వురను మా మాయాబలముచే నపహరించి యిచ్చటకుఁ దీసికొనివచ్చి దేవికిబలియిచ్చెదము. ఈ రహస్యము రావణునకుఁ దప్ప నితరులకుఁ దెలియగూడదని చెప్పగా, వారలు తిరిగి లంకకువచ్చి రావణునకాసంగతి జెప్పిరి.

౩-౪-౫-౬ విభీషణుని మంత్రులు నల్వురును గూఢచారులుగా నుండి పక్షివేషములతోఁ దిరుగుచు, రావణుఁడాలోచించిన యీ రహస్య కార్యమును వారలు తెలిసికొని వెంటనే విభీషణునియొద్దకువచ్చి రావణుని పన్నుగడను జెప్పిరి. పిమ్మట విభీషణుడు సుగ్రీవుడు మొదలగు పెద్దలందఱు నాలోచించి వానరులనందఱను నొక ప్రాకారమునువలె వ్యూహము నేర్పరచి యా వానరసైన్యముయొక్క ముఖద్వారమున హనుమంతుని గావలియుంచి, రామలక్ష్మణులను సేనామధ్యభాగమున నొక శిలాఫలకమున గూర్చుండబెట్టి సుగ్రీవుడు మొదలగు వారలుజాగరూకులై నలుదిక్కులను బరికించుచు నారాత్రి భాగమున జాగరతగ నుండిరి.

౭ పిమ్మట రాత్రిభాగమున, ఐరావణ మైరావణు లిరువురును పాతాళమునుండి బయలుదేరి లంకకు వచ్చి రావణుని జూచి యోదార్చి తాము చేయబోయెడి కార్యక్రమము నతనికిఁ జెప్పి వెంటనే యుద్ధభూమికి వెళ్ళి వానరులచే నేర్పరుపబడిన వానర ప్రాకారమును జూచి విస్మయమంది గగనమార్గముగా వారలెగిరి సేనా మధ్యభాగములోనికి పైనుండి దిగిరి.

౮-౯ ఇట్లైరావణ మైరావణు లిరువురునుదిగి సైన్యముమీద మచ్చుచల్లి వానరసైన్యమునంతను మూర్ఛిల్లఁజేసి రాతిమీద గూర్చుండియున్న రామలక్ష్మణులనుగూడ నట్లే చేసి పిమ్మట రామలక్ష్మణు లిరువురను చేతులతో నెత్తుకొని పైకెగిరి కొంతదూరము గగనమార్గమున వెళ్ళి పిదప భూమిమీదకుదిగి, క్రమముగా రామలక్ష్మణులను తమ నివాసస్థానమయిన పాతాళలోకమునకుఁ దీసికొనిపోయిరి.

పశ్చాద్విముక్తమోహాస్తే వానరా రాఘవౌ తు తౌ
అదృష్ట్వా ఖిన్న మనస శ్చింతయంతిస్మ నైకథా
తా వన్వేష్టుం మరుత్సూనుః పాదచారేణ సర్గతః
విచిన్వ న్నరిమశః పశ్చాదాగ ... భూ ... కుంభిలామ్. ౧౦-౧౧

తత్రైకా స్వపతిం కపోత్యథ మిథః ప్రాహ ప్రసన్నం వచో
నాథాహం ఖలు గర్భిణీ త దధునా వాంఛా స్పృహాంసే స్తిమే
మద్వాంఛాం పరిపూరయేతి కథితే జాయాం కపోతో వద
ప్రాణేభ్యోపి గరీయసీ త్వ మబలే వాంఛా-ద్య తే పూర్యతే
౧౨

పాతాళాధిబద్ధై త్ర్యాభ్యాం సమానీతౌ హి రాఘవౌ
దేవ్యాలయే ధ్రువం దేవీప్రీతయే తౌ వధిష్యతః
తస్మి న్నవసరే గత్వా నరమాంసం తు కంచన
సమానీయ ప్రదాస్యామి చింతాం సంత్యజ మానసే
శ్రుత్వా తద్వచనం తుష్ట స్సమీరణసుత స్తదా
పాతాళ మగమ త్క్షిప్రం ద్వారపో మకరధ్వజః
ధృత్వా పవనజం ప్రాహ క స్త్వ మాగా త్కుతో భవాన్
ఇత్యుక్తః ప్రాహ హనుమా న్వచనం మకరధ్వజమ్.
౧౩-౧౪-౧౫-౧౬

రామలక్ష్మణనామానౌ దాసవాభ్యా ముభావపి
పాతాళం తు సమానీతౌ వేత్సి తౌ యది మే వద
ఇత్యుక్త స్తం పునః ప్రాహ మారుతిం మకరధ్వజః. ౧౭

౧౦-౧౧ పిమ్మట గొంతసేపటికి వానరు లందఱు మత్తు నుండి విడుదలబడిన వారలై రామలక్ష్మణులను జూడగా వారు కన్పడరైరి. అందుచే వానరులు కడు ఖిన్నులయి యనేక విధముల కర్తవ్య మాలోచించు చుండిరి. ఈ సమయములో హనుమంతుఁడు రామలక్ష్మణులను వెదకుచు గాలినడకతో బయలుదేరి నికుంభిలకు వెదకుటకై వచ్చెను.

౧౨ ఆ నికుంభిలయను రహస్య స్థానములో నొక యాడుపావురము మగ పావురముతో నిటులఁ బలుకుచుండెను. (ఏమన) నాథా! నేను గర్భవతినిగానుంటి గాన క్రొత్తవస్తువుల మీదను ప్రేమ కలుగుచుండును. నాకిపుడు నరమాంసముమీద వాంఛ కలుగుచుండెను. నా కోరికను పూర్తి చేయుమని పలుకగా, మగపావురము తన భార్యతోఁ నిటులఁ బలికెను. నాకు నీవుప్రాణములకంటె నెక్కువగ నిష్టురాలవు. కాన నీకోరికను నేను దప్పక తీర్చెదను.

౧౩-౧౪-౧౫౧౬ వెంటనే నీకోరిక నెరవేరునుసుమా! పాతాళలోకమున కధిపతులయిన యైరావణ మైరావణులు రామలక్ష్మణులను కాళికాలయములో బలియిచ్చెదరు. ఆ సమయమున నేను వెళ్ళి కొంచెము నర మాంసమును దీసికొనివచ్చి నీకిచ్చెదను. నీవు విచారపడకుము. అని చెప్పుచుండ, ఆ మాటలను హనుమంతుడు విని సంతోషించి తొందరగా తాను పాతాళలోకమునకేగెను. అచ్చట ద్వారపాలకుడుగా నున్న మకరధ్వజుడు లోపలికిఁ బోవుచున్న హనుమంతుని చేతిని గట్టిగ పట్టుకొని "నీవెవ్వడవు? నీ వెక్కడనుంచి వచ్చుచుంటివి? అని యడుగగా హనుమంతుడు మకరధ్వజునితో నిటులఁ బలికెను.

౧౭ ఓ ద్వారపాలకా! యిచ్చట ప్రభువుగా నున్న రక్కసులు రామ లక్ష్మణులను పాతాళలోకమునకుఁ దీసికొనివచ్చినట్లు తెలిసి వచ్చితిని. నీకేమయినను దెలిసినచోఁ జెప్పుమనగా, మకరధ్వజుడు తిరిగి హనుమంతునితోఁ నిటులఁ బలికెను.

తాతో మే హనుమాం స్తు తస్య నికటే క్షేమేణ కిం వర్తతే
బ్రూహీ త్యస్య వచో నిశమ్య మరుత స్సూను స్తదా విస్మితః
ప్రాహైవం మకరధ్వజం హనుమతః పత్న్యేవ నాసీ త్సుతః
పుత్రో౽భూ ద్వచనం తు తే న హి మయా విశ్వాసయోగ్యం
ధ్రువమ్. ౧౮॥

ఇత్యుక్తో మకరధ్వజః పవనజం ప్రాహైవ మార్య! ధ్రువమ్
దగ్ధ్వా మే జనకో దశాననపురీం వాలం నిజం సాగరే
కర్తుం శీతల మాశు సాగర మధో గత్వా స్వవాలం జలే
నిక్షిప్యా౽౽త్మగళస్థ మక్షిపదరం శ్లేష్మాపి తత్సాగరే. ౧౯॥
మాతా మే మకరీ తు భక్షితవతీ త చ్ఛ్లేష్మ గర్భి ణ్యభూ
త్సంభూతో౽స్మ్యహమేవ మద్య సకలం సత్యం మదుక్తం విభో
ఇత్యుక్తః పవనాత్మజో౽వద దిదం సో౽హం నచ ద్వాపర
స్త్విత్యుక్తః ప్రణనామ సో౽పి పితరం వృత్తం చ తస్యా౽వదత్.
౨౦॥

కించైవం త మువాచ సో౽థ పితరం తద్రాఘవౌ శ్వః పునః
కామాక్ష్యాస్తు బలింప్రదాతు మసురౌ నిశ్చిక్యతు స్తౌ ద్రువమ్
గత్వా త్వం ద్రుత మద్య తత్ర రహసి స్థిత్వా చ తద్రాఘవౌ
హృత్వా త్వం వ్రజ చేతి తేన కథితో వవ్రాజ సూక్ష్మాకృతిః.
౨౧॥

తద్దేవ్యాలయసంస్థితో౽థ మరుత స్సూనుః కవాటం పున
ర్బద్ధ్వాతిష్ఠ త్తతో౽సురా వపచితిం దేవ్యా విధాతుం శనైః

౧౮౪ మా తండ్రియయిన హనుమంతుడు రాముని సమీపమున దూతగా నుండెను. అతడు క్షేమముగా నుండెనా? అని ప్రశ్నించుటతోడనే హనుమంతు డాశ్చర్యపడి మకరధ్వజునితో నిటుల బలికెను. ఓరీ! హనుమంతునకు భార్యయే యింతవరకు లేదే! అతనికి కుమారు డెట్లు పుట్టెను? ఇది యాశ్చర్యముగా నుండెను. నీమాట విశ్వసింప దగినదిగా లేదనియెను.

౧౯౪-౨౦౪ ఇట్లు చెప్పుటతోడనే మకరధ్వజుడు హనుమంతునితో నిటులఁ బలికెను. మా తండ్రియయిన హనుమంతుడు సీతాన్వేషణమునకై లంక కేగినపుడు లంకను దగులబెట్టి తన తోకను జల్లార్చుకొనుటకై సముద్రమునకేగి యచ్చట తోకను చల్లార్చి తన గొంతుకలోనున్న శ్లేష్మమును సముద్రములో నుమియగా, దానిని నా తల్లియగు మకరి (ఆడు మొసలి) మ్రింగెను. వెంటనే నాతల్లి గర్భవతియై నన్ను గనెను. నేను జెప్పినదంతయు సత్యము-అని చెప్పగా, నిజమని నమ్మి "నాయనా! నేనే యతడను" అని చెప్పగా, వెంటనే మకరధ్వజుడు తండ్రికిఁ బ్రణమిల్లి యిట్లు పలికెను.

౨౧౪ తండ్రీ! రామలక్ష్మణులను కామాక్షీదేవికి బలియిచ్చుటకై యైరావణ మైరావణులు నిశ్చయించిరి. కాన నీవు ముందుగనే యా దేవ్యాలయమునకేగి దానిలోపల రహస్యముగానుండి యా రామలక్ష్మణుల నచటకు వారలు బలియిచ్చుటకై తీసికొనివచ్చినపుడు వారలను సంహరించిపొమ్ము. అని చెప్పగా వెంటనే హనుమంతుడు సూక్ష్మరూపముతో దేవ్యాలయమునకు వెళ్ళెను.

౨౨౪ పిదప హనుమంతుడు దేవ్యాలయములోపల బ్రవేశించి లోపల కవాటమును బంధించి కూర్చుండెను. పిమ్మట, ఐరావణ మైరావణులు దేవిని బూజించుటకై మెల్లగా వచ్చుటకు వచ్చిరి. హనుమంతు

ఆగాతాం పవనాత్మజోఽపి దనుజౌ దేవీస్వరేణాఽఽహ తౌ
కార్యా న్మేఽపచితి ర్గవాక్షవివ రేణైవాఽఽశరాభ్యాం ద్రుతమ్.
౨౨॥

కోదండాశుగధారిణౌ చ కుసుమై స్సంపూజితౌ రాఘవా
వానీయాఽఽశు సజీవ మత్ర తు యువాం కించిత్సముద్ఘాట్యవై
ద్వారం ప్రేమయుతం శనై ర్నరవరౌ మా పశ్యతం మాం
యువాం, కించ ద్వా వపి శస్త్రవర్జితకరౌ స్థేయా యువా
మాలయే. ౨౩॥

తద్దేవీవచనేన తా వపి పరం తుష్టౌ గవాక్షేణ త
త్పూజామాశువిధాయభక్ష్యనివహంశ్చాఽముంచతామాలయే
కించ స్వాదుఫలాని తత్ర దనుజౌ దేవ్యంతికేఽముంచతామ్
దృష్ట్వా తన్మరుదాత్మజోఽపి దనుజౌ దేవీస్వరేణాఽఽహ తౌ.
౨౪॥

క్షుచ్ఛాంతి న్మే ఫలభక్ష్యభోజ్యనివహో దృష్టో భవద్భ్యామయం
స్వల్పోఽభూ న్మమ తృప్తి రస్తి నహి తై రేతైః పదార్థై
ర్ధ్రువమ్. ఇత్యుక్త్వా దనుజౌ ద్రుతం త్వనుచరై స్సర్వా
న్పదార్థాన్ పురా, దానాయ్యాఽపి వితీర్య తృప్తి మధికాం
దేవీం శ్రమా న్నిన్యతుః. ౨౫॥

డును దేవిపలికినట్లుగా వారలనుద్దేశించి యిట్లు పలికెను. ఓ రాక్షసులారా! మీరలు నాకుఁ జేసెడి పూజయంతయు కిటికీలోనుండి చేయవలయును.

౨౩౹ ఓ రక్కసులారా! మీరలు గామలక్ష్మణులను పుష్పాదులచేఁ బూజించి కొంచెముగా తలుపు తెరచి వారలనిద్దరను సజీవులనుగా నే లోపలకు బంపవలయును. వారలను లోనికి బంపునపుడు వారలచేతులలో ధనుర్బాణము లుండవలయును. మీరలు వన్ను మాత్రము చూడగూడదు. ఇదియునుగాక మీరలిరువు ధనుర్బాణములను ధరింపగూడదు సుమా!

౨౪౹ ఇట్టి మాటలు విని యా రక్కసులు దేవి తమయందు ప్రసన్నురాలయి మాట్లాడినదని తలంచి మిక్కిలి సంతోషముగల వారలయి కిటికీ చువ్వలలోపల నుండియే దేవినిఁ బుష్పాదులచేఁ బూజించి, పిదప భక్ష్యరాసులను నివేదనమునకై లోపలకు వారలు గుట్టలు గుట్టలుగాఁ బడవేయుచుండిరి. మఱియు, ననేకవిధములయిన ఫలములనుగూడ లోపలపడవేయుచుండ హనుమంతుడు వాని నన్నిటిని భక్షించుచుండెను.

వారలు తిరిగి ఫలములను బడవేయుచుండిరి. దేవి పలికినట్లుగ హనుమంతుడు పిదప రక్కసులతో నిటులఁబలికెను.

౨౫౹ ఓ రాక్షసులారా! మీరలు కష్టపడి భక్ష్యభోజ్యరాసులను ఫలములనుగూడ నాకు సమర్పించితిరి. కాని నాకుఁ దృప్తిగలుగలేదు. ఈ స్వల్పపదార్థములవలన లాభములేదు. ఎచ్చటనైనను వెదకి యింకను భక్ష్యభోజ్యాదులను దెప్పింపుడని పలుకగా, రక్కసులాశ్చర్యపడి పట్టణములలోనున్న రక్కసులయిండ్లలోని తినుబండారముల నన్నిటిని క్షణములో దూతలచేఁ దెప్పించి కిటికీలగుండగ లోపలబడవేసి దేవిని దృప్తిజెందించిరి.

పశ్చాద్రాఘవలక్ష్మణౌ తు కుసుమై ర్దైత్యా వలంచక్రతు,

స్తూద్ఘాట్యాఽథ కవాట మీాష దనఘా వంతః ప్రవేశ్యాఽనుజౌ
ద్వారా త్తౌ దనుజౌ బహి ర్వ్యవసతాం భృత్యాదిభి ర్వేష్టితౌ
పశ్చాద్దాశరథీ సమీరణసుతో నత్వా మిథః ప్రాహ తౌ. ౨౬

విలంబేన విభో తేఽలం బహి రాగచ్ఛ సత్వరం
శరచాపాసి ధారీ త్వం సహ సౌమిత్రిణా ద్రుతం
ఇతి తత్కర్ణయో రాహ సమీరణసుతః పునః. ౨౭-౨౮

నిర్గత్యాఽఽశు బహి స్తు తౌ నృపసుతౌ దైత్యౌ తదీయాన్ శరై
ర్విచ్ఛిన్నాని చక్రతు స్తదను తౌ దైత్యౌ పునర్జీవితౌ
ఏవం తౌ శతవార మాశరవరౌ హత్వాపి నాఽభూన్మృతి
స్తస్మా ద్విస్మయసంయుతః పవనజో జ్ఞాతుం చ బీజం త్వగాత్.
౨౯

కాంచి ద్ద్వారతలే స్థితాం పవనజోఽప్యన్వీక్ష్య పప్రచ్ఛ తామ్
దైత్యౌ నో మృతి మాప్నుతో బహుశరై స్సంఛిద్యమానా వపి
నో పశ్యా మ్యహ మత్ర హేతు మబలే జానాసిచే త్త్వం ద్రుతం
మహ్యాం బ్రూహి కృపాం విధాయ భవతీసంప్రార్థితం దీయతే.
30

ఐరావణసమానీతాం భోగపత్నీం చ తస్య తు
మైరావణః ప్రతిదినం బాధతే మా మయం ధ్రువం
ద్వయోః క్రీడాం ప్రదాతుం నే శక్తి ర్నాస్తి తథోఽధునా

౨౫-౬ పిదప దేవి చెప్పినరీతిగ రామలక్ష్మణులను బూలచేఁ బూజించి యలంకరించియు కొంచెముగ తలుపుదెరచి రామలక్ష్మణులనులోపలికి బంపి తాము బయటనేయుండిరి హనుమంతుడు రామలక్ష్మణులకు నమస్కరించి రహస్యముగ నిట్లు పలికెను.

౨౭-౨౮ రామలక్ష్మణులారా ! యిక యాలస్యమేల ? వెంటనే బయటికి రండు. ధనుర్బాణధారులయియేయుంటిరికదా! అని మెల్లగా జెప్పెను.

౨౯ ఆ రామలక్ష్మణులు వెంటనే బయలుదేరి యైరావణ మైరావణులను వారి సంబంధీకులగు రక్కసులనుకూడ శరపరంపరలచే హతులనుగా జేయుచుండిరి. కాని యైరావణ, మైరావణులు మాత్రము తిరిగి జీవించుచుండిరి. అనేక పర్యాయములు రామలక్ష్మణులు వారలను జంపిరి కాని వారలకు మృతి కలుగనందున హనుమంతుఁడందులకు విస్మయమొంది వారలు చావకపోవుటకు గారణమేదియో యుండి యుండునని దానిని దెలిసికొనుటకై పురములోనికి బయలు దేరెను.

30 హనుమంతుడిట్లు బయలుదేరి పురవీధులవెంట దిరుగుచుండగా, ఐరావణుని యుంపుడుకత్తె యొకతె తన యింటి బహిర్ద్వారమున నుంచుని చూచుచుండెను. ఆమెను జూచి హనుమంతుఁడు నిటులఁ బలికెను, ఐరావణ మైరావణులను రామలక్ష్మణులు శరపరంపరలచే జావకొట్టినను జచ్చుటలేదు. కారణము గోచరించుటలేదు. అమ్మా! నీ కేమైనను దెలిసినచో దయయుంచి నాకుఁ జెప్పుము. నీవు కోరిన దాని నిచ్చెదను. (అని హనుమంతుడు పలికెను)

3౧-3౨-33 ఐరావణుని యుంపుడుకత్తె తన మనస్సులో నిటులఁ జింతించెను. ఐరావణునిచే దీసికొని రాబడి యతనికి భోగపత్నిగా నున్న నన్ను మైరావణుడు కూడ తనతో భోగింపమని బాధించు చుండెను. వానితో గూడ భోగించుటకు నాకు శక్తి లేకపోయెను.

ద్వయో ర్వధే రాఘవం తం వృణోమీతి విచింత్య సా
మారుతిం ప్రాహ రామో మాం స్వస్త్రియం చే ద్విధాస్యతి
తయో ర్మృత్యు ర్యత శ్శీఘ్రం భవే ద్వచ్మి న సంశయః.
౩౧-౩౨-౩౩

ఇత్యుక్తో మారుతి శ్చాఽపి సంచింత్యాఽత్మని తాం పునః
ప్రత్యువాచ యదా రామో మంచకం త్వధిరోహతి
తదా భగ్నో యది నచే న్మంచక స్తే పతి ర్ధ్రువం
భవితా రాఘవో దేవి వద తన్మృత్యు కారణమ్. ౩౪-౩౫

ఇత్యుక్త్వా సా తథే త్యుక్త్వా తద్రహస్య మువాచ తం
పురైకదాఽర్భకై ర్నిత్యం షట్పదాన్ కంటకైః పునః
రోపితా న్వీక్ష్య దనుజౌ మోచయామాసతు స్త్విహా
తత స్తుష్టా ద్విరేఫా శ్చ రాక్షసౌ ప్రాహతు స్తదా
యువాం మరణకాలే తు రక్షిష్యావో వయంధ్రువమ్. ౩౬-౩౭

ఇత్యుక్త్వా భ్రమరా స్తత్ర స్థితా శ్చానీయ తేఽమృతం
దైత్యాసృగ్బిందుసంస్పర్శం విధాయ సుధయా త్వమీ
హతౌ చా ప్యసురా వేతౌ కుర్వంతి చ సజీవితౌ
నిద్రాస్థానే తయో రద్య కోటిశ షట్పదా స్థితాః.
తా న్మారయసి చే త్త్వం తు రాక్షసౌ చ మరిష్యతః
౩౮-౩౯-౪౦

వీరల నిర్వారను జంపించినచో రాముసే నేను వరింపవచ్చు నని మనస్సులోఁ దలంచి హనుమంతునితో నిట్లుల నామె పలికెను. నేను గోరిన దాని నిచ్చెదనని చెప్పితివిగదా! రాముడు నన్ను దన భార్యనుగా గ్రహించెడి పక్షమున వారలు చచ్చు రహస్యమును జెప్పెదను. సందియము లేదు.

3౪-3౫ ఇట్లు చెప్పుటతోడనే హనుమంతుడు తన మనస్సులో గొంత తడవాలోచించి యామెతో నిటులఁ బలికెను. రామచంద్రమూర్తి నీ మంచముమీద గూర్చుండినపుడు నీ మంచము విరుగకుండ నుండెనచో నీకోరికను రామచంద్రమూర్తి సఫలముచేయును. నీ మంచము విరిగిపోయినచో రామునివలన నీ కోరిక సఫలము కానేరదు. కాన నీవు వెంటనే రక్కసుల మృత్యురహస్యమును జెప్పుమనియెను.

3౬-3౭ పిదప నామెకూడ నందుల కంగీకరించి యా రహస్యమును హనుమంతున కిట్లు చెప్పదొడగెను. పూర్వ మొకప్పుడు పిల్లలు తుమ్మెదలను బట్టుకొని ముళ్ళకు గ్రుచ్చి వానిని బాధించుచుండగా, ఐరావణ మైరావణులు చూచి పిల్లలవలన బాధలేకుండ తుమ్మెదలను విడిపించిరి. పిమ్మట తుమ్మెదలు సంతోషించి యైరావణ మైరావణులతో నిటులఁ జెప్పినవి ఓ రక్కసులారా! మీరు మా ప్రాణ రక్షణమును జేసితిరి గాన మీకుఁ బ్రాణాపాయము సంభవించు కాలమున మిమ్ములనుగూడ మేము రక్షించగలమని చెప్పినవి.

3౮-3౯-౪౦ ఇట్లు చెప్పి తుమ్మెద లప్పటినుండియు నిచ్చటనే యుండెను. ఆ తుమ్మెద లిపుడు రక్కసులకు మృత్యువు కలుగకుండ తమ యొద్ద నిలువయుంచిన యమృతబిందువులను రాక్షసుల రక్త బిందువులలో జేర్చుచుండుటవలన వారలు సజీవులగుచుండిరి. ఆ తుమ్మెదలను నీవు చంపివేసితివేని రక్కసులుంగూడ వెంటనే చచ్చెదరు.

ఇత్యుక్తః పవనాత్మజోఽపి నితరాం తుష్ట్వాఽఽశు గత్వా తయో
ర్నిద్రాస్థానగతా నమర్దయ దరం నైకా న్ద్విరేఫా న్పునః
తత్రైకం శరణం గతం పవనజః ప్రాహ ద్విరేఫం ప్రతి
త్వం తావ త్కురు మంచకస్య వివరం త్వైరావణస్య
ద్రుతమ్. ౪౧

తదా భవా న్జీవిత స్స్యాది త్యుక్త ష్షట్పదోఽపి సః
తథే త్యుక్త్వా ద్రుతం గత్వా గజభుక్తకపిత్థవత్
తద్దైత్య మంచకం చాఽపి చకారాఽంత స్తు దుర్బలమ్. ౪౨

తతో రామాంతికం గత్వా ప్రేరయామాస మారుతిః
తదా రామేణ నిహతో న పున ర్జీవితో మృతః
పశ్చా దాహూయ రామోఽపి మకరధ్వజ ముత్తమం
దైత్యరాజ్యేఽభిషిచ్యాఽథ యదా గంతు మియేష సః
మారుతి స్తు నతిం కృత్వా రాఘవం ప్రాహ తం మిథః
గతం ప్రతి వయం పశ్చా ద్భాషయేమ ద్రుతం భవాన్
మయా సహ సమాగచ్ఛే న్నాగకన్యాగృహం ప్రతి.
ఇత్యుక్తస్సోఽపి నిష్క్రాంతో నాగకన్యాగృహం యయౌ.
౪౩-౪౪-౪౫-౪౬

గత్వా మారుతినా ప్రోక్తో మంచకే తూ పవిష్టవాన్
సోఽపి రాఘవ భారేణ భగ్నోఽభూ న్మంచక స్తదా

౪౧ ఇట్లు చెప్పుటతోడనే హనుమంతుడు సంతోషించి యామె పడక గదిలో నున్న తుమ్మెదల నన్నిటిని దన కాళ్ళతో మర్దించి చంపు చుండగా, నొక తుమ్మెద హనుమంతుని శరణు పొందెను. శరణార్థి యయిన యా తుమ్మెద నొకదానిని జంపకుండగ వదలి దానితో నిటులఁ బలికెను. ఓ భృంగమా! నిన్ను జంపకుండ నేను వదలి పెట్టినందుకు నొక యుపకారమును నీవు చేయవలయును (అది యేదన) ఐరావణుని యుంపుడుకత్తె యొక్క మంచమును నీవు తొలిచి డొల్లగా జేయవలయును (ఇదియే నీవు చేయు నుపకార మనియెను,)

౪౨ నేను చెప్పినట్లు చేసిననే నీవు బ్రతుకగలవని చెప్పగా, ఆ తుమ్మెదయు నందునకు వల్లెయని చెప్పి యొప్పుకొని వెంటనే యా మంచమును, ఏనుగు వెలగపండులోని గుజ్జునంతను దిని దానిని డొల్లగా జేసినట్లు, డొల్ల జేసెను.

౪౩-౪౪-౪౫-౪౬ పిమ్మట హనుమంతుడు రాముని సమీపమున కేగి జరిగిన సమాచారము (రక్కసుల మృత్యురహస్యమును) జెప్పి యిక వారలను జంపుడనియెను. పిదప రామచంద్రమూర్తి బాణ మెక్కుపెట్టి వారల నిర్యాణను గొట్టగా వారలు వెంటనే మృతినొందిరి. తిరిగి పూర్వమువలె జీవింపక పోయిరి. పిమ్మట రామచంద్రమూర్తి మకరధ్వజుని రప్పించి యా రక్కసుల రాజ్యమున నతనిని నభిషిక్తుని జేసి బయలుదేరి తిరిగి లంకకు వచ్చు ప్రయత్నములో నుండగా, హనుమంతుడు రామచంద్రమూర్తితో నిటులఁబలికెను. రామచంద్రా! నా వెంట నొక చోటునకు నీవు రమ్మని పలుకగా రామచంద్రమూర్తియు హనుమంతుని వెంట ఐరావణుని యుంపుడుకత్తెయొక్క యింటికి బయదేరి వెళ్ళెను,

౪౭-౪౮ ఇట్లు రామచంద్రమూర్తి యచటకు వెళ్ళి హనుమంతుడు చెప్పిన రీతిగ నామె మంచముమీదను గూర్చుండెను. ఆ మంచ మంతకు పూర్వమే తుమ్మెదచే డొల్లగా జేయబడియుండుటచే రామచంద్ర

నాగాంగనా నిరాశాం ..హ రాఘవం సాంజలి స్తదా
మదీయం వాంఛితం రామ సఫలం కర్తు మర్హసి. ౪౭-౪౮

ఇత్యుక్తః ప్రాహ తాం రామో ద్వాపరే త్వదభీప్సితం
సఫలం భవితా త్వం మే భవితా ప్రేయసీధ్రువం
ఇత్యుక్త్వాఽథ విసర్జత్య రాఘవో మారుతే ర్భుజం
సమారూఢో యయౌ పశ్చా ల్లక్ష్మణో మకరధ్వజం
సమారుహ్య యయౌ లంకాం రాఘవౌ వీక్ష్యవానరాః
సుగ్రీవ ప్రముఖా స్సర్వే ముముదుః పవనాత్మజం
అనేకథా స్తువంతి స్మ పున స్తే యుద్ధకాంక్షిణః
సంస్థితా రావణ శ్శ్రుత్వా తదుదంతం శుశోచ సః
పురా బ్రహ్మనచ స్సత్యం మనుతే స్మ దశాననః
౪౯-౫౦-౫౧-౫౨-౫౩

ఇత్యాశ్చర్యరామాయణే యుద్ధకాండే
సప్తదశ స్సర్గ స్సమాప్తః.

---

## అష్టాదశ స్సర్గః

గేహం పఙ్క్తిముఖః ప్రవిశ్య మనసా సంచింతయామాస వై
య త్తప్తం తు పురా మయా తదధునా మోఘంమమాఽ
భూత్ఫలు, హా మర్త్యనజో ఽస్మి సత్య మభవ త్త్పితామహాం
తద్వచో, మర్త్యా దేవ భయం తవే త్యపిచ మే శాపోఽనర
ణ్యస్యచ. ౧

మూర్తి కూర్చుండినతోడనే యది మధ్యకువిరిగిపోయెను. ఐరావణుని యుంపుడుకత్తె నిరాశురాలయి చేతులు జోడించి రామచంద్ర మూర్తిని తన కోరికను సఫలము చేయుమని బ్రార్థించెను.

౪౯-౫౦-౫౧-౫౨-౫౩ ఇట్లు ప్రార్థింపగా, రామచంద్రమూర్తి కరుణించి యామెతో నిట్లు చెప్పెను. జన్మాంతరమున నీ కోరిక సఫలమగును. నీవు నాకు బ్రియురాలవు కాగలవు. ఇది నిజము, అని చెప్పి రామ చంద్రమూర్తి హనుమంతుని భుజముమీదను గూర్చుండి లంకకుఁ బ్రయాణ మయ్యెను. లక్ష్మణుని మకరధ్వజుడు తన భుజముమీదను గూర్చుండబెట్టుకొని తీసికొని వెళ్లెను. రామలక్ష్మణులిరువురు నిట్లు తిరిగి లంకకు రాగా, సుగ్రీవుడు మొదలగు వానరోత్తము లందఱు రామలక్ష్మణులను జూచి సంతసించుటయే కాక హనుమంతుని ననేక విధముల గొనియాడిరి. పిదప వానరు లందఱు యుద్ధకాంక్షులయి సింహనాదములు చేయుచుండ, నా కోలాహలము ను రావణుడు విని రామలక్ష్మణులు తిరిగివచ్చినట్లు తెలిసికొని దుఃఖపడుటయే కాక, పూర్వము బ్రహ్మ చెప్పిన వచనము (మానవునివలన నీకు మృత్యువున్నదని చెప్పినమాట) సత్యమని మనస్సులో దలంచెను.

యుద్ధకాండమున పదునేడవ సర్గము ముగిసెను.

---

## పదునెనిమిదవ సర్గ ప్రారంభము.

౧ రావణుడు పిదప గృహములో బ్రవేశించి మనస్సులోఁ బరిపరివిధ ముల నిట్లు చింతించెను. నేను బూర్వముచేసిన తపస్సంతయు వ్యర్థ మయ్యెగదా! ఓహో! నే నొక మానవునిచే జయింపబడితిని. బ్రహ్మ వాక్యము సత్యమయ్యెను. మఱియు, ఇక్ష్వాకు వంశస్థుడయిన యనర ణ్యుడు నా కిచ్చిన శాపముగూడ (నా వంశస్థునివలన నీకు మరణము గలుగును, అనియెడి శాపము) గలదు.

తత్త్ర చ్ఛాపవనో౽న్యథా న భవితా మిథ్యా న తద్భాషితం
సంచింత్యైవ మథా౽౽హ రాక్షసవరా నేత ద్దశాస్యః పునః
నిశ్చింత స్స్వపితి స్వకీయ శిబిరే తత్కుంభకర్ణో౽ధునా
ప్రాప్తం కష్ట మిదం మమా ద్య దనుజా వాచ్యం భవద్భి
ర్గతమ్. ౨

నిబోధయత శీఘ్రం త మిహానయత సత్వరం
భక్ష్యభోజ్య సురార క్త కుంభా నాదాయ గచ్ఛత. ౩

తస్మి న్నాగతి నో భవే న్మమ పున శ్శోకో ధ్రువం రక్షసా
మిత్యుక్తా దశకంఠ కేణ దనుజా స్తానీయ భక్ష్యా న్బహూన్.
మాంసం శోణిత కుంభరాశి మపి తే తాం కౌంభకర్ణీం గుహాం
జగ్ము స్తాం చ గుహాం ప్రవిశ్య దదృశు స్తస్యాం శయానంచ
తమ్. ౪

పశ్చా త్తస్య నిబోధనార్థ మధికం చక్రుః ప్రయత్నం తు తే
భేరీకాహాళశంఖ నాదమపి తే చక్రు శ్చ తత్సమ్ముఖే
సో౽యం నో బుబుధే తథాపి దనుజాః పశ్చా త్తలై ర్ముష్టిభి
ర్వృక్షై శ్చాథ గదాభి రద్రిశిఖరై ర్జఘ్ను స్తదా తం పునః
౫

నిశ్వాసేన తు తస్య తే౽పి బలినో రాత్రించరా స్తత్ర తు
స్థాతుం న ప్రబభూవు రాశరవరాః పశ్చా న్నిబోధాయ తే
తప్తం ద్రావక మాయసం పున రథో తత్కర్ణయో రక్షిపన్.
కించా౽నేకగజై స్తదంగ మధికం సమ్మర్దయంతిస్మ తే. ౬

౨ పూర్వము వారు వారిచ్చిన శాపవచనములు మిథ్యకాలేదు. అని ఇట్లు తలపోసి పిదప రక్కసులతో నిట్లు రావణుడు పలికెను. నా తమ్ముడయిన కుంభకర్ణుడు నాకు గలిగిన కష్టమును దెలిసికొనక సుఖముగ నిద్రాశిబిరములో నిద్రించుచుండెను. మీరలతనిని లేపి నా కష్టదశను వానికిఁ జెప్పవలయును.

3 ఓ రక్కసులారా! శీఘ్రముగ వానిని లేపి యచటకు దీసికొనిరండు మీరలు కుంభకర్ణుని లేపుటకు వెళ్ళునపుడు భక్ష్యరాసులను సురాకుంభములను రక్తకలశములను గూడ దీసికొనిపొండు.

౪ ఓ రక్కసులారా, కుంభకర్ణుడు మేల్కొనినచో నిశ్చయముగ నాకు దుఃఖముండదని రావణుడు చెప్పగా, రక్కసులు భక్ష్యభోజ్యాది రాసులను మాంసపు రాసులను సురా రక్త కుంభములను వెంట దీసికొని కుంభకర్ణుని గుహకు వెళ్లిరి. ఇట్లచటఁ బ్రవేశించి యా గుహలో నిద్రించుచున్న కుంభకర్ణునిఁగూడ జూచిరి.

౫ పిదప కుంభకర్ణుని లేపుటకై రక్కసులు భేరీలను, అతని చెవులదగ్గర ఁబ్రమోగించుచుండిరి. కొందఱు శంఖముల నూదుచుండిరి. కాహళధ్వనులు చేయుచుండిరి; కాని కుంభకర్ణుడు మాత్రము లేవ లేదు, పిదప జేయునది లేక రక్కసు లందఱు పిడికిళ్ళతో నతనినిఁ బొడుచుచుండిరి. చేతులతోఁ గరచుచుండిరి. కాని లాభము లేనందున పెద్ద పెద్ద చెట్లతోను, పర్వత శిఖరములతోను, గదలతోను నతనిని బాధుచుండిరి,

౬ ఆ కుంభకర్ణు డొక్కొకమాఱు నిట్టూర్పు వాయువు విడుచుచుండ బలవంతులయిన రక్కసులు సైతము, అచ్చట నిలువలేక యుండిరి. పిదప రాక్షసోత్తము లందఱు నాలోచించి సీసము కాచి వాని చెవులలోఁ బోయుచుండిరి. ఇదియునుం గాక కొందఱు మదపు టేనుగులను వానిమీద నెక్కించి త్రొక్కించుచుండిరి.

పశ్చాత్ప జ్జిత ముఖానుజ స్తు శనకై ర్విక్షిప్య బాహూ
క్రమాత్, వక్త్రించాఽపి వివృత్య జృంభణ మలం దీర్ఘం చకా
రాఽఽశరః, ఉన్మీల్యాఽక్షియుగం రసాతలనిభం తత్కుంభ
కర్ణ శ్శనై, రుద్ధాయాఽఽగతవా న్మహీస్తు శనకై స్స్వాపా
లయా దాశరః ౭

ఏవం తచ్ఛయనోత్థితస్య బహి రప్యాగచ్ఛత స్తస్య తే
వారాహా న్మహిషాం శ్చ రక్తకలశా న్మద్యాని భక్ష్యా
న్బహూన్, మేదః కుంభ సహస్ర మాశరవరా స్సందర్శయంతి
స్మ త, త్సర్వం వీక్ష్య బభక్ష రాక్షసవర స్తత్కుంభకర్ణో
ద్రుతమ్. ౮

దూతా న్స్వాహ దశాననస్య సహజః కస్మా దహం బోధితః
కచ్చిద్వై కుశలం దశాననవిభో ర్యద్వాఽఽగతం చే ద్భయమ్
కస్మా ద్బూత మహేంద్ర మప్యనల మప్యాహోస్వి దస్మా
నపి, ప్రాయోఽద్యైవ గత స్త్విహోఽహ మసురా స్తా న్నాశ
యేయం ద్రుతమ్ ౯

యూపాక్ష స్తమువాచ నోభయ మభూ త్తే భ్యోదశాస్యానుజ!
ప్రాప్తం హ్యద్యభ్యయం దశానన విభో ర్మర్త్యా దభూ ద్రాఘ
వాత్, ఏకేనైవ పురా ప్లవంగహతకేనాఽదహ్యతేయం పురీ
కించాఽహన్యత తేన రావణసుత స్త్వక్షః కుమారః పురా. ౧౦

రాఘవోఽద్య తు సంగ్రామే సుగ్రీవాదిభి రన్వితః
లంకాపురే స్థితా న్సూరా న్రక్షసాం శ్చాప్య నాశయత్. ౧౧

౭ ఇట్లు వారలు చేయుచుండ గొంతసేపటికి కుంభకర్ణుడు మెల్లగాఁ చేతులు చాచి ముఖము నిటు నటు త్రిప్పి యావలించి తుదకుఁ గన్నులు తెరచి యిటు నటు చూచెను. అతని కన్నులు పాతాళ సదృశములయి యుండెను. పిదప మెల్లగా కుంభకర్ణుడు లేచి తన నిద్రాగుహనుండి బయటికి మెల్లగా వచ్చెను.

౮ ఇట్లు నిద్రలేచి బయటకు వచ్చుచున్న కుంభకర్ణున కెదురుగా వడివి పందులను, దున్నపోతులను, రక్తకలశములను, సురాకుంభసహస్రమును భక్ష్యభోజ్యాది రాసులను, మెదడుతో నిండిన కలశములను వెయ్యింటిని, ఆహారమునకై చూపించిరి, వాని నన్నిటినిఁ క్రమముగా కుంభకర్ణుడు భక్ష్యములను భక్షించెను. సురను, రక్తమును త్రాగెను.

పిదప కుంభకర్ణుడు దూతలతో నిటుల బలికెను. ఓ రక్కసులారా మీరు నన్నేల లేపితిరి? రావణునకు కుశలమా! ఏదైనను మన ప్రభువునకు భయహేతువు తటస్థింపలేదుగదా ? ఒకవేళ కలిగినచో నెవనివలన గలిగెనో చెప్పుడు. మహేంద్రునివలన కలిగెనా ? లేక యగ్నిహోత్రునివలననా? లేక యితరుల వలననా ? మీరు చెప్పినచో నిచటి నుండియే వెళ్ళి వారలను హతము చేయుదును.

౧౦ పిమ్మట యూపాక్షుడు కుంభకర్ణునితో నిటులఁబలికెను. కుంభకర్ణా! మీ యన్నయగు రావణునకు నీవు పైనచెప్పిన వారివలన భయమేమియు గలుగలేదు. కాని మానవమాత్రుడయిన రామునివలన మాత్రము భయము కలిగెను. ఇంతకు పూర్వమొక క్రోతి వచ్చి లంకను గాల్చి యక్షకుమారుని జంపెను.

౧౧ ఇప్పుడు రామచంద్రమూర్తి సుగ్రీవాది వానరులతో గలసి యుద్ధమునకువచ్చి లంకలోనున్న శూరులనందఱను జంపెను.

ఇత్యుక్త స్తముచాచ సోఽపి కపిభి స్సౌమిత్రిణా రాఘవం
హత్వా రాత్రిచరా నసృగ్భి రధికం సంతర్పయిష్యా మ్యహమ్
ఇత్యుక్త్వా దనుజ స్సమం నృపసభా దాయాంత మాఘ్యా
లయం, దృష్ట్వా తం బహి రాస్థితా వనచరా స్తే తత్రసు
శ్చాఽధికమ్. ౧౨

కేచి చ్చైల సభాకృతిం త మసురం త్వన్వీక్ష్య శాఖామృగా
భీతా రాఘవ మాపు రాశు శరణం పేతు శ్చ కేచి త్క్షితౌ
కేచి ద్వ్రజు రార్త నిస్వనకృత స్సర్వా దిశో వానరాః
దృష్ట్వా విద్రుత మాత్మసైన్య మవద ద్రామోఽసురేశాను
జమ్. ౧౩

కోఽసౌ వద్రినిభో దశాస్యసహజ! ప్రాయో౽ద్భవ ద్దృశ్యతే
దృష్ట్వా యం ప్లవగా స్తత స్తత ఇమే భీతా స్త్వలం విద్రుతాః
ఆచక్ష్వేతి నృపాత్మజస్య వచనం శ్రుత్వాఽఽహ తం రాక్షస
స్సోఽయం రామ! దశాననస్య సహజో భూ త్కుంభకర్ణా
భిధః ౧౪

పూర్వం యేన పరాజిత శ్చ మఘవా వైవస్వత శ్చాఽఽహవే
జాతేనైవ తు భక్షితాఽసు భువనే సత్త్వాసి యేనాఽధికమ్
యస్యాగ్రే నసితుం న శేకు రమరా యస్యాతిభారం క్షితి
స్సోఢుం న ప్రభవే చ్చ యద్భుజయుగాధారో దశాస్యో
ధ్రువమ్ః ౧౫

తస్మి న్పీడయతి ప్రజా స్తు శరణం జగ్ము ర్మహేంద్రం పురా
సోఽప్యాగత్య జఘాన తం త్వైమ మలం వజ్రేణ రుష్టో ద్రుతమ్

౧౨ ఇట్లు యూపాక్షుడు చెప్పగా కుంభకర్ణు డిట్లు పలికెను. యూపాక్షా! నేను యుద్ధమునకు వెళ్లి వానరసహితముగా రామలక్ష్మణులను జంపి వారల రక్తముచే రాక్షసులకు సంతర్పణము చేసెదనని చెప్పి యచటనుండి బయలుదేరి రావణుని గృహమునకు కోటలోని రాజ మార్గమునుండి వచ్చుచున్న యా కుంభకర్ణుని జూచి వెలుపలనున్న వానరులు భయపడిరి.

౧౩ పర్వతాకారముగల యా కుంభకర్ణునిఁజూచి వానరులలోఁ గొందఱు భయముచే రాముని శరణుపొందిరి. అతనిని జూచియే కొందఱు భూమిమీదఁ బడిపోయిరి. మఱికొందఱు ఆర్తనాదములఁజేయుచు దశదిశలకుఁ బరుగు లిడిరి. ఇవ్విధముగా వానరసైన్యమంతయు చెల్లా చెదరు కాగా రామచంద్రమూర్తి విభీషణునితో నిటుల బలికెను.

౧౪ విభీషణా! వీడెవడో పెనుగొండవలెను వర్షాకాలపు మేఘము వలెను గన్పడుచుండెను. ఇప్పుడెవ్వనిని జూచి వానరులందఱు భయ పడి నలుదిక్కులకుఁ బరుగులిడుచుండిరో వీ డెవ్వడైయుండును? చెప్పుమని యడుగగా, రామచంద్రా! వీడు కుంభకర్ణుడను రావణుని సహోదరుడేయని విభీషణుడు చెప్పెను.

౧౫ రామచంద్రా! ఆ కుంభకర్ణుని పరాక్రమమును జెప్పెదను వినుము. యుద్ధములో నతడు దేవేంద్రుని యముని జయించెను. ఇదియునుం గాక, యతడు పుట్టుటతోడనే లోకములోని జంతువులను భక్షింప గడంగెను. దేవతలుసైతము నితనిముందు నిలువలేరు. మఱియు నతని భారమును భూదేవి సహితము భరింపలేకపోయెను. రావణుడు కూడ నతని భుజయుగము నాధారము చేసికొని యుండెను.

౧౬ అట్టి కుంభకర్ణుడు పుట్టినప్పుడే ప్రజలను బాధించుచుండగా, ప్రజలు దేవేంద్రుని శరణుపొందిరి ఆ దేవేంద్రుడు వజ్రాయుధముతో కుంభ కర్ణుని గొట్టగా, వజ్రాయుధమే ముక్కలై పోయెను. గాని యితని

తద్వ్యథోఽపి బభూవ కుంభకర్ణ స్తద్గాత్రసంస్పర్శత
శ్చ్యాలేనాఽఽశు జఘాన తం పున రయం సోఽభూ త్త్వరం
మూర్ఛితః॥ ౧౬

పశ్చా త్తస్య ముపేయివాం స్తు మఘవా గత్వా విరించిం ప్రతి
ప్రాహా స్వస్య పరాభవం తు దనుజాధీశా ద్విరించి స్తతః
నిర్గత్యాఽంతిక మస్య భీకరమహాశైలాకృతిం వీక్ష్య తమ్
ప్రాహైవం సతతం త్వ మాశర: మృతిం ప్రాప్తో యథా
స్వప్స్యసి॥ ౧౭

తచ్ఛ్రైతామహ శాప మాశరపతి శ్శ్రుత్వా గతః ప్రాహ తమ్
ఛేత్తుం త్వం భగవ న్మహీరుహ మలం సంవర్ధితం నార్హసి
త్వద్వంశే జనితం తు పూరుషవరం శప్తుం భవాన్నార్హతి
త్వం తావ త్పరిచింత్య సప్తృవిషయే శీఘ్రం ప్రసన్నో భవ॥౧౮

ఇత్యుక్తో విధి రాహ తం మమ వచో నో జాతు మిథ్యా భవే
త్కాల స్తు క్రియతే ద్య కింతు శయనే వా జాగృతౌ వా
మయ్యా, షణ్మాసా న్యయితా తతః పున రయం జాగ ర్తి చైకం
దినం, నిద్రాభంగ కృతౌ బలా త్త్వదనుజ శ్శీఘ్రం వినాశం
వ్రజేత్. ౧౯

ఇత్యుక్త్వాఽగా ద్విధి స్తస్య శాపా, దేవాఽఽశర స్త్వయమ్
చిరా ద్గుహాయాం స్వపితి దశాస్యోపి నిజాపదమ్
నిరీక్ష్య బోధయామాస విస్మృత్య వచనం విధేః ౨౦

కేమియు బాధగలుగలేదు. వెంటనే యతఁడు తన శూలముతో దేవేంద్రునిఁ బొడవగా దేవేంద్రుడు మూర్ఛిల్లి పడిపోయెను.

౧౭ పిమ్మట దేవేంద్రుడు కొన్ని దినములకు స్వస్థతను జెంది బ్రహ్మదేవుని యొద్దకేగి తనకుఁ గలిగిన పరాభవమును జెప్పుకొనగా బ్రహ్మ స్వయముగా కుంభకర్ణుని జూచుటకువచ్చి పర్వతమువలెనున్న యతనిని జూచి కుంభకర్ణునితో నిట్లు శాపపూర్వకమయిన వాక్యమునుబలికెను (ఏమనగా) ఓరీ రాక్షసా! నీవెప్పుడును మేల్కొనియుండినచో నీముందు లోకము లాగలేవు గాన నెల్లప్పుడును నీవు నిద్రలో నుండుమని పలికెను.

౧౮ బ్రహ్మదేవుడు తన తమ్మునినిటుల శపించినట్లు రావణుడు విని వెంటనే బ్రహ్మయొద్ద కేగి యిటుల బలికెను. ఓ పితామహా! శాఖోపశాఖలుగ బెరిగిపోవుచున్న చెట్టును సమూలముగాఁ దెగగొట్టునట్లు నీవంశములో బుట్టి యభివృద్ధిలోనికి గానున్న యొక పురుషశ్రేష్ఠుని (కుంభకర్ణుని) ఇట్లు శపించుట న్యాయముకాదు. కావున నీ వాలోచించి నీకు మునిమనుమడయిన కుంభకర్ణునిమీద ననుగ్రహముంచి శాపమును మరలింపు మనియెను.

౧౯ ఇట్లు రావణుడు ప్రార్థింపగా బ్రహ్మ యిట్లు చెప్పెను. రావణా! నా నోటినుండి వచ్చినమాట యనృత మెప్పుడును గానేరదు. కాని యతని నిద్రకుగాని, మేల్కొనియుండుటకు గాని కాలము నేర్పరచెదను, వినుము. ఆఱుమాసములు నిద్రయు నొకదినము మేల్కొనుటయు నిట్లు జరుగుచుండును. నీవిందునకు సంతోషింపుము. నిద్రాభంగము కలుగజేసినచో వెంటనే యితడు నశించిపోవును (అని చెప్పెను).

౨౦౪ ఇట్లు చెప్పి బ్రహ్మ తన లోకమునకువెళ్ళెను. రామచంద్రా! బ్రహ్మ శాపమువలననే యీ కుంభకర్ణుడు సుఖముగా నొక గుహలోనిద్రించుచుండెను. రావణుడు తన కిట్టి యాపద తటస్థింపగా విధివాక్యమును మరచి రక్కసులను బంపి తన తమ్ముని నిద్రనుండి లేపించెను.

సోఽయం స్వాపగృహా ద్దశాస్యః కటం త్వాయాతి దృష్ట్వా తు
తమ్, శైలాకారతనుం ప్లవంగమబలం భీత్వా దిశో విద్రుతమ్
బ్రూహి త్వం ప్లవగా న్నచాఽయమసురః కిం త్వేత దేకం మహా
ద్యంత్రం చేతి తథేతి వానరచమూం ప్రత్యాహ తాం రాఘవః
౨౧॥

పశ్చాన్నీల మువాచ వానరచమూనాథం మహీజాపతి
శ్శీఘ్రం వ్యూహ్య సమస్త వానరచమూ మగ్రే భవాం స్తిష్ఠ
తాత్, ఇత్యుక్త స్త్వనలాత్మజోఽపి సకలాం సేనాం సమీ
కృత్య తాం, వ్యూహ్యాగ్రే వనతిస్మ భూరుహకర స్సేనాం
తదా భీషయన్. ౨౨॥

పశ్చా దాత్మసమీప మాగత మరం తం కుంభకర్ణం పున
ర్వీక్ష్యోత్థాయ త మాసనే దశముఖ స్తత్రోపవేశ్యాఽఽహ
తమ్, వత్స! త్వం తు న వేత్సి మేఽద్య మహీజాజానే రుపాత్తం
భయమ్, సోఽయం సూర్యాసుతాభిః పరివృతో లంకాం చకా,
రాఽఽవిలామ్. ౨౩॥

కించాఽస్మిన్నగరే ప్రధానపురుషా యే సంస్థితా స్తే పున
స్సర్వే తే నిహతా బభూవు రధునా లంకాం భవా న్రక్షతాత్
భూతే ష్వద్య న తే సమోఽస్తి బలవా న్దైవాసురే సంయుగే
పూర్వం త్వద్విజితా బభూవు రమరాః కార్యం న తే దుష్క
రమ్. ౨౪॥

౨౧౪ ఆ యీ కుంభకర్ణుడు నిద్రాస్థానమునుండి బయలుదేరి రావణుని సమీపమునకుఁ రాబోవుచుండెను. పర్వతాకారముగల యతనినిఁజూచి వానరసైన్యమంతయు భయపడి దశదిశలకుఁ బరువులిడుచుండిరి, రామచంద్రా! నీవు వానరులతో నిటులఁ జెప్పుము. (ఏమనగా) ఆ కనుబడెడివాడు రాక్షసుడు కాడు. ఇక నేమనగా యంత్రముతో తయారుచేయబడిన యొక బొమ్మయని వానరులకు జెప్పుమనగా రామచంద్రమూర్తియు నట్లే జెప్పుదునని చెప్పి పిదప వానరులతో నీది యొక మహాయంత్రపుబొమ్మ గాని రాక్షసుడుంగాడు. కాన మీరు భయపడవద్దని చెప్పెను.

౨౨౪ పిమ్మట రామచంద్రమూర్తి సర్వవానర సేనాయకుడయిన నీలుని బిలచి యిట్లు చెప్పెను. ఓ నీలుడా! వానరులు నిర్భయముగా నుండుటకై వానరుల ముందుభాగమున నీవు నిలిచియుండుమని చెప్పగా, నీలుడు సమస్త వానరులను నొక వ్యూహముగా నిలుప బెట్టి వారలు పారిపోకుండగనుండునట్లు నొక పెద్ద చెట్టును జేతి యందుంచుకొని వారల నదల్చుచు వారిముందు నిల్వబడెను.

౨౩౪ పిమ్మట తన సమీపమునకు వచ్చుచున్న కుంభకర్ణునిఁజూచి రావణుడు లేచి యెదురుగ వెళ్ళి తీసికొనివచ్చి యతనికి దగిన యాసనమున గూర్చుండబెట్టి యిటులఁ బలికెను. తమ్ముడా! సీతాపతివలన నాకు గలిగిన భయమునుగాని కష్టమునుగాని నీవెరుగవుకాని గొప్ప యాపద వాటిల్లెను. ఆ రాముడు సుగ్రీవాది వానరులతో లంకను ముట్టడించి యల్లకల్లోము చేసివైచెను.

౨౪౪ సోదరా! యింకను జెప్పెదను వినుము. లంకలో నున్న ప్రధాన పురుషులనందఱను హతము చేసెననియే చెప్పవచ్చును. కావున నీవు లంకను రక్షింపవలయును. భూతములలో నీకు సమానమయిన బల వంతుడు లేడనుట నిక్కము - పూర్వము దేవదానవయుద్ధములో నీవొకడవు సర్వదేవతలను జయించితివి గదా! నీకు దుష్కరకార్య మనునది లోకములో లేదనుట నిక్కము.

ఇత్యుక్త స్త మువాచ రాక్షస పతిం తత్కుంభకర్ణో వచః
ప్రాగస్మాభి రదర్శి మంత్రసమయే దోషస్తు యోఽద్య త్వయా
సోఽయం సాధితఏవ దుష్కృతఫలం భోక్తవ్య మేవ త్వయా
భ్రాత స్త్వం త్వధునాఽపి వా జనకజాం రామాయ దేహి
ద్రుతమ్. ౨౫

అవశిష్టా స్తు జీవేయు ర్లంకాయాం దనుజా విభో
ఇత్యుక్తః ప్రాహ రోషేణ దశాస్యోఽప్యనుజం వచః
నోత్థాపితో భవా రస్మ ముపదేష్టుం గురు ర్యథా
నిద్రాగుహాం ద్రుతం గత్వా స్వపిహి త్వం పురా యథా
ఇత్యుక్తః కుంభకర్ణోఽపి ప్రాహైవం తం దశాననం
౨౬--౨౭--౨౮

భ్రాత స్తవ హితాయైవ మయైవం ప్రతిపాదితం
నచే దిచ్ఛసి మద్వాక్యం వ్రజా మ్యద్యైవ సంగరమ్! ౨౯

భ్రాత శ్చిరా త్ప్రసుప్తస్య విక్రమం మమ సత్వరమ్
ద్రక్ష్యసి త్వంచ భూతాని పశ్యంతు మమ విక్రమం॥ 30

ఆదిత్యం భువి పాతయేయ మనలం వాఽత్స్యామి శక్రం తు వా
హన్యాం తద్వరుణాలయం పున రహం పాస్యామిచాఽద్రీ నపి
ప్రాయ శ్చూర్ణయితుం దశాననవిభో శక్నోమి భూమిం తథా
క్రుద్ధోఽహం కిల దారయేయ మధికం సంభాషణేనాఽద్య కిమ్
3౧

౨౫ ఇట్లు రావణుడు చెప్పగా, కుంభకర్ణుడు తిరిగి రావణునితో నిట్లు పలికెను. అన్నా! నీవు మంత్రులతో మంత్రాలోచనము చేయు సమయమున నేదోషమున్నదని తలచితివో, ఆదోషమే (అనగా రాముడు వానరులతో లంకను ముట్టడిచేయుట) యిపుడు సంప్రాప్త మయ్యెను. పాపఫలము ననుభవింపకతీరదు. అన్నా! నీవు గతము నకు వగవక యిప్పుడైనను సీతను దీసికొనివెళ్ళి రామునకు సమర్పించుట మంచిది (శత్రుపక్షము బలముగ నుండెను గాన జేయవలసిన పని యిది యనెను.)

౨౬-౨౭-౨౮ అన్నా! నేను జెప్పినట్లు నీవు చేసితివేని లంకలో మిగిలిన వారలైనను బ్రతుకుదురు. అని యిట్లు చెప్పుటతోడనే రావణుడు మండిపడి కుంభకర్ణునితో నిట్లు పలికెను. ఓరీ! గురువువలె నీవు ధర్మోపదేశమును నాకుఁ జేయుటకా? వని నిన్ను నిద్రనుండి లేపలేదు. యుద్ధమునకు వెళ్ళెదవని లేపితిని. నీకిట్టి పిఱికిపంద నైనచో, వెంటనే పూర్వమువలె నీ నిద్రాగృహమున కేగి సుఖముగా నిద్రింపుము. అని రావణుడు కోపముతో బలుకగా, కుంభకర్ణుడు తిరిగి రావణునితో నిట్లు పలికెను.

౨౯ అన్నా! నీ హితమును గోరి నేనిట్టులఁ జెప్పితిని కాని వేఱుకాదు నీవు నామాటలు రుచింపక పోయినచో నిపుడే నేను యుద్ధమునకుఁ బోవుచుంటిని.

౩౦ అన్నా! చిరకాలము నుండి నిద్రించుచు విశ్రాంతిని గొనియున్న నా యొక్క బలపరాక్రమములను నీవు భూతములుగూడ జూడగలవు.

౩౧ అన్నా! నేను కోపగించితినేని సూర్యమండలములో నున్న సూర్యుని గూడ భూమిమీదను, బడవేయగలను. ఇంక నాగ్రహించితినేని యగ్నినైనను మ్రింగివేయగలను. మఱియు దేవేంద్రునిగూడ హతము చేయగలను. మఱియు సముద్రమునిఁ బీల్చివేయగలను. కొండలను బిండిచేయుదును. నేను గోపగించితినేని భూమిని బ్రద్దలుచేయ గలను. వేయుమాటలేల! అని చెప్పి మఱియు నిట్లనియెను.

అద్య రామం వధిష్యామి ససౌమిత్రిం ససూర్యజం
అవశిష్టా నహం క్రుద్ధో భక్షయిష్యామి సత్వరమ్॥ 32

తచ్ఛ్రుత్వా ఽహ మహోదర స్తమసురాధీశానుజం యత్త్వయా, ప్రోక్తం సాధు న యేన రామవిభునా నైకే బలిష్ఠా హతాః, కించానేకసహస్రరాక్షసవరా మాహూర్తకాలే జన స్థానే యేన హతా స్త మద్య తు భవా నేకః కథం జేష్యతి॥ 33

శ్రుత్వా తద్వచనం మహోదర మథ ప్రాహాసురేశానుజో యుద్ధేకాపురుషై ర్భవద్భి రధిప స్త్య తావ దాసాదితమ్
శూరో నైవ వృథా ప్రగర్జతి యథా మేఘోఽమల స్తు ధ్రువం
శ్రుత్వా తద్వచనం త్వథాఽహ సహజం రాత్రించ రేశ స్తదా॥ 34

త్రస్తోఽయం తు మహోదరో రఘుపతే రేవం బ్రవీతి ధ్రువమ్
వత్సాఽథాపి బలాన్వితో వ్రజ నచే దేకాకినం త్వాం పునః
సంవేష్ట్య ప్లవగా స్తలై శ్చ దశనై స్తీక్ష్ణై ర్నఖై ర్ఘ్నంతి త
త్తైన్యై నాన్వితఏవ గచ్ఛతు భవాన్మా త్వం ప్రమత్తో భవ॥ 35

ఇత్యుక్త్వా మహోహారం చ కిరీట మప రావణః
విభూషణాని చాఽన్యాని దదౌ తస్మై తథాఽశిషమ్. 36

పశ్చాత్తం దశకంధరం తదనుజో నత్వా త మాలింగ్య వై
నిర్గత్యాఽహవభూమి మాశు దనుజానీకై స్తురంగై ర్గజై

3౨ అన్నా! ఆలస్య మేల? ఇప్పుడే నేను యుద్ధమునకు పోయి రామ
లక్ష్మణులను సుగ్రీవుని ముప్పురను గూడ వధించెదను. మిగిలిన వాన
రుల నందఱను నొక పర్యాయమే భక్షించివేసెదను.

33 ఇట్లు రావణునకు సంతోషము గలుగునట్లు కుంభకర్ణుడు పలుకగా
మహోదరు డా మాటలను విని కుంభకర్ణునితో నిటులఁ బలికెను.
కుంభకర్ణా! నీమాటలంతగ యుక్తముగా గనుపడుట లేదు. (ఏలనన)
ఏరామునివలన బలిష్ఠులయిన యనేక రక్కసులు హతులయిరో,
ఇదియుంగాక, జనస్థానమున పదునాలుగు వేల రక్కసులు ముహూర్త
మాత్రమున నేరామునిచే జంపబడిరో, అట్టి రాముని నీవొక్కడవు
నెట్లు జయింపగలవో తెలియకుండనున్నదని యాక్షేపించెను.

3౪ వాని మాటలు విని కుంభకర్ణుడు మహోదరునితోఁ నిటులఁ గోప
ముతోఁ బలికెను. మహోదరా నీవంటి దుర్మార్గులందఱు రావణుని
యొద్ద జేరుట చేతనే యితని కింత చేటు వాటిల్లెను. శూరుడైనవాడు
శరదృతువునందలి మేఘ మాడంబరములేక యుండునట్లు నిరాడంబర
రుడుగా నుండుగాని గర్జింపడు. అని పలుకగా రావణుడు విని కుంభ
కర్ణునితో నిటులఁ బలికెను.

3౫ సోదరా? నిక్కముగా మహోదరుడు రామునివలన భయపడి యిట్లు
పలికెను. నీ బలపరాక్రమము లతనికి దెలియవు. కాని నీవు యుద్ధ
మున కొక్కడవే వెళ్ళక సైన్యమును గూడ వెంటబెట్టుకొని పొమ్ము.
అట్లు నీవు చేయక పోతివేని యొంటరిగా యుద్ధము చేయుచున్న నిన్ను
క్రోతిమూక నలువైపుల జుట్టుకొని పండ్లతోను గోళ్ళతోను పిడికిలి
పోట్లతోను బాధించును. అందువలన సైన్యముతోనే వెళ్ళుట మంచిది
పరాకుగా మాత్రముండకుము.

3౬ ఇట్లు రావణుడు చెప్పి యతనికి సంతోషము కలుగజేయుటకై మణి
హారమును, గిరీటమును మఱికొన్ని యాభరణముల నిచ్చుటయే కాక
యాశీస్సులనుగూడ నిచ్చెను,

3౭ పిదప కుంభకర్ణుడు రావణునకు నమస్కరించి యతని నొకమాఱు
కౌగలించుకొని యుద్ధభూమికి సైన్యసమేతుడై బయలుదేఱెను. వాని

సౌవర్ణై శ్చ రథై రశ్వై ర్బహువిధై స్తద్వాద్యఘోషై స్తథా
గచ్ఛ న్నధ్వని మంగళైః కృతను స్సంపూజ్యమానో యయౌ.
౩౭

వ్రజత స్తస్య స్ఫుర ద్వామం నయనం రక్షసోఽధ్వని
వామబాహు స్తదా తస్య ప్రాస్ఫుర ద్భాస్కర స్తదా
నిష్ప్రభోఽభూ త్సమీరోఽపి ప్రతికూలో వవౌ తదా
తథాపి దుష్టశకునా న్యనాదృత్య నిశాచరః
సింహనాదం ప్రకుర్వాణో యయౌ యోద్ధుమనా ద్రుతమ్.
౩౮–౩౯–౪

శ్రుత్వా తస్య నదం ఘోరం పేతుః కేచన మూర్ఛితాః
నిపేతు శ్చాపరే కేచి త్కుంభకర్ణం నిరీక్ష్య తు
గతాసవో బభూవు శ్చ కేచి ద్దశదిశో గతాః
విద్రుతాం స్తా న్కపీ న్వీక్ష్య ప్రాహ సంఘో వాలినందనః
నేదం విద్రవణం శూరకార్యం భవతి వానరాః
వ్యూహ్య సర్వే భవంత స్తు తిష్ఠంతు తరుపాణయః
ఇత్యుక్తా స్తే తథా చక్రు ర్వానరా శ్చ తదాజ్ఞయా.
౪౦–౪౧–౪౨

కుంభకర్ణ బలస్యాపి వానరాణాం తదా పునః
పరస్పరం చ తుములం మహా దాహవ మప్యభూత్
పశ్చా చ్ఛూల ముపాదాయ కుంభకర్ణోఽతిదుష్టవాన్
**నిజఘాన కపీ న్నాగాం శ్చ రాక్షసాం శ్చ చ్ఛాఖామృగా న్నృపః**

వెంటఁబోవు వారలలో గొందఱు గజారూఢులును, మఱికొందఱు అశ్వారూఢులును, కొందఱు రథారూఢులును కొందఱు పాదచారులుగూడ నుండిరి. ఇట్టి చతురంగబలముతోడను, వాద్యఘోషములతోడను బయలుదేరిపోవుచు బురజనులచే మంగళద్రవ్యములచే బూజింపబడుచు వెళ్లెను.

౩౮-౩౯ ఇట్లు బయలుదేరి వెళ్ళుచున్న కుంభకర్ణుని యెడమకన్ను మధ్యమార్గములో నదుర నారంభించెను. మఱియు నతనియెడమ బాహువు కూడ నదరెను. మఱియు సూర్యుడు తేజోహీనుడయ్యెను. వాయువు ప్రతికూలముగా వీచుచుండెను. ఇట్లనేకము లయిన దుష్టశకునములు సంభవించినను వాని నన్నిటిని లక్ష్యపెట్టక సింహనాదము చేయుచు యుద్ధకాముడై వెళ్ళెను.

౪౦-౪౧-౪౨ ఆకుంభకర్ణుని పెడబొబ్బలను విని వానరులలోఁ గొందఱు మూర్ఛిల్లుచు బడిపోవుచుండిరి, కొందఱు కుంభకర్ణుని భీకరాకారమును జూచి ప్రాణములే విడుచుచుండిరి. కొందఱు వానరులు దశదిశలకు పారిపోవుచుండిరి. ఇట్లు చెల్లాచెదరై పాఱిపోవుచున్న వానరులను అంగదుడు మందలించుచు నిటులఁ బలికెను. ఓ వానరులారా! యిట్లు పాఱిపోవుట శూరులు చేయుపనికాదు. కావున మీరలందఱు నొక వ్యూహముగా నుండుడు. మఱియు చెట్లనాయుధములుగా బెట్టుకొనుడు. అని అంగదుడు చెప్పగా, వారలట్లు చేసిరి.

౪౩-౪౪-౪౫ పిదప కుంభకర్ణుని వెంటవచ్చిన రక్కసులకును వానరులకును పరస్పరము సంకులయుద్ధము జరిగెను, పిమ్మట కుంభకర్ణుడు శూలము చేతబట్టుకొని మహాకోపముతో వానరులను బొడిచిచంపుచు, కొందఱను తన కాళ్లతోఁ ద్రొక్కిచంపుచు, కొందఱిని తన చేతితోఁ

పాదాభ్యాం మర్దయామాస తథాన్యాంశ్చ కాంశ్చన
ముష్టినా తాడయిత్వాఽన్యా న్నిజఘాన కపీ న్బహూన్. ౪౩-౪౪-౪౫

పశ్చా న్మారుతనందనోఽద్రిశిఖరా ణ్యానీయ దూరా త్క్షణే
చిక్షేపోపరి తస్య తేన రుధిరోద్గారీ క్షణం మూర్ఛితః
పశ్చా త్స్వాస్థ్య ముపేయివాంశ్చ దనుజాధీశానుజః క్రుద్ధవాం
స్తద్బాహ్వో ర్నిజఘాన తేన హనుమా న్మూర్ఛాం గతోఽభూ త్క్షణమ్. ౪౬

పశ్చా ద్దశభి రాశు ముష్టిభి ర్బలం శాఖామృగా స్తే పున
స్తస్యాఽఽరుహ్య భుజే తు వివ్యధు రథో తత్కుంభకర్ణం
పునః, క్రుద్ధ స్స న్నసురోఽపి తా న్నిజకరేణాఽఽదాయ
చాఽత్తిస్మ తే, తద్గర్భాంతరగా స్తు కర్ణవివరా ద్దాగు ర్బహి
ర్వానరాః. ౪౭

సంగరే జానునా నీలం గవాక్షం గంధమాదనం
పాదేన నిజఘానాఽఽశు తేపి భూమ్యాంతు మూర్ఛితాః
నిపత్య క్షణమాత్రేతు పున స్సంజ్ఞాం గతా స్తతః
సహస్రశ స్తత శ్శాఖామృగా స్తం దశనై ర్నఖైః
వివ్యధుః కుంభకర్ణోఽపి క్రమా త్తా న్పరిగృహ్య సః
అపాతయ త్క్రమా దాశు స్వీయాననగుహాంతరే
నాసారంధ్రపుటాభ్యాం తే వివరాభ్యాం చ కర్ణయోః
పునర్బహి స్సమాయాతా బభూవుః ప్లవగా స్తతః ౪౮-౪౯-౫౦
బభక్ష వానరాన్కాంశ్చి త్కేచి త్పాదవిమర్దితాః
కేచి చ్ఛూలేన నిహతాః కేచి ద్భీత్యా దిశో గతాః ౫౧

జరచి హతముచేయుచు, కొందఱిని పిడికిలి పోట్లతోఁ బరిమార్చుచు లక్షలకొలది వానరులను సంహరించెను.

౪౬ పిదప హనుమంతుడు పర్వతశిఖరములను పెకలించుకొనివచ్చి కుంభకర్ణుని మీద బలముకొలది విసరివేయగా, ఆ దెబ్బలకు కుంభకర్ణుడు క్షణమాత్రము మూర్ఛిల్లి పిదపఁ దెప్పరిల్లి మిక్కిలి కోపముగలవాడై శూలముతో హనుమంతుని బాహువుల సందున బొడవగా, హనుమంతుడు క్షణకాలము మూర్ఛిల్లి పిదప స్వస్థతగల వాడయ్యెను.

౪౭ పిదప వానరులు కుంభకర్ణుని బుజములమీదికెక్కి వెంటనే రాళ్ళతోను. పిడికిలిపోట్లతోను కుంభకర్ణుని గొట్టుచు పొడుచుచు బాధించుచుండిరి. కుంభకర్ణుడు మిక్కిలి కోపముతో తనపై నెక్కిన వానరులను చేతులతో లాగి నోటిలో బడవేసికొని మ్రింగుచుండెను. కాని యా వానరులందఱు లోపలనుండి కర్ణరంధ్రములనుండి తిరిగి బయటకు వచ్చుచుండిరి.

౪౮-౪౯-౫౦ ఇట్లు కుంభకర్ణుడు సామాన్య వానరులను చేతులతో లాగి కొండగుహవలె నున్న తన నోటిలో పడవేసుకొని మ్రింగుటయే కాక సర్వసేనా నాయకుడగు నీలుని మోకాలుతో గవాక్షుని గంధమాదనుని కాలితోను తన్నగా వారలు భూమియందు మూర్ఛితులయి పడిపోయిరి; కాని వెంటనే వారలు తెలివి నొంది వేలకొలది వానరులతో కలసి కుంభకర్ణుని మీదఁపడి దంతములతోను గోళ్ళతోను పీకుచుండిరి. కాని వారల నందఱను చేతులతో లాగి తన ముఖగుహలో బడవేసుకొనుచుండ వారలు ముక్కురంధ్రముల నుండియు కర్ణరంధ్రములు నుండియు దిరిగి వెలుపలికి వచ్చుచుండిరి.

౫౧ కుంభకర్ణుడు వానరులను కొందఱను నమలుచును, మఱికొందఱిని కాలితో రాచివేయుచు, కొందఱిని చేతిచరుపులతో హతము చేయుచుండగా చావగా మిగిలినవారలు నలుదిక్కులకుఁ బరుగులిడుచుండిరి.

ఏవం తే ప్లవగా దశాస్యసహజే నాఽవధ్యమానా స్తతో
రామం తం శరణం యయు స్త్వథ సుతః క్రుద్ధోఽచలం వాలినః
ఆనీయోపరి తస్య బాహుయుగళస్యాఽభ్యంతరేఽపాతయ
త్తేనాఽభూ ద్భువి పాతితః క్షణ మయం మూర్ఛా మవా
పాఽఽశు సః. ౫౨

పశ్చా చ్ఛూలధరోఽ సురేశ సహజో దుద్రావ సూర్యాత్మ
జమ్, శైలాగ్రం తు ముమోచ వక్షసి పున స్తస్యాఽర్క
సూను స్తతః, తస్యాఽఽ ఘాతవశా త్రితౌ తు దనుజో మూ
ర్ఛా మవాప్యాఽ పత, ద్దృష్ట్వా తం ప్లవగాః ప్రహృష్టమనసో
నేదు ర్విశేషేణ తే॥ ౫౩

పశ్చా త్స్వస్థ్య ముపాగతోఽసురపతే ర్భ్రాతా కనిష్ఠ స్తు తం
సుగ్రీవం పరిగృహ్య హ స్తయుగళే నాథో భుజస్కంధకే
సంస్థాప్యాఽఽశరనాయకస్య నికటం యాతిస్మ సూర్యాత్మజ
స్తస్మాత్సోఽపిచ కర్ణయుగ్మ మసురస్యాఽథో నఖై శ్ఛిన్నవాన్॥
౫౪

కించ తద్బాహుయుగళం దశనై స్సూర్యనందనః
దష్ట్వా తద్బాహుమూలా త్తు సముత్ప్లుత్యాఽంబరం తతః
నివర్త్య దూరతః క్షిత్యాం జగామ హరివాహినీమ్
ఏతస్మి న్నంతరే తస్య శూలం పాణితలే స్థితం
ఆకృష్య మారుతి శ్చాఽపి ద్విధా భగ్నం చకార సః॥
౫౫-౫౬

౫౨ ఇట్లు కుంభకర్ణుడు వానరులను విహ్వలులనుగా చేయుచుండ కొందఱు పారిపోయి రాముని శరణుపొందిరి. ఈ సమయమున వాలి పుత్రు డయిన యంగదుడు మిక్కిలి క్రుద్ధుడై యొక పర్వతమును పెకలించి తీసికొనివచ్చి కుంభకర్ణుని బాహువులమీదఁ బడవేయగా నాదెబ్బతో కుంభకర్ణుడు భూమియందు మూర్ఛిల్లి పడెను. కాని క్షణములో దిరిగి లేచెను.

౫౩ పిదప కుంభకర్ణుడు శూలము పుచ్చుకొని సుగ్రీవునిమీదికిః బరుగిడగా సుగ్రీవుడు తన చేతియందున్న పర్వతశిఖరమును కుంభకర్ణుని వక్షస్థలము మీదికి విసరెను. ఆదెబ్బతో కుంభకర్ణుడు మూర్ఛిల్లి భూమి యందుబడగా, వానరులందఱు సంతోషముతో కేక లిడుచుండిరి.

౫౪ పిదప కుంభకర్ణుడు స్వస్థచిత్తుడై లేచి సుగ్రీవునిమీదికి పరుగిడి సుగ్రీవుని బట్టుకొని తన భుజముమీద వేసుకొని రావణునకు జూపింప వలయునని యతని సమీపమునకుఁ బోవుచుండ సుగ్రీవుడు కుంభ కర్ణుని ముక్కును చెవులను తన పండ్లతోను గోళ్ళతోను కొరికి శూర్పణఖ గతి పట్టించెను.

౫౫-౫౬ ఇంతియేగాక సుగ్రీవుడు కుంభకర్ణుని రెండుచేతులను పండ్లతో దృఢముగ గొఱుకగా నతడు సుగ్రీవుని తన చేతులలోనుండి విడిచి పెట్టగా నతడు సైకగిరి దూరముగా వానరసైన్యములో దుమికెను. ఈ సందులో కుంభకర్ణుని చేతిలోనున్న శూలమును హనుమంతుడు లాగివేసి రెండుతునియలుగా జేసెను.

కింక ర్త్వవిమూఢధీ ర్దశముఖ భ్రాతా కనిష్ఠః పురీం
లంకాం గంతు మనీప్సితోఽంగవికృతే ర్నాసాపుటాభ్యాం
తథా, కర్ణాభ్యాం చ విసర్గతేన మహతా రక్తప్రవాహేన వై
సంసిక్త స్త్రపయాశుచా పరభియా యుక్తోఽప్యగా త్సంగరమ్. ౫౭

కుంభకర్ణోఽప్యతో రుష్టో భక్షయ న్వానరా న్పునః
చరణాభ్యాం చ హస్తాభ్యాం మర్దయ న్కదనం మహత్
కుర్వ న్కపిమా ద్రఘూ త్తంస నికటం ప్రతి విద్రుతః
రామచంద్రోఽపి నిశితై ర్బాణై స్తత్కరౌ పునః
చిచ్ఛేద ఛిన్నబాహు శ్చ రాక్షసో రాఘవం పున
అత్తుం జగామ సోఽప్యర్ధచంద్రాకృతిశరౌ పునః
సమాదాయ పదద్వంద్వం తస్య చిచ్ఛేద రాఘవః. ౫౮-౫౯-౬౦
ఏవం ఛిన్న పదద్వయోఽపి దనుజో వ్యాదాయ వక్త్రం తదా
ఘోరం వై నినద న్వ్రజం శ్చ శనకై ర్వ్యక్షస్థలేనాఽవనౌ
ఆయాతిస్మ తదంతికం రఘుపతి స్సంవీక్ష్య రాత్రించరం
ముక్త్వేంద్రాస్త్రమథో త్తమాంగ మపి వై చిచ్ఛేద తస్యాద్రుతమ్ ౬౧

ఏతస్మి న్సమయేఽంబరే తు దివిజాః శ్రీరాఘవస్యోపరి
పుష్పాణి వ్యకిర న్ముదా బహు తదా నేదు శ్చ వాద్యా న్యలమ్
శ్రుత్వా తం నిపాతం దశాననవిభు శ్శోకేన యుక్త స్తదా
మూర్ఛాం ప్రాప తదేంద్రజిత్తు పితరం తం సాంత్వయా
మాస సః. ౬౨

ఆశ్చర్య రామాయణే యుదకాండే అష్టాదశ సర్గ స్సమాప్తః.

౫౭ పిదప కుంభకర్ణుడు చేయునదిలేక వికారరూపముతో లంకకు తిరిగి వెళ్ళుట కిష్టపడక తిరిగి యుద్ధభూమికి వచ్చుచుండెను కాని యతని ముక్కు చెవుల రంధ్రములనుండి రక్తప్రవాహము బయలు వెడలగా దానిచే తడుపబడుచు సిగ్గుచేతను శత్రుభయముచేతను నూగులాడుచు యుద్ధభూమికి వచ్చెను.

౫౮-౫౯-౬౦ కుంభకర్ణు డిట్లు రణభూమికి తిరిగివచ్చి శూలములేనందువలన వానరులను చేతులతో లాగి పట్టుకొని భక్షించుచు కొందఱను కాళ్ళక్రిందఁ బడవేసి చూర్ణము చేయుచు మఱి కొందఱను చేతులతో జరిచి హతముచేయుచు క్రమముగా రామునియొద్దకుఁ బరుగిడుచు వచ్చెను. రామచంద్రమూర్తియును తన వాఁడి బాణములచే నతని బాహువులను ఛేదింపగా, నతడు చిన్నబాహుఁడై బొబ్బలిడుచు రాముని భక్షించుటకై పైకి వచ్చుచుండగా, రామచంద్రమూర్తియును, అర్ధచంద్రాకారముగల రెండు బాణములను ప్రయోగించి కుంభకర్ణుని పాదములనుగూడ దెగనరికెను.

౬౧ ఇట్లు శ్రీరామచంద్రునిచే గాలుచేతులు తెగనరుకబడిన వాఁడయ్యు, కుంభకర్ణుడు పొట్టతో ప్రాకుచు నోరు తెరచి ఘోరమైన నాదమును జేయుచు రాముని మ్రింగుటకై వచ్చుచుండెను రామచంద్రమూర్తియు వెంటనే ఐంద్రాస్త్రమును బ్రయోగించి దానిచే నతని శిరస్సునుగూడ ఛేదించెను.

౬౨ ఈసమయమున దేవతలు ఆకసమునందుండి రామచంద్రమూర్తి మీదఁ బుష్పవర్షము కురిపించుచుండిరి. ఇదియునుం గాక, దుందుభులు మ్రోగించుచుండిరి. అప్సరసలు నృత్యగీతముల జేయుచుండిరి. పిదప కుంభకర్ణుడు కూడ హతుడయినట్లు రావణుడు విని మిక్కిలి దుఃఖపడి మూర్ఛిల్లి నేలబడి పోయెను. అప్పుడు ఇంద్రజిత్తు వచ్చి తండ్రి నోదార్పసాగెను.

ఆశ్చర్యరామాయణమున యుద్ధకాండమున పదునెనిమిదవసర్గము సమాప్తము.

## ఏ కో న విం శ స్స ర్గః

పశ్చాద్రాత్రిచరాధిపో నిజసుతా నేత ద్వచః ప్రాహ తా॰
న్యో మే దక్షిణబాహు రేవ నిహత స్సోఽయం నరేణా ద్య హా,
ఆరోహంతి యథేష్ట మాశు హరయో దుర్గాణి సర్వాణ్యపి,
ప్రాయో మే రతి రస్తి నో ధ్రువ మిదం మజ్జీవితే కిం పరైః, ౧

శ్రేయో మే మరణం మదీయ సహజో వ్రవాజ యత్రాఽ
ధునా, యాంస్యా మ్యద్య త మాశు పూర్వవచనం వైభీషణం
మాం పునః, నూనం ప్రీడయతీ తి తస్య వచనం శ్రుత్వాఽఽ
హు రస్యాఽఽత్మజా, శ్శక్తి స్తే పరమేష్ఠినా రిపుహరీ దత్తాఽ
స్తి కిం శోచసి. ౨

యద్వా పిత స్సుఖం తిష్ఠ వయ మేవ గతా రణం
శత్రూం స్తే నాశయిష్యామో దేయాఽనుజ్ఞా త్వయాఽద్య నః. ౩

ఇత్యుక్త్వా పితరం ప్రణమ్య సహసా యోద్ధుం వినిర్గచ్ఛతః
పుత్రా న్దేవనరాంతకత్రిశిరసః కించాఽతికాయం ముహుః
ఆశీర్భి స్త్వభినంద్య రక్షణకృతే తేషాం బలం రక్షసామ్
సద్యః ప్రేషయతిస్మ రాక్షసవిభు స్సంగ్రామ భూమిం ప్రతి. ౪

గత్వా తే శరవర్షం తు వవర్షు ర్వానరోపరి
న శేకు స్సమరే స్థాతుం రక్షసాం పురత స్తు తే
హనూమా న్వ్రజకల్పేన ముష్టినా క్రోధసంయుతః
దేవాంతకస్య శిరసి నిజఘాన ద్రుఢం తతః
ముష్టి నిష్పిష్ట మూర్ధా సా గతాసు శ్చ పపాత కౌ. ౫-౬

## ఒందొమ్మిదవ సర్గ ప్రారంభము

౧ పిమ్మట రావణుడు తన పుత్రులతో నిటుల జెప్పి విలపించెను. “పుత్రులారా! నాకు కుడిభుజముగా నుండెడివాడో, అతడొక మానవునిచే హతుడయ్యెను. ఎంతకష్టము కలిగెను. ఇంక వానరులు యథేష్టముగా ప్రాకారముల నెక్కి లోపలఁ ప్రవేశించెదరు. ఇక నా జీవితమునందు నాకేమాత్ర మిచ్ఛ లేదు. ఇక ఇతరులతో నాకుఁ బ్రయోజన మేమి యుండును?

౨ నేను వానరులచే నిట్లు పరాభవింపబడి బ్రతుకుటకంటె మరణమే శ్రేయస్కరము. నా తమ్ముడయిన కుంభకర్ణు డెచ్చటికేగెనో అచ్చటికి నేనుగూడఁ బోవుదును. అన్నిటికంటె విభీషణుని మాటలు తలచుకొనినచో నాకు లజ్జ కలుగుచున్నది” అని చెప్పుచుండ నతని పుత్రులగు నింద్రజిత్తు, నరాంతకుడు మొదలగువారలు తండ్రితో నిటులఁ బలికిరి. నీకు బ్రహ్మ యిచ్చిన శక్తియను నాయుధముండగా నీ విట్లేల శోకించెదవు.

3 తండ్రీ! నీవు సుఖముగ నింటిలో నుండుము. మేమే యిపుడు సమరమున కేగి నీ శత్రువుల నందఱను నశింపజేసి వచ్చెదము. వెంటనే మాకు ననుజ్ఞ నిమ్ము.

౪ ఇట్లు నరాంతకుడు మొదలగు రావణపుత్రులు తండ్రితోఁ జెప్పి యతనికి నమస్కరించి యుద్ధమునకు బయలుదేరిన నరాంతక దేవాంతక త్రిశిరసులను, అతికాయుని, ఆశీర్వదించి వారల రక్షణమునకై కొంత చతురంగబలమునుగూడ వారివెంట బంపించెను.

౫-౬౪ ఇట్లు దేవాంతక నరాంతక త్రిశిరసులు నతికాయుడును యుద్ధమునకు వెళ్ళి శరవర్షమును గురిపించుచుండ. వారలముందు వానరులు నిలువలేకుండనుండిరి. అట్టి సమయమున హనుమంతు డచటకు వచ్చి మహాకోపముతో వజ్రతుల్యమైన తన పిడికిలితో దేవాంతకుని శిరస్సు మీదఁ బొడువగా నాదెబ్బతో తల బ్రద్దలయి దేవాంతకుడు చచ్చెను.

నీలోఽపి శైల ముత్పాట్య సమానీయ నరాంతకం
జఘాన తేన వజ్రేణ హరోఽద్రి రివ దానవః
నిపపాతాఽఽశు భూమ్యాం తు మమార చ నిశాచరః. ౭-౮

ఉత్ప్లుత్యాఽఽశు మరుత్సుత స్త్రిశిరసంత్వాదాయతత్పాణిగమ్
హృత్వాఽసిం తు బలేన తేన నితరాం చిచ్ఛేద శీర్ష త్రయమ్
పశ్చా ద్వీక్ష్య హతం సహోదర మథో మత్తోఽసురః క్రుద్ధవా
నాదాయాఽఽశు గదాం తయా హరిచమూం వివ్యాధ బాణై
రపి. ౯

యుద్ధోన్మత్త స్తథోన్మత్తో మత్త శ్చాఽప్యనుజా స్త్రయః
నిహతా వానరై స్తూర్ణం మరుత్సుత ముఖై స్తదా. ౧౦

అతికాయో మహావీరో హరిసేనోపరి ద్రుతమ్
శరవర్షం వవర్షాఽథో సౌమిత్రి ర్ద్రుత మాగతః
అతికాయోరసి క్రుద్ధో ముమోచ శర ముత్తమమ్
తదస్త్ర నిహతో భూమ్యాం పపాత చ మమార సః. ౧౧-౧౨

నరాంతకం త్రిశిరసం దేవాంతక మథాఽఽహవే
అతికాయం హతం శ్రుత్వా రావణోఽప్యతిదుఃఖితః
ధూమ్రాక్షం ప్రేషయామాస యోద్ధుం సహ నిశాచరైః
గత్వా తే శరవర్షేణ వివ్యధుః ప్లవగా న్బహూన్
అంగదాద్యై ర్హతా స్తేపి శైలపాతేన వానరైః
అవశిష్టా హతాః కేచి త్కేచి ద్దశముఖం యయుః.
౧౩-౧౪-౧౫-౧౬

౭-౮ పిదప నీలుఁడొక పర్వతమును పెల్లగించి తెచ్చి దానితో నరాంతకుని గొట్టగా నతడు వజ్రాయుధముచే నరుకబడిన రెక్కలుగల కొండ వలె భూమియందుబడి వెంటనే మరణించెను

౯ పిదప హనుమంతు డొక గంతువేసి త్రిశిరసుడను రక్కసుని చేతిలో నున్న ఖడ్గమును లాగి దానితో వాని మూడు తలలను దెగనఱికెను. ఇట్లు తన సోదరులు హతులయిరని తెలిసి మత్తుడనువాడు మిక్కిలి క్రుద్ధుడై వెంటనే గదను జేతఁబట్టి గదతో వానరులను హతము చేయసాగెను.

౧౦ పైన చెప్పబడిన మత్తునకు సహాయముగా, ఉన్మత్తుడు యుద్ధోన్మత్తుడును రాగా మత్తోన్మత్త యుద్ధోన్మత్తులను మువ్వురను హనుమంతుడు మొదలగు కపివీరులు క్షణములో హతమార్చిరి.

౧౧-౧౨ పిమ్మట, అతికాయుడు మండిపడుచు వచ్చి వానరసైన్యము మీదను శరవర్షమును గురిపించుచుండ లక్ష్మణు డతని నెదుర్కొని దివ్యాస్త్రము నతనిమీదఁ బ్రయోగింపగా దానిచే, అతికాయుడు హతుడయ్యెను.

౧౩-౧౪-౧౫-౧౬ ఇట్లు దేవాంతకుడు, నరాంతకుడు, త్రిశిరసుడు, అతికాయుడును హతులయినట్లు రావణుడు విని మిక్కిలి దుఃఖపడి ధూమ్రాక్షుని యుద్ధమునకు రాక్షస సైన్యముతోగూడఁ బంపెను. ధూమ్రాక్షుడును, అతనివెంటవెళ్ళినరక్కసులుగూడ వానరసైన్యమును జీల్చి చెండాడుచుండ, అంగదుడు మొదలగు వానరవీరులు తారసిల్లి పర్వతశిఖరములను ధూమ్రాక్షునిమీదను విసరివేయగా ధూమ్రాక్షుడు హతుడయ్యెను. మిగిలిన రక్కసులలో గొందఱు వానరులచే జంపబడిరి. మఱికొందఱు రావణునిగూర్చి చావుకబురు చెప్పుటకు పరుగు లిడిరి.

తత స్తేషాం వధం శ్రుత్వా దశాస్యో బహుదుఃఖితః
ఇంద్రజి త్సాంత్వయిత్వా తం పితరం ప్రాహ దుఃఖితమ్
అద్య మే పశ్య తాత త్వం విక్రమం దేహి మే పునః
అభ్యనుజ్ఞాం తు యుద్ధాయ హనిష్యామి రిపూం స్తవ.
౧౭-౧౮

ఇత్యుక్త్వా పితరం నత్వా మేఘనాదోఽతిదుఃఖితం
క్రోధేన మహతాఽఽవిష్టః ప్రతస్థే సమరం ప్రతి
పశ్చా దింద్రజితా తే తు వధ్యమానా శ్శరై స్తతః
సంగతా వానరా స్సర్వే విద్రుతా రావణిం ప్రతి
ద్రుమై స్తథాఽచలాగ్రైశ్చ రావణిం త మతాడయన్
పశ్చా త్సునిశితై ర్బాణై స్సమరే వానరాం స్తు సః
ప్రమమాథ మహావీరో విచక ర్త శరై స్తు తాన్.
౧౯-౨౦-౨౧-౨౨

సర్వే తే ప్లవగా విభిన్నతనవ స్తద్బాణ వర్షార్దితా
స్త్యక్త్వా సంగర మాశు దుద్రువు రథో వాతాత్మజం చాఽంగదమ్, సుగ్రీవం చ సుషేణ మృక్షపతి మప్యేవం గవాక్షం తథా, మైందం నీల మలం శరైః కపివరా న్వివ్యాధ సోఽంతర్హితః. ౨౩

ఏవం రావణి రంబరే తు నివస న్నంతర్హితో వానరాన్
సంపాత్యాఽవనిజాపతిం తదనుజం కృత్వా విషణ్ణౌ శరైః
తుష్టో రావణపాలితాం తు నగరీం శీఘ్రం వివేశాఽనుజౌ
దివ్యా స్త్రేణ నిపాతితౌ పున రుభౌ చైతన్యహీనౌ స్థితౌ ౨౪

౧౭-౧౮ ధూమ్రాక్షుడు మొదలగువారు గూడ హతులయినట్లు రావణుడు విని మిక్కిలి దుఃఖపడుచుండగా, ఇంద్రజిత్తు వచ్చి దుఃఖసముద్రములో మునిగియున్న తండ్రి నోదార్చుచు నిటులఁబలికెను. తండ్రీ! యీ తడవ నా పరాక్రమమును జూడుము. నాకు యుద్ధమునకు వెళ్ళుట కనుజ్ఞ నిమ్ము. నీ శత్రువుల నందఱను బరిమార్చి వచ్చెదను.

౧౯-౨౦-౨౧-౨౨ ఇంద్రజిత్తు తండ్రితో నిటులఁజెప్పి నమస్కరించి మిక్కిలి క్రుద్ధుడై యుద్ధభూమికి వెళ్లి శరవర్షముచే వానరులను హతమార్చుచుండ, వానరులందరును గుంపుగాచేరి చెట్లతోను పెద్ద బండలతోను ఇంద్రజిత్తునిగొట్టగా, వాని నన్నిటిని తన బాణములచే దుత్తినియలు చేయుచు శరపరంపరలచే వానరులను దునియలుగా జేసి వేయుచుండెను.

౨౩ ఇంద్రజిత్తు యొక్క బాణములచే బ్రద్దలయిన శరీరములుగల వానరులు తచ్ఛరవర్షమును సహింపలేక సమరమును విడిచి నలుదిశలకుఁ బారిపోవుచుండిరి, పిదప ఇంద్రజిత్తు గగనమార్గమున నంతర్హితుడయి (యెవరికి గన్పడకుండగ నుండి) హనుమంతుని మీదను, అంగదుని మీదను, సుగ్రీవుని మీదను, సుషేణుని మీదను, జాంబవంతుని మీదను, నీలుడు గవాక్షుడు, మైందుడు మొదలగు వానరవీరుల మీదను. శరవర్షము గురిపించుచు, వారలను మూర్ఛిల్లఁజేయుచుండెను.
౨౪ ఇవ్విధముగా, ఇంద్రజిత్తు, ఆకాశమున నంతర్హితుడైయుండి వానరులను యూధపతులను తన శరపరంపరాఘాతములచే మూర్ఛితులనుగా జేసి భూమియందుఁబడునట్లు చేయుటయేకాక, రామలక్ష్మణులను గూడ తన శరాఘాతములచే విషణ్ణులనుగా జేసి మిక్కిలి సంతోషముతో లంకకు వెళ్లెను. రామలక్ష్మణులు దివ్యాస్త్రముచే భూమి యందతనిచే నేలపడవేయబడి చైతన్యరహితులయి యుండిరి

తస్మి న్నిశీథే హనుమద్విభీషణౌ
సైన్యే ప్రవిష్టౌ మృతిమ త్ప్లవంగమాన్
అన్వేషమాణౌ వసుధారి వానరా
న్విచేరతు స్తత్ర రణే శనై శ్శనైః ౨౫

తతో రణా న్నివృత్యాఽఽశు మేఘనాదోఽతిహర్షితః
గత్వా దశముఖం తస్మై ప్రాహ చాఽఽత్మ జయం పునః. ౨౬

ఏతస్మి న్సమయే తత్ర జాంబవా న్మారుతిం పునః
నిరీక్ష్య తం సమాలింగ్య ప్రాహైవం మారుతిం ప్రతి. ౨౭

స ప్త షష్టిర్హతాః కోట్యో మేఘనాదేన మారుతే
అంతర్హితేన తేనాఽద్య గత్వా తత్ర మహౌషధీః
సమానీయ ప్లవంగాం శ్చ రాఘవా వపి జీవయ
ఇత్యుక్తో మారుతి శ్చాఽపి గత్వా ద్రోణగిరిం ద్రుతమ్
మహౌషధీ స్సమానీయ వానరాం స్తా నజీవయత్
తదాఘ్రాణ వశాత్సద్యో రాఘవావపి తత్క్షణే
విశల్యా వుత్థితౌ రామో ధను స్సజ్యం చకార సః ౨౮, ౨౯–30

తతో నిశీథకాలే తు లంకా మభిముఖా శ్చ తే
సోల్కా శ్శాఖామృగా స్సర్వే దహంతి స్మ పురీం క్రుధా. ౩౧

దశాననోఽతిరుష్ట స్స న్కుంభకర్ణ సుతౌ పునః
యుద్ధాయ ప్రేషయామాస రాక్షసై స్సహ సత్వరమ్
తద్యుద్ధ మభవద్ఘోరం వానరాణాం చ రక్షసామ్

౨౫ ఆయర్ధరాత్రి సమయమున హనుమంతుడును విభీషణుడు నిర్జరును సైన్యములోఁ బ్రవేశించి యెవరెవ్వరు చచ్చిరో. యెవరెవ్వరు బ్రతికి యుండిరో వెతుకుచుండిరి.

౨౬ పిదప నింద్రజిత్తు రణరంగమునుండి మరలి సంతోషముతో రావణునకు వానరులను రామలక్ష్మణులను గూడ భూమిమీద బడవేసి వచ్చినసంగతిని జెప్పి సంతోషపెట్టెను.

౨౭ హనుమద్విభీషణులు సైన్యములోఁ బ్రవేశించి వెతుకుచున్న సమయమున జాంబవంతుడు కన్పడెను. జాంబవంతుడు హనుమంతుని జూచి కౌగిలించుకొని యిట్లుపలికెను.

౨౮-౨౯-౩౦ హనుమంతా! యీ రాత్రి యుద్ధములో, ఇంద్రజిత్తు అరువదియేడు కోట్ల వానరులను హతముచేసెను. అత డంతరిక్షమున గన్పడకుండ నుండి శరవర్షములచే నిట్లు హతము చేయగలిగెను. నీవు వెంటనేవెళ్ళి సంజీవిని మొదలగు నౌషధులను దీసికొనివచ్చి వానరులను రామలక్ష్మణులనుగూడ బ్రతికింపుము అని కోరగా వెంటనే హనుమంతుడు క్షణములో ద్రోణగిరి కేగి యోషధులను దెచ్చి వానరులను రామలక్ష్మణులనుగూడ బ్రతికించెను. ఆ యోషధుల వాసనవలననే రామలక్ష్మణులు విశల్యులయి లేచి ధనుస్సు నెక్కుపెట్టి యుద్ధసన్నద్ధులయి యుండిరి.

౩౧ ఆ యర్ధరాత్రముననే వానరులందరు కొఱవులు చేతబట్టుకొని లంకలో బ్రవేశించి లంకను దగులబెట్టుచుండిరి.

౩౨-౩౩-౩౪ ఇట్లు వానరులు లంకలో బ్రవేశించి యల్లకల్లోలము చేయుచుండ, రావణుడు సహింపలేక కుంభకర్ణుని పుత్త్రులగు కుంభ నికుంభులను యుద్ధమునకు బంపెను. కుంభ నికుంభులకును వానరులకును ఘోరయుద్ధము జరిగెను. ఇట్టిసమయమున సుగ్రీవుడు కుంభునితో యుద్ధము జేసి వానిని హతునిగా జేసెను. పిదప హనుమంతుడు

సుగ్రీవేణ హతః కుంభో నికుంభోఽనిలజేన చ
రామేణ మకరాక్ష శ్చ నిహతో రణమూర్ధని. ౩౨-౩౩-౩౪

కుంభకర్ణ సుతౌ చాఽపి నిహతౌ ఖరనందనం
మకరాక్షం హతం శ్రుత్వా రావణః క్రోధమూర్ఛితః
ప్రేషయామాస తనయం యోద్ధు మింద్రజితం పునః
ఇంద్రజి న్మాయయా సీతాం కల్పయిత్వా పరాం పునః
సంస్థాప్యాత్మరథే తాం తు రణభూమిం జగామ సః ౩౫-౩౬-౩౭
గత్వా తేషాం ప్లవంగానాం పశ్యతాం రావణి స్తదా
మాయాసీతాం సమాదాయ చిచ్ఛేదా స్త్రేణ తచ్ఛిరః
వానరేషు ప్రమత్తేషు సంప్రాప్యతు నికుంభిలాం
తత్ర హోమ విధానాయ స ఏవం కృతవాంశ్చ హో. ౩౮-౩౯

మారుతి ర్మూర్ఛితో భూయ స్సముత్థాయ గతో ద్రుతం
రావణే శ్చేష్టితం ప్రాహ రాఘవం ప్రతి దుఃఖితః ౪౦

విలపంతం తతో రామం ప్రాహ పంక్తిముఖానుజః
జీవతో రావణస్యేదం కృత్యం సీతావధాత్మకమ్
న భవే ద్రామచంద్రాఽద్య కృతం మాయామయం ధ్రువం
ఇత్యుక్త్వా సాంత్వయిత్వాఽఽహ పున రేవం విభీషణః ౪౧-౪౨

ఇంద్రజిన్మాయయా సీతాకల్పనం వాఽథ తద్వధః
మోహనార్థం ప్లవంగానాం నాఽత్ర కార్యా విచారణా
తచ్ఛ్రుత్వా రాఘవో హృష్ట శ్చింతాం సంత్యక్తవా నభూత్
**౪౩-౪౪**

పర్వతశిఖరమును దెచ్చి నికుంభుని మీదఁ బడవేయగా నికుంభుడు గూడ హతుడయ్యెను. ఖరునికొడుకయిన మకరాక్షుని రామచంద్ర మూర్తి హతముచేసెను.

౩౫-౩౬-౩౭ కుంభనికుంభులు మకరాక్షుడును గూడహతులయిరనువార్తను విని రావణుడు మిక్కిలి శోకమును, క్రోధమునుగూడ నొంది యింద్రజిత్తును దిరిగి యుద్ధమునకుఁ బంపెను ఇంద్రజిత్తు మాయా సీతను కల్పించి తనరథమున గూర్చుండబెట్టుకొని రణభూమికి వెళ్ళెను.

౩౮-౩౯ ఇట్లు రణభూమికి నింద్రజిత్తు వెళ్లి వానరులు చూచుచుండగనే, మాయాసీతను జేతబట్టుకొని తన దివ్యాస్త్రముచే నామె యొక్క శిరస్సును ఛేదించెను. అట్లు ఛేదించుటలో నతని యుద్దేశమేమనగా, సీత చచ్చిపోయెగదా యను విచారముతో వానరులు ప్రమత్తులయి యుండగా, దాను వెళ్ళి తనకు దివ్యాస్త్రలాభము కలుగుటకై నికుంభిలలో హోమపూర్తి చేయ వీలగునని తలంచి యిట్లు చేసెను.

౪౦ సీతను మేఘనాదుడు ఛేదింపగా, హనుమంతుడు చూచి మూర్ఛితుడై కొంతతడవు పడిపోయి, పిదపలేచి వెళ్లి రామచంద్రమూర్తితో, ఇంద్రజిత్తుయొక్క దుండగమును దుఃఖించుచు జెప్పెను.

౪౧-౪౨ హనుమంతుడిట్లు చెప్ప, రామచంద్రమూర్తియు విలపించుచుండ, విభీషణుడు రామునితో నిటులఁ జెప్పెను. రామచంద్రా! నీవు దుఃఖింప వలసిన పనిలేదు. (ఏలనన) రావణుడు బ్రతికియుండగా, సీతావధాత్మకమయిన కార్యము జరుగదు. ఇది యంతయు నింద్ర జిత్తుచేఁ గల్పింపఁబడిన మాయ కాని నిజముకాదని జెప్పి యూరార్చి, తిరిగి రామచంద్రమూర్తితో విభీషణు డిటుల బలికెను.

౪౩-౪౪ రామచంద్రా! ఇంద్రజిత్తు మాయాసీతను గల్పించుట కాని, యా సీతను వధించుట కాని, వానరులను మోసగించుటకుఁ గాని వేఱు గాదు. ఇవ్విషయమున విచారణతోఁ బనిలేదు. అని చెప్పగా రామ చంద్రమూర్తి సంతోషించినవాడై యా విచారమును విడిచెను.

దివ్యాస్త్రరథలాభార్థీ మేఘనాదో నికుంభిలాం
హవనార్థం జగామాఽఽశు నివృత్త స్సమరాంగణాత్. ౪౫

గత్వా తత్రేంద్రజి త్తూర్ణం పురోహితపురస్సరః
రక్తాంబరధర స్తత్ర హవనా యోపచక్రమే
యోగినీవటవృక్షస్య స్థితోఽథ స్త్వాభిచారికం
కర్తుం సర్పాదిభి స్సప్త దుర్గమా స్వరిత స్తదా
సర్పఖండై శ్చ మండూకై ర్హోమం కర్తుం సముద్యతః.
౪౬-౪౭

విభీషణో నిరీక్ష్యాఽథ హోమధూమం సముత్థితం
మేఘనాదసమారంభం ప్రాహైవం రాఘవం ప్రతి
భూప! సీతాపతే! నూన మింద్రజి ద్ధవనం పునః
కరోతి తత్సమాప్తం చే దజేయోఽయం భవే ద్ధ్రువం
తస్మా త్ప్రేషయ సౌమిత్రిం ఘాతయిష్యామి తేన తమ్.
౪౮-౪౯-౫౦

య శ్చతుర్దశవర్షాణి నిద్రాహార వివర్జితః
తేనైవ మృత్యు రాదిష్టా పురా కంజభువాఽస్య తు
సౌమిత్రి స్తు యదాఽయోధ్యాపురా త్త్వాఽనుససార సః
తదాది రామచంద్రాఽయం నిద్రాహారవివర్జితః
ఉదంతోఽయం మయా జ్ఞాత స్తత్సంభాషణమూలతః.
౫౧-౫౩

పశ్చా త్తద్రఘునందనోఽపి నితరాంతుష్టోఽవద త్తం పున
స్సౌమిత్రిం హరిభి ర్మరుత్సుత ముఖ్యై స్సాకం ద్రుతం త్వం పునః

౪౫ ఇంద్రజిత్తు మాయాసీతను రణరంగమున ఛేదించిన పిదప నికుంభిలకు వెళ్ళి యచట దివ్యరథము, దివ్యాస్త్రములు సంపాదింపవలెనని యొక యాభిచారిక హోమమును జేయ నారంభించెను.

౪౬-౪౭½ ఇంద్రజిత్తు హోమము జేయుట యెట్లనగా, పురోహితుని ముందుంచుకొని రక్తాంబరమును ధరించి యోగినీవటవృక్షముక్రింద నున్న యొక పాతాళ గుహలో హోమము జేయుచుండెను. ఎవరు నా స్థలమునకు రాకుండ నుండుటకై చుట్టును పెద్ద పులులు, సర్పములు మొదలగు వానిచే సప్తప్రాకారములను గల్పించుకొనియెను. మఱియు హోమముజేయు వస్తువు లేవియన? రక్తపుష్పములు కప్పలు ఆవాలు, బొమికలు, సర్పఖండములు మొదలగునవియై యుండెను.

౪౮-౪౯-౫౦ ఇట్లింద్రజిత్తు నికుంభిలలో హోమము చేయుచుండగా, హోమధూమముపైకి వ్యాపించెను. ఇట్లు నికుంభిలలోనుండి బయలు దేరిన ధూమమును విభీషణుడు చూచి యింద్రజిత్తు హోమమేదియో చేయుచుండెనని నిశ్చయించి రామచంద్రమూర్తితో నిటులఁజెప్పెను. రామచంద్రా! ఇంద్రజిత్తు నికుంభిలలో హోమము చేయుచుండెను. ఆ హోమము సమాప్తినొందినచో నతనిని నెవ్వడును జయింపలేడు. అందువలన వెంటనే లక్ష్మణుని నావెంటఁ బంపుము. లక్ష్మణునిచే నతనిని జంపించెదను.

౫౧-౫౨½ లక్ష్మణుని బంపుమని నేనేలఁ గోరితిననగా జెప్పెదను వినుము. ఎవడు పదునాలుగు సంవత్సరములు నిద్రాహారములు లేకుండ నుండునో, అతనిచేతగాని యింద్రజిత్తు చావడు. ఇట్లు పూర్వము బ్రహ్మ వరమిచ్చియుండెను. లక్ష్మణుడు అయోధ్యనుండి బయలు దేరినది మొదలు నేటివఱకు నిద్రాహారములు లేకుండ నుండెననియెడి సంగతి నేను లక్ష్మణునితో నిష్టాగోష్ఠిగ మాట్లాడుటలో నాకు దెలిసినది. (అనిచెప్పెను.)

౫౩½ పిదప రామచంద్రమూర్తి మిక్కిలి సంతోషించి విభీషణునితో నిటులఁ జెప్పెను. విభీషణా! హనుమంతుడు మొదలగు వానర వీరులను వెంటబెట్టుకొని లక్ష్మణుని దీసికొని వెళ్ళుము. తొందరగ

నీత్వా మారయ తం విభీషణ! భవా న్నిర్యాత్వరం తైస్సమం
ప్రోక్త స్త్వేవ మరం దశాస్యసహజో నిష్క్రాంతవాం స్తైస్సహ.
౫౩

ద్రుతం నికుంభిలాం గత్వా సౌమిత్రిప్రముఖా స్తతః
వ్యాఘ్రసర్పముఖా న్సప్త ప్రాకారా నాశుగై ర్ధృతం
భిత్త్వా ప్రవిశ్య చాఽంత స్తే తత్రాఽన్విష్యాపి రావణిం
కుత్రచి త్తం న దదృశు స్తతః క్రుద్ధోఽనిలాత్మజః
యోగినీవట మన్వీక్ష్య త ముత్పాట్య తదంతరే
దదర్శ సంస్థితాం గుప్తాం మహతీం యోగినీగుహాం.
౫౪-౫౫-౫౬

తతో మరుత్సుత స్తత్ర తత్పిధానశిలాం పునః
యోగినీసంజ్ఞయైవాఽఽశు పాదఘట్టనమూలతః
చూర్ణీకృత్య గుహాసంస్థం తర్జయామాస రావణిం
తత్ర స్థితాన్నృత్విజ శ్చ మేఘనాద మతాడయన్
త్యక్త్వా హోమం బహి స్త్వేత్య యోద్ధుం సిద్ధోబభూవ సః.
౫౭-౫౮

సౌమిత్రి శ్చ శరై ర్ధను ర్ధ్వజరథా నశ్వాం శ్చ సూతం తథా
చిచ్ఛేదాఽఽశరపాత్మజస్య కవచం చాఽపి క్రమా ద్రక్షసః
ధృత్వా న్య ద్ధను రాశు రావణి రపి స్థిత్వా క్షితౌ తద్రిపో
శ్చిచ్ఛేదాఽఽశు తనుత్ర మాశరవరే తత్రుద్ధవా న్లక్ష్మణః
౫౯

వీరితో బయలుదేరుము, అని రామచంద్రమూర్తి చెప్పగా, విభీష ణుడు లక్ష్మణుడు మొదలగు వారితో బయలుదేరెను.

౫౪-౫౫-౫౬ ఇట్లు లక్ష్మణుడు మొదలగువారలు నికుంభిలకు వెళ్ళి యచ్చటి వ్యాఘ్ర సర్పాది రూపకములగు సప్తప్రాకారములను ఛేదించుకొని లోపలికివెళ్లి యింద్రజిత్తును వెతుకుచుండిరి. కాని యెచ్చటను మేఘనాదుడు కన్పింపకపోయెను. ఇట్లతడు కన్పింప నందున హనుమంతుడు క్రుద్ధుడై యచ్చటనున్న రోహిణీ వటవృక్ష మును పెల్లగింపగా, దానిక్రిందనున్న గుహ కన్పడెను.

౫౭-౫౮ పిదప హనుమంతుడు గుహాద్వారమున కడ్డుగానున్న శిలను తన పాద ఘట్టనముచే దుత్తినియలు చేసి గుహలోఁ బ్రవేశించి యచ్చట హోమము చేయుచున్న యింద్రజిత్తును నతని ఋత్విజులనుగూడ పిడికిలి పోట్లతో పొడవ నారంభించెను. పిదప మేఘనాదుడు హోమము విడిచి బయటికి వచ్చి యుద్ధసన్నద్ధుడయ్యెను.

౫౯ లక్ష్మణుడు మేఘనాదునితో యుద్ధము కొంతసేపుచేసి పిదప నతని ధనువును, ధ్వజమును, రథమును, గుఱ్ఱములను సారథిని తన బాణ ములచే ఛేదింపగా, విరథుడయి యుండెను. పిదప లక్ష్మణుడు మేఘనాదుని కవచమునుగూడ ఛేదించెను. ఇంద్రజిత్తు మఱియొక ధనువును వెంటనే గ్రహించి భూమియందు నిల్వబడియే యుద్ధము చేయుచు లక్ష్మణుని కవచమును బాణములచే ఛేదింపగా, నతని మీద లక్ష్మణుడు మిక్కిలి యాగ్రహము గలవాడయ్యెను.

సౌమిత్రి స్తు సహస్రశ శ్చ విశిఖాం స్తస్మి న్ముమోచా
శరే,సర్వాం స్తా న్విశిఖా న్బిభేద శతశ స్సోప్యాశరోఽప్యాశు
ఆగ్నేయాస్త్ర మథో ప్రయుజ్య సహసా తద్రావణే ర్దక్షి
బాహుం తేన శరాన్వితం తు తరసా చిచ్ఛేద రామానుజః

తద్బాహు స్సశరో దశాననసుతప్రాసాదమధ్యేఽపత
త్పశ్చాద్వామక రేణ రావణి రలం క్రుద్ధో నిహంతుం
సౌమిత్రింప్రతి విద్రుత స్సునిశితం శూలం గృహీత్వా
వామం చాఽపి కరం స శూల మపి తేనాఽస్త్రేణ చిచ్ఛేద
ః

సతు వామకర స్తస్య గత్వా రావణ సన్నిధౌ
పపాత మేఘనాదస్య త దద్భుత మివాఽభవత్
పశ్చాద్రాత్రిచ రేశ సూను రపి తం వ్యాదాయ వక్త్రింద్ర
ద్రుద్రావాఽథ తు లక్ష్మణోఽపి విశిఖం శ్రీరామనామాంకి
తస్మి న్నాశు ముమోచ సత్యవచనే భ్రాతుః ప్రతిజ్ఞాంపునః
కృత్వాసోపి శిర స్సకుండల మథో చిచ్ఛేద తద్రావణేః.
౬౨-౬౩

పశ్చాత్తే ముదితా స్సురా బహువిధం తం తుష్టువు ర్లక్ష
పుష్పాణి వ్యకిరం శ్చ చక్రు రథ తే నీరాజనం తస్యతు
పశ్చాత్సోఽపి గతశ్రమో దర మలం సంపూరయామా
చ్ఛిత్వా తాం త్రిజటా మథాఽఽహ మహిజా శం
స్థైత ద్వచః

౬౦ లక్ష్మణుఁ డాగ్రహము గలవాఁడై వేలకొలది బాణములను, ఇంద్ర జిత్తు మీదను ప్రయోగింపగా, ఇంద్రజిత్తు వాని నన్నిటిని తన బాణములచే మధ్యనే తుత్తునియలుగా జేసెను. ఇతరములయిన యస్త్రములచే ప్రయోజనము లేకపోయినందున లక్ష్మణుడు వెంటనే యాగ్నేయాస్త్రమును ప్రయోగించి బాణసహితమయిన యతని కుడి భుజమును ఛేదించెను.

౬౧ లక్ష్మణునిచేఁ దెగగొట్టబడిన యింద్రజిత్తుయొక్క కుడిభుజము శర సహితముగా వెళ్ళి యింద్రజిత్తుయొక్క మేడలోపలఁబడెను. ఇంద్ర జిత్తు కుడిభుజము తెగగొట్టబడినను, అత డూఱుకొనక, యెడమ చేతితో యుద్ధము చేయుచు లక్ష్మణునిమీదకురాగా, ఆ యాగ్నే యాస్త్రముచేతనే యతని యెడమ భుజమునుగూడ లక్ష్మణుడు ఛేదించెను.

౬౨-౬౩-౬౪ లక్ష్మణునిచేఁ దెగగొట్టబడిన యింద్రజిత్తుయొక్క యెడమ భుజము శూలాయుధసహితముగా, రావణుని సమీపమునఁ బడెను. అది యాశ్చర్యకరమైన విషయము - పిదప మేఘనాదుడు రెండు చేతులు పోయిన వాడయ్యు నుపేక్షింపక నోరు తెరచి లక్ష్మణుని మీదకు మ్రింగుటకుఁ బోగా, లక్ష్మణుడు "రాముడు సత్యసంధుడే యయినయెడల" ఓ బాణమా నీవు వెళ్ళి యింద్రజిత్తుయొక్క శిర మును ఛేదింపుమాయని ప్రతినజేసి రామనామాంకితమైన శరమును విడువగా, ఆశరమువెళ్లి యింద్రజిత్తుయొక్క శిరస్సును ఛేదించి వేసెను.

౬౫ పిదప దేవతలు సంతోషపడి లక్ష్మణుని ననేక విధముల స్తుతించుట యే కాక పుష్పవర్షములను గూడ నతనిమీదను వర్షించి నీరాజనము నిచ్చిరి. పిదప లక్ష్మణుడు శంఖమును విజయచిహ్నముగఁ బూరింపగా, ఆ శంఖధ్వనిని సీతవిని సందేహముగలదియై త్రిజటతో నిట్లుబలికెను.

తచ్ఛంఖనాదస్యతుహేతు మద్య జ్ఞాత్వా సమేత్య త్రిజటే వద
త్వమ్, ఇత్యేవ ముక్తా త్రిజటాఽఽశు గత్వా జ్ఞాత్వా సమే
త్యాఽఖిల మాహ తస్యై. ౯౬

తచ్ఛ్రుత్వా మేఘనాదస్య మరణం జానకీ భృశం
ముదితాఽభూ త్తత స్తత్ర మేఘనాదస్య త చ్ఛిరః
గృహీత్వా మారుతి స్సద్య స్సౌమిత్ర్యాదిభి రన్వితః
నానావాద్యస్వనై స్సాకం రాఘవాంతిక మాయయౌ
సమేత్య రావణిం ప్రాహ లక్ష్మణేన హతం చ సః. ౯౭-౯౮॥

నత్వా థో రఘునందనం పవనజ స్తన్మేఘనాదస్యత
చ్ఛీర్షం దర్శయతిస్మ సోఽపి నితరాం తుష్ట్వాఽనుజం ప్రాహ
తమ్, సౌమిత్రే బహుమాయకం తు దనుజాధీశాత్మజం
త్వాం వినా, హంతుం కోఽప్యపరో న శక్ష్యతి మహా
త్కార్మ త్వయాసాధితమ్. ౯౯॥

పశ్చా త్తద్భుజ మన్వవేక్ష్య చ తత శ్శ్రుత్వాఽఽత్మసూనో
ర్మృతిం, తత్రైవాఽఽశు పపాత రాక్షసవిభు స్సమూర్ఛిత
స్తు క్షితౌ, పశ్చా ద్దైవ స్మృతి మేత్య సోఽపి నిశితం
ఖడ్గం గృహీత్వా ద్రుతం, సీతాం హంతుమనా వ్రజన్నృప
రథో తన్మంత్రిభి ర్వారితః. ౧౦౦॥

కించైవం త మథాఽబ్రువంశ్చ సచివాః పంక్త్యానన! త్వం పునః
కర్తుం స్త్రీవధ మద్య కిన్ను యతసే దోషో మహాం స్త ద్భవేత్
అస్మాభి స్సహితో భవా న్రిపువధం కర్తుం యతేథాఽఽహవే
హత్వైవం రిపు మాప్స్యసే మహిసుతాం నూనం దశాస్యప్రభో.
౧౦౧॥

౬౬ ఓ త్రిజటా! శంఖనాదము గొప్పగా వినబడెను. దానికి గారణ మేదిమో యుండియుండును. నీవు తెలిసికొని వచ్చి నాకుఁ జెప్పు మని యడుగగా, త్రిజట వెంటనే వెళ్ళి కారణమును దెలిసికొని వచ్చి యామెకుఁ జెప్పెను.

౬౭-౬౮½ ఇట్లు త్రిజటవలన నింద్రజిత్తుయొక్క మరణవార్తను సీత విని మిక్కిలి సంతోషించెను. అచ్చట లక్ష్మణునిచే దెగగొట్టబడిన మేఘనాదుని శిరమును హనుమంతుడు చేతఁబట్టుకొని లక్ష్మణుడు మొదలగు వారితో గూడి వాద్యధ్వనులతో గూడ శ్రీరాముని సమీపమునకు వచ్చెను. వచ్చి యింద్రజిత్తు లక్ష్మణునిచే జంపబడి నట్లుగూడ రామున కిట్లు విన్నవించెను.

౬౯½ మఱియు హనుమంతుడు రామచంద్రమూర్తికి నమస్కరించి యిటులఁ జెప్పెను. రామచంద్రా! యిదిగో మేఘనాదుని శిరము. దీనినిఁ జూడుమని చెప్పి రామచంద్రుడు తచ్ఛిరమునుఁజూచి మిక్కిలి సంతోషించి లక్ష్మణునితో నిటులఁ బలికెను. లక్ష్మణా! బహు మాయికుడయిన యింద్రజిత్తును నీవు తక్క నితరు లెవ్వరును జంప జాలరు. నీవు గొప్ప కార్యమును సాధించితి వనెను.

౭౦½ పిదప రావణుడు తన సమీపమున బడిన మేఘనాదునిచేతిని జూచి యింద్రజిత్తుకూడ హతుడయినట్లువిని తెలిసికొనియు భూమి యందు మూర్ఛిల్లి పడిపోయెను. కొంతసేపటికిఁ దిరిగి యతడు తెలివి నొంది ఖడ్గము చేతబట్టి సీతను దెగనరికెదనని బయలుదేరగా నచ్చట నున్న మంత్రులు మొదలగు వారలు రావణుని యాకృత్యము నుండి మరలించుచు నిటుల బలికిరి.

౭౧½ రావణా! స్త్రీహత్య చేయుటకై నీ వేల ప్రయత్నించుచుంటివి? అది మహాదోషముగదా! కావున నీవు ఆ కృత్యమునుండి మరలి మమ్ము లను వెంట నిడుకొని యుద్ధమునకు వెళ్ళి శత్రువును జంపి పిదప సీతను బొందుము - అని చెప్పిరి.

ఇత్యుక్తో రావణ స్తస్మై ద్విరరామ వధా త్తిస్రియాః
తత స్సులోచనా తత్ర నిజభర్తు ర్భుజం పునః
భూషావిభూషితం దృష్ట్వా సశరం భువి పాతితం
విలలాపాథసంస్మృత్య సాఽంగనా పతివిక్రమం. ౭౨-౭౩౫

పశ్చా త్తద్భుజపవతాం పున రలం త్వాశ్వాస్యభూమ్యాం తదా
ర క్తేనైవ లిలేఖ చైవ మన ఘే రామాంతికం త్వం గతా
దృష్ట్వా మచ్చిర ఆశు తత్రభవతీ సాకం మయాఽగ్నిం విశ
త్వం తావ త్సుగతిం వ్రజిష్యసి వృథా కిం రోదిషి త్వం త్విహా ౭౪౫

సంపఠ్యాఽఽశు సులోచనా పతికరన్యస్తాక్షరాణి క్షితౌ
సంతుష్యాఽఽశరనాయకం ప్రతి గతా నత్వాచ తస్మై పునః
స్వాభీష్టం వినివేద్య తచ్ఛ్వశుర మప్యాపృచ్ఛ్య మందోదరీం
సర్వాలంకృతిభూషితా శిబికయా రామాంతికం త్వాగతా ౭౫

ఆయాంతీం తు సులోచనాం తు శిబికారూఢాం ప్లవంగాః పున
స్సంవీక్ష్యాఽఽశరనాయ కేనతుభయా త్త్యక్తాం మహీజాంపునః
మత్వా తన్మహిజాం నిరీక్షితు మరం తే విద్రుతా వీక్ష్య తాం
విజ్ఞాయాఽథ సులోచనాం తు కపయః పశ్చాన్నివృత్తాః పునః ౭౬

పశ్చా త్సాపి సులోచనా రఘుపతిం గత్వాఽథ నత్వా చ తం
భర్తు శ్శిర మయాచతాఽవనిపతిం శ్రీరాఘవం సాంజలిః
ప్రాహైవం రఘునందనోపి నితరా మాశ్వాస్య తా మంగనాం
భర్తారంతవ జీవితం పున రహం కుర్యాం శుచం మాగమః ౭౭

౨౨-౨౩½ ఇట్లు మంత్రులు చెప్పగా రావణుఁడు స్త్రీహత్యను జేయకుండ మరలెను. ఇంద్రజిత్తుయొక్క భార్యయగు సులోచనాదేవి తన సమీపములో బడిన భర్తయొక్క శరసహితమయిన కుడిచేతిని జూచి భర్తయొక్క పరాక్రమాదులను దలంచికొని మిక్కిలి విలపింప దొడగెను.

౨౪½ ఇట్లు భర్తమరణముచే దుఃఖించుచున్న యా సులోచనాదేవిని నింద్రజిత్తుయొక్క కుడిభుజము ఆమె నోదార్చుచు రక్తాక్షరములను బాణముచే "దుఃఖింప వలదు" అని వ్రాసి యింకను ఇటుల నచట వ్రాసెను. "కాంతా! ప్రత్యక్షమూర్తియయిన శేషుని బాణఘాతముచే నేను ముక్తి నొందితిని. రాముని సన్నిధికి నీవు వెళ్ళి నాశిరము నడిగి తెచ్చుకొని నాతోగూడ నగ్నిప్రవేశము చేయుము. నీవుగూడ ముక్తినొందగలవు. వ్యర్థముగ నేల శోకించెదవు?" అని వ్రాసెను.

౨౫ సులోచనాదేవి యా యక్షరములను జదువుకొని సంతోషపడి రావణుని సమీపమునకేగి తన సహగమనమున కనుజ్ఞను వేడి యతని యనుజ్ఞను మండోదరి యనుజ్ఞను గూడ బడసి సర్వాభరణ భూషితురాలయి మేనా నెక్కి తన భర్తశిరమునుఁ బ్రార్థించుటకై రాముని సమీపమునకు వచ్చుచుండెను.

౨౬ ఇట్లు మేనాలో గూర్చుండి వచ్చుచున్న యామెను దూరమునుండి వానరులు చూచి సీతను రావణుడు పంపివేయగా నామె వచ్చుచున్నది. యని భ్రమించి యామెను జూచుటకై పల్లకిని జుట్టుడించి యందున్న స్త్రీనిఁజూచి సీత కాదనియు సులోచనయనియుఁ దెలిసికొని వెనుకకు మరలిరి.

౨౭ పిదప సులోచనాదేవి రాముని సమీపమునకు వెళ్ళి నమస్కరించి తన భర్తృశిరమును సహగమనము తాను చేయుటకై తన కిప్పింపుమని ప్రార్థింపగా, రామచంద్రమూర్తి యామె నోదార్చి యిటుల బలికెను. అమ్మా నీవు దుఃఖింపకుము. నీభర్తను తిరిగి జీవింపజేసెద నని చెప్పగా, సులోచన రామచంద్రమూర్తితో నిటులఁబలికెను.

ఇత్యుక్త్వా౽౽హ సులోచనా రఘుపతిం శేషాంశభూతా ద్విభో
సౌమిత్రేః పున రాఘ్య! మత్పతిమృతి ర్ధ్యాయః కథం సంభవేత్
తస్మాన్మత్పతి మద్య జీవయతు మా దేవో భవాం స్తచ్ఛిరో
దేహిం త్వం మమ రాఘవా౽ద్యకృపయా దీనావనే దీక్షితః.
౭౮

తద్వాక్యశ్రుతిమాత్రమందహసితస్మేరాననం తచ్ఛిర
శ్శ్రీరామార్పిత మాశరేశతనయప్రేయ స్యథా౽౽దాయ సా
లంకాయాః పతిబాహుయుగ్మ మసురై రానాయ్య భృత్యై
ర్వృతా, పద్భ్యా మేవ నికుంభిలాం గతవతీ భర్త్రా౽నలం
ప్రావిశత్. ౭౯

పశ్చా ద్దివ్య శరీరిణీ స్వపతినా స్వర్గం గతా౽భూ త్తతః
పంక్త్యాస్యో౽పి చిరంవిచార్యబహుధాభ్రాత్రాత్మజానాంమృతేః
నిశ్చిత్యా౽౽త్మమృతిం ద్రుతం రఘుపతే స్తూర్ణంసమస్తాశరై
స్సాకం యోద్ధు మగా త్సువర్ణఖచితం త్వారుహ్య దివ్యంరథమ్
౮౦

సర్వే తే యుధి రాక్షసా రఘువరేణై కేన వై సంహృతా
వాయవ్యేన శరేణ పంక్తివదనః క్షిప్తః పురేచా౽పతత్
మూర్ఛాం ప్రాప్య ముహూర్తమాత్ర మథ సో వ్యుత్థాయ
మాయామయం, సీతాం దర్శయితుం శిరో రఘుపతేః
కృత్వా వినిష్క్రాంతవాన్. ౮౧

ఏతస్మి న్సమయే గతో౽వనిసుతాం బ్రహ్మా౽వద త్తాం పున
ర్భద్రే పంక్తిముఖేన కృత్రిమశిరోమాయామయం కల్పితమ్

౨౮ రామచంద్రా! శేషాంశసంభూతుడగు లక్ష్మణుని చేతిలో నా భర్తకు మరణము తిరిగి యెట్లు లభించును? లభింపదు గాన నా భర్తను బ్రతికింపవలదు ఓ దీనరక్షకా! కృపనుంచి నా భర్త శిరమును మాత్రము నా కిప్పించిన జాలునని వేడెను.

౨౯ ఆ వాక్యమును విని మందహాసము చేయుచున్న మేఘనాదుని శిరమును రామచంద్రమూర్తి సులోచన కీయగా, ఆ శిరము నామె తీసికొని లంకలోనున్న తన భర్త్రృ బాహుయుగళమును గూడ దూతలచే వెంటనే తెప్పించుకొని పాదచారిణియయి తన భర్త్రృ శరీరము పడియున్న స్థలమునకు (నికుంభిలకు) వెళ్ళి భర్త్రృ శరీరముతో గూడ తానుగూడ వహ్నిప్రవేశము చేసెను.

౩౦ పిదప సులోచన దివ్యశరీరధారిణియయి స్వర్గమున కేగెను. పిమ్మట రావణుడు తన సోదరమరణమునకును, పుత్రులమరణమునకును గొంత తడవు విచారపడి, రామునివలన, దనకుకూడ మరణము తప్పనిదే యని నిశ్చయించి వెంటనే లంకలోనున్న రక్కసులను వెంటనిడుకొని బంగరురథము నెక్కి యుద్ధమునకు వెడలెను.

౩౧ ఇట్లు రావణుడు తన రక్కసులతోగూడ యుద్ధమునకువచ్చి శరవర్షమును గురిపించుచుండగా, రామచంద్రమూర్తి వాయవ్యాస్త్రముచే రావణుని లంకలోబడునట్లు చేసెను. రావణుడిట్లు లంకలో వచ్చిపడి కొంతతడవు మూర్ఛిల్లి పిదప లేచి తన మాయచే రాముని శిరమును నొకదానినిఁ గల్పించి సీతకుఁ జూపింపబయలుదేరెను.

౩౨ ఈ లోపలనే బ్రహ్మ సీతకు దర్శనమిచ్చి యిట్లుచెప్పెను. తల్లీ! రావణుడు నిన్ను మోసగించుటకై తనమాయచే రాముని శిరమును

సోఽప్యాయాస్యతి తేఽంతికం రఘుపతేశ్శీర్షం గృహీత్వాఽద్యత
న్మాభైషీ స్త్వ మవేక్ష్య భూమితనయే మాగా విషాదం పునః.
౧౨

ఇత్యుక్త్వాఽఽశు తిరోహితో విధి రభూ త్పశ్చా ద్దశాస్యో
ద్రుతం, భూజాతాంతిక మేత్య రాఘవశిర స్త ద్దర్శయా
మాస సః, ప్రాహైవం మహిజాం పరాక్రమవతా భర్తా
హత స్తే మయా, త్యక్త్వాఽఽశాం రఘునందనోపరి సుఖం
మ త్త స్త్వయా ప్రాప్యతామ్. ౧౩

శ్రుత్వా తద్వచనం దశాననమిదం ప్రాహాఽథ సా జానకీ
రే రే మత్పతిబాణ పాతితభవ చ్ఛీర్షాణి శీఘ్రం త్వహం
ద్రక్ష్యామ్యేవ రణాంగణే ప్రజశ రేణాఽఽస్యం పిధాయ ద్రుతమ్
త్వన్మాయాపరికల్పితం త్విద మితి ప్రాయో మయా వేద్యతే.
౧౪

ఏవం తదీయవచనాశుగతాడితస్స
న్వంజ్జాన్యనో వికలహృ త్త్రపయాన్వితశ్చ
గత్వా నికేతన మలం హృది భావికార్యం
సంచింతయ న్నివసతిస్మ సుతా ర్తిఖిన్నః. ౧౫

ఆశ్చర్య రామాయణే యుద్ధకాండే
ఏకోనవింశ స్సర్గస్సమాప్తః.

---

కల్పించి తీసికొనివచ్చును. నీవు నమ్మవలదని చెప్పెను. నీవు భయమును విషాదమును బొందకుమనియుఁ జెప్పెను.

౨౩ ఇట్లు బ్రహ్మ చెప్పి యంతర్ధానమయ్యెను. పిదప రావణుడు రాముని శిరమును వెంటదీసికొని సీతాసమీపమునకు వచ్చి రాముని శిరమును జూపి యిటులఁ బలికెను. ఓ జానకీ! నేను యుద్ధములో నీ భర్తను జంపగలిగితిని. ఇదిగో యతని శిరము, ఇంక నతని యాశను విడిచి నావలన సుఖములను బడయుము (అని పలికెను)

౨౪ పిదప రావణుని మాటలను సీతవిని యిటులఁ బలికెను. ఓరీ! కొలది కాలములోనే నా భర్తయొక్క బాణములచేఁ దెగనరుకబడు నీ శిరములను నేను జూచెదను. నోరుమూసికొని రణరంగమునకు బొమ్ము. ఇదియంతయు నీ మాయచే కల్పింపబడినదని నేను దెలిసికొంటిని.

౨౫ ఇట్లు సీతపలుకగా, ఆమెయొక్క వాక్ఛరాఘాతముచేఁ బీడింపబడి వికలమనస్కుఁడై, లజ్జచేఁ దలవంచుకొని, తిరిగి తన గృహమునకేగి భావికార్యమును గూర్చి తన మనమునం దాలోచించుకొనుచుండెను.

ఆశ్చర్యరామాయణమున యుద్ధకాండమున
పందొమ్మిదవ సర్గము సమాప్తము.

## వింశస్సర్గః

పశ్చా ద్రాత్రిచరాధిపో నిజసభాం గత్వాఽబ్రవీ ద్దానవా
న్నిర్యాంత్వద్య రథైర్గజైశ్చతురగై స్సర్వే భవంతోఽన్వితాః
పాదాతై ర్మహిజాపతిం తు సమరే హంతుం యతధ్వం గతా
ఇత్యుక్తా శ్చతురంగసైన్యసహితా యోద్ధుం గతా స్తేఽసురాః
౧

గత్వా వానరవాహినీం తు దనుజా స్సర్వే ద్రుతం సంగతా
బాణై ర్జఘ్ను రథోఽవర్షు రధికం నారాచవర్షం తదా
సర్వేపి ప్లవగా ద్రుమై రపి శిలాపాతై ర్నిజఘ్ను శ్చ తాన్
తద్దైత్యాశుగపాతభిన్నతనవ శ్శాఖామృగా విద్రుతాః ౨

రాఘవం శరణం జగ్ముః కేచి ద్దశ దిశో గతాః ౩
తతో రామో ధనుస్సజ్యం కృత్వా సంధాయ చాఽశుగాన్
శరవర్షం వవర్షాథ దహంత మరివాహినీం,
కాలరుద్రనిభం వీరం ద్రష్టుం శక్తా నచాఽశరాః ౪
అపశ్య న్నామచక్రం తు కాలచక్ర మివాఽశరాః
ఏకేనైవ హతా స్సర్వే రాక్షసాః కోటిశ శ్శరైః ౫

హతశేషా స్తదా లంకా మభిపేతు ర్నిశాచరాః
దేవా స్సర్షిగణా రామవిక్రమం తుష్టువు స్తదా ౬
లంకాం ప్రతి గతా శ్శేషా దానవా స్త్రీస్ర్తిభి రన్వితాః
ఏవం తే విలపంతిస్మ దీనా శ్చింతాపరిప్లుతాః ౭

వృద్ధా శూర్పణఖా వికారసహితా రామం సురూపం వనే
దృష్ట్వా కామవశా బభూవ హి కథం తన్మూలతో నాశనం తా

# ఇరువదవ సర్గ ప్రారంభము

౧ తరువాత రావణుఁడు సభకేగి దానవులతో "మీరందఱును రథగజ తురగ పదాతులతోఁ గలిసిపోయి సీతాపతిని వధింప యత్నింపుఁ" డని చెప్పెను. అట్లు చెప్పగాఁ జతురంగ బలములతో దైత్యులు యుద్ధము సేయ వెడలిరి.

౨-3 వెడలి రాక్షసు లందఱును వానరసైన్యమును సమీపించి బాణములను వేయుచు నారాచవర్షముల నధికముగా వర్షించిరి. వానరులును చెట్లను శాఖలను వైచి వారిని భేదించిరి. వానరులు రాక్షసబాణ భిన్న శరీరులయి పరుగులిడి రాముని శరణు చొచ్చిరి. కొందఱు పది దెసలకుఁ బరుగులిడిరి.

౪ అంత రాముఁడు ధనుస్సు నెక్కుపెట్టి బాణముల సంధించి శరవర్షమును వర్షించెను. శత్రుసైన్యముల దహించు కాలాగ్నిరుద్రుని వంటి యా రాముని దానవులు తేరిజూడలేకపోయిరి.

౫ దానవులు రామచక్రమును గాలచక్రమునుగాఁ జూచిరి. కోట్ల కొలఁది దైత్యులు రాముఁ డొకనిచేతనే శరములచేఁ జంపబడిరి.

౬ హతశేషులగు నిశాచరులు లంక కేగిరి. దేవతలును ఋషులును రామ విక్రమమును వర్ణించిరి.

౭ లంకకేగిన హతశేషులు సతులతోఁగూడి దీనులై విచారించుచు నిట్లు విలపించిరి.

౮ ముదుసలి ముప్పునాతి కామవికారముచే సురూపుఁడగు రాముని జూచి కామించుటచే వివిధముగా లంకకు నాశనము వచ్చెను. నేడు లంకలో

లంకాయా స్సమభూ దిహాఽద్య పురుషాస్సర్వే హతాదానవా
నార్య స్సంతి సహస్రశ స్తు విధవాః కార్యం కి మస్తిప్రభోః
ధర్మాత్మా హి విభీషణో బహువిధం ప్రాహాఽసురేశంపురా
మోహా త్తస్య వచః పురాఽమృతనిభం నాఽశ్రావ్యనేన
ప్రియమ్, తద్వాక్యాశ్రవణేన పఙ్క్తివదనో నష్టాత్మజోఽ
భూ త్తథా, నష్టశ్రీర్హతబంధుమిత్రపరివారోఽభూ త్తులో
న్మాలకః ౯

నూనం భూమిసుతాపతి స్తు కరుణాసింధు స్తతోఽద్యాపి వా
సీతా మాశు సమర్ప్య తస్య చరణద్వంద్వే పతే చ్చే దయమ్
పఙ్క్త్యాస్యో యద రాఘవోఽభయ మరం దత్వా దశాస్యంపునః
రక్షిష్య త్యసురేశ్వరస్య సుమతి ర్నో దేత్యభాగ్యాత్తు హా ౧౦

ఇత్యేవం విలపంతీనాం రాక్షసీనాం తు రోదనం
రాక్షసానాం తు సర్వేషాం వధం శ్రుత్వా రురోద సః ౧౧

పశ్చా ద్భార్గవ మేత్య పఙ్క్తివదనోఽవస్థాం స్వకీయాం పున
స్తూక్త్వా శత్రుజయస్య సాధన మథో పప్రచ్ఛ తం భార్గవమ్
దృష్ట్వా దీనదశాం దశాననవిభోః ప్రాహాఽథ తం భార్గవో
భోలంకేశ్వర! తే బ్రవీమి పరమంగుహ్యం జయార్థం రిపోః. ౧౨

లంకాద్వారకవాటసంచయ మరం బద్ధ్వా ద్రుఢం త్వంగుహాం
గత్వా హోమముపాశ్రితో రిపుహరై ర్మంత్రైస్తుహోమంకురు
తత్పూర్తౌ విజయో భవిష్యతి తవ ప్రాయో దశాస్య! ధ్రువమ్
గత్వైవం కురుతా ద్భవా నితి గురుప్రోక్తో దశాస్యోఽప్యగాత్
౧౩

మగవాండ్రందఱును మరణించిరి. విధవలు వేలకొలఁదిగ నున్నారు. వీరివలనఁ బ్రభువు కేమి లాభము?

౯ పుణ్యాత్ముఁడగు విభీషణుఁడు రావణునకన్నియో విధములఁ జెప్పెను. అట్టి ప్రియవాక్యములను మోహముచే నతఁడు వినలేదు. ఆమాటల వినకయే పుత్రులను, సంపదను, చుట్టపక్కములను, కులమును నాశము చేసికొనెను.

౧౦ నిజముగా రాముఁడు కరుణాసముద్రుఁడు కావున నిప్పుడైనను రామునకు సీత నిచ్చి యతని పాదములపై రావణుఁడు పడిన రాఘవుఁడు అభయమిచ్చి దశాస్యుని మఱల రక్షించును. కాని రావణునకు మంచి బుద్ధి పుట్టుటలేదు. అయ్యో! మన దురదృష్టము.

౧౧ ఇట్లు రాక్షసస్త్రీల రోదనమును, రాక్షసులందరి మరణమును విని రావణుఁడు దుఃఖించెను.

౧౨ అంత రావణుఁడు శుక్రాచార్యునికడ కేగి తన యవస్థను విన్నవించి యతనిని శత్రుజయసాధనమునడిగెను. అప్పుడతఁడు "లంకానాయకా! శత్రుజయమునకై మంచి రహస్యమును జెప్పుదును."

౧౩ తొందరగా లంకతలుపులను మూసి గుహలోఁ జేరి మౌనివై శత్రుహారములగు మంత్రములతో హోమము చేయుము. అది పూర్తియైన నీకు తప్పక జయముకలుగును. వెళ్ళి అట్లుచేయుము" అని చెప్పగా రావణుఁడు వెళ్లెను.

గత్వా సోపి గుహాం ప్రవిశ్య దనుజాధీశ స్సదారో ద్రుతమ్
హోమద్రవ్య పురస్సరం రిపుజయాకాంక్షీతత శ్శోణితే
స్నాత్వా బాలశిరోభి రస్థిభి రథో మాంసై స్తథా శోణితై
ర్హోమం త్వాచరతిస్మ తత్ర రహసి ప్రాచార్య కల్పాశ్రితః ౧౮

తత్రోత్థితం ధూమ మవేక్ష్య రామం
విభీషణః ప్రాహ రహస్యవేదీ
హోమం కరో త్యద్య దశానన స్తు
పూర్ణేచ తస్మి న్విజయీ భవేత్సః॥ ౧౯

శ్రుత్వా తద్వచనం ద్రుతంరఘుపతి శ్శాఖామృగాంస్తా న్బహూ
న్కర్తుం తస్య విఘాత మంగదముఖా న్సంప్రేషయామాస సః
ప్రాకారం తు విలంఘ్య తేపి హరయో రాత్రించ రేశాలయమ్
గత్వాఽప్యాశరహోమభూమి మథవాఽపశ్య న్న రక్షోధిపమ్॥
౨౦

హరీణాం సరమా పశ్చా ద్ధోమస్థాన మసూచయత్ ౨౧

హ స్తసంజ్ఞాం విధాయాఽథ తత్పిధానశిలాం పునః
తారేయః క్షోదయామాస పాదఘట్టనమూలతః
హోమంచరంత మాలోక్య రావణం ముష్టినా ద్రుఢమ్
తాడయా మాస బహుధా నచచాల దశాననః॥ ౨౨

పశ్చా చ్ఛాఖామృగా స్సర్వే ముష్టిభి శ్చ తలై రపి
అతాడయ న్దశాస్యం తం నచచాల తథాపి సః ౨౩

౧౪ ఇట్లు రావణుఁడు వెళ్ళి భార్యయుఁ దానును హోమద్రవ్యములతో శత్రుజయమునుగోరి గుహాలోఁజేరి రక్తముతో స్నానముచేసి బొంగర తలలతోను అస్థులతోను, మాంసముతోను, రక్తముతోను గురువు చెప్పినట్లు రహస్యముగా హోమము చేయుచుండెను.

౧౫ పిదప హోమస్థానమునుండి బయలుదేరిన యా ధూమమును విభీష ణుడు చూచి రక్కసుల గుట్టు తెలిసినవాడుగాన రామచంద్ర మూర్తితో నిట్లు చెప్పెను. రామచంద్రా! రావణు డిపుడు శత్రు జయమును గోరి హోమము చేయుచుండెను. ఆ హోమము పూర్తి యయినచో నతనికిఁ దప్పక జయము చేకూరును. (అని చెప్పెను)

౧౬ ఆ మాట విని రామచంద్రమూర్తి వెంటనే రావణునిహోమమునకు విఘాతము చేసిరండని యంగదుడు మొదలగు వానరుల కాజ్ఞా పించెను. వారలు వెంటనే ప్రాకారములను దాటి రావణుని భవ నమునకు వెళ్లి వెదకిరి కాని యా హోమ స్థానము కాని, హోమము చేయుచున్న రావణుడు కాని యెచ్చటను గన్పింపకపోయెను.

౧౭-౧౮-౧౯ సరమాదేవి (విభీషణుని భార్య) వానరులకు హోమస్థాన మును చేతితో సంజ్ఞచేసి చూపింపగా, వెంటనే హోమగుహకు పైభాగమున నెవరికిఁ దెలియకుండగాఁ గప్పబడియున్న రాతి బండను అంగదుడు కాళ్ళతోఁదన్ని ముక్కలుగాఁజేసి లోపలకు వానరులతో గూడఁ బ్రవేశించి హోమముచేయుచున్న రావణుని జూచి యతనినిఁ బిడికిళ్ళతో తాను బొడువ నారంభించెను. కాని యతడు కదలనందున వానరులందరు పిడికిళ్ళతో బొడుచుచుఁ జేతులతోఁ జరుచుచుండిరి. కాని దానికి గూడ రావణు డేమాత్ర మచటనుండి కదలకపోయెను.

పశ్చా ద్వాలిసుతో విచార్య సహసా*మందోదరీంతత్ప్రియామ్
ధృత్వా మూర్ధజపాశమూల మవనౌ సంపాతయామాస సః
నీవీమోచనకంచుకాపహరణోద్యుక్తం త మాలోక్య సా,
భర్తారం తు విలోక్య విహ్వలమనా శోకాకులా ప్రాహ తమ్
—౨౦౪

---

* మూర్ధజపాశమూల మితి నను "మహాపతి వ్రతాం స్ప్రష్టుం బిభే త్యగ్ని రపి ధ్రువమితి వచనపరిశీలనే మహాపతివ్రతా శిరోమణి భూతాయా మందోదర్యాః కేశ పాశగ్రహణ మంగదేన కథ మాచరితం? కథం వా౽య మంగ దస్తదంగస్పర్శనో నదగ్ధః? ఏత దేత దన్యైః కృతో వా నకృత మిత్యాశంకా సముదేతి-అత్రైవం సమాధేయం-తథాహి-పురా కదాచన దశాననః కైలాసం గత్వా బహుధా పరమేశ్వరం ప్రార్థయామాస, తదాసోపి సాక్షా త్ప్రత్యక్షభూత్వా హైమ వత్యా దశాననస్య వరం వృణీష్వే త్యవోచత్, పార్వతీం నిరీక్ష్య మోహితో దశానన స్తా మేవ స్వస్మై దేహీ త్యవో చత్, తథైవ సోపి తస్మైదదౌ, తదానయనావసరే మార్గ మధ్యే తయా సంస్మృతో మహావిష్ణు ర్దశాననమిత్ర రూపేణా గత్య "కేయ మిత్య౽నభిజ్ఞాత మపృచ్ఛత్, సేయం పార్వతీతి దశాననో౽ప్యవదత్, రే మూఢ లోకే స్వభార్యా మన్యస్మై ప్రదాతాకః? తా మహం దర్శయేయ మిమాంతస్మై పునర్దత్వా సమేహీతి కథనే, తన్మాయామోహిత స్తథా౽కరోత్, తత స్తన్మిత్రరూపేణ స్థితవా న్భగవానపి దశాననం మయగృహం

౨౦౫ పిదప, వాలి పుత్రుడయిన అంగదు డాలోచించి (అనగా తన భార్యను అవమానించునపుడు భర్తకుఁ గోపమువచ్చి లేచునేమోయని యాలోచించి) రావణుని ధర్మపత్నీ యగు * మండోదరిని జుట్టు పట్టుకొని యివతల కీడ్చుచుండెను. అప్పటికిని రావణుడు కదల నందున మండోదరి నవమానింప ప్రయత్నించుచుండ, భర్తతో మండోదరి యేడ్చుచు నిట్లు పలికెను.

---

* మండోదరిని జుట్టుపట్టుకొని యంగదు డీడ్చుచుండెను,

"మహాపతివ్రతను దాకుటకగ్నికూడ భయపడునను" స్మృతి వాక్యమును బరిశీలించినచో, మహాపతివ్రతాశిరోమణి యయిన మండోదరిని అంగదు డెట్లు జుట్టుపట్టుకొని యీడ్చెను ? ఆమెను దాకుటచే నిత డెట్లు దగ్ధుడు కాలేదు ? మండోదరిని ఇతరు లెవ్వరును స్పృశింపకుండగ నంగదుడే యేల స్పృశించెను ? ఈ యాశంకలకు సమాధాన మిట్లు చెప్పబడినది. (ఏమన) ఒకప్పుడు రావణుడు కైలాసమునకేగి పరమేశ్వరు నారాధింపగా, శంకరుడు పార్వతితో ప్రత్యక్షమయి, నీ యభీష్టమును గోరుకొనుమని రావణునకుఁ జెప్పగా రావణుడు పార్వతీ సౌందర్యమునకు మోహితుడై యామెను దన కిప్పింపుమని శంకరునిఁ బ్రార్థింప శంకరుడు నటులనే యామె నిచ్చెను. రావణు డామెను దీసికొని వచ్చుచుండ పార్వతి శ్రీమహావిష్ణుని మనమునస్మరించి తనకష్టమును గట్టెక్కింపుమని ప్రార్థించెను. శ్రీహరియును రావణునిమిత్రుని వేషముతో మధ్య మార్గమున రావణుని గలిసికొని యీయామె యెవ్వతె ? యని ప్రశ్నింపగా పార్వతి యని రావణుడు ప్రత్యుత్తర మిచ్చెను. అప్పు డతడు రావణునితో నిటులఁ జెప్పెను. ఓరి వెఱ్ఱివాడా ! లోకములో నెవ్వడైనను తన భార్యని తరునికిచ్చువాడుండునా ? ఈమెపార్వతికాదు. ఈమెవతని కిచ్చిరమ్ము. నీకు యథార్థమైన పార్వతిని జూపించెదనని చెప్ప. మాయామోహితుఁడై రావణుడామెను దిరిగి శంకరున కిచ్చివచ్చెను. అప్పుడు మిత్రరూపముతో నున్న భగవానుడు రావణుని మయుని గుహయొద్దకుఁ దీసికొనిపోయి యచటనున్న మండోదరినిఁ జూపించి

తవాఽగ్రే త్వహిం తే నాథ! పాతయిత్వాఽ నసౌ తు మామ్
కేశపాశం సమాదాయ బహుధా పీడయత్యలం
హావనేన ఫలం కిన్ను జీవితేన చ కిం ఫలమ్
ఇత్యుక్తో రావణ శ్చాఽపి త్యక్త్వా హోమం త్వరాన్వితః
బహి రాగా త్తత స్సర్వే ప్లవగా రాఘవాంతికం
గత్వా నివేదయామాసు ర్హోమవిఘ్నకృతిం పునః

౨౧-౨౨-౨౩౪

---

ప్రతి నీత్వా తత్ర త్వాం మందోదరీం దర్శయిత్వా ఇయ మేవ యథార్థభూతా హైమవతీత్యుదీర్య గతవాన్. తస్మిన్నవశానసేపి మందోదరీం సమానీయాగచ్ఛతిసతి మార్గమధ్యే దేహబాధా గమనావసర స్తస్య సంబభూవ, తత్రైకస్మి న్భూరుహమూలే సూపవిష్టం వాలినం సమీక్ష్య సేయం మందోదరీ మదాగమన పర్యంతం త్వయా ద్రష్టవ్యే త్యుదీర్య దశాననో యయౌ, వాలినా రతయే బలాత్కృతాఽయా స్తస్యా స్సద్యోగర్భ స్సంబభూవ, తద్వై వాంగదోఽపి సముద్భూత స్తస్యాః, రావణాగమనం నిరీక్ష్య వాలీ సుత మానీయ గతవాన్, తదేత త్తేనానభిజ్ఞాతమేతయానో క్తంచ, తస్యాఽయోనిజత్వా న్న పాతివ్రత్యభంగో బభూవేతి, మాతృభూత మందోదరీ స్పర్శా దంగదస్యనదోష ఇతి. మాతృగుప్త రామాయణ కథాత్రానుసంధేయా.

౨౧-౨౨-౨౩½ నాథా! నీ శత్రువు నీ ముందఱనే నన్ను భూమిమీదఁ బడవేసి జుట్టుపుచ్చుకొని యీడ్చుచు బాధించుచుండగా, నీ హోమ మేల కాల్పనా! నీ బ్రతుకేల? అని మండోదరి పలుకగా, రావణుఁడు వెంటనే హోమమును విడిచి తొందరగా, వెలుపలికి వచ్చెను. వెంటనే వానరులును రామచంద్రుని సమీపించి రావణుని హోమమునకు విఘాతమును జేసివచ్చితిమని వారలు చెప్పిరి.

---

యీ మెరయే పార్వతియని చెప్ప నమ్మి యామెను దీసికొనివచ్చుచుండెను. మిత్రరూపముతో వెంటవచ్చిన భగవానుడు కన్పడకుండఁగఁ బోయెను. రావణుడు మండోదరిని దీసికొని వచ్చుచుండ మధ్యమార్గములో దాను దేహబాధకు వెళ్ళవలసివచ్చి యచ్చటఁ నొక చెట్టు మొదటఁ గూర్చుండియున్న వాలినిజూచి యామెను దాను వచ్చుదనుక చూచుచుండుమని చెప్పి రావణుడు దేహబాధకు వెళ్లెను. వాలి పిదప నామెను బలాత్కరించి భోగింపగా వెంటనే యామెకు సద్యోగర్భమై కుమారుడు కూడ నప్పుడే పుట్టెను. రావణుడు వచ్చుచున్న జాడ కనిపెట్టి వాలి తన కొడుకు నెత్తికొనిపోయెను. ఈ జరిగిన సంగతి రావణునకుఁ దెలియదు. మండోదరి భయముచేఁ జెప్పలేదు. మండోదరి యోనిసంభూతురాలు కానందున నామెకు పాతివ్రత్యభంగము గలుగలేదు. ప్రకృతమున. ఇవ్విధముగా మండోదరికి అంగదుడు కుమారుడు గాన నతడు తన తల్లిని దాకినవాడు గాన హైయాళంకలకు తావులేదు. ఇతరులామెను స్పృశించినచో వెంటనే దగ్ధులగుదురు సందియము లేదు. అను మాతృగుప్త రామాయణకథ యిచ్చట ననుసంధేయము.

పశ్చా న్మందోదరీ ప్రాహ రావణం సాంజలి ర్వచః
మదుక్తం వచనం పూర్వం త్వయైతదపి న శ్రుతం
అద్యవా భూమిజాం సీతాం రాఘవాయ సమర్పయ
విభీషణం భవాన్ రాజ్యే త్వభిషిచ్య మయా సహ
గత్వా వనం తపశ్చర్యాం కర్తు మర్హసి సువ్రత ౨౪-౨౫-౨౬

శ్రుత్వా తద్వచనం దశాననవిభు స్తామాహ మందోదరీం
రామం వేద్మి జనార్దనం తు మహిజాం లక్ష్మీం తథా వేద్మ్యహమ్
తద్ధస్తా ద్వధ మాప్తు మేవ మహిజా సీతా వనాద్వై మయా
త్యక్త్వా దేహమరం కరాద్రఘుపతేః ప్రాప్స్యామివిష్ణోః పదమ్॥ ౨౭

క్రియైకాఽద్య త్వయా కార్యా ప్రవిశ త్వం మయాఽనలమ్
మయా సహ ద్రుతం త్వం చ పరం పద మవాప్స్యసి
ఇత్యుక్త్వాఽఽశరనాథోపి రథ మారుహ్య సత్వరమ్
రాక్షసై రావృతో యోద్ధుం ప్రతస్థే రాఘవేణ సః॥ ౨౮-౨౯

ముం డ్యగ్రే ప్రవిలోకితో నిజగృహా న్నిర్గచ్ఛతా తేన వై
కించి ద్ద్వారగతస్య తస్య ముకుటో భూమౌ పపాత ద్రుతమ్
తస్మా ద్భీతి ముపాగతోపి హృదయే పంక్త్యాననో వై బహి
ర్ధైర్యం ప్రాప్య రణాంగణం ద్రుత మగాద్యోద్ధుంబలై రన్వితః॥౩౦

క్రుద్ధో రాత్రిచరాధిప స్తు సమరే శాఖామృగాణాం బలే
నారాచాంస్తు వవర్ష కేచన తదా శాఖామృగా స్సంహృతాః,
కేచి ద్భిన్నహృదో బభూవు రపరే పార్శ్వేష్వలం దారితాః
కేచి త్కర్ణవివర్జితాః కిల కృతాః కేచి చ్ఛిరోవర్జితాః॥ ౩౧

౨౪-౨౫-౨౬ పిదప మండోదరి ప్రాంజలియై రావణునితో నిటుల జెప్పెను. నాథా! నేను జెప్పినమాటలను నీవింతదనుక వినకపోయి నందుకు ఫలమనుభవించితివి. ఇకనైనను సీతను దీసికొని వెళ్లి రామచంద్రమూర్తికి సమర్పింపుము. విభీషణునకు రాజ్యాభిషేకము చేసి నాతో గూడ వనమునకేగి తపస్సు చేసికొనుము. ఇంకగృహస్థాశ్రమమున జేయదగినది లేదుకదా! యని చెప్పెను.

౨౭ ఆమాటవిని రావణుడు మండోదరితో దన మనస్సులోని మాటను జెప్పెను. ఓ ప్రేయసీ! రాముడు భగవంతుడగు విష్ణువనియు, సీత లక్ష్మియనియు, నాకిదివరకే తెలియును. రాముని చేతిలో మృతి నొందదలచియే సీతను లంకకు దెచ్చితిని. రాముని చేతిలో, ఈ దేహమును విడిచి సద్గతినొందగలను.

౨౮-౨౯ ప్రేయసీ! నీవొకపని చేయవలయును. (అదియేమన) నేనెటులనో చచ్చుట నిక్కము, నీవుగూడ నాతో సహగమనము చేయుము. నీవుకూడ సద్గతిని బొందెదవు.. అని చెప్పి రావణుడు వెంటనే బంగరు రథము నెక్కి రక్కసులచే నావరింపబడి రామునితో యుద్ధము చేయఁ బయనమయ్యెను.

30 రావణు డిట్లు బయలుదేరుటతోడనే యొక సన్యాసి యెదురుగా వచ్చెను. ఇంక కొంచెముదూరము వెళ్ళుటతోడనే రావణుని కిరీటము క్రిందఁబడిపోయెను. ఆ యపశకునములకు మనస్సులో భీతినొందియు బయటికి ధైర్యమును బొంది సైన్యసమేతుడై యుద్ధము చేయుటకై రణాంగణమున కేగెను.

30 రావణుడు మిక్కిలి యాగ్రహము గలవాడై వానరసైన్యమున బాణవర్షమును గురిపింపగా. కొందఱు వానరులచ్చటనే మడిసిరి. కొందఱు గుండెలు బ్రద్దలై పడిరి. మఱికొందఱు ఛేదింపబడిన పార్శ్వభాగములు గల వారలయిరి. కొందఱు తెగిపోయిన చెవులు గలవారును మఱికొందఱు శిరస్సులు తెగినవారలునై యుండిరి.

కేచి చ్ఛాఖామృగా స్తూర్ణం రాఘవం శరణం యయుః
కేచి ద్దశ దిశో జగ్ము ర్దశాననభయా త్తదా 3౨
రాఘవో ముదితో యోద్ధుం రావణేన సమాగతః
శరవర్షం వవర్షాఽథ నిశాచరపతౌ పునః॥ 33

పర్జన్యేనతు రాఘవోఽనల మథోసార్పం తు సౌపర్ణత
స్సంధిద్యాఽఽశరనాయకోపరి తదా దివ్యాస్త్రజాలం పునః
తత్యాజాఽఽశరనాయకోఽస్త్రనిచయం రామస్య చిచ్ఛేద వై
పశ్చా ద్రామదశాస్యయో స్తు సమరం ఘోరం బభూవాఽ,
ద్భుతమ్॥ 3౪

రామరావణయో ర్యుద్ధం ద్రష్టుకామా స్తదాఽంబరే
విమానేషు స్థితా దేవాః పశ్యంతి స్మ మహర్షయః॥
సిద్ధవిద్యాధరాశ్చాపి గంధర్వా శ్చ సమాగతాః
విమానసంస్థితా స్సర్వే కౌతుకా ద్దదృశు శ్చ తత్॥ 3౫-3౬

రావణో నైకరూపాణి ధృత్వా మాయాబలా త్తదా
ఏకైకం వానరం నైకే రావణాః పర్యవారయన్
దశదిక్షు ప్రదృశ్యంతే రావణాః కోటిశ స్తదా
అంతరిక్షస్థితా దేవా దృష్ట్వా తా న్విప్రదుద్రువుః॥ 3౭-3౮

యే రామస్య తు శక్తి మద్భుతతమాం జానంతి తే నిర్భయా
స్సంస్థా యే నవిదంతి తే దశముఖా ద్భీత్వా ద్రుతం విద్రుతాః

3౨ మఱికొందఱు వెంటనే పరుగులిడుచు రాముని శరణుపొందిరి. కొందఱు వానరులు వాని భయముచే దశదిశలకుఁ బారిపోయిరి.

33 పిదప రామచంద్రమూర్తి రావణునితో యుద్ధము చేయునవకాశము దొరికెను గదాయని సంతోషించి యుద్ధమునకై వచ్చి రావణుని మీదశరవర్షము కురిపించు చుండెను.

3౪ రావణుడుకూడ వెనుదీయక వెంటనే యాగ్నేయాస్త్రమును బ్రయోగింపగా, రామచంద్రమూర్తి పర్జన్యాస్త్రము చేతనే దానిని మరలించెను. రావణుడు సార్పాస్త్రమును బ్రయోగింపగా, రామచంద్రమూర్తి గారుడాస్త్రముచే దానిని హతమార్చెను ఇట్లు రావణుడు ప్రయోగించెడి యస్త్రములకు బ్రత్యస్త్రములను బ్రయోగించుటయే కాక వానిమీదను దివ్యాస్త్రముల నన్నియు బ్రయోగించు చుండెను. కాని రావణుడా యస్త్రములను తన శస్త్రములచే ఛేదించు చుండెను. ఆ రామరావణుల యుద్ధము మహాఘోరముగాను, అద్భుతముగాను జరుగుచుండెను,

3౫-3౬ రామరావణ యుద్ధమును జూచుటకై దేవతలు మహర్షులుకూడ గగనమునందు విమానములలో నుండి చూచుచుండిరి. మఱియు సిద్ధులు విద్యాధరులు గంధర్వులు మొదలగువారు కూడ విమానముల మీద నుండి రామరావణ యుద్ధమును గుతూహలముతో జూచు చుండిరి.

3౭-3౮ రావణుడు పిదప తన మాయాబలముచే, అనేక రూపములను ధరించి యొక్కొక వానరునియొద్ద నొక్కొక రావణుడు చుట్టడించెను. ఎచ్చట చూచినను యుద్ధభూమి యంతయు రావణమయముగా నుండెను. కోట్లకొలది రావణులు కన్పడుచుండ దేవతలు కూడ భయపడి పారిపోవుచుండిరి.

3౯ రామచంద్రమూర్తి యొక్క శక్తి సామర్థ్యములను దెలిసినవారు మాత్రము నిర్భయులుగా నచటనుండి కదలకుండ నుండిరి. రాముని మహిమను దెలియని వారలు పారిపోవు చుండిరి. దేవతలుగూడ

సద్యో భూమిసుతాపతి ర్దశముఖా న్నైకాంస్తు మాయామయా
నేకేనైవ శరేణ నాశ మనయ త్తం తుష్టువుః ఖే సురాః॥ 39

సూర్యోదయే యథా త్వంధతమ స్సర్వం వినశ్యతి
రామబాణోదయే నష్టం దశానన సహస్రకమ్
ఇత్యేవం తుష్టువు ర్దేవా వవర్షుః కుసుమా న్యలమ్
రాఘవం స్తువతో దేవా న్హంతుం సద్యో దశాననః
ఉత్పపాతాఽంబరం దేవా భీత్వా చక్రుః పలాయనం
తదా వాలిసుతః క్రుద్ధో గగనం తు సముత్పతన్
దశాననపదం ధృత్వా పాతయామాస భూతలే. ४०-४१-४२

తస్మా ద్దుఃఖ ముపేయివా న్దశముఖః క్రుద్ధో భుజంగో యథా
నిశ్వస్యాఽఽశు సముత్థితోఽధికశరాసారేణ శాఖామృగాన్
భిన్నాంగా నకరో త్తథా రఘుపతిం బాణై ర్వివర్ణాం పునః
కుర్వ న్దుస్సహతేజసా తు విలస న్నాసీ ద్రణస్యాంగణే. ४3
దశాననం రథస్థం త మధోభాగే తు సంస్థితం
రాఘవం వీక్ష్య శక్రోపి రథం ప్రేషయతిస్మ సః. ४४

శక్రప్రేషితరత్నభూషితరథం త్వారుహ్య రామో ద్రుతం
పంక్త్యాస్యేన యుయోధ భైరవమభూ ద్యుద్ధంతదాసీంద్వయోః
జేతవ్యం త్వితి రాఘవో దశముఖో మ ర్తవ్య మిత్యాత్మనా
తౌ కృత్వా దృఢనిర్ణయం తు సమరం చ్రక్రతు ర్దుస్సహమ్.
४५

పరుగు లిడుటను జూచి రామచంద్రమూర్తి రాక్షసమాయను నశింప జేయు బాణమును విడువగా, అది మాయారావణుల నందఱను హతము చేసెను. అప్పుడు రామచంద్రమూర్తిని దేవతలు గగనమున స్తుతింపు చుండిరి. (ఏమని స్తుతింపుచుండి రనగా,)

౪౦-౪౧-౪౨ సూర్యోదయ మగుటతోడనే గాఢతమస్సంతయు నెటుల నశించి పోవునో, రామబాణముదయించుట తోడనే మాయారావణులు నశించిరి. అని స్తోత్రములు చేయుచు దేవతలు రామచంద్రమూర్తిమీద పుష్పవర్షము కురిపించుచుండ రావణుడుచూచి సహింపలేక దేవతలను జంపివేసెదనని పైకి గగనమున కెగురుచుండగా, దేవతలు భయపడి పారిపోవుచుండిరి. అప్పుడంగదుడు రావణునితో గూడ దానుగూడ పైకెగిరి రావణుని కాలిని బట్టుకొని క్రిందకు లాగి భూమిమీదఁ బడవైచెను.

౪౩ రావణుడు తనకొక వానరుని వలన గలిగిన పరాభవమునకు దుఃఖపడుచు తిరిగి లేచి రథారూఢుడై తొక్కత్రొక్కిన పాముచందమున బుసగొట్టుచు బాణవర్షముచే వానరుల నందఱను భిన్నాంగులనుగా జేయుచు, రామచంద్రమూర్తిని గూడ బాణవర్షములో ముంచుచు దుస్సహమయిన తేజస్సుతో రావణుడు రణరంగమున నొప్పుచుండెను.

౪౪ దేవేంద్రుడు పైనుండి చూచుచుండెనుగాన, రావణుడు రథముమీద నుండి యుద్ధము చేయుచుండగా, రామచంద్రమూర్తి నేలమీద నుండి యుద్ధము చేయుట బాగుగా లేదని యాలోచించి వెంటనే తన రథమును తన గుఱ్ఱములను తన సారథిని తన దివ్యాస్త్రములను రామచంద్రమూర్తికిఁ బంపెను.

౪౫ పిదప దేవేంద్రుడు పంపిన రత్నభూషితమైన దివ్యరథమును రామచంద్రమూర్తి యెక్కి రావణునితో యుద్ధము చేయుచుండెను. ఆ యిరువురకు ఘోరయుద్ధము జరుగుచుండెను. ఎట్లయినను రావణుని జయింపవలెనని రామచంద్రమూర్తియును, ఎట్లయినను రాముని చేతిలో జావవలయునని రావణుడును, దృఢనిశ్చయములతో వారిరువురును దుస్సహమైన యుద్ధమును జేయుచుండిరి.

అభ్రం త్వభ్రనిభం సరిత్పతి రపి ప్రాయో౽బ్ధితుల్య స్తథా,
శ్రీరామస్య చ రావణస్య చ తయో ర్యుద్ధం యథా౽భూ
త్తయోః, ఇత్యేవం గగనే స్థితా దివిషదం ప్రాహు
స్తదైవం పునః, స్వస్తి బ్రాహ్మణగోకులస్య వసతా
ల్లోకోఽప్యయం శాశ్వతః. ౪౬

పశ్చా త్త్వం జ్జిముఖ శ్శరై రనుపమై స్సూతం తు వివ్యాధ తం
కించ స్యందన ఏవ మాతలి రభూ త్సంపాతిత స్తచ్ఛరైః
రథ్యాం స్తస్యఘూనై దశముఖః క్రుద్ధ స్తదీయం ధను
శ్చిచ్ఛేదా౽శు తదీయలాంఛన మథో సంతాడయామాస, సః॥
౪౭

తస్మా దాశ్వవరుహ్య మారుతి భుజా వారుహ్య సీతాపతౌ
యుద్ధ్వా త్వాశరనాయక స్తు పరిఘై ర్నైవా౽నిలస్యా౽౽త్మజమ్
సంతాడ్యా౽౽శ్వకరో త్సుమూర్ఛిత మథో సస్మార రామో
నిజమ్,
దివ్యం స్యందన మాశు సోఽపి గగనా ద్రామాంతికం త్వాగతః॥౪౮

సూతో యత్ర తు దారుకో౽స్తి విశిఖా యత్ర స్థితా వైష్ణవాః
పద్మం యత్ర గదా స్థితే చ గరుడో యత్ర ధ్వజే సంస్థితః
యస్మి న్శైబ్యవలాహకాదితురగా శ్శార్ఙ్గం ధను ర్యత్ర వై
ఛత్రం చామర మప్యవాస చ రథే యస్మిం స్తు సౌవర్ణకమ్
దివ్యంతం రథ మన్వవేక్ష్య మహిజాజానిః ప్రణమ్యా౽౽శు తం
త్వారుహ్యా౽థ ముదా౽న్వితో ధనురలంధృత్వా చ శార్ఙ్గం, తతః

౪౬ గగనమునకు గగనమే యెట్లు సాటియో, సముద్రమునకు సముద్రమే యెట్లు సాటియో, అటులనే రామరావణులయుద్ధమునకు రామరావణులయుద్ధమే సాటిగాని మఱియొకటి సాటిలేదని గగనమున దేవతలు తలంచుచుండిరి. మఱియు గోబ్రాహ్మణులకు శుభము చేకూరుగాక యనియు, రావణవధచే లోకములన్నియు శాశ్వతముగా సుఖముగా నుండుగాక యనియు దేవతలు విమానములయందుండి జపించుచుండిరి.

౪౭ పిదప రావణుడు తన శరవర్షముచే సారథియగు మాతలినిగొట్టగా, రాముని రథసారథియయిన మాతలి రథముమీదను బడెను. పిదప రావణుడు గుఱ్ఱములను గూడ గొట్టుటకాక రాముని చేతిలోనున్న యైంద్రధనువును గూడ తన బాణములచే తుత్తునియలుచేసెను. ఇంతియేగాక, రథముమీదను లాంఛనముగానున్న హనుమంతునిగూడ బాణముల దెబ్బలచే విషణ్ణునిగాఁ జేసెను.

౪౮ ఇట్లు సారథిని గుఱ్ఱములను గూడ రావణుడు పడునట్లు చేయగా వెంటనే రామచంద్రమూర్తి హనుమంతుని భుజములమీదను గూర్చుండి యుద్ధము చేయుచుండ, రావణుడు పరిఘాయుధముతో హనుమంతుని నొక వ్రేటు వేయ, హనుమంతుడును మూర్ఛితుడయ్యెను. పిదప రామచంద్రమూర్తి వైకుంఠములోనున్న తన దివ్యరథమును స్మరింపగా, వెంటనే వైకుంఠమునుండి దివ్యరథము గగనమార్గమున క్షణములో రామచంద్రుని సమీపమునకు వచ్చెను.

౪౯-౫౦ ఏ దివ్యరథమునకు దారుకుడు సారథిగానుండెనో, ఏరథమునందు వైష్ణవాస్త్రము లమర్చబడియుండెనో, ఏ దివ్యరథమున గదా పద్మములు విలసిల్లుచుండెనో, ఏవైష్ణవరథమున గరుడధ్వజముండెనో, ఏరథమున శార్ఙ్గ మను దివ్యధనుస్సు ఛత్రచామరములు నొప్పుచుండెనో, ఆదివ్యరథమును రామచంద్రమూర్తి చూచి వెంటనే నమస్కరించి సంతసముతో దానిమీద నెక్కి వైష్ణవధనువును జేతపట్టి దివ్యాస్త్రముల నందు సంధించి రావణునిమీది కా

సంధాయాఽపిచ వైష్ణవాం స్తు విశిఖా న్ముక్త్వాఽఽశరాధీశ్వరే
చిచ్ఛేదాఽఽశు దశాస్యశీర్షదశకం శ్రీరామచంద్రప్రభుః॥ ౫౦

తచ్ఛిన్నాని శిరాంసి చాఽంబర మరం తూ ల్ప్లుత్య సీతాపతేః
పాదద్వంద్వసమీపవేవ నమనం కర్తుం యథాఽథాఽ పతన్
భూమౌ ప్యాశరనాయకస్య సహసోద్భూతాని శీర్షా ణ్యథో
తుల్యాన్యేవ నవాని తా న్యపి పున శ్చిచ్ఛేదరామ శ్శరైః॥ ౫౧

ఏవం తస్య శిరాంసి చైకశతశ శ్చిచ్ఛేద రామ స్తదా
తుల్యాన్యేవ సముద్భవంతి చ పున శ్శీర్షాణి తస్యాద్భుతమ్
నాఽపశ్య ద్రఘునందనో దశముఖస్యాంతం తత శ్శాంతవా
న్నామోఽనేకవిధంహ్యదా పునరలం సంచింతయ న్సంస్థితః ॥౫౨

ఏతస్మి న్సమయే మహర్షి రగమ త్తస్యాఽంతికం కుంభజో
రామేణాఽథ సుపూజితోఽవద దిదం వాక్యం మహర్షి స్తతః
శ్రీరామోపదిశామి తేఽర్కహృదయం సర్వాహితోన్మూల
కం, త్విత్యుక్త్వోపదిదేశ సూర్యహృదయం త్వేవం మునీ రాఘ
వమ్॥ ౫౩

ఆదిత్య స్సవితా ఖగ శ్చ తపన స్త్వష్టా రవి ర్భాస్కరో
మార్తాండ శ్చ మరీచిమాం స్తిమిరహృద్భాను ర్గ్రహాణాంప్రభుః
విష్ణు శ్శంభు రయం ప్రజాపతి రయం కాలో మరుత్వా నయం
ధ్యాత్వైవం మనుజో ధ్రువం తు లభతేఽభీష్టస్య సిద్ధింద్రుతమ్.
౫౪

దివ్యాస్త్రములను విడువగా వెళ్ళి రావణుని పదితలలను వెంటనే క్రమముగా ఛేదించెను.

౫౧ ఇట్లు రామబాణములచే ఛేదింపబడిన యారావణుని తలలు గగనమున కెగిరి తిరిగివచ్చి రామచంద్రుని పాదారవిందములకుఁ బ్రణమిల్లుచున్నవి వలె రామపాదముల సమీపమున బడుచుండెను. కాని రావణుని శిరస్సులు వెంటనే క్రొత్తవి బయలు దేరుచుండెను. రామచంద్రమూర్తి వానిని దెగనరుకుచుండెను.

౫౨ ఇవ్విధముగా, రావణుని తలలను నూటయొకమారు రామచంద్రమూర్తి ఛేదించెను గాని సమానమైన క్రొత్త తలలు మొలుచుచుండుటవలన, రావణుని కంఠము కన్పడక పోయెనని రామచంద్రమూర్తి యనేక విధముల మనస్సున నాలోచింపుచుండెను.

౫3 ఈ సమయమున రామచంద్రమూర్తి సమీపమునకు అగస్త్యమహర్షి వచ్చి రామచంద్రమూర్తిచేఁ బూజింపబడి యిటుల శ్రీరామునితో: బలికెను. రామచంద్రా! శత్రువిజయమునకై నీకు ఆదిత్యహృదయము నుపదేశించెదను. అది సర్వశత్రునాశకరమయినది. యని చెప్పి వెంటనే రామచంద్రమూర్తికి అగస్త్యమునీంద్రు డీ క్రింది విధముగ నుపదేశించెను.

౫౪ ఆదిత్యుడు, సవిత, ఖగుడు, తపనుడు, త్వష్ట రవి, భాస్కరుడు, మార్తాండుడు, మరీచిమంతుడు, తిమిరహృత్తు, భానుడు, గ్రహరాట్, అని యీనామములచే నాదిత్యుని స్తుతించి యితడే విష్ణువు, ఇతడే శివుడు, ఈయాదిత్యుడే బ్రహ్మ, ఈయాదిత్యుడే యింద్రుడు, ఈతడే కాలుడు, అని యితనిని సర్వాత్మకునిగా ధ్యానించుచున్న మనుజుడు శీఘ్రసిద్ధిని దప్పక పొందగలడు.

హార్యశ్వాయ నమో నమోఽస్తు రుచయే సూరాయ తస్మై
నమః, శత్రుఘ్నాయ నమో నమోస్తు రవయే సప్తా
ర్చిషే నై నమః, ఏవం త్వాపది కీర్తయం స్తు మనుజో
ముక్తో భవే దాపదో, యుద్ధే లోపిజగత్ప తేస్తు హృదయం
జప్త్వా జయం ప్రాప్స్యతి॥ ౫౫

తస్యైవం హ్యుపదిశ్య సూర్యహృదయం ప్రాగా న్మని
స్స్వాశ్రమమ్, పశ్చా ద్భూమిసుతాపతి స్త్రిగుణితం తద్వై
జజాప ద్రుతం, ఏతస్మి న్సమయేఽవద ద్రఘుపతిం రాత్రిం
చరేశానుజ * స్తన్నాభా వమృతాన్వితోఽ స్తి కలశ స్తం
శోషయ త్వం విభో. ౫౬

* తన్నాభావమృతకలశఇతి – అత్రేయం పౌరాణికీ గాథానుసంధేయా, పురా కదాచన దేవాః పూర్వదేవా శ్చ వారిధిం మమంథుః, అంతత స్సుధాభాండ స్సముద్భూత స్తదానయనావసరే తస్మా త్స్రవంతీ రమృతధారాః పరానభిజ్ఞాత మదితి స్స్వర్ణకలశే సంస్థాప్య తదగ్రం చైలాగ్రేణ దృఢ మాబధ్యైకత్ర తం స్థాపయామాస. తత శ్చిరాయు సోఽప్యమృత కలశః కైకస్యా స్సంప్రాప్తో బభూవ, సాపి త మాత్మజాయ దశాననాయ క్రీడార్థ మేకదా దదౌ సచ ఫల భ్రాంత్యా త మంతర్గత మాచచార త మేత ముదంతం

౫౭-౬౭ మఱియు హర్యశ్వునకు నమస్కారము, రుచికినమస్కారము, సూర్యునకు నమస్కారము, శత్రుసంహారకునకు నమస్కారము, రవికి నమస్కారము, సప్తార్చిషునకు నమస్కారము, అని యాదిత్యుని, నమస్కరించిన మానవుడు ఆపదలనుండి విముక్తుడగును. మఱియు, యుద్ధములో నెంత యల్పుడుగా నుండినవాడైనను పైవిధముగ ఆదిత్యహృదయమును జపించినచో, యుద్ధములో శత్రువును జయింపగలడు.

౫౬ ఇట్లు రామచంద్రమూర్తికి అగస్త్యుడు ఆదిత్య హృదయమును నుపదేశించి తన యాశ్రమమునకు వెళ్ళిపోయెను- పిదప రామచంద్రమూర్తియును ఆదిత్య హృదయమును మూడు పర్యాయములు జపించెను. ఈ సమయమున విభీషణుడు రామచంద్రమూర్తియొద్దకు వచ్చి యిటులఁ జెప్పెను. రామచంద్రా! నాకుగూడ నిపుడు స్మృతికి వచ్చెను. రావణుని * నాభియందు అమృతకలశ మొకటియుండెను. దానిని నీవు లాగివేసినగాని యితడు చావడు కావున వెంటనే దానిని శోషింపజేయుమనియెను.

---

* నాభియం దమృత కలశ మొకటి యుండెను - అమృతకలశ మెట్లు రావణుని నాభియందుండెనని యాశంక కలుగును దానికి క్రింది పురాణ గాథ యనుసంధేయము. పూర్వ మొకప్పుడు దేవతలును పూర్వదేవతలును (రాక్షసులును) క్షీరసముద్రమును అమృతోత్పాదనమునకై మథింపగా, తుదకు దానిలోనుండి యమృత కలశము పుట్టెను. దాని నివతలకు దీసికొని వచ్చుచుండ నమృత కలశములోనుండి యమృతధారలు క్రిందఁ బడగా, అదిఁజూచి సువర్ణకలశములో అమృతబిందువుల నెత్తిపెట్టి యాసువర్ణకలశము యొక్క మూతిని గుడ్డతో గట్టి పదిలముగా నొకచోట దాచెను. పిమ్మటఁ గొంతకాలమునకు రావణుని తల్లియైన కైకసి యాకలశము సంగ్రహించెను. ఆ కైకసికూడ నొకదినమున పిల్లవాడుగానున్న రావణునకు క్రీడార్థమై(ఆడుకొనుటకై) దానినివ్వగా రావణుడు పండను భ్రాంతితో దానిని లోపలికి మ్రింగెను. రావణుడమృత

శ్రుత్వా తద్వచనం ముదన్వితమనాః జాజ్వల్యమానం తథా
లోకానాం భయనాశనం రఘుపతి స్సమ్మంత్ర్యచాఽస్త్రం తదా
సంధాయాఽఽశు ధను ష్యలం దశముఖస్యోరస్థ్సలే పాతయ
ద్గత్వా తద్ధృదయం ప్రవిశ్య కలశం సౌధం తదాఽశోషయత్. ౫౭

*కించ తత్కలశం తస్య చాంత్రై స్సహ బహిర్గతం
చకార పావకాస్త్రం త త్తత్రస్థా శ్చ చతుర్దశ
ద్వి రేఫా బహి రాగత్య నత్వా రామం తదాఽఽత్మనాం
పూర్వవృత్తం నివేద్యాఽఽశు గతా స్స్వర్గం తదాజ్ఞయా. ౫౮-౫౯

---

విశ్రవసే కథయంత్యాః కైకస్యాః గర్భ స్థితో విభీషణ శ్శ్రుత
వాన్, తదహస్య మధునా రామచంద్రాయ విభీషణః ప్రోక్తవా
నితి పౌరాణికీ గాథాఽనుసంధేయా.

* చతుర్దశద్విరేఫాఇతి - చతుర్దశద్విరేఫా అమృతకలశే
కథ మవసన్ - తేకే - ప్రతిమాదహానం కి మిత్యత్రేయం పౌరా
ణికీ గాథానుసంధేయా - తద్భ్రమరే ష్వేక ఏవం రామ మవదత్ -
అహం మృత్యు స్సర్వేఽప్యేతే మదీయానుచర్య స్సంధి
దేవతాః, సర్వేపి వయం నిజరూపైః కస్య చి త్స్థలస్య గత్వాః
పున రాగమనసమయే కుత్రచి త్కైకసీ త్వమృతకలశస్య సంధి

౫౭ ఆ మాట విని రామచంద్రమూర్తి మిక్కిలి సంతోషించి లోకముల భయమును దొలగించు దేదీప్యమానమయిన పావకాస్త్రమును ధనువునందుంచి యభిమంత్రించి యాయస్త్రమును రావణుని వక్షస్స్థలమునందు విడువగా, ఆ పావకాస్త్రము రావణుని హృదయములో బ్రవేశించి నాభియందున్న యమృతకలశమును శోషింప జేసెను.

౫౮-౫౯ ఇదియటుండగా, రామచంద్రమూర్తిచే విడువబడిన పావకాస్త్రము రావణుని నాభియందున్న యమృతకలశమును వాని ప్రేగులతోగూడ బయటకులాగి పడవైచెను. ఆకలశము దూరముగా నెగిరిపడుటలో దాని మూత విడిపోయెను. ఆ యమృతకలశములో నున్న * పదునాలుగు తుమ్మెదలు బయటకు వచ్చి రామచంద్రమూర్తికి నమస్కరించి తమ ♦ పూర్వవృత్తాంతము జెప్పి రామానుజ్ఞనొంది నిజరూపములతో స్వర్గమున కేగెను.

---

కలశమును గ్రమింగెనను సంగతి కైకసి తనభర్తయగు విశ్రవసునితో జెప్పుచుండగా, కైకసిగర్భములోనున్న విభీషణుడు, రావణుడమృతకలశమును గ్రమింగిన సంగతిని వినియుండెను. ఆ రహస్యమిప్పుడు స్మృతికివచ్చి రామచంద్రమూర్తికి విభీషణుడు చెప్పెనను పురాణగాథ యిచట ననుసంధానము చేసికొనదగి యున్నది.

* పూర్వవృత్తాంతము — అమృతకలశములో పదునాలుగు తుమ్మెదలెట్లుండెను. ఆ తుమ్మెదలెవ్వరు? రావణుని గృహమున స్థాపింపబడిన ప్రతిమలు దగులబడుట యేమిటి? అవి తమ పూర్వవృత్తాంత మేమని చెప్పెను? అను విషయమున నీక్రింది పురాణగాథ యిచట ననుసంధేయము. పూర్వవృత్తాంతమును రామచంద్రమూర్తితో నొకతుమ్మెద యీక్రింది విధముగాఁ జెప్పినట్లు తెలియబడుచుండెను. ఆ తుమ్మెదలలో నొక తుమ్మెద రామచంద్రుని తో నిటుల జెప్పెను, రామచంద్రా! నేను మృత్యుదేవతను. వీరలందరు నాపరిచారికలగు సంధిదేవతలు. మేము పదునలుగురము కలిసి యొక తావునకు వెళ్ళి తిరిగి వచ్చుచున్న సమయములో

తత్కాలే రావణగృహే స్థాపితాః ప్రతిమా అపి
దగ్ధా బభూవు రాశ్చర్యం కి మతః పర మస్తి నై. ౬౦

పశ్చా ద్రాఘవముక్తదివ్యవిశిఖచ్ఛిన్నోత్తమాంగోఽపత
ద్భూమ్యాంపంక్తిముఖో యధాకులిశభృత్సంఛిన్నపక్షోఽచలః
పశ్చా ద్రాత్రిచరా హతాధిపతయ స్తే దుద్రువు స్సర్వతః
కేచి ద్రావణ మందిరం ప్రతి గతా వక్తుం మృతిం రక్షసః ౬౧

---

బంధ మాచరతిస్మ,నిరీక్ష్య తం సర్వేపి వయం ద్విరేఫాకృతయ స్తదంతః ప్రవిష్టాః, తదేత దవిజ్ఞాయ సాపి ద్రుఢం సంధిబంధ మమృతకలశస్యాఽకరోత్, తదుత్తరక్షణ ఏవ దశాననోపి మాత్రా క్రీడార్థం వితీర్ణ మమృతకలశం హృదంతర్గత మకరోత్, తతో బహి రాగంతు మశక్తా స్తత్రైవ స్థితా వయ మేతావత్, అధునా త్వత్ప్రసాదా ద్విముక్తాశ్చాభూమ, అస్మాకం నిజశరీరాణి దశాననేన నిజగృహద్వారపార్శ్వయోః ప్రతిమారూపేణ స్థాపితాని ధృత్వా చ తాని నిజలోకం వ్రజామ. ఇత్యుక్త్వా తత్ప్రతిమారూప నిజశరీరాణి విధృత్య నిజలోకం యదా వవ్రజు స్తత్ప్రతిమా శ్చ దగ్ధాఇవ బభూవు రితి నారదీయశ్రీరామకథాతరంగిణీకథాఽత్రాఽనుసంధేయా-

౬౦ ఆసమయమున రావణుని గృహద్వారమున స్థాపింపబడిన పదునాలుగు ప్రతిమలు దగ్ధములయ్యెను. ఇంతకంటె పరమాశ్చర్య మేమి యున్నది ?

౬౧ పిదప రామచంద్రమూర్తి దివ్యాస్త్రముల నెక్కుపెట్టి కొట్టగా నవి వెళ్ళి రావణుని శిరస్సులను ఛేదించివైచెను. వజ్రాయుధముచే దేవేంద్రునిచే దెగగొట్టబడిన పర్వతము నేలగూలినట్లు రావణుడు కూడ ఛిన్న శిరస్కుడై భూమిమీదఁ బడెను. ఇట్లు తమ ప్రభువగు రావణుడు హతమగుటతోడనే నాథుడు లేనివారలై మిగిలిన రక్కసులు నలుదిశలకుఁ బరుగులిడి పారిపోయిరి, కొందఱు రక్కసులు రావణుని మరణవార్తను జెప్పుటకై రావణమందిరమున కేగిరి.

---

నొక చోటను కైకసి యీ యమృతకలశమునకు సంధి బంధము (మూతిని బిగించుట) చేయుటకు మూతిని విప్పి తిరిగి బాగుగ సంధి బంధము చేయ ప్రయత్నములో నుండ మేమందఱము దానిని జూచి తుమ్మెదల రూపములను ధరించి మాశరీరముల నొక చోటనుంచి యాయమృతకలశములో బ్రవేశించితిమి. మేము లోపల నుండగనే యాకైకసి యమృతకలశమును దృఢముగా సంధిబంధము చేసి కుమారుడయిన రావణున కాదుకొనుటకై యిచ్చెను. రావణుడు దానిని త్రింగెను. అందువలన మేము వెలుపలికివచ్చు నవకాశము లేక యచ్చటనే యింతదనుక యుండిపోతిమి. ఇప్పుడు నీ యనుగ్రహమువలన మేము విముక్తులము మైతిమి. మానిజ శరీరములను రావణుడు తీసికొని పోయి తన గృహద్వారమునకు నిఱుపార్శ్వముల యందున నలంకారమునకై పాతిపెట్టెను. బొమ్మలుగా నచ్చట మాశరీరములు స్థాపింపబడియున్నవి. మా నిజరూపములను మేము ధరించి మా లోకమునకు వెళ్ళెదమని చెప్పి యచ్చట రావణమందిరమున ప్రతిమారూపములుగా నున్న తమ శరీరములను ధరించి వారలెప్పుడు వెళ్లెనో, అచ్చటి ప్రతిమలు దగులబడినట్లు అదృశ్యములయ్యెను. అనియెడి నారదీయ శ్రీరామ కథా తరంగిణి కథ యిచట ననుసంధేయము.

పశ్యతాం సర్వభూతానాం తేజ స్తస్య దురాత్మనః
రాఘవం ప్రవివేశాఽఽశు* సురా స్సర్వేఽతి విస్మితాః
విస్మితా న్నారదః ప్రాహ సురర్షి ర్ద్విజా న్ప్రతి,
ద్వేషా త్సదా రామమేవ హృది రాత్రించరాధిపః
భావయ న్ప్రిత్యహం స్వప్నే పశ్యం స్తం ముక్తి మాప సః.
౬౧-౬౩

పశ్చా దృక్షపతి స్తు దుందుభి మథాఽఽదా యైక ముత్సాహాత్, నిర్గత్య క్షణమాత్రఏవ తు దిశో గత్వాఽభితో రావణమ్, శ్రీరామేణ హతం నివేద్య మహతా ఘోషేణ తద్దుందుభేః, శ్రీరామస్య జయం చ భూమితనయాప్రాప్తిం సమాగా త్స్వనః. ౬౪

కించాఽఽభ్రే సురదుందుభి శ్చ నితరా మాఘోషితోఽభూ త్సురైః, స్తత్కాలే, సుమవృష్టి రంబరతలా ద్రామ ప్రభౌ చాఽపతత్, సిద్ధా స్తుష్టువు రాశు రాఘవ మలం దేవా స్తథా కిన్నరాః, గంధర్వాశ్చ జగు స్తదీయచరితం ప్రాపు ర్ముదం తాపసాః, ౬౫

---

* అత్ర తేద మవధేయమ్ "పాపిష్ఠో వా దురాత్మా పరధన పరదారేషు సక్తో యది స్యా, న్నిత్యం స్నేహా ద్భయాద్వా రఘుకులతిలకం భావయ న్సంపరేతః, గత్వా శుద్ధాంతరంగో భవశతజనితానేకదోషై ర్విముక్తః, సద్యో రామస్య విష్ణో స్సురవరవినుతం యాతి వైకుంఠ మాద్యమ్." ఇతి శ్లోకోక్తేః.

౬౨-౬౩ అందఱు చూచుచుండగనే రావణుని బొందిలో నున్న తేజస్సు వచ్చి రామచంద్రమూర్తిలోఁ బ్రవేశింపగా, దేవతలు కడు విస్మితులయిరి. (ఈ పాపిష్ఠునకిట్లు సద్గతికలిగెనని యాశ్చర్యపడిరి.) అప్పుడు నారదమహర్షి దేవతలతో నిట్లు చెప్పెను. ఓదేవతలారా! మీర లాశ్చర్యపడవలసిన పనిలేదు. (ఏలనన) ఈ రావణుడు రాముని యందలి ద్వేషముచేతను, శ్రీరామునే యెప్పుడు హృదయమునందు భావనచేయుచుండెను. స్వప్నములో గూడ రామునే చూచుచుండెడివాడు. * అందువలన (సదా శ్రీరామస్మరణాదుల వలన) అతడు ముక్తినొందగలిగెనని (నారదుడు దేవతలకుఁ జెప్పెను.)

౬౪ పిదప జాంబవంతుడు దుందుభిని పేసికొని మెడకు దగిలించుకొని దప్పు వేయుటకై యుత్సాహముతో బయలుదేరి క్షణములో సకలదిక్కుల యందును, శ్రీరామునిచే రావణుడు చంపబడెననియు, రామచంద్రమూర్తికి జయము కలిగెననియు, సీతను రామచంద్రమూర్తి తిరిగి పొందగలిగెననియు, చాటింపుచేసి తిరిగి క్షణములో శ్రీరాముని సన్నిధి కేతెంచెను.

౬౫ జాంబవంతుడు దుందుభి మ్రోగించుచు బయలుదేరినపుడు దేవతలు కూడ దేవదుందుభులను మ్రోగించిరి పుష్పవర్షముకూడ దేవతలు కురిపించిరి. దేవతలు సిద్ధులు మహర్షులు మొదలగు వారందఱును శ్రీరామచంద్రుని స్తుతింపుచుండిరి. గంధర్వులు గానము చేయుచుండిరి. తాపసులానందముతో నుండిరి.

---

* అందువలన నతడు ముక్తినొందకలిగెను — ఇటులనే విశ్వామిత్రప్రోక్తమయిన రామాయణమున జెప్పబడినది. (ఎట్లన) "పాపిష్ఠుడైనను, దురాత్ముడైనను, పరధనపరదారాసక్తుడైనను, యెట్టివాడైనను, స్నేహముచేతనుగాని, భయముచేతనుగాని యెట్లయినను రఘుకుల తిలకమగు శ్రీరామచంద్రునిస్మరణము కలిగియుండిన యెడల, వాడు మృతినొందు సమయమున నిర్మలచిత్తుడై యనేకకోటిజన్మార్జిత పాపసంచయమునుండి కూడ విముక్తుడయి వైకుంఠమును బొందగలడని (చెప్పెను.)

దేవాః ప్రాహు రథో విరించిపురుహూతాద్యా స్తు సీతా
పతిమ్, స్వామి న్క్రూర మిమం దశాస్యహతకం దేవ
ద్విజాపీడకమ్, హత్వా త్వం సమరే సమస్తజగతా
మచ్యా౽కరో శ్శం ధ్రువమ్, లోకక్షేమకరస్య తే నమ
ఇదం దైవం త్వయా గృహ్యతామ్. ౬౬

ఇతి దేవాదయ స్స ర్వే తుష్టచిత్తా స్తదా పునః,
రామచంద్రం విమానస్థా స్తుష్టువు ర్బహుధా తదా
గంధర్వాశ్చ జగు స్సద్యో ననృతు శ్చాప్సరోగణాః
రాఘవస్య యశ స్తత్ర బహుధా౽ కీర్తయ న్బుధాః ౬౭-౬౮

ఆశ్చర్య రామాయణే యుద్ధకాండే
వింశస్సర్గ స్సమాప్తః

---

ఏ క విం శ స్స ర్గః

తతో భర్తృమృతిం శ్రుత్వా రాక్షసీభి స్తు వేష్టితా
మండోదరీ సమేత్యా౽౽శు వీక్ష్య తం బహుధారుదత్. ౧

*పూర్వం యేన సముద్ధృత శ్శివగిరి ర్యేన త్రిలోకీజితా
దోర్భ్య మన్యభుజై ర్న జా త్వవసర శ్శస్త్రస్య యస్యా౽

---

* దైవేబలేదుర్బలే - ఏవ మన్యత్రాపి సందృశ్యతే -
“జాతి ర్బ్రహ్మకులే౽గ్రజో ధనపతి ర్భ్రాః కుంభకర్ణో౽నుజః,

౬౬ పిదప బ్రహ్మేంద్రాదిదేవతలు శ్రీరామచంద్రమూర్తితో నిటుల విన్నవించిరి. స్వామీ! దేవబ్రాహ్మణుల హింసపెట్టిన దుర్మార్గుఁడగు రావణుని జంపి త్రిలోకములకు సుఖము నొనగూర్చితివి. ఇట్టి లోకక్షేమంకరుఁడవగు నీకు మేము వందనము లర్పించుటకంటె వేఱొండు చేయఁ జాలము గాన మావందనమిదిగో గ్రహింపుమనిరి.

౬౭-౬౮ ఇట్లు దేవతలు విమానములయందుండి సంతుష్టాంతరంగములతో ననేకవిధములుగ స్తుతించి నుతించిరి. గంధర్వులు సంగీతము పాడుచుండిరి. అప్సరసలు నృత్యముల జేసిరి. బుధులు రాముని చరిత్రమును గొనియాడిరి.

ఆశ్చర్యరామాయణమున యుద్ధకాండమున
నిఱువది సర్గము సమాప్తము.

---

## ఇఱువదియొకటవసర్గ ప్రారంభము

౧ పిదప రావణవధను మండోదరి విని కొంతతడవు దుఃఖించి రాక్షసస్త్రీలనుగూడ వెంటనిడుకొని రావణుని మృతకళేబరమున్న చోటునకు వచ్చి నేలఁబడియున్న రావణునిఁ జూచి యిట్లు విలపింపఁదొడగెను.

౨ * పూర్వమెవ్వఁడనాయాసముగా రెండుచేతులతో కైలాసపర్వతము నెత్తివైచెనో, ఎవఁడు త్రిలోకములను జయించెనో, ఎవ్వని శస్త్రమునకు రెండు భుజములు తప్ప నితర భుజముల యవసర

* దైవబల మొకటి లేనందువలన—

ఇటులనే మఱియొకటిఁగూడ వర్ణించి యుండిరి. "జననమా బ్రహ్మవంశమున జననము. అన్నయా నవనిధులుగల కుబేరుఁడన్నయై యుండెను, తమ్ముఁడా త్రిలోకములను జయించిన కుంభకర్ణుఁడు'

ప్యభూత్, తం త్వాం కశ్చన మానవో భుజయుగం లబ్ధ్వా
జఘానాఽధునా, హా త్వం వ్యర్థభుజోఽసి రాక్షసపతే
* దైవే బలే దుర్బలే. ౨

విలపంత్యాం తదా తస్యాం దుఃఖిత స్సన్విభీషణః
ఏవం రురోద నితరాం శిరస్తాడనపూర్వకమ్. 3

సిద్ధవిద్యాధరస్త్రీణాం పరిష్వంగం విహాయ కిమ్
భువ మాలింగతి భ్రాతః భవా న్స్వర్గాతిగం పురం
త్యక్త్వా స్వర్గం ప్రయాతో వా శిరఃపుష్పై శ్శివార్చనం
త్యక్త్వా సమరదేవ్యా స్తు పూజా మద్య కరోషి వా
దిక్పాలకార్చితాంఘ్రి స్త్వం కంకగృధ్రార్చితోఽసి వా
భ్రాత ర్మే హితవాక్యాని తృణీకృత్య భవాం స్తు నః
కృత్వా దుఃఖాంబుధౌ మగ్నా నేవం స్వర్గం గతోఽసివా.
౪-౫-౬

---

పుత్ర శ్శక్రజయీ స్వయం దశశిరాః పూర్ణా భుజా వింశతిః,
దైత్యాః కామచరా రథ శ్చ విజయీ పారే సముద్రం గృహం
సర్వం నిష్ఫలితం బభూవ విధినా దైవే బలే దుర్బలే.

దుర్గం త్రికూటం పరిఘా సముద్రః
రక్షాంసి యోధాః ధనద శ్చ విత్తం
సంజీవినీ యస్య ముఖాగ్రవిద్యా సరావణః కాలవశా ద్వినష్టః.
ఇతి-

మింతదనుక కలుగక పోయెనో, అట్టి యిరువది భుజములుగలనిన్ను ద్విభుజుడగు నొక మానవుడు చంపెనా! దైవబలమొకటి లేనందు వలన నివన్నియు నెన్నియుండినను వ్యర్థభుజములుగల వాడవైతివి గదా! అని విలపించెను.

3 ఇట్లు మండోదరి విలపించుచుండగా, విభీషణుడుకూడ భ్రాతృ మరణమునకు దుఃఖించుచు నెత్తి బాదుగొనుచు నిటుల విలపింప దొడగను.

౪-౫-౬ అన్నా! విద్యాధరస్త్రీలు మొదలగు స్త్రీల యాలింగనమును విడిచి రణభూమి నిటుల నాలింగనము చేయుచుంటివా? స్వర్గ పురమును మించియున్న లంకాపురమును విడిచి స్వర్గపురి కేగితివా? శిరస్సులనియెడి పూవులచే శివార్చనము మాని నేడు సమర దేవతా రాధనను చేయుచుంటివా? దిక్పాలకులచేఁ బూజింపబడిన పాద ములుగల నీ విపుడు గద్దలు మొదలగు వానిచే సేవింపబడుచుంటివా? అన్నా! నేను జెప్పినమాటలను తృణీకరించి మమ్ముల నందఱను దుఃఖసముద్రములో ముంచివేసి స్వర్గమున కేగితివా? (యని విభీష ణుడు విలపించుచుండెను.)

---

పుత్త్రిని విచారింతుమా యింద్రుని జయించిన యింద్రజిత్తు పుత్త్రిడు, ఆలోచనమునకు బుద్ధిలేదా యనిన నీవు పదితలలు గలవాడవు, చేతులా యిరువది చేతులు, పరివారమును విచారింతుమా కామచారు లగు దైత్యులు, నీ రథమా జయశీలమయిన రథము, నీ నివాసమా సముద్రపుటవతలియొడ్డునందుండెను. ఇన్నియు దైవబలము తక్కు వగుటచే నిష్ఫలములయ్యెనని (వర్ణింపబడెను.)

మఱియు నిటుల వర్ణింపబడెను. ఏ రావణుని పురమునకు దుర్గమా త్రికూటపర్వతము, కోటకందకమా సముద్రము, యోధులా రక్క సులు, ధనమా కుబేరుడు, విద్యయా సంజీవినీవిద్య, అట్టి రావణుడు కూడ కాలవశమున మృతిజెందెనని వర్ణింపబడెను.

ఇత్యేవం విలపంతం తం తథా మందోదరీ మపి
రాఘవ స్సాంత్వయ న్నేవ మువాచ వచనం తతః. ౭

అవిద్యామూలకో జాతా దారాః పుత్రాశ్చ బంధవః
విచారే కస్య కో నూనం సర్వం మాయామయం ధ్రువమ్. ౮

ఇతి మందోదరీ తేన బోధితా ప్రాహ రాఘవం
కష్టాత్కష్టతమం స్త్రీణాం వైధవ్యం మహీజాపతే
కథం సహిష్యే త దిద మితి శోచా మ్యహం పునః. ౯౪

ధన్యా రామ! త్వయా మాతా ధన్యో రామ త్వయా పితా
ధన్యో రామ త్వయా వంశః పరదారా న్నపశ్యసి
సాధు సాధు మహాదేవ! సాధు రామ నమోఽస్తు తే
అనుజ్ఞా దీయతాం మహ్యం భర్త్రా సహగమే త్వయా
హృదయే మమ తిష్ఠ త్వం శాంతరూపయుతః ప్రభో
యావ ద్దేహం త్యజేయం చ పత్యా సహ చితౌ స్థితా.
౧౦-౧౧-౧౨౪

* ఇతి త ద్వచనం శ్రుత్వా రాఘవం ప్రాహ సాదరం
దేవి! తే వర మద్యాఽహం దదామి శ్రుణు సువ్రతే

---

* అత్రేయం గౌతమసంహితాకథాఽనుసంధేయా - తథాహి - "రావణవధానంతరం మందోదరీ విలపంతీ రాఘవాంతిక మేత్య పూర్వసువాసినీత్వ మహం కథం సహిష్యే? ఇతి రుదంతీం తా మేవ మువాచ రాఘవః, త్వద్భర్తృకళేబరస్య దహనేపి తద్దక్షిణ పదాంగుష్ఠమాత్రందగ్ధం నస్యాత్తత

౭ ఇట్లు విలపించుచున్న విభీషణుని మండోదరినిగూడ రామచంద్ర మూర్తి యోదార్చి యిట్లు శాంతివాక్యములను జెప్పదొడగెను.

౮ మండోదరి! దారపుత్రాదులు కాని బంధుగులుగాని తత్త్వ విచారము చేసినచో, అవిద్యామూలకముగా నేర్పడిరి. విచారించినచో నొకనికి నింకొకనికి నెట్టి సంబంధములేదు. ఇది యంతయు మాయామయము, ఈ సంసారమంతయు కల్ల (యని చెప్పెను.)
౯ ఇట్లు మండోదరి శ్రీరామునిచే నోదార్పబడి పిదప నంజలి ఘటించి యిట్లు పలికెను. స్వామీ! నీకుఁ దెలియని ధర్మములేదు. కాని స్త్రీలకు వైధవ్యమనునది కష్టములలో కెల్ల కష్టమైనది. దానిని నేనెట్లు సహింపగలనా యని దుఃఖపడుచుంటినని పలికెను.
౧౦-౧౧-౧౨ రామచంద్రా! పరస్త్రీనిగన్నెత్తి నీవు చూచి యెఱుగనందున నిట్టి నిన్నుగన్న నీ తల్లిదండ్రులు ధన్యాత్ములగుటయేకాక నీ వంశము గూడ ధన్యమయ్యెను. రామచంద్రా! నీకు నమస్కారము భర్తతో గూడ సహగమనమునకు ననుజ్ఞనిమ్ము. నాకొక వరము నీయవలయును. (ఏమన) నేనీదేహమును వదలుటకై భర్తృచితియందు నేను ప్రవేశించబోవునపుడు నీవు శాంతరూపముతో నా హృదయ పుండరీకమున నివసింపవలయును. ఇదియే నాకోరికయని చెప్పెను.

౧౩-౧౪-౧౫ ♦ మండోదరి చెప్పిన మాట విని రామచంద్రమూర్తి యామె విషయమై కరుణించి యిటులఁబలికెను. అమ్మా! నీకు

---

♦ రావణుని కాష్ఠము చల్లారకుండగ నుండునట్లు—
ఈ విషయమున గౌతమ సంహితా కథ యనుసంధేయము! (అది యెట్లన) రావణవధానంతరము మండోదరి విలపించుచు రాముని సమీపించి నే నెట్లు పూర్వసువాసినీత్వమును (వైధవ్యమును) భరింపగలనని మొరపెట్టగా, రామచంద్రమూర్తి యామెతో నిటుల జెప్పెను. అమ్మా! నీవు దుఃఖింపకుము నీభర్తృశరీరమంతయు చితియందు దగ్ధమయినను పాదాంగుష్ఠము దగులబడకుండ నుండును.

సదాదశాననచితి ర్జ్వలితా స్యా ద్యథా తథా
కరిష్యామి న వైధవ్యం భవతా త్తే తతో ధ్రువమ్
విభీషణ గృహే స్థిత్వా మందోదరి ! మహాశయే
చిరం రాజ్యసుఖం భుంక్ష్వ మాశోకం కురు సువ్రతే
ఇత్యుక్త్వా సాంత్వితా దేవీ జగామ నిజ మందిరం
౧౩-౧౪-౧౫

పశ్చా ద్విభీషణం ప్రాహ రాఘవో ధర్మవత్సలః
మరణాంతాని వైరాణి భ్రాతు ర్దహనసంస్క్రియాం
విధాతుం వ్రజతా దేవ ముక్త స్సోపి గతో ద్రుతం
చకార విధినా పశ్చా ద్దహనాదిక్రియాః పునః
వితీర్య చోదకం తస్మై సాంత్వయిత్వా వధూశ్చతాః
రాఘవస్యాంతికం ప్రాప్యవినీత స్సాంజలిస్స్థితః. ౧౬-౧౭-౧౮

---

స్తత్కాష్ఠనిచయోపి శాంతో నభవేత్, తదగ్ని శాంతౌ తవ వైధవ్యం సంభవేత్, పరంతు సర్వదా మారుతిః కాష్ఠనిచయ మానీయ తస్యాం చితౌ నిక్షిపేత్, యథా తదగ్ని ర్న శామ్యేత్ తథా మారుతినాకరణే తవ పతిః పున స్సజీవో భవే దితి వరం దదౌ, పున రేవ మవోచత్, జన్మ సదా కర్మబద్ధ మేవ, తతో యదా జన్మాభూ త్తదా మృతి రవశ్యంభావినీ భవేత్, తత స్త్వ మపి విచార్య శోకం విముంచతా దిత్యుక్త్వా తదగ్రఏవ మారుతిం సమాహూయ యథోక్త ముక్తవా నితి.

వైధవ్యము లేకుండ నొక యుపాయము జేసెదను. (అది యేమనగా) రావణుని కాష్ఠము చల్లారకుండ నుండునట్లును, ఎల్లప్పుడు మండుచునే యుండునట్లును నేనేర్పాటు చేసెదను (పూర్తిగ నతని కళేబరము దహనమయినచో నీకు వైధవ్యము వచ్చును. అట్లు పూర్తిగ దగులబడకుండగ జేసెదను) నీవు విభీషణుని గృహమునందుండి రాజ్యసుఖము ననుభవింపుము. దుఃఖింపకుము. అని రామచంద్రమూర్తి చెప్పి యోదార్పగా నామె తిరిగి గృహమున కేగెను.

౧౬-౧౭-౧౮ పిమ్మట ధర్మతాత్పర్యముగల రామచంద్రమూర్తి విభీషణునితో నిటులఁజెప్పెను. మిత్రమా! "వైరము మరణము వరకే" యను న్యాయము ననుసరించి యిక విరోధభావమును మరచి మీ యన్నకు దహనాది సంస్కారములను జేయఁ బ్రయత్నింపుము- అని చెప్ప వెంటనే విభీషణుడు వెళ్ళి రావణుని దహనాది క్రియలను జరిపెను. విభీషణుడు రావణునకు తిలోదక పిండప్రదానముల నిచ్చి రావణుని యంతఃపుర స్త్రీల నోదార్చి తిరిగి శ్రీరాముని సన్నిధికి వచ్చి వినీతుడై యంజలి ఘటించి నిల్వబడియుండెను.

---

అందువలన నీ భర్తృకాష్ఠముకూడ చల్లారకుండగ నుండును. చితియందలి నిప్పుచల్లారి పోయినచో నీకు వైధవ్యము సంభవించును. (అనగా దహనకర్మ పూర్తియైన పిదప కాని వైధవ్యమురాదు) ఎప్పుడు రావణుని కాష్ఠ మారిపోకుండగ మా హనుమంతుడు చితిమీదను కట్టెలను బడవేయుచు జూచుచుండును. అందువలన అగ్నిచల్లారదు. హనుమంతుడు కట్టెలను దీసికొని వచ్చి చితిని పడవేయక పోయినచో నీ భర్త తిరిగి సజీవుడగునట్లు నేను వరమునుగూడనిచ్చుచుంటిని, అనిచెప్పి తిరిగి యిట్లు చెప్పెను. అమ్మా! "జాతస్య మరణంధ్రువ"మ్మను న్యాయముచే పుట్టినవాడు చావక మానడు. కావున నీవు బాగుగ విచారించి దుఃఖింపకుమని చెప్పి యామె యెదుటకు హనుమంతుని బిలిపించి తాను జేసిన ప్రతినను హనుమంతునకుఁ జెప్పి రావణకాష్ఠమును జూచుచుండుమని చెప్పెను. అని

మాతలి శ్చ తతో రామం ప్రణమ్యాఽఽజ్ఞా మవాప్య చ
సరథ స్స్వర్గ మగమ ద్గగనేన పథా తదా. ౧౯

తదా సౌమిత్రి మాహేదం వచనం రాఘవః పునః
పూర్వ మేవ మయా దత్తం లంకారాజ్య మిదం పునః
విభీషణాయ తు భవా న్గత్వా తం చ విభీషణం
యథావిధి సమాయుక్తః ప్లవగై రభిషేచయ. ౨౦-౨౧
ఇత్యుక్త స్సోపి గత్వాఽఽశు వానరై స్సహితో ముదా
అభిషేకం చకారాఽఽశు లంకారాజ్యే విభీషణమ్
విభీషణోపి సౌమిత్రిం సుగ్రీవాదీం శ్చ వానరాన్
సత్కృత్య చింతయామాస రాఘవం ప్రతి మానసే. ౨౨-౨౩

ఇహాఽఽగతస్య రామస్య య ద్దాస్యామి న మేస్తి తత్
ఇయం లంకా ఇమే దారా అమీ పుత్రా స్తథా హ్యహమ్
సర్వ మేత త్సతా దత్తం రాఘవేణ న సంశయః ౨౪

ఇతి సంచింత్య సోఽప్యాశు సౌమిత్రిప్రముఖాన్వితః
కాంచి చ్ఛిలాం మారకతీం రాఘవస్యాఽఽసనాయ తామ్
సమానీయాఽఽగత స్తూర్ణం రాఘవాంతిక మాశరః
ఆగత్య ప్రణిపత్యాఽఽహ రాఘవం సాంజలిః పునః
శిలాఫలకఏవాఽస్మి న్భవా నుపవిశే త్ప్రభో. ౨౫-౨౬-౨౭

౧౯ దేవేంద్రుని రథసారథియు కొంచెము స్వస్థతచెంది శ్రీరామచంద్రునకు నమస్కరించి తన రథముతో గగనమార్గముగా స్వర్గమునకేగెను.

౨౦-౨౧ పిమ్మట రామచంద్రమూర్తి లక్ష్మణునిఁబిలచి తమ్ముడా! యింక నాలస్యమేమి? లంకారాజ్యమును విభీషణున కిదివరకే నేనిచ్చి యున్నను విభీషణుని దీసికొనివెళ్ళి సుగ్రీవాది వానరసహితుడవై యథావిధిగాఁ బట్టాభిషిక్తునిఁ జేయుమని చెప్పెను.

౨౨-౨౩ ఇట్లు రామచంద్రమూర్తి చెప్పుటతోడనే వెంటనే సుగ్రీవాది వానరులతో గూడ వెళ్లి విభీషణుని లంకారాజ్యమునకు పట్టాభిషిక్తుని జేసెను. విభీషణుడు పట్టాభిషిక్తుడయి పిదప సుగ్రీవాది వానరులను సౌమిత్రిని గూడ బాగుగ సత్కరించి తనమనమునం దిటుల నాలోచింప దొడగెను.

౨౪ సుగ్రీవాదివానరులను సత్కరించుట కేమి కాని మన లంక కేతెంచి యిట్టి మహోపకారము చేసియున్న రామచంద్రమూర్తి కేమి యిచ్చి వారిని సంతోషపెట్టుదునాయని మనమునందాలోచింప దొడగెను. ఈ లంకారాజ్యమూ రామచంద్రమూర్తియే నాకిచ్చెను. ఈ దారపుత్రాదులు కూడ దిరిగి నాకాయన యిచ్చినవే. నేనుగూడ రామచంద్రునిచే నీయబడినవాడనే. సర్వము శ్రీరామచంద్రునిచే నీయబడినదే. సందియము లేదు. ఏమి యివ్వగలనని యాలోచించెను.

౨౫-౨౬-౨౭ ఇట్లు విభీషణు డాలోచించి యేమియు నీయలేనని నిశ్చయించి లక్ష్మణుడు మొదలగు వారితో గలసి రామచంద్రమూర్తి సమీపమునకుఁ దానువచ్చుచు రామచంద్రమూర్తికి ఆసనముగా వేయవచ్చునని మరకతశిల నొకదానిని వెంటబెట్టించుకొని రామునియొద్ద కేగి నమస్కరించి యిటులఁ బలికెను. రామచంద్ర ప్రభూ! ఈమరకతశిలమీదను తాము కూర్చొని నన్ను ధన్యుని జేయుమని వేడి దాని నీయగా, రామచంద్రమూర్తి యామరకత శిల యొక్క ప్రకాశమును జూచి తమకు గూడ నిట్టిది యుండిన

ఇత్యుక్త్వా సోఽదదా ద్రామో భాస్వంతీం తాం శిలాం పునః
సాభిలాషం దదర్శాఽథ జాంబవా నాహ రాఘవం. ౨౮

ఇంద్రం నేత్రయుగాన్వితం ప్రథమతః పంచాస్య మబ్జోద్భవం
గోత్రా స్వక్షయుతాం శ్చ వేద్మి మదనం చాంగాన్వితంవారిధేః
నీరం వై మధురం శివం సితగళం దామోదరం పింగళం
నూనం వేద్మి రఘూత్తమాఽహ మఖిలం దత్త్వాపహారం వినా.
౨౯

తదాశయం రఘూత్తంసో విదిత్వా తం పునః పునః
సంశ్లాఘ్య మారుతిం ప్రాహ వచనం రాఘవ స్తతః 30

అశోకవనికాం గత్వా రావణస్య వధం పునః
సీతాయై కథయిత్వా మే ప్రతివాక్యం నివేదయ. 3౧

ఏవం రాఘవచోదితః పవనజో లంకాం గతో రాక్షసై
స్సమ్యక్పూజితఏవ భూమితనయాభ్యాశం సమాగత్య తామ్
నత్వా ప్రాహ మహీసుతే రఘుపతి ర్హత్వా దశాస్యం పున
స్సామాత్యం ససుతం ససైన్య మనుజేనాస్తే సుఖీ సార్కజః.3౨

ప్రాహ తే కుశలం రామో లంకారాజ్యే విభీషణం
అభ్యషించ దితి శ్రుత్వా మారుతిం ప్రాహ జానకీ. 33

బాగుండునని మనస్సులో నభిలాషయుండినట్లు మరకతశిలను బరికించి చూచుచుండ, జాంబవంతుడు రాముని హృద్గతాభిప్రాయమును గనిపెట్టి రామచంద్రమూర్తితో నిటులఁ బలికెను.

౨౯ రామచంద్రా! యింద్రుడు రెండుకన్నులతో నుండుటను నేనెరుగుదును. బ్రహ్మదేవుడు పంచముఖుడుగా నున్న సంగతి నాకుఁ దెలియును, పర్వతములకు రెక్కలుండుటను నేను గుర్తెరుగుదును, మన్మథుడు శరీరధారిగా నుండుటకూడ నాకుఁ దెలియును, సముద్ర జలము మధురముగా నున్న సంగతి నాకు దెలియును, శంకరుడు నీలకంఠుడు గాక శ్వేతకంఠుడుగా నుండుట నెరుగుదును. విష్ణుమూర్తి పింగళవర్ణముగలవాడుగా నుండుట నెరుగుదును. నేనిన్నిటి నెరుగుదునే కాని ఇచ్చిన వస్తువుమీద తిరిగి యాశకలవానిని మాత్ర మెరుగననియెను. (అనగా విభీషణునకు నీవిచ్చినదియే కదా యీ రాజ్యైశ్వర్యము, ఈ మరకతశిలమీదను నీకెందుకీ యాశయని భావము.)

30 జాంబవంతుని యభిప్రాయమును రామచంద్రమూర్తి తెలిసికొని యతనిని గొనియాడి పిదప హనుమంతునితో నిటుల బలికెను.

3౧ హనుమంతా! నీవశోకవనమున కేగి రావణవధను సీతకుఁ జెప్పి యామెయొక్క ప్రత్యుత్తరమును నాకు వెంటనే వచ్చి చెప్పుమనియెను.

3౨ ఇట్లు రామచంద్రమూర్తి చెప్పగా, వెంటనే హనుమంతుడు లంకకు వెళ్ళి రక్కసులచే గౌరవింపబడుచు, అశోకవనమున సీతయొద్దకేగి యామెకు నమస్కరించి యిట్లు చెప్పెను. దేవి! రామచంద్రమూర్తి రావణుని సంహరించెను. ఇదియునుంగాక రావణుని పుత్రులను మంత్రులను భృత్యులను వాని సైన్యమునంతను హతమార్చి లక్ష్మణ సమేతుడై సుగ్రీవాది వానరులతో సుఖముగ నుండెను.

33 రామచంద్రమూర్తి నీకుఁ గుశలమును జెప్పుమనియెను. మఱియు రామచంద్రమూర్తి విభీషణుని లంకారాజ్యమునకుఁ బట్టాభిషిక్తుని గాఁజేసెను. ఇట్లు చెప్పగా విని సీత హనుమంతునితో నిటులఁ జెప్పెను.

మారుతే తే ప్రియం కర్తుం న పశ్యామి జగత్త్రయే
నచాఽస్తి ప్రియవాక్యస్య తవ తుల్యంతు కించన. ౩౪

ద్రష్టుం రఘుపతిం శీఘ్ర మిచ్ఛా మ్యహ మిదం వచః
రాఘవాయ నివేద్యాఽఽశు త దాజ్ఞాం మే నివేదయ. ౩౫

ఇత్యుక్తో మారుతి స్సద్యో గత్వా రామం న్యవేదయత్
విభీషణ మథ ప్రాహ రాఘవో దూరదృష్టిమాన్. ౩౬

స్నాతాం నూతనచేలభూషణయుతాం కృత్వా మహీజాం పున
శ్శీఘ్రం మత్సవిధం సమానయ మరుత్సూనుం చ నీత్వా వ్రజ
ఇత్యుక్త స్స విభీషణోఽపి సహితో వాయ్వాత్మజేన ద్రుతం
గత్వా రాత్రిచరీభి రాశు మహిజాం తాం స్నాపయామాస సః.
౩౭

నవ్యాలంకృతిచేలభూషితతనుం భూమ్యాత్మజాతాం తదా
సౌవర్ణే శిబికాభిధే సురుచిరే యానే సమారోప్య తామ్
గుప్తాం వేత్రధరై ర్వ్యధాయ దనుజాధీశానుజ స్సత్వరం
యుక్తో మారుతినా సమానయ దరం శ్రీరాఘవస్యాఽన్తికమ్.
౩౮

ఏతస్మి న్సమయే సీతాం ద్రష్టుకామాః ప్లవంగమాః

శిబికాం పరివార్యాఽథ స్థితా స్తా న్వేత్రధారిణః

న్యవారయం స్త దన్వీక్ష్య రామ స్సౌమిత్రి మాహ సః. ౩౯-౪

౩౪ ఆంజనేయా ! యిట్టి ప్రియవార్తను జెప్పిన నీకుఁదగిన ప్రియవస్తువు నిచ్చుటకు ముల్లోకములలో వెదకినను గన్పడదు. నీ ప్రియవాక్యము నకు సదృశమయిన వస్తువేలేదు.

౩౫ శ్రీరామచంద్రుని నెప్పుడు చూతునాయని కోరికతో నుంటిని. హనుమంతా ! యీ సంగతిని రామచంద్రమూర్తితో జెప్పి యాయన యాజ్ఞను నాకు జెప్పుము.

౩౬ ఇట్లు చెప్పుటతోడనే హనుమంతుడు తిరిగి రామచంద్రమూర్తియొద్ద కేగి సీతయొక్క కోరికను దెలియజేసెను. రామచంద్రమూర్తి విభీషణునితో నిటులఁ బిదపఁబలికెను.

౩౭ విభీషణా ! వెంటనే నీవు హనుమంతుని గూడ దీసికొనివెళ్ళి సీతను మంగళస్నానము చేయించి సర్వాలంకార భూషితురాలనుగా జేయించి నా సమీపమునకు దీసికొనిరమ్ము. అని చెప్పుటతోడనే విభీషణుడు హనుమంతుని గూడ వెంటనిడుకొని వెళ్ళి రాక్షస స్త్రీలచే సీతకు మంగళస్నానము చేయించెను.

౩౮ పిదప సీతను నూతన వస్త్రాలంకార భూషితురాలనుగా జేయించి బంగరు పల్లకినిఁదెప్పించి దానియందుఁ గూర్చుండబెట్టించి పల్లకి వెంట వేత్రధారులుగూడ నుండునట్లు నియమించి తానుగూడ హనుమంతునితోగూడి శ్రీరాముని సన్నిధికి బయలుదేరెను.

౩౯ ఈ సమయమున రాముని సమీపమునకు వచ్చుచున్న సీతను జూచుటకై వానరులందఱును కుతూహలము గలవారయి యామె యెక్కిన పల్లకిని జుట్టడింపగా, పల్లకి వెంటవచ్చుచున్న వేత్రధారులు (బంట్రోతులు) వానరులను దగ్గరకు రాకుండగ దరిమివేయుచుండుటను దూరమునుండి శ్రీరామచంద్రమూర్తి చూచి లక్ష్మణునితో నిట్లు చెప్పెను.

సౌమిత్రేః ప్లవగా స్త్వమీ మహీసుతాం పశ్యంతు తస్మాద్భవా
న్గత్వా భూమిసుతాం వదే త్త్వ మనుజ త్వం పాదచారేణ వై
శ్రీరామాంతిక మేహి సర్వహరయో ద్రక్ష్యంతి చేతి ద్రుతం
ప్రోక్త స్సోపి తథాఽకరో చ్చ హరయ స్తుష్టా స్తథా తత్కృ
తేః, ౪౧

రామాంతికం సమాగత్య పాదచారేణ భూమిజా
నత్వా ప్రాంజలిసంయుక్తా స్థితా తూష్ణీం త్రపాన్వితా. ౪౧
దృష్ట్వా తాం దివిజార్థసిద్ధివిషయే మాయామయీం కల్పితామ్
రామః ప్రాహ తదా త్వవాచ్య వచనా న్యాకర్ణ్య సా జానకీ
సౌమిత్రేఽనల మాశు వై జ్వలయతా త్త్వప్రత్యయార్థం తథా
విశ్వాసార్థ మహం సమస్తజగతా మగ్నిం ప్రవేక్ష్యామ్యరమ్.
౪౨
జ్ఞాత్వా రామమతంతు కాష్ఠనిచయం కృత్వాఽనలం లక్ష్మణో
నిక్షిప్యాఽఽశు తు తత్ర తం పున రలం ప్రజ్వాలయిత్వా స్థితః
పశ్చా ద్భూమిసుతాఽఖిలేషు నితరాం పశ్యత్సు బద్ధాంజలి
ర్నత్వా దేవగణం తతోఽవద దిదం వాక్యంతు ధర్మాశ్రితా.
౪౩
నూనం మే హృదయం సదా రఘుపతే శ్చే న్నాపసర్పే త్తదా
సద్యో మా మనలోఽవతా దితి నిగద్యైవాఽనలం ప్రావిశత్
దృష్ట్వా భూమిసుతాప్రవేశ మనలే హాహేతి చోక్త్వా ముహు
స్తత్రత్యా రఘునందనం బహు మిథ స్సందూషయంతిస్మ తమ్.
౪౪

౪౦ లక్ష్మణా! వానరులు సీతనుజూడ గుతూహలముతోఁ బల్లకిని జుట్టడింప వేత్రధారులు వానరులను దూరముగ వెడలగొట్టు చుండిరి. కాన నీవు వెళ్ళి సీతను పాదచారిణిగానే రమ్మనమని చెప్పిరమ్ము. అప్పుడు వానరులందఱు సీతను జూచుట కవకాశము గలవారగుదురని చెప్ప, వెంటనే లక్ష్మణుడు వెళ్ళి పాదచారిణిగా సీత రామసమీపమునకు రావలసినదని కబురుచేయ, సీతకూడ వాహనమునుండి దిగి పాదచారిణిగా వచ్చుచుండ, వానరులు సీతను జూచి సంతోషించిరి. లక్ష్మణు డట్లుచేయించి నందున కతనిని గొనియాడిరి.

౪౧ సీత పాదచారిణియయి రాముని యొద్దకువచ్చి నమస్కరించి సిగ్గుచే దలవంచుకొని నిల్వబడి యుండెను.

౪౨ రామచంద్రమూర్తి యామెను జూచి యామె దేవకార్యమును సాధించుటకై కల్పిత మయిన మాయాసీతగావునను, నిజమయినసీత యగ్నియందు దాచబడియున్నది గావున, నిజమయినసీతనుగ్రహింప వలయును గావున, మాయాసీతను దుర్భాషణములు మాట్లాడగా, ఆమె లక్ష్మణునితో నిటులఁ బలికెను. లక్ష్మణా! రామచంద్రమూర్తికిని లోకములకు గూడ విశ్వాసము గలుగుటకై యగ్ని ప్రవేశము చేయుదును. నీవు అగ్నిని బ్రజ్వలింప జేయుమని కోరెను.

౪3 లక్ష్మణుడు రాముని యభిప్రాయమును దెలిసికొని వెంటనే కట్టెలను బ్రోగుచేసి దానియందగ్ని నుంచి ప్రజ్వలింపజేసి యూరకుండెను. పిదప సీతాదేవి అందఱును జూచుచుండగా బద్ధాంజలియై దేవతలకును శ్రీగామచంద్రునకు గూడ నమస్కరించి యగ్నిహోత్రునుద్దేశించి యిటులఁ బలికెను.

౪౪ ఓయగ్నిహోత్రుడా! నాహృదయము నిశ్చయముగా శ్రీరామచంద్రమూర్తినుండి యెప్పుడును దొలగకుండ నుండినదేయైనచో నన్ను నీవు దగ్ధము చేయకుండఁ గాపాడెదవుగాక యని పలికి వెంటనే యగ్ని ప్రవేశము చేసెను. సీత యగ్నిప్రవేశము నిటులజేయుచుండుటనుజూచి సహింపలేక వానరులందఱు రామచంద్రమూర్తిని మెల్లగా దూషింప మొదలిడిరి.

అంబరే సంస్థితా దేవాః ప్రాహు స్తా మైకకంఠ్యతః
పరిశుద్ధాం తతోఽగ్ని శ్చ శుద్ధసత్త్వమయీం శుభాం
ధృత్వా కరేణ రామాయ స్వయ మేవ దదౌ పునః. ౪౫

పశ్చా త్స్థితేతు విమానగా హరిహరబ్రహ్మాదయో దేవతా
గంధర్వోరగకిన్నరా శ్చ పితరో దేవర్షయో గుహ్యకాః
సర్వే ప్రాంజలయోఽబ్రువ న్రఘుపతిం కర్తా చ భర్తా భవా
న్సంహర్తా జగతాం హరి స్త్వ మసి తద్బ్రహ్మ త్వ మీశో
భవాన్. ౪౬

త్వన్మాయావృతచేతసాం త్వ మధికం దృష్టోఽసి మర్త్యాకృతి
స్త్వన్నామస్మరతాం భవా న్రఘుపతే సందృశ్యతే చిన్మయః
మాయాతీత మనంత మాదిరహితం యోగీశసంసేవితం
నిత్యం శుద్ధ మధీశ మీశ మనఘం శ్రీరామచంద్రం స్తుమః.
౪౭

స్తుత్వైవ మాత్మభూ ముఖ్యా యయుః కేచి త్పదం నిజం
విమానసంస్థితం వీక్ష్య పితరం రఘునందనః
ప్రణనామ తత స్సోపి రాఘవం ప్రాహ తత్పితా. ౪౮

తారితోఽహం త్వయా వత్స దుస్తరా ద్భవసాగరాత్
కులం ధన్య మభూ ద్రామ ధన్యా మాతా త్వయా ధ్రువం
ఇత్యుక్త్వా సో ప్యగా త్పశ్చా ద్వాసవం ప్రాంజలిం తదా

౪౫ అప్పుడు గగనమున విమానములలో నున్న దేవతలందఱును సీత మహాపతివ్రత యనియు పరిశుద్ధు రాలనియు ఏకకంఠ్యముగా జెప్పిరి. పిదప శుద్ధసత్వ ప్రధానురాలుగఁ దనలోనున్న నిజమైన సీతను అగ్నిహోత్రుడు నిజరూపముతోఁ జేతితో నామెను దిసికొనివచ్చి రామచంద్రమూర్తి యొక్క తొడలో గూర్చుండబెట్టెను.

౪౬ పిదప నంతరిక్షమున విమానములలో నున్న బ్రహ్మేంద్రాది దేవతలును గంధర్వులును నాగులు కిన్నరులు పితృదేవతలు దేవర్షులు గుహ్యకులు వీరలందఱును ప్రాంజలులై శ్రీరామచంద్రమూర్తి నిటుల స్తుతించిరి. రామచంద్రా! సమస్త జగత్తులకుఁ గర్తవు భర్తవు సంహర్తవు గూడ నీవే యయియుంటివి. బ్రహ్మవు నీవే శివుడవు నీవే సుమా!

౪౭ రామచంద్రా! నీ మాయచే నావరింపబడిన వారలకు నీవు మానవుడవుగాఁ గన్పడుదువు. నీ నామమును సర్వదా స్మరించువారలకు నీవు సచ్చిదానందమయుడవై గోచరించెదవు. నీవు మాయాతీతుడవును, ఆద్యంతరహితుడవును, యోగీంద్రసేవితుడవును, నిత్యశుద్ధబుద్ధముల స్వరూపుడవును, సర్వలోకేశ్వరుడవు నయియుంటివి. ఇట్టి నిన్ను మేము స్తుతింపుచున్నాము.

౪౮ ఇవ్విధముగా బ్రహ్మాదులు స్తుతించి రాముని శెలవొంది తమ తావుల కేగిరి. విమానమునుమీదను దేవతలతో గూడ రామరావణ యుద్ధమును జూచుటకై దశరథుడు గూడ వచ్చి యంతరిక్షమున నుండెనుగాన, రామచంద్రమూర్తి తండ్రియయిన దశరథుని. పైన విమానమునఁ జూచి నమస్కరించెను. అప్పుడు దశరథుడు రామచంద్రమూర్తితో నిటులఁబలికెను.

౪౯-౫౦-౫౧ రామచంద్రా! నీవలన నేను దుస్తరమయిన భవసాగరము నుండి తరింపజేయబడితిని. నీ వలన వంశమంతయు ధన్యమయ్యెను. మీ తల్లి ధన్యురాలయ్యెను. అని చెప్పి దశరథుడు సంతోషముతో విమానముతో జరిగి స్వర్గమున కేగెను. తన కెదురుగాఁ బ్రాంజలియైయున్న దేవేంద్రునితో రామచంద్రమూర్తి యిటులఁజెప్పెను.

రాఘవః ప్రాహ శక్ర! త్వం సుధావృష్ట్యా ప్లవంగమాన్
నిహతా స్జీవయ క్షిప్ర మిత్యుక్తో మఘవాపి సః॥
సుధావృష్ట్యా మృతా న్సర్వా స్జీవయామాస వానరాన్.
౪౯-౫౦-౫౧

అదృష్ట్వైకం కపిం రామో మారుతిం ప్రాహ సాదరం
నదృశ్యతే కపి స్త్వేకో వానరేషు భవా న్వినః
జానాతి చే ద్వదే త్యుక్తః ప్రాహ తం మారుతిః పునః
కుంభకర్ణేన తు పురా భక్షితోఽభూ త్సవానరః
తం హరిం ప్రేషయే త్యాజ్ఞాం దదౌ రామో యమంత్వథ
తథా సోప్యకరో ద్రామశక్తిం తే తుష్టువు ర్బహు.
౫౨-౫౩-౫౪

తత స్సర్వే సురా నత్వా రాఘవం తు తదాజ్ఞయా
స్వం స్వం పద మవాపు స్తే కీర్తయంతో రఘూత్తమం. ౫౫

ఇత్యాశ్చర్యరామాయణే యుద్ధకాండే
ఏకవింశ స్సర్గ స్సమాప్తః.



దేవేంద్రా! యమృతవర్షమును నీవు కురిపించి యుద్ధములో చచ్చి పోయిన వానరుల నందఱను బ్రతికింపుమనగా, దేవేంద్రుడు సంతోషముతో అమృతవర్షమును గురిపించి హతులయిన వానరుల నందఱిని బ్రతికింపజేసెను. (వానరులను జచ్చిపోయినవారి నందఱను నొక గుట్టగాబడవేసి యుంచిరనియు, చచ్చిపోయిన రక్కసులనందఱను దీనికొనిపోయి సముద్రములో బారవేసిరనియు, అందువలననే రక్కసు లెవ్వరును అమృతవర్షముచే బ్రతుకలేదనియు దెలియదగినది)

౫౨-౫౩-౧౪ వానరులందఱు బ్రతికిరి కాని యొక వానరుడు మాత్రము కన్పడనందున శ్రీరామచంద్రమూర్తి యా కన్పడని వానరుని విషయమై హనుమంతుని బ్రశ్నింపగా, ఆ వానరుడు కుంభకర్ణునిచే నమలబడినందున గన్పడలేదని హనుమంతుడు చెప్పగా, ఆ వానరుని బంపుమని యమునకు రామచంద్రమూర్తి యాజ్ఞనివ్వగా, యముడును రామాజ్ఞను శిరసావహించి వెంటనే యా వానరునిబంపగా, రాముని శక్తి సామర్థ్యములనుగూర్చి యా వానరులందఱును బహువిధముల స్తుతించిరి,

౫౫ పిదప, ఇంద్రాదిదేవతలు రామునకు నమస్కరించి యనుజ్ఞనొంది రామచంద్రమూర్తిని గొనియాడుచు దమదమ పదవులకేగిరి.

ఆశ్చర్యరామాయణమున యుద్ధకాండమున
ఇరువది యొకటవ సర్గము సమాప్తము.



## ద్వావింశస్సర్గః

రాఘవో మంగళస్నానం విధాతుం ప్రార్థిత స్తతః
విభీషణేన సంస్మృత్య భరతం నేచ్ఛతిస్మ సః. ౧

విభీషణోఽపి ధర్మాత్మా రాఘవప్రేరిత స్తతః
ఆనయామాస సచివైః పుష్పకం సమలంకృతమ్. ౨

తత స్తేన సమాజ్ఞప్తా స్సర్వే తే ప్లవగాః పునః
విమానం పుష్పకం దివ్యం సమారురుహు రద్భుతమ్. ౩

విభీషణోపి తద్యాన మారురోహ తదాజ్ఞయా
ఆరురోహ తత శ్శీఘ్రం రాఘవోపి ముదాఽన్వితః
సీతయా లక్ష్మణేనాఽపి సుగ్రీవప్రముఖై రపి. ౪½

పశ్చా ద్రాఘవ మేవ మాహ మహిజా నత్వా వచః ప్రాంజలి
ర్స్నానం మే త్రిజటాఽకరో దుపకృతిం తస్యైఋణస్థాహ్యాహమ్
ఏతస్యై భగవా న్దదాతు వర మిత్యుక్తోఽదదా ద్రాఘవ
స్తస్యై నైకవరా న్ప్రసన్నహృదయ స్సీతావచోగౌరవాత్.
౫½

వైశాఖేఽపిచ కార్తికేఽపిచ తథా మాఘేఽపి తే ప్రీతయే
ఆదౌ తు త్రిదినం కరిష్యతి జన స్స్నానం తథా తర్పణమ్
తత్పుణ్యేన కృతార్థతా ముపగతా త్వం సద్గతిం ప్రాప్స్యసి
ప్రాయ శ్శ్రాద్ధకృత స్త్వదక్షిణతయా పుణ్యం తవ స్యా ద్ధ్రువమ్.
౬½

## ఇఱువది రెండవ సర్గ ప్రారంభము

౧ పిదప విభీషణుడు మంగళస్నానముచేసి బయలు దేరుడని రామచంద్రమూర్తిని ప్రార్థించెను. కాని భరతుడు దీక్షాస్నాతుడు కానిదే తాను దీక్షాస్నానమును జేయుట కంగీకరింపకపోయెను.

౨ పిదప రామచంద్రమూర్తి విభీషణునితో విమానమును దెప్పింపుమని చెప్ప, వెంటనే మంత్రులనుబంపి విమానమును రప్పించెను.

3 పిమ్మట రామచంద్రమూర్తి సుగ్రీవాది వానరులందఱితోఁ బుష్పక విమానము నెక్కుడని చెప్పగా వెంటనే వానరులందఱును అపూర్వమయిన యా దివ్య విమానము నెక్కిరి.

౪ అటుపిమ్మట విభీషణుడు కూడ రామునిచేఁ బ్రేరేపింపబడి పుష్పక విమానము నెక్కెను. పిదప రామచంద్రమూర్తి సీతాలక్ష్మణుల తోడను సుగ్రీవ హనుమ జ్జాంబవ దంగదాదులతోను పుష్పక విమానము నెక్కెను.

౫ పిమ్మట సీతాదేవి రామచంద్రమూర్తితో ప్రాంజలియై యిటుల జెప్పెను. నాథా! యీ త్రిజట నేనశోకవనమునం దున్నప్పుడు రక్కసుల వలన బాధలు లేకుండజేసి మహోపకారమును జేసెను. కావున నీ మెకేమైన వరములను మీరీయవలయునని చెప్పగా సీత యొక్క మాటయందలి గౌరవముచే వా మెకు (త్రిజటకు) అనేకములయిన వరముల నిచ్చెను.

౬ ఆవరము లివియన జెప్పబడు చుండెను. ఓ త్రిజటా! మాఘమాసమున వైశాఖమునందున కార్తికమునందున పెండటి మూడు దినములలో నిన్నుద్దేశించి జనులు స్నానదానాదులను నదీతీరముల యందుఁ జేయుదురు. ఆ పుణ్యము వలననే నీవు కృతార్థురాలవై సద్గతినొంద గలవు.- ఇదియునుంగాక దక్షిణనివ్వకుండగ శ్రాద్ధము చేసిన వాని పుణ్యముకూడ నీకు వచ్చునట్లు వరమిచ్చుచున్నాను.

ఇత్యుక్త్వా త్రిజటాం సతీం చ సరమా మారోప్య తత్పుష్పకే
పశ్చాత్పుష్పకనిర్గమాయ మహీజాజాని స్త్వనుజ్ఞాం దదౌ
నిర్యాతిస్మ తతస్తు పుష్పక మరం రామోపి భూమ్యాత్మజామ్
తత్తత్కౌతుకవేదనేచ్ఛు రవద ద్వాక్యంత్విదం సాదరమ్.
సీతే పశ్య పురీ మిమాం రణభువం పశ్యాఽత్రయుద్ధే మయా
పఙ్క్త్యాస్యో నిహత స్త్వదీయ సహజ స్తత్కుంభకర్ణో మయా
తత్రాహాన్యత తత్సుతోఽత్ర నిహత స్సౌమిత్రిణాత్వింద్రజిత్
తత్రాఽభూత్ఫణిపాశబంధన మపి ప్రాయ స్తు నావాహవే.
౭-౮ ॥

తతోఽబధ్యత సేతుబంధన మపి స్వప్రేయసీం దర్శయ
న్నబ్ధే రేత్య పరం తు పార మసురేశస్యాఽనుజే నేరితః
తస్మాదాశ్వవరుహ్య భూమితనయాజాని గృహీత్వా ధను
స్తస్యాఽగ్రేణ తు తత్ర తత్ర కృతవాం స్తత్సేతుభేదం పునః
౯ ॥

తతఏవ ధనుష్కోటి రితి లోకే ప్రథా హ్యభూత్
తత్తీర్థే మజ్జనం నృణాం సాక్షాత్కైవల్యదాయకమ్
ఇతి తస్మై వరం చాఽపి దదౌ సీతాపతి స్తతః
ఏతస్మి న్నంతరే తత్ర సంపాతి శ్చ సమాగతః ౧౦-౧౧
సంపాతిం రఘునందనోఽపి నితరా మాలింగ్య తం ప్రాహ తం
సేతా వత్ర సమాఖ్యయా తవ కురు త్వం తీర్థ మేకం సఖే
ఇత్యుక్తః ఖగరాట్ తథేతి నిగద న్నాభతుర్విధాతుంముదం
తన్నామ్నా త్వకరోజ్జటాయు రితి త త్తీర్థంపవిత్రం తు సః. ౧౨

౭-౮ ఇట్లుచెప్పి త్రిజటనుగూడ తమతో పుష్పక విమానము నెక్కుమని చెప్పగా, నామెకూడ పుష్పక విమానము నెక్కెను. వెంటనే రామచంద్రుని యాజ్ఞచే సరమకూడ పుష్పక విమానము నెక్కిన పిదప, విమానము బయలుదేరుట కాజ్ఞనిచ్చెను. పిమ్మట రామచంద్రమూర్తి సీతనుగూర్చి యాయా కౌతుకములను (వినోదములను) దెలియజేయ నిచ్ఛతో నిటుల బలికెను. ఓ జానకీ! లంకాపురము నంతను జూడుము. ఇదిగో రణభూమి. యుద్ధములో నిచ్చటనే రావణుని జంపితిని. ఆ స్థలమున రావణ సోదరుడగు కుంభకర్ణుని జంపితిని. ఇదిగో యీ స్థలమున లక్ష్మణుడు రావణుని సుతుడగు నింద్రజిత్తుని జంపెను. అదిగో నచట సోదరులము మేమిరువురము నాగపాశ బద్ధులమైతిమి.

౯ అదిగో సముద్రములోని సేతువు, ప్రేయసీ చూడుమని చెప్పునంతలో సముద్రపు టవతలియొడ్డునకు విమానముచేరెను. అప్పుడు విభీషణుడు సేతువును తెగగొట్టుమని తనను ప్రేరేపింప, రామచంద్రమూర్తి పుష్పకమునుండి దిగి ధనుస్సును చేతబట్టి యాధనుష్కోటితో (ధనస్సుయొక్క అగ్రముతో) సేతువునచ్చటచ్చట భేదించెను.

౧౦-౧౧ కావుననే ధనుష్కోటియని యిప్పటికిని లోకమున ప్రసిద్ధిగలిగెను. ఆ తీర్థమున స్నానము చేసిన వారలకు కైవల్యము చేకూరునని యా ధనుష్కోటికి రామచంద్రమూర్తి వరమునుగూడ నిచ్చెను. ఈ సమయమున సంపాతి యచ్చటికి వచ్చెను.

౧౨ రామచంద్రమూర్తి సంపాతిని కౌగలించుకొని యిటుల బలికెను. ఓ పక్షిరాజమా! నీ పేరుతో నిచట నొక తీర్థమును గల్పింపుమని చెప్ప సంపాతియు "తథాస్తని" చెప్పి తన సోదరునకు సంతోషము కలుగుటకు నతని పేరుతో జటాయుతీర్థ మను నొక పవిత్ర తీర్థమును గల్పించెను. (ఇప్పటికిని జటాయుతీర్థమని యనునది కన్పించును)

సంపాతిం త్వథ పుష్పకే రఘుపతి స్త్వారోప్య సీతాం పున
స్తత్ర కౌతుకదృశ్యజాత మపి తాం సందర్శయం స్తత్క్షణే
రామేశాంతిక మాగతో ఽవనిజయా సాకం శివం సేవితుం
తస్మా దాశ్వవరుహ్య భూమితనయాముఖ్యై ర్వృతో ఽగా
చ్ఛివమ్. ౧౩

గత్వా మారుతినా సుగోపిత మథో విశ్వేశలింగం తు త
ద్రామేశాంతికఏవ భూమి తనయాయుక్తో ఽప్రతిష్ఠాపయత్
రామేశం త్వభిషిచ్య పుష్పక మథాఽఽరుహ్యాఽఖిలై రన్వితః
కిష్కింధాం సముపాగతో ఽవనిసుతాం తాం దర్శయామాస సః.
౧౪

తదా తా న్రాఘవః ప్రాహ సుగ్రీవాదీం స్తు వానరాన్
యూయం ద్రుతం గతా స్సర్వే దారపుత్త్రాదిభి స్సహ
సమాగచ్ఛత చేత్యుక్తా స్తథా చక్రుః ప్లవంగమాః
మానవాకృతయ స్తే ఽథ యాన మారురుహు స్తదా. ౧౫-౧౬

పశ్చా త్తాం ప్రతి దర్శయ జ్జనకజాం కౌతూహలాని క్రమా
ద్గత్వా పంచవటీం ముదాఽవనిసుతాం తాం దర్శయిత్వా చ సః
ప్రాప్యాఽగస్త్యమునే రథాఽఽశ్రమ మరంతత్పుష్పకాద్రాఘవః
ప్రాప్యాఽగస్త్యమునిం విదేహసుతయా నత్వాఽబ్రవీ త్తం
మునిమ్. ౧౭

౧౩ పిదప రామచంద్రమూర్తి సంపాతినిగూడ పుష్పకమునం దెక్కించి పూర్వమునందువలె సీతను నాయా కౌతుకములను జూపించుచు రామేశ్వరమునకు వచ్చెను. అచ్చట పుష్పకమునుండి దిగి రామచంద్రమూర్తి సీతా లక్ష్మణ సమేతుఁడై రామలింగేశ్వర సన్నిధానమున కేగెను.

౧౪ ఇట్లు వెళ్ళి హనుమంతునిచే పూర్వము దాచియుంచబడిన విశ్వేశ్వర లింగమును రామలింగేశ్వర సన్నిధిని రామచంద్రమూర్తి సీతా సమేతుఁడై ప్రతిష్ఠించి రామలింగేశ్వరునకభిషేకము చేసి పుష్పక విమానము నెక్కెను. విమానమతివేగముగ కిష్కింధాపురమునకు రాగా, సీత కా పట్టణమును జూపించెను.

౧౫-౧౬ పిదప రామచంద్రమూర్తి సుగ్రీవాది వానరులతో నిటులఁబలికెను. ఓ వానరులారా! మీరు గృహములకేగి దారపుత్రాదులను దీసికొని త్వరగా రావలయునని చెప్పగా, వానరులు పుష్పక విమానమునుండి దిగి తమ గృహములకేగి తమ దారపుత్రాదులను దీసికొని వెంటనే తిరిగివచ్చి పుష్పక విమానము నెక్కిరి. ఆవానరులు వానర స్త్రీలును మానవరూపములతోనే బయలుదేరి వచ్చుచుండిరి.

౧౭ వారలందఱు నెక్కిన పిదప విమానము వెళ్ళుచుండగా, పూర్వము వలె రామచంద్రమూర్తి సీతకు వినోదములను జూపించుచుండెను. ఇంతలో విమానము క్షణమాత్రములో పంచవటికిరాగా, సీతకు పంచవటిని జూపించెను. ఇంతలో అగస్త్యాశ్రమమునకు పుష్పకము రాగా, అమ్మహర్షిని సందర్శింపదలచి వెంటనే సీతాసమేతుఁడై రామచంద్రమూర్తి యందుండి దిగి యాశ్రమములోనికేగి అగస్త్య మహాముని సందర్శించి నమస్కరించియు నిటుల నమ్మునితో బలికెను.

నూనం తాపసవర్య! తే కరుణయా శత్రుఘ్నోఽభూ న్మయా
ప్రాప్తోఽభూన్మహిజాపున స్తదఖిలం చాభూ త్త్వదాశీర్బలాత్
ఇత్యేవం రఘునందనే తు మునినా సంభాషయ త్యాఽఽశు సా
సీతాఽగస్త్యకళత్రదర్శనకృతే త్వంతః ప్రవిష్టా తదా. ౧౮
లోపాముద్రాపి భూజాతాం సంపూజ్యాఽఽహ సువిస్మితా
భర్త్రా తే విహితే కార్యజాతే సీతే మహాద్వద. ౧౯
ఇత్యుక్త్వా మహిజా తదా ఉత్మనసా సంచింత్య సా ప్రాహ
తామ్, మన్నాథేన కృతేషు కర్మసు మహా ద్వారాంనిధా
బంధనం, సేతో రస్యసుదుష్కరం త్వేద మితి ప్రోక్తా
విహస్యాఽహ సా, మన్నాథం ప్రతి రాఘవోఽవద
దిదం చేదాశ్వయం తం పిబేత్ ౨౦

కుంభజానుజ్ఞయా పశ్చా ద్రాఘవో భూమిజాన్వితః
పుష్పకారోహణం భూయ శ్చకార చ చచాల తత్ ౨౧
భూయోఽప్యాహ వచో రఘూత్తమవిభు స్సీతాం ప్రియాం
పశ్యతో దేతం త్వాశ్రమ ముత్తమస్య మహాత శ్శాంతం
సుతీక్ష్ణస్య తమ్, పశ్యాఽత్రే రిమ మాశ్రమం త మచలం
శ్రీ చిత్రకూటం శుభమ్, జానీహీతి వద న్క్షణే ముని మగా
ద్వాచస్పతే రాత్మజమ్. ౨౨

పుష్పకా దవరుహ్యాఽఽశు రాఘవో భూమిజాన్వితః
సౌమిత్రిణా చ సహితో మునిం ద్రష్టుం సమాగతః. 23

౧౮-౧౯ ఓ తాపసోత్తమా ! నీ కరుణాకటాక్షముచే నేను రావణసంహారము చేయగలిగితిని. సీతను దిరిగి పొందగలిగితిని. ఇంతయేల? ఇతరులు చేయలేని పనులనన్నిటిని నేను చేయగల్గుట యనునది నీ యాశీః ప్రభావమేయని రామచంద్రమూర్తి యగస్త్యునితో సంభాషించుచుండ, సీతాదేవి లోపలికివెళ్ళి యగస్త్యుని ధర్మపత్నియగు లోపాముద్రను గలిసి సంభాషించుచుండ, ఆమె "నీ భర్తచేసిన పనులన్నిటిలోను గొప్ప ఘనకార్యము నొకదానిని నాకుం జెప్పు"మని యడిగెను.

౨౦ ఇట్లు లోపాముద్ర యడుగగా సీత కొంత తడవాలోచించి (రావణసంహారము చేసెనని చెప్పినచో నాభర్త యచటకువచ్చి యాదిత్యహృదయము నుపదేశించుటవలనగదా యాపనిని నీభర్త చేయగలిగెనని యామె యనునేమోయని యాలోచించి) ఇతరులు చేయలేని సేతుబంధనమును సముద్రమున నాభర్త చేసెను. ఇది ఘన కార్యము కాదా! యని సీతయనగా లోపాముద్ర నవ్వి "నీ మగ డెంత తెలివితక్కువవాడమ్మా ! నా భర్తతో మాటమాత్రము చెప్పితే సముద్రము నాపోశనము పట్టివేయును గదమ్మా ! ఈభాగ్యమున కింత ప్రయాసపడెనా" యని యామె నవ్వెను.

౨౧ పిదప రామచంద్రమూర్తి యగస్త్యునియొద్ద శలవుతీసికొని సీతాసమేతుడై పుష్పక విమానము నెక్కగా నది తిరిగి బయలుదేరెను.

౨౨ తిరిగి పూర్వమునందువలె రామచంద్రమూర్తి సీతను వినోదములను జూపించుచు నిటులం బలికెను. ప్రేయసి ! యిదిగో చూడుము; ఇది యగస్త్య శిష్యుడయిన సుతీక్ష్ణమహర్షి యొక్క యాశ్రమము సుమా ! ఈ యాశ్రమము కడు రమ్యమైనదియును, శాంతమయినదియునై యున్నదని చెప్పుచుండగనే విమానము చిత్రకూటమునకు రాగా రామచంద్రమూర్తి చిత్రకూటపర్వత మిదిగో ! చూడుమని సీతతో జెప్పుచుండగనే విమానము భరద్వాజాశ్రమమునకు వచ్చెను.

౨3 పిదప రామచంద్రమూర్తి సీతాలక్ష్మణులతో గూడ పుష్పక విమానమునుండి దిగి భరద్వాజమహర్షిని సందర్శించుటకయి యాశ్రమములోనికి వచ్చెను.

భరద్వాజమునిం నత్వా సీతయా లక్ష్మణేన సః
ఆతిథ్యాయాఽర్థిత స్తేన తదా పరిజనై స్సహ. ౨౪

పూర్ణే చతుర్దశే వర్షే పంచమ్యాం రఘునందనః
తన్మునే రాశ్రమం త్యాగా త్సోఽపి నిర్మాయ భూతలే
స్వర్గభోగాం శ్చకా రాఽఽయ మాతిథ్యం రాఘవస్య త
త్పరివారస్య చాఽథా ఽఽహ రాఘవ స్తన్మునిం వచః, ౨౫

భ్రాతా మే కుశలీ కి మద్య భరత స్తత్క్షేమవార్తా త్వయా
జ్ఞాతా కిన్ను యదాకదాచి దపివా మహ్యాం వద త్వం మునే
ఇత్యుక్తో ముని రాహ తం రఘుపతిం క్షేమాన్వితోఽ స్త్యేవసః
త్వ య్యత్యు త్తమభ క్తిభా జ్మ్నని రివాఽతిష్ఠ త్సదా త్వన్మనాః.
౨౬

శ్రుత్వాతద్వచనం ద్రుతం పవనజం త్వాహూయ తం ప్రాహ
సః, స్మృత్వా భ్రాతృవచ స్త్వ మద్య గతవా న్నన్దిగ్రామే
దరస్యాఽంతికం, నత్వా బ్రూహి మదాగతిం త్విహ జయం
సర్వత్ర తం ప్రత్యరం, కైకేయీతనయస్య తస్య వదతా
త్ప్రత్యు త్తరం మే పునః. ౨౭

కించాఽధ్వ న్యపి శృంగిబేరనగరే దృష్ట్వా గుహం మత్సఖమ్
క్షేమం మే వదతా త్సమాగతి మిహప్రోక్త్వా గుహేన ద్రుతమ్
సాకేతం ప్రతి గచ్ఛతా త్త్వ మితి తప్రోక్తో ద్రుతం నిర్గత

౧౪ రామచంద్రమూర్తి సీతాలక్ష్మణసహితుడై భరద్వాజమునిని సందర్శించి నమస్కరింపగా, అమ్మహర్షియును సపరివారముగా రామచంద్రమూర్తిని ఆతిథ్యమున కాహ్వానించెను.

౧౫ రామచంద్రమూర్తి భరద్వాజాశ్రమమునకు చేరిన దినమునకు పదునాలుగు సంవత్సరములు పూర్తియయ్యెను. చైత్రశుద్ధ పంచమీ దినమునకు భరద్వాజాశ్రమము చేరెనని తెలియదగును. భరద్వాజమహర్షి తన తపస్సును గొంత వ్యయముచేసి స్వర్గభోగముల నన్నిటిని తన యాశ్రమమున గల్పించి రామచంద్రమూర్తికి వారి పరివారమునకు నాతిథ్యమును జేసెను. పిదప రామచంద్రమూర్తి భరద్వాజమునీంద్రునితో నిటులఁ బలికెను.

౧౬ ఓ భరద్వాజమునీంద్రా ! నా సోదరుడుడగు భరతుడు సుఖముగానున్నట్లు వాని కుశలవార్తయేమైన మీకు, దెలియునా? ఏప్పుడైనను మీకు వాని కుశలవార్త తెలిసినచో నాకు జెప్పుమని యడుగగా, భరతుడు నీయందత్యుత్తమమయిన భక్తితో నుండెననియు, నీవలె తాపసవేషముతోనే జటావల్కలములను ధరించియుండెననియు, క్షేమముగానుండెననియు జెప్పెను.

౧౭ భరద్వాజుని మాట విని రామచంద్రమూర్తి పూర్వము భరతుడు తనతో చిత్రకూటమున జెప్పిన మాట (రామచంద్రా ! పదునాల్గవ సంవత్సరము చివరదినమున నీవు అయోధ్యకు రానిచో నేనగ్నిప్రవేశము చేసెదని చెప్పిన భరతుని మాట) జ్ఞప్తికి వచ్చి తనరాక యతనికి దెలియపరుపక పోయినచో నగ్నిప్రవేశము చేయునేమో యని భయపడి వెంటనే హనుమంతుని బిలచి నీవయోధ్యకేగి నేనిచటకు వచ్చినట్లును, సర్వత్ర విజయము గలిగినట్లును భరతునకు వెళ్ళి చెప్పి యతడు చెప్పెడి ప్రతి వచనమునుగూడ నాకు జెప్పుమనియెను.

౧౮ మఱియు రామచంద్రమూర్తి హనుమంతునితో నిటులఁ జెప్పెను. హనుమంతా ! నీవయోధ్యకుఁబోవు మార్గములో శృంగిబేరపురమను నది కన్పడును. ఆ పురములో గుహుడను నా స్నేహితుడు కలడుఁ అతనిని నీవు కలిసికొని నా క్షేమమును, ఇచ్చటకు నారాకనుగూడ.

స్వామీరి స్తు పథాఽంబరేణ గతవాం స్తచ్ఛృంగిబేరం పురమ్.. ౨౮

స్థిత్వా చాఽంబరఏవ తద్గుహ మథాఽఽహూయాఽఽహ తం మారుతిః, శ్రీరామః కుశలీ సఖా తవ భరద్వాజాశ్రమే తిష్ఠతి, త్వా మేవం కథనీయ మిత్యభిహితో వచ్మీ త్యుదీర్యాఽశు త, త్సాకేతం ప్రతి సత్వరం పవనజ స్త్వేక క్షణేఽగా ద్ద్రుతమ్. ౨౯

య త్రైతావ దువాస రాఘవపదద్వంద్వార్చనాస క్తిమా న్కైకేయీతనయో జటాజినధరో రామో యథా తాపసః నందిగ్రామ ముపేత్య తత్పురసమీపస్థం తు తం మారుతి ర్దృష్ట్వాకోటిజనాం శ్చ తత్రమిళితా న్వేత్తుం తు తత్రాఽఽగతః. 30

పూర్ణేఽబ్దేపి చతుర్దశే రఘుపతే రాగత్యభావా ద్ద్రుతం కై కేయీతనయోఽపి పూర్వవచసో భంగా ద్భియా సోఽనలే దేహం త్యక్తుమనా శ్చితిం చ నితరాం కాష్ఠై ర్విధాయాఽ నలం, నిక్షిప్యాఽథ నిశాముఖస్య సమయం వీక్ష న్నథాఽఽహాఽనుజమ్. 3౧

మన్యేఽహం నిహతౌ దశాస్యహతకేనాఽఽర్యారణేరాఘవౌ సర్వే రాజసుతా స్తదర్థమనుజ! ప్రాయ స్త్విహాకారితాః

జెప్పి యటుపిమ్మట నయోధ్యకుఁబొమ్ము, అని చెప్పగా, వెంటనే హనుమంతుడు బయలుదేరి గగన మార్గమున నే పోవుచు క్షణములో శృంగి బేరపురమునకు వచ్చెను.

౨౮ హనుమంతు డంతరిక్షముననుండియే గుహునికేక వేసి యిట్లు చెప్పెను. ఓ గుహుడా! నీ మిత్రుడగు రామచంద్రమూర్తి కుశలముగా నుండెను. ఇప్పుడు సీతాలక్ష్మణులతోడను మిత్ర పరివారములతోడను భరద్వాజాశ్రమమునకు వచ్చి కుశలముగా నుండెను. నీతో నిట్లు చెప్పవలసినదిగా రామచంద్రమూర్తి చెప్పెను గాన నేను జెప్పుచున్నానని చెప్పి క్షణములో నచటినుండి యయోధ్యకు వెళ్ళెను.

3౦ ఏ నంది గ్రామమున భరతుడు శ్రీరామపాదసేవాసక్తుడై జటా వల్కలములను ధరించి రామునివలె తాపసుడై యుండెనో, ఆ నందిగ్రామమునకు హనుమంతుడు వచ్చుసరికి కోట్లకొలది ప్రజలొక చోట మూగియుండ, ఆ సంగతిని దెలిసికొనుటకై హనుమంతుడు గగనమునుండి క్రిందికి దిగెను.

3౧ (ఆజనమంతయూ నచట మూగియున్న కారణము చెప్పబడు చున్నది. పదునాలుగు సంవత్సరములు పూర్తియయినను రామచంద్ర మూర్తి రాకపోవుటవలన భరతుడు తాను చిత్రకూట పర్వతమున రామునితో జెప్పియున్న మాటకు (నీవు పదునాలుగు సంవత్సరముల చివరిదినమున రానియెడల నగ్ని ప్రవేశము చేసెదనని చెప్పిన మాటకు) భంగమువచ్చునని భయముచే అగ్నిప్రవేశము చేయదలచి కట్టెలతో చితినిగూడ నేర్పరచి యగ్నిని బ్రజ్వలింపజేసి సూర్యాస్తమయమునకై యెదురుచూచుచు శత్రుఘ్నునితో నిటుల జెప్పుచుండెను.

3౨ శత్రుఘ్నా! మన రామలక్ష్మణు లింతదనుక రాని కారణము నాలోచింపగా వారలు దుర్మార్గుడగు రావణునిచే హతులయిరేమో యని తలచుచుంటిని. రావణునకు సహాయముగా బంపదలచియే యీ

సైన్యై స్సాక మరం భవాన్సహ నృపై ర్లంకాం గత స్సత్వరం
సాహ్యం రాఘవయోః కరోతు నితరాం శత్రుఘ్న ? తూర్ణం
వ్రజ. 31

శాంతం పాప మథాఽన్యథాపి సమరే హత్వా దశాస్యంభవా
న్భూజాతాం తు విమోచ్య చైత్య చ పురీం పశ్చాత్తయోః
కర్మతత్, కర్తుం త్వర్హతి పారలౌకిక మహం సూర్యేఽ
స్తగే చాఽనలం, శత్రుఘ్న ! ప్రవిశామి చేతి వచనం
శ్రుత్వా విషణ్ణా జనాః. 33

పౌరా జానపదా నృపాశ్చ జననీ బంధుస్త్రియో మంత్రిణో
భృత్యా స్తం పరివేష్ట్య ఖేదవికల స్వాంతా స్థితా స్తాన్క్రమాత్
ఆశ్వాస్యాథ నదీంగతస్తు భరత స్స్నాత్వా సమేత్యానలం
మాతశ్చాపి నతిం విధాయ చ గురూ నగ్ని ప్రవేశోద్యతః
34

ఏతస్మి న్సమయే సమీరణసుత శ్శ్రుత్వా తు కోలాహలం
కైకేయీతనయోద్యమం చ గగనే స్థిత్వైవ సోచ్చైస్స్వరం
ప్రాహైవం భరత ! ప్రవేశ మనలే త్వం మా కురు త్వం శృణు
భ్రాతా తే రఘునందనోఽవనిసుతాయుక్త స్సమాగా
ద్ధ్రువమ్. 35

సీతా లక్ష్మణసంయుతో రఘుపతి శ్శాఖామృగై స్సంయుత
శ్చాఽఽగత్యాఽద్య తు రాజనందన ! భరద్వాజాశ్రమే తిష్ఠతి

రాజుల నందఱిని నిచటకు రప్పించితిని. నీవు వచ్చిన రాజపుత్త్రులను సైన్యములను వెంటబెట్టుకొని వెంటనే లంకకేగి రామలక్ష్మణులను సాహాయ్యము చేయవలయును. వెంటనే వెళ్ళుము.

33 శివశివా! తమ్ముఁడా! ఒకపక్షమున రామలక్ష్మణులు రావణునిచే హతులేరైన పక్షమున రావణుని మీర లెట్లయినను జంపి సీతను నచటనుండి విడిపించి పురమునకు తీసుకొనివచ్చి పిమ్మట వారి పారలౌకిక క్రియలను నీవు జరుపవలయును. సూర్యుడ స్తమించుట తోడనే నే నగ్ని ప్రవేశము చేయుదును. అని భరతుడు చెప్పు చుండ జనులందఱు విషణ్ణులై యుండిరి.

3౪ ఆసమయమున పురజనులు, సామంతరాజులు, పల్లెలనుండి వచ్చిన జనులు, తల్లులు, బందుగులు, స్త్రీలు, మంత్రులు. భృత్యులు వీరలందరు భరతుని జుట్టుకొని వికలమనస్కులై విచారముతోనుండ, వారలనంఱను భరతుడోదార్చి సరయూనదికేగి స్నానముచేసి వచ్చి గురువులకు, తల్లులకు నమస్కరించి యగ్నిప్రవేశము చేయఁ బ్రయత్నములో నుండెను. జనులందఱు కోలాహలము చేయుచుండిరి.

3౫ ఇట్టి సమయమున హనుమంతుడు నందిగ్రామమునకు వచ్చి జనులందరు నొకచోట మూగియుండుటను జూచియు వారల కోలాహలము ను వినియు దాని కారణమేమని జనుల నడుగగా రామచంద్రమూర్తి రాని కారణమున భరతు డగ్నిప్రవేశము చేయుట కుద్యమించుచుండెనని చెప్పగా విని యచటనుండియే గద్గదస్వరముతో నుచ్చైస్స్వరముతో భరతునిగూర్చి బొబ్బరిల్లునట్లు నిటులఁ బలికెను. ఓ భరతా! ఆగుమాగుము. అగ్నిప్రవేశమును జేయకుము నామాట వినుము. నీయన్న రామచంద్రమూర్తి సీతాలక్ష్మణ సమేతుడై వచ్చెను. ఇది నిజము.

3౬ (రాము డెక్కడనుండెనని యనియెదవేమో చెప్పెదను వినుము.) రామచంద్రమూర్తి సీతాలక్ష్మణులతోడను, వానరులతోడను, వచ్చి యిపుడు భరద్వాజాశ్రమములో నుండెను. భరద్వాజుడు అథ్యతి

ఆతిథ్యాయ నిమంత్రిత స్తు మునినా తత్రాఽస్తి సోఽస్మిన్దినే
శ్వ స్తం ద్రక్ష్యసి రాఘవోఽపి నితరా ముత్కంఠితో వీక్షితమ్
౩౬

తత్స్వామీరివచోఽమృతేన భరత స్సిక్త స్తదా విజ్వరో
నత్వాగ్నిం భరత స్తదుద్యమపరావృత్తిం విధాయాఽఽశు తమ్
నత్వా వాయుసుతం జగాద వచనం వాక్యం ప్రియం త్వీదృశం
వక్తు స్తేఽద్య ఋణీ భవామి సదృశం వస్త్వేవ నాఽభూద్యతః.
౩౭

ఇత్యుక్తః పవనాత్మజోఽపి భరతం నత్వాఽఽహ తం ప్రాంజలిః
సంశ్లాఘ్యా వౌ రఘూత్తమే తవ పునర్భక్తి స్థిస్తా మాదృశైః
ఇత్యుక్త్వా రఘునందనస్య చరితం తం శ్రావయిత్వా థ తం
పృష్ట్వా రామ సమీప మేత్య సకలం తం శ్రావయామాస సః.
౩౮

పశ్చా దాహ నిజానుజం తు భరత శ్శత్రుఘ్న మేవం పున
స్సాకేతేఽనుజ! దైవతాని తు పురే యావం త్యతిష్ఠ న్ద్రితం
తేషాం పూజన మాచరంతు బలిభి ర్నానోపహారై ర్బుధా
స్సర్వత్రాపి పురే త్వలంకృతి మరం కుర్వంతు రాత్రౌ జనాః,
౩౯

మిచ్చుటకై వారల నచట నీదినమున నాపెను. రాని కారణ మిదియే. రేపటి దినమున రామచంద్రమూర్తిని జూడగలవు. నీవెంత కుతూహలముతో నుంటివో నీకంటే వెయ్యిరెట్లెక్కుడుగ, రామచంద్రమూర్తి నిన్నెప్పుడు చూతునాయని కుతూహలముతో నుండెను.

౩౭ ఇట్లు హనుమంతుడు చెప్పగా భరతుడు తద్వాక్యామృతముచే దడుపబడి సంతాపవిముక్తుడై యగ్నికిఁ దిరిగి ప్రదక్షిణ నమస్కారముల నొనర్చి యగ్నిప్రవేశోద్యమమునుండి మరలి హనుమంతుని కెదురుగా వచ్చి నమస్కరించి హనుమంతునితో నిటులఁ బలికెను. ఓ మహాత్మా! ఇట్టి యాపత్సమయమున నిట్టి ప్రియవార్తను జెప్పి కాపాడిన నీకు దగినటుల నీయదగిన వస్తువేదియు నాకు గన్పడ నందున నీకు తప్పక ఋణస్థుడనై యుంటి ననిపలికెను.

౩౮ ఇట్లు భరతుడు పలుకగా, హనుమంతుడును, భరతునకు వందన మాచరించి యంజలి ఘటించి యిటులఁబలికెను. భరతా! రామచంద్రమూర్తియందు నీకున్న భక్తివిశేషమును జూచి మాబోట్లు దానిని నేర్చుకొనవలసియుండెను, నీ భక్తియే కడుశ్లాఘనీయము, అని చెప్పి పిదప రామచంద్రమూర్తి సమాచారమును సవిస్తరముగా భరతునకు వినిపించి యచటనుండి తిరిగి భరద్వాజాశ్రమమున కేతెంచి హనుమంతుడు రామచంద్రమూర్తితో భరతుని భక్తిని తదుద్యమునంతను వినిపించెను.

౩౯ పిదప భరతుడు సోదరుడగు శత్రుఘ్నునితో నిటులఁ జెప్పెను. సోదరా! మన పట్టణములో, ఎన్ని దేవాలయములుండెనో వానిలోని దేవతలకు దెలిసిన బ్రాహ్మణులచే పూజలు చక్కగాఁ జేయించవలయును. ఇదియునుంగాక, పురజనులు పురమునంతను జక్కగ నలంకరింపవలయును. ఇది యంతయు నీరాత్రిభాగముననే జేయవలయును.

సర్వే భృత్యజనా శ్చ వారవనితాః పౌరా స్తథా బ్రాహ్మణా
రాజాన స్స్తుతిపాఠకా శ్శశినిభం శ్రీరాఘవస్యాఽఽననం
ద్రష్టుం మంగళవాద్యపూర్వక మరం నిర్యాంతు రాజ్ఞ స్తథా
శ్రీరామస్య చ మందిరం వితనుతా త్సంశోభితం సత్వరమ్. ౪౦

ముక్తాతోరణ మాలికా నృపపథే కుర్వంతు వీథ్యోఽప్యరం
సిచ్యంతాంచసుగంధివారిభి రలంకుర్వంతు రాజ్ఞో గృహమ్.
శత్రుఘ్నోఽధికరత్న దీపనివహై శ్శోభాయమానాం పురీం
కుర్వంతు ప్రతిగేహ మప్యతులితం సంశోభతా ముత్సవైః ౪౧

శ్రుత్వా తద్వచనం తతః పరిజనా శ్శత్రుఘ్న సంచోదితాః
గత్వా తన్నగరం తదా భృశ మలంచక్రు స్సమంతా త్పునః
ముక్తారత్నమయోజ్జ్వలై ర్బహువిధై శ్చిత్రై ర్ధ్వజై స్తోరణైః
రాజ్ఞో మందిర ముత్తమం రఘుపతే స్సౌధం తథైవాఽఽచ
రన్. ౪౨

నిర్యాంతిస్మతతో ముదా పురజనా శ్శ్రీరామ మన్వీక్షితుమ్
విప్రా శ్చాపి నృపాలకా శ్చ సచివా భృత్యా స్తథాఽన్యే జనాః
అశ్వానా మయుతం తథా రథగజా శ్చాలంకృతా బృందశో
నిర్జగ్ము శ్శిబికాభి రాశు చ తతో రాజాంగనా శ్చ క్రమాత్.
౪౩

నందిగ్రామ ముపాగతా శ్చ సకలా స్తే తత్ర పాయాం పున
శ్శిష్టాయాం కిల కించిదేవ భరతోఽప్యన్వీక్ష్య తా న్సత్వరమ్

౪౦ మఱియు, మంత్రిపరివారాది సమస్త సేవకజనులను వేశ్యలు వంది మాగధులు పౌరులు బ్రాహ్మణులు రాజులు శ్రీరామచంద్రుని సందర్శింప మంగళవాద్యఘోషపూర్వకముగా వెంటనే బయలుదేరవలయును. మఱియు. దశరథమహారాజు పూర్వము నివసించిన రాజభవనమును, వెంటనే శ్రీరామచంద్రుని సౌధమును సర్వాలంకారశోభితమగునట్లలంకరింపవలయును.

౪౧ సోదరా ! రాజమార్గములయందు ముత్యాలతోరణములను రత్నతోరణములను గట్టింపుడు. మఱియు వీధులన్నియు సుగంధిజలములచే దడుపబడు గాక, రాజభవనము రత్నదీపములచే శోభిల్లునట్లు జేయింపుము. పురమునంతను రత్నదీపములచే ప్రకాశింపజేయింపుము. ప్రతి గృహమునందున గూడ నుత్సవములతో శోభిల్లునట్లు చేయింపుము.

౪౨ ఆమాటలు విని శత్రుఘ్నుడు పరిజనులను ప్రోత్సహింప, వారలు వెంటనే నగరమునకు వెళ్ళి పురమునంతను జక్కగ నలంకరింపచేసిరి. ముత్యాలతోరణములచేతను రత్నతోరణములచేతను జండాలచేతను తోరణములచేతను పురమునంతను శోభాయమానముగా జేసి రాజభవనమును రామమందిరమును గూడ నెక్కుడుగ నలంకరింపజేసిరి.

౪౩ పిదప పౌరులందరు మహాసంతోషమునొంది రామచంద్రమూర్తిని సందర్శింపఁ గుతూహలముతో బయలుదేరిరి బ్రాహ్మణులు రాజులు మంత్రులు భృత్యులు, ఇతరులు (పల్లెలనుండి వచ్చిన వారలు) వీరలందఱు గుంపులు గుంపులుగ బయలుదేరిరి. రథగజతురగ పదాతులు పదివేలకు పైగా బయలుదేరిరి. పిదప రాజస్త్రీలు శిబికారూఢులై క్రమముగా బయలుదేరిరి.

౪౪ ఇట్లు వారలందఱు బయలుదేరి నందిగ్రామమునకు కొంచెము రాత్రియుండగనే వచ్చి జేరిరి. ఇట్లు వచ్చిన వారలందఱను భరతుడు చూచి యుషఃకాలమయినదని తెలిసికొని వెంటనే బ్రాహ్మణులతో

ప్రత్యూషే సరయూం గత్వాఽనుజయుతో విప్రైశ్చ సాకం
ద్రుతం, స్నాత్వాఽఽగత్య విధాయ చాఽఽహ్నిక మరం
నిర్గంతు ముద్యుక్తవాన్. ౨౨

ఆశ్చర్య రామాయణే యుద్ధకాండే
ద్వావింశ స్సర్గ స్సమాప్తః.



## త్ర యో విం శ స్స ర్గః

శ్రీరామోపి వినిర్గతోఽథ సహసా ప్రాతః పరస్మి న్దినే
సీతాలక్ష్మణసూర్యనందనముఖై స్తస్మా న్మునే రాశ్రమాత్
ఆరుహ్యైవ విమాన ముత్తమ మథాఽఽగచ్ఛ న్పథాఽ
భ్యంతరే, గ్రామం వీక్ష్య గుహస్య సోఽప్యవతతారాఽ
న్వీక్షితుం తం తతః. ౧

ఏవం సోఽప్యవతీర్యపుష్పకతలా ద్దృష్ట్వా సఖాయం గుహం
తం త్వాశ్లిష్య నివేద్య చాఽఽత్మవిజయం త్వారోప్య తం
వాహనే, కైకేయీ తనయాశ్రమం ప్రతి తతో నిర్గత్య
సీతాపతి, స్త్వాయాతిస్మ విమానతోఽంబరతలే తత్పుష్ప
కాగ్రే స్థితః. ౨

కైకేయీతనయోపి మూర్ధని నిజే నిక్షిప్య తత్పాదుకే
శత్రుఘ్నేన చ మంత్రిభిః పురజనై ర్మిత్రై స్తథా బంధుభిః
సంయుక్తో మహిజాపతే రభిముఖం త్వాగచ్ఛతిస్మాఖిలైః
కించి ద్దూర మపాగత శ్చ భరత శ్శత్రుఘ్న యానదర్శనిమ్. ౩

గూడ సరయూనదికి స్నానమునకేగి స్నానముచేసి వెంటనే వచ్చి ప్రాతఃకాలకృత్యములను నెరవేర్చుకొని రామచంద్రమూర్తి కెదురుగా, వెళ్ళుటకుఁ బ్రయత్నములో నుండెను.

ఆశ్చర్యరామాయణమున యుద్ధకాండమున
ఇరువది రెండవ సర్గము సమాప్తము.

---

## ఇఱువది మూడవ సర్గ ప్రారంభము

౧ శ్రీరామచంద్రమూర్తి మఱుదినము ప్రాతఃకాలముననే సీతా లక్ష్మణ సమేతుఁడై సుగ్రీవాది వానరులతోడఁగూడ పుష్పకవిమానము నెక్కి భరద్వాజాశ్రమమునుండి బయలుదేరి వచ్చుచు మధ్యమార్గమున శృంగిబేరపురము గన్పడఁగా, గుహుని జూచుటకై తాను పుష్పకవిమానము నుండి దిగెను.

౨ ఇవ్విధముగా రామచంద్రమూర్తి పుష్పకమునుండి దిగి తన మిత్రుఁడయిన గుహునిజూచి కౌఁగలించుకొని రావణ సంహారము మొదలగు తన విజయవార్తలను సంక్షిప్తముగా నతనికిఁ జెప్పి యతనిని గూడ దన పుష్పకమునం దెక్కించుకొని నందిగ్రామమునకు వచ్చుచుండెను. ఆ విమానమున ముందుభాగమున రామచంద్రమూర్తి కూర్చొనియుండెను.

3 భరతుడును రామపాదుకలను తన శిరమునందిడుకొని శత్రుఘ్నుఁడు, మంత్రులు, పురజనులు, మిత్రులు, బందుగులు వెంట బయలుదేర తాను రామచంద్రమూర్తి కెదురుగా వచ్చుచుండెను, కొంచెము దూరము భరతుడు వచ్చుసరికి పుష్పక విమానముయొక్క శబ్దము వినబడెను

పశ్చాచ్చంద్రనిభం విమాన మపిసోఽపశ్య న్నహ చ్చాఽంబరే
భూత్వా సోఽంజలిసంయుతోఽంబరతలే తత్పుష్పకాగ్రే స్థితమ్
రామం వీక్ష్య ననామ పుష్పక మథో రామాజ్ఞయా భూతలే
మందం తు ప్రవివేశ రాఘవపదద్వంద్వం ననామాఽథ సః. ౪

పశ్చాద్భూమిసుతాభివందన మరం కృత్వాఽనుజం లక్ష్మణమ్
పృష్ట్వాథో కుశలం చ తత్కథనతో జ్ఞాత్వా ప్లవంగోత్తమాన్
సుగ్రీవ ప్రభృతీ నథాఽఽహ భరత స్సూర్యాత్మజం సాదరమ్
భ్రాతా మే రఘునందనోఽర్కసుత! తే సాహాయ్య జ్జయం ప్రాప్తవాన్ ౫

అస్మాకం ధ్రువ మర్కనందన! భవా న్భ్రాతా భవేత్పంచమ
స్సశ్లాఘ్యైవ మథో విభీషణ మరం సంశ్లిష్య తం ప్రాహ సః
దుష్టారేషు తు కల్పవృక్ష ఇవ భో రాత్రించరేశానుజ!
త్వం త్వేకః పరిదృశ్యసేఽధికగుణో హ్యైత్యేషు ధర్మాశ్రితః ౬

శత్రుఘ్నోఽపి మహీసుతాం రఘుపతి ర్నత్వా స్థితః ప్రాంజలి
స్తంచాప్యంకతలే నివేశ్య భరతంచాఽఽశ్వాస్యపశ్చాదుభౌ
ఆరోప్యాఽపిచ పుష్పకే రఘుపతి స్తత్పుష్పకేణ ద్రుతం
నందిగ్రామ ముపేత్య సోఽప్యవతతారాఽథ స్సమస్తై స్తతః. ౭
ఏవం సోప్యవరుహ్య భూమిసుతయా సాకం గతో మాతరం
నత్వాఽన్యామపి మాతరం రఘుపతి ర్నత్వా చ తాం
కైకయీమ్, నత్వా చాఽఽత్మగురూ న్ప్రణమ్య సకలా

౪ పిదప పూర్ణచంద్రునివలెఁ బ్రకాశించుచు వచ్చుచున్న పుష్పకవిమానము అందున్న రామచంద్రమూర్తియుంగూడ కనపడగా భరతుడు వెంటనే అంజలిఘటించి, యావిమానముయొక్క ముందు భాగమున గన్పడుచున్న శ్రీరామచంద్రునకు నమస్కరింపగా రామచంద్రమూర్తియును భరతునిఁజూచి వెంటనే విమానము నాపించెను. ఆవిమానము మెల్లగా భూమిమీదకు దిగగా, వెంటనే భరతుడు వెళ్ళి రామచంద్రుని పాదారవిందములయందు పడెను. (నమస్కరించెను.)

౫ పిమ్మట భరతుడు సీతాదేవికి వందన మాచరించి, తమ్ముడగు లక్ష్మణుని కుశలమడిగి సుగ్రీవుడు మొదలగు కపివీరుల సంగతి లక్ష్మణుని వలన దెలిసికొని వారల కుశలమడిగి పిదప సుగ్రీవునితో నిటులఁ బలికెను. సుగ్రీవా! నా యన్నయగు రామచంద్రమూర్తి నీ సహాయమువలననే రావణ సంహారము చేసి జయమును బొందగలిగెను.

౬ సూర్యనందనా! (సుగ్రీవా) నీతోఁగూడ మేమయిదుగురు సోదరులము నీవు మాకైదవసోదరుడవు, అని కొనియాడి పిదప విభీషణునితో నిటులఁబలికెను. ఓ విభీషణా! ఈ మెత్త చెట్లలోఁ గల్పవృక్షము జయలుదేరినటుల నీవు రాక్షసులలో నీవొక్కడవే సద్గుణభూయిష్ఠుడవగు ధార్మికుడుగా గన్పడుచుంటివి. అని స్తుతించెను.

౭ పిదప శత్రుఘ్నుడు సీతారాములకు నమస్కరించి ప్రాంజలియై నిల్వబడియుండెను. రామచంద్రమూర్తి భరతశత్రుఘ్నుల నిరువురను తన రెండుతొడలమీదను గూర్చుండబెట్టుకొని వారలను, బుజ్జగించి పిదప వారలను గూడ విమానముమీద నెక్కించుకొని క్షణములో నంది గ్రామమున నందితోఁగూడ నచట దిగెను.

౮ రామచంద్రమూర్తి యిటుల దిగి సీతాసమేతుడయి కౌసల్య మొదలగు తల్లులకు నమస్కరించి పిదప వసిష్ఠాది గురువులకు వందనం

న్వృద్ధా న్ద్విజాంశ్చ క్రమా, దాలింగ్యాఽఽథ సుహృజ్జ
నాంస్తు కుశలం పప్రచ్ఛ నైకాకృతిః. ౮

రాఘవానుజ్ఞయా తత్ర సమంతా దాసనేషు తే
సుగ్రీవప్రముఖా స్సర్వే హ్యుపవిష్టా స్సభాస్థలే. ౯

కైకేయీతనయ స్స్వర్ణరచితే తత్పాదుకే పాదయో
ర్భ్రాతు ర్యోజయతిస్మ భక్తివివశః ప్రాహాఽథ తం ప్రాంజలిః
పూర్వం రాజ్య మిదం త్వయా మయి పునర్న్యస్తం ప్రసాదా
త్తు తే, త స్ని ర్యాతిత మేవ రాఘవ మయా ధన్యా హ్యభూ
భూ న్మే జనిః. ౧౦

య త్పశ్యామి సమాగతం పుర మిదం త్వాం రాఘవాఽహం
పున, స్తే న్మే జన్మ బభూవ సార్థక మిదం కోశం బలం చ
ధ్రువమ్, పూర్వస్మా దధికం కృతం దశగుణం త్వత్తేజ
సేతః పరమ్, త్వం తావ త్పరిపాలయాఽద్య భగవ
న్రాజ్యేఽభిషిక్తః ప్రజాః. ౧౧

భ్రాత ర్మే జననీ త్వయా రఘుపతే నూనం త్వభూ త్సత్కృతా
ద త్తం రాజ్య మిదం దదామి భవతే భూయో యథా మేఽదదాః
భ ర్తవ్యం వృషభేణ భార మధికం వత్సో యథాఽహం విభో
కార్యం భూపరిపాలనం తు భవతా కర్తుం నశక్నో మ్యహమ్.
౧౨

కృచ్ఛ్రాన్నీతసువర్ధితా వసరుహా శ్శాఖోపశాఖాన్వితాః
పుష్పా ణ్యాశు వితీర్య నోఫలతి చే త్తత్స్థాపకస్య ధ్రువమ్

బాచరించి పిదప పెద్దలకు బ్రాహ్మణులకు నమస్కరించి, మిత్రులను కుశలమడిగి తాననేక రూపములతో నందఱిని గౌరవించెను.

౯ పిదప శ్రీరాముని యనుజ్ఞచే సుగ్రీవాది కపివీరులందఱు వారి వారికి దగిన యాసనములయందు సభాస్థలమున గూర్చుండియుండిరి.

౧౦ ఇట్లు వారలందఱు కూర్చుండినపిదప భరతుడు స్వర్ణరత్న భూషితములయిన రామపాదుకలను దీసికొనివచ్చి రామచంద్రమూర్తి పాదములకు దొడిగి భక్తిపారవశ్యమున నిటుల బలికెను. అన్నా నీవు కోసలరాజ్యమును నీవిచటకు వచ్చువరకు నాయందు న్యాసభూతముగా నుంచితివి. నీయనుగ్రహముననే యాపనిని నిర్వర్తించితిని. నాజన్మ సార్థకమయినది.

౧౧ అన్నా! తిరిగి యిచ్చటకు వచ్చిన నిన్ను జూడగలిగినందు వలన నాజన్మ ముమ్మాటికి సార్థకమైన దని తలచుచుంటిని. అన్నా! ధనాగారములు చతురంగ సైన్యము కూడ పూర్వముకంటె పదిరెట్లెక్కువుగ నేను జేసితిని కాని వేఱుగా జేయలేదు. ఈ వృద్ధిని జేయుట యంతయు నీతేజస్సువలన జరిగెను గాని నాప్రభావమేమియు లేదు. ఇటు పిమ్మట రాజ్యాభిషిక్తుడవై ప్రజలను బరిపాలింపుము.

౧౨ అన్నా! రామచంద్రా! నాతల్లియగు కైకను నీవు సర్వవిధముల సత్కరించితివి. నాకు నీవిచ్చిన రాజ్యమును తిరిగి నీకిచ్చుచున్నాను. గ్రహింపుము. నీవు నాకెట్లప్పగించితివో, అటులనే యప్పగించెదను. నీ వీ రాజ్యము చేయకూడదాయని నీవనియెదవేమో, ఆబోతు మోయదగిన బరువును లేగదూడ మోయలేనట్లు, నీచే మోయదగిన యీ రాజ్యపాలన భారమును నేనుగూడ మోయుటకు సమర్థుడను గాజాలను.

౧౩ అన్నా! యింకొక సంగతిని జెప్పెదను వినుము. (ఏమన) లోకములో ఫలాపేక్షచే నతి కష్టముచే నెచ్చటనుండియో మొక్కలను దెచ్చి దొడ్డిలో వేసి పెంచి పెద్దదిగా జేయబడిన వృక్షము శాఖో

యాదృ క్కష్ట మలం భవే ద్రఘుపతే! త్వద్భ్రూరుహస్థాసక
స్తాత స్తే ధ్రువ మాప్నుతే త దధునా కష్టం నచ ద్వాపరః. ౧౩

ఇత్యుక్త్వా ప్రణిపాతపూర్వక మరం తత్రైకయీనందనో
జగ్రాహాఽథ పదారవింద యుగళం శ్రీరామచంద్రప్రభోః
ఇత్యేవం భరతం బ్రువాణ మనఘం శాఖామృగా స్తే పున
స్సుగ్రీవప్రముఖా స్తథా పురజనా శ్చాఽపి స్తువంతిస్మ తమ్.౧౪
కైకేయ్యా గురుణాఽర్థితో రఘుపతిః పశ్చా త్తథేత్యుక్త్వా
ద్రాజ్యం త ద్భరతాత్పునః ప్రతిసమాదాతుం త్వియేష ద్రుతమ్
మాయామానుష వేషధారణవశా చ్చేష్టాం తదీయాం శ్రిత
శ్రీరామోఽప్యురరీచకార యది నో రాజ్యం స్వరాజః కియత్.
౧౫

సర్వేషాం జగతా మధీశితు రిదం రాజ్యం కియ ద్యస్య తు
భ్రూభంగేన జగ ద్వినశ్యతి తథా యస్య ప్రసాదా జ్జనః
ప్రాప్నోతీంద్రపదం తథాపి భజతా మర్థేఽనువర్తేత వై
ప్రాయో మానవచేష్టితం శ్రితజనాభీష్టప్రదానాయ స ౧౬

శత్రుఘ్నవచసా పశ్చా న్నిపుణా శ్శ్మశ్రువర్ధకాః
సుఖహస్తా స్ససేత్యాఽఽశు రామాదీన్పర్యుపాసత. ౧౭

పశాఖలుగా బెరిగి పుష్పించికూడ ఫలింపకపోయినచో, ఆ చెట్టు వేసినవాని కెంతకష్టమో యాలోచింపుము. అట్లనే మన తండ్రియయిన దశరథుడుకూడ నీవనే చెట్టును వేసెను. అభివృద్ధి చెందితివి" రాజ్యపరిపాలన మనెడి ఫలమును నీవు కలుగజేయకపోతివేని నిన్ను బెంచి పెద్దచేసిన నీ తండ్రికికూడ నట్టి కష్టము గలుగును సుమా :

౧౪ ఇట్లు చెప్పి భరతుడు రామచంద్రమూర్తి పాదములను నమస్కారపూర్వకముగా బట్టికొనెను. ఇట్లు శ్రీరామునితో జెప్పుచు రామచంద్రమూర్తికిఁ బ్రణమిల్లుచున్న భరతుని సుగ్రీవుడు మొదలగు వానరోత్తములు వేనోళ్ళతో గొనియాడిరి.

౧౫ ఇట్లు భరతుడు రామచంద్రమూర్తినిఁ బ్రార్థించుటయే కాక కైకయు, వసిష్ఠుడుకూడ, పట్టాభిషిక్తుడవై ప్రజలను బరిపాలింప వలసినదిగా గోరగా, రామచంద్రమూర్తియు "తథాస్తు"ని చెప్పి భరతునివలనఁ దిరిగి రాజ్యమును స్వీకరించుట కంగీకరించెను. శ్రీ రామచంద్రమూర్తి మాయామానుష వేషమును ధరించియుండుటచే మానవచేష్ట ననుసరించి యీ రాజ్యపాలనము నంగీకరించెను. కాని లేకపోయినచో స్వారాజ్యసుఖ మనుభవించు రామునకీ రాజ్య సుఖమన నెంత ! (యనిభావము) (దానిని గూర్చియే క్రిందిశ్లోకమున జెప్పబడు చుండెను)

౧౬ సర్వజగములకుఁ బ్రభువయిన యీ రామచంద్రమూర్తికి, ఈ కోసల రాజ్యమన నిజముగా నెంత ? ఏ మహనీయుని భ్రూభంగ మాత్రముచే సమస్తజగంబులు నశించునో, ఏ మహాత్ముని యనుగ్రహమున జనులు మహేంద్ర పదవిని సయితము పొందగలుగుదురో, అట్టి సకల జగదీశ్వరుడగు రామచంద్రమూర్తికి కోసల రాజ్యమన నెంత ? అయినను దనను భజించువారల కొరకై మానవలీలలను ధరించుచుండును. వారి యిష్టములను నెరవేర్చుచుండును.

౧౭ పిదప శత్రుఘ్నుడు చెప్పగా, నిపుణులును, సుఖహస్తులు నగు శ్మశ్రువర్ధకులు (మంగలులు) రామచంద్రమూర్తి మొదలగు వారికి క్షురకర్మ నాచరించిరి.

స్నాతేఽగ్రే భరతే తథా తదను తత్సౌమిత్రి సూర్యాత్మజ
క్రవ్యాదాంగద వాయుసూనుషు తథా స్నాతే ష్వథో రాఘవః
స్నాత శ్చిత్రసువర్ణభూషణధర స్స్వర్ణాంబరాలంకృతో
బాభాతిస్మ నృపాలవేషవపుషా రాజ్యశ్రియేవార్థితః ౧౮

కౌసల్యా తనయప్రేమ్ణా భూమిజాం వానరాంగనాః
స్నాపయిత్వా స్వయం తాసాం ప్రతికర్మ చకార సా. ౧౯

తత శ్శత్రుఘ్నవచసా సుమంత్రో రథ ముత్తమమ్
ఆనీయ రాఘవస్యాఽగ్రే స్థాపయామాస సత్వరమ్. ౨౦

తత స్త్వయోధ్యాగమనాయ రామః ప్రచోదిత స్తద్భరతేన
సద్యః, తథేతి జగ్రాహ వచ స్తు తస్య, సర్వే ప్యయోధ్యా
గమనాయ సిద్ధాః. ౨౧

సాకేతం ప్రతి నిర్యయౌ రఘుపతి స్త్వారుహ్య తత్స్యందనం
కైకేయీతనయ స్తు రశ్మియుగళం జగ్రాహ తస్యానుజః
ఛత్రం తత్ర సమాదదే వ్యజనధృ త్సౌమిత్రి రాసీ త్తత
స్థిత్వాఽగ్రే వ్యజనం దశాస్యసహజో ప్యన్యద్దధారాఽఽశు సః. ౨౨

ఆరుహ్యాఽర్కసుత స్తదోత్తమగజం నిష్క్రాంతవా న్వానరాః
నిర్జగ్ముః క్రమశ స్తతోఽయుతమదోన్మత్తద్విపై శ్చాఽంబరే
దేవాః కిన్నరసాధ్యచారణ మరుద్గంధర్వముఖ్యా స్తత
శ్శ్రీరామస్యగుణా నపారసముఖాం స్తే తుష్టువు ర్నైకధా. ౨౩

౧౮ భరతుడు ముందు దీక్షాస్నానము చేసినపిదప లక్ష్మణుడు, సుగ్రీవుడు, విభీషణుడు, అంగదుడు, హనుమంతుడును మంగళస్నానముల జేసిరి. పిమ్మట రామచంద్రమూర్తి మంగళస్నానము నాదరించి చీనాంబరములధరించి స్వర్ణరత్నాభరణాద్యలంకృతుడై రాజ్యలక్ష్మిచే వరింపబడెనాయన్నట్లు రాజవేషముతో బ్రకాశించుచుండెను.

౧౯ పిదప కౌసల్యాదేవి పుత్రునియందలి ప్రేమచే సీతాదేవికే కాకమానవస్త్రీరూపములను ధరించిన వానరస్త్రీలకు గూడ మంగళస్నానములను జేయించి తాను స్వయముగ వారలకలంకారముల నలంకరించెను.

౨౦ పిదప శత్రుఘ్నుడు చెప్పగా, సుమంత్రుడు దివ్యమైన రథమును సిద్ధముచేసి తీసికొనివచ్చి రామచంద్రమూర్తి సమీపమున నుంచెను.

౨౧ పిదప నయోధ్యకు బయలుదేరుటకై భరతుడు రామచంద్రమూర్తిని ప్రేరేపింపగా, అట్లనే కానిమ్మని రామచంద్రమూర్తి పలికెను. వానరులందఱు నయోధ్యకు బయలుదేర సంసిద్ధులయి యుండిరి.

౨౨ పిదప రామచంద్రమూర్తి సుమంత్రునిచేఁ దీసికొనిరాబడిన దివ్యరథము నెక్కెను, భరతుడు సారథ్యముచేయుటకై పగ్గములను చేతబట్టెను. ఛత్రమును శత్రుఘ్నుడును చామరమును లక్ష్మణుడును, విభీషణుడు మఱియొక చామరమును బుచ్చుకొని రథముమీద నిల్వబడిరి.

౨3 సుగ్రీవుడు మదపుటేనుగు నెక్కి యారథము వెంట బోవుచుండెను. వానరోత్తములుగానున్న వారలు పదివేల యేనుగుల నెక్కి యతని వెనువెంట బోవుచుండిరి. ఆ సమయమున, ఆకసమున దేవకిన్నర సిద్ధ సాధ్యచారణులు గంధర్వులు దేవర్షులు మొదలగు వారలు రామచంద్రమూర్తిని బహువిధముల స్తుతించుచుండిరి.

పశ్చా త్పైతృగృహే ప్రవిశ్య భరతం శ్రీరాఘవోఽప్యాహ తమ్
నీత్వా మద్భవనం విభీషణ మిమం సూర్యాత్మజం చానుజ,
సౌధే స్వర్ణమయే ప్రవేశయ తయో ర్దారాం స్తథా
బాంధవా, నిత్యుక్తో భరతోఽపి తౌ రఘుపతే స్సౌధం
నినాయ ద్రుతమ్. ౨౪

యచ్చాఽభూ న్మణిబద్ధభిత్తివిలస త్సౌవర్ణ పంకాన్వితా
భూమి ర్యత్ర విరాజతేఽపిచ వనం పుష్పద్రు మైశ్శోభితమ్
యత్ర స్తంభసహస్ర మున్నత మభూ ద్యస్మి న్పున స్స్ఫాటికం
ముక్తాతోరణరత్న దీపనివహై స్సంశోభితం యత్స్థితమ్. ౨౫
యస్మి న్పంజర సంస్థితా శ్శుకముఖా శ్శ్రీరామచంద్రప్రభో
ర్గాయంతిస్మ ముదాఽపదాన మధికం సౌధే తు తస్మి న్పునః
సుగ్రీవ శ్చ విభీషణ శ్చ భరతే నోభౌ తు నీతౌ క్రమా
త్సర్వత్రాఽపిచ దర్శితా వథపున ప్రావేశితౌ తౌ ద్రుతమ్. ౨౬
కైకేయీతనయో విచింత్య గురుణా శీఘ్రం పరస్మి న్దినే
సీతాపత్యభిషేక కార్యకరణం నిశ్చిత్య సూర్యాత్మజమ్
ప్రాహైవం వచనం శ్వ ఏవ భవితా పట్టాభిషేకోత్సవో
దూతా న్ప్రేషయ వార్ధితీర్థ మపిచాఽఽనేతుం నదీవారిచ.
౨౭

* శుకముఖాఇతి – "జయతు కౌశిక స్యాధ్వరం గతో, జయతు రక్షసాం, మారకో హరిః, జయతు గౌతమాహల్యయా స్తుతో, జయతు జానకీ తాతమానితః, ఇత్యాది గీతాః గాయంతి త ఇతి వేద్యమ్.

౨౪ పిదప రామచంద్రమూర్తి పితృభవనమున ప్రవేశించి పిదప భరతు నితో నిటులఁ బలికెను. సోదరా! సుగ్రీవ విభీషణుల నిరువురను దీసికొని వెళ్ళి నా బంగరు మేడలోఁ బ్రవేశపెట్టుము. వారి దార లను బంధుగులను నచటనే ప్రవేశపెట్టుము. అని చెప్పగా భర తుడు వెంటనే సుగ్రీవ విభీషణులను శ్రీరాముని యొక్క దివ్యసౌధమున బ్రవేశపెట్టెను.

౨౫-౨౬ ఏ దివ్యసౌధము మణులచేఁ గట్టబడిన గోడలు గలదియై విలసిల్లు చుండెనో, ఏ సౌధమునందలి ప్రదేశమంతయు బంగరు పూతతో విరాజిల్లుచుండెనో, ఇదియును గాక! యే దివ్యసౌధము పుష్పవాటి కలచే శోభిల్లుచుండెనో, ఏ సౌధమునందలి ముందుభాగము స్ఫటి కపు సహస్రస్తంభములచే విలసిల్లుచుండెనో, ఏ సౌధమున ముత్యాల తోరణములు రత్నదీపములు శోభిల్లుచుండెనో, ఏదివ్యసౌధమునందు బంగరు పంజరములలో నున్న రామచిలుకలు మొదలగు నవి శ్రీరామచంద్ర ప్రభుని * చరిత్రమును గీతములచే గానము చేయుచుండెనో, అట్టి దివ్యసౌధమున సుగ్రీవ విభీషణులను భరతుడు తీసికొనివెళ్ళి ప్రవేశపెట్టెను.

౨౭ భరతుడు వసిష్ఠునితో నాలోచించి మరుదినముననే రామాభిషేక ముహూర్తమును నిశ్చయించి పిదప సుగ్రీవునితో నిటులఁ బలికెను. ఓ మిత్రమా! రేపటిదినముననే పట్టాభిషేకము జరుగును. కాన నీవు దూతలను బంపి చతుస్సముద్రోదకములనుఁ దెప్పింపుము. అని చెప్పెను.

* చిలుకలు మొదలగు నవి గానము చేయుచుండెనో —(ఏమని గానము చేసెననగా) విశ్వామిత్ర యాగరక్షకునకు జయమగు గాక, రాక్షసమారకునకు జయమగుగాక, అహల్యాశాపవిమోచనునకు జయ మగుగాక, జనకసన్మానితునకు జయమగుగాక యని.

ఇత్యుక్త స్తు తథేతి సూర్యతనయో౽ప్యుక్త్వా చతుర్ణాం పున
స్సౌవర్ణా న్కలశా న్వితీర్య వచనం ప్రాహా౽థ తద్వానరాన్
ప్రత్యూషస్య జలం భవద్భి రిహా చా౽౽నేతవ్య మబ్ధి ష్వరం
త్విత్యుక్తా హరయోపి హేమకలశా నాదాయ తే నిర్యయుః. ౨౮

పూర్వాబ్ధే ర్జల మాహర్తుం సుషేణో గతవా న్ద్రుతం
ఋషభో దక్షిణం వార్ధిం పశ్చిమం గవయో౽oబుధిమ్
నళ స్తూ త్తరవారాశిం జగామ క్రమశో ద్రుతమ్
సుగ్రీవప్రేరితౌ పశ్చా జ్జాంబవన్మరుదాత్మజౌ
నిష్క్రాన్తౌ జల మానేతు మాపగాభ్య స్తు సర్వశః. ౨౯-౩౦

గత్వైవం వానరా స్తే౽పి సమానీయ జలం దదుః
వసిష్ఠం ప్రతి శత్రుఘ్నో జలాగతి మువాచ సః
రామస్య మంగళస్నానం కారయిత్వా ద్రుతం మునిః
అభిషేక ప్రయత్నే తు స్థితవా న్మునిభి స్సహ. ౩౧-౩౨

పశ్చా న్మంగళసర్వవాద్యనినదే నిర్గచ్ఛతి ప్రాయశో
దేవే ష్వంబరసంస్థితేషు సకలే ష్వాలోకితుం తూత్సవమ్
ముక్తాభూషిత రత్నదీప విలస త్సన్మంటపాభ్యంతరే
ప్రావే శ్యావనిజాయుతం రఘుపతిం సద్యో౽భ్యషించ ద్గురుః.
౩౩

ఋత్విగ్భి శ్చ తతో ద్విజై శ్చ సచివైః కన్యాభి రప్యంబుభి
ర్దివ్యై రోషధిసద్రసై ర్నృపసుత స్సత్రా౽భిషిక్త స్తదా

౨౮ ఇట్లు భరతుడు చెప్పగా, సుగ్రీవుడు తథాస్తని చెప్పి నలుగురు వానరులను బిలచి వారలకు నాలుగుసువర్ణకలశముల నిచ్చి యిటులఁ జెప్పెను. మీరలు నలుగురు ప్రత్యేకముగా నొక్కొక సముద్రమునకు వెళ్ళి యాసముద్రోదకమును తెల్లవారు సమయమునకు నిచటకుఁ దీసికొని రండని చెప్పగా, వారలు సువర్ణకలశములను దీసికొని బయలుదేరిరి.

౨౯-3౦౪ (ఆ వెళ్ళిన వానరుల విషయమే యిచట చెప్పబడుచున్నది) సుషేణుడు తూర్పుసముద్రమునకు జలమును దీసికొని వచ్చుటకై వెళ్లెను. ఋషభుడను వానరోత్తముడు దక్షిణసముద్రమునకును, గవయుండు పశ్చిమసముద్రమునకును, నళుడు ఉత్తరసముద్రమునకును క్రమముగా వెళ్ళిరి. పిదప సుగ్రీవుడు మహానదీజలములను దీసికొని వచ్చుటకై జాంబవంతుని హనుమంతునిఁ బ్రేరేపింపగా, వారలిరువురును అయిదువందల మహానదులనుండి జలమును దీసికొని వచ్చుటకు బయలుదేరి వెళ్ళిరి.

3౧-3౨ ఇవ్విధముగ వానరులు వెళ్ళి సముద్రోదకమును నదీజలములను గూడ తీసికొనివచ్చిరి. పిదప శత్రుఘ్నుడు సముద్రోదకమువచ్చిన సంగతి గురువయిన వసిష్ఠునితో జెప్పగా వసిష్ఠుడు శ్రీరామచంద్రమూర్తికి మంగళస్నానము చేయించి యభిషేకము చేయు ప్రయత్నములతో మునులతో సిద్ధముగ నుండెను.

33 పిదప సమస్త మంగళవాద్యధ్వనులు బయలుదేరగా, సమస్తదేవతలు రామాభిషేకమును జూచుటకై యంతరిక్షమున విమానములయందుండ, ముత్యాలతోరణములచేతను, రత్నదీపములచేతను విలసిల్లుచున్న రత్నమంటపమున వసిష్ఠుడు సీతాసమేతుడయిన రామచంద్రమూర్తినిఁ గూర్చుండబెట్టి యభిషేకము చేసెను.

3౪ పిమ్మట జాబాలి వామదేవుడు గౌతముడు మొదలగు ఋత్విక్కులును, పిదప బ్రాహ్మణులును, అటు పిమ్మట మంత్రులును కన్యకలును, సముద్రోదకముచేతను, నదీజలములచేతను ఓషధీరసముల

తత్పార్శ్వే పరివారితా ముపగతా స్తే తే క్రమా న్మారుతి
స్సీతాలక్ష్మణకైకయీతనుభవా శ్శత్రుఘ్ననామా తథా. 3౪

ఏతస్మి న్ననుగే కిరీట మతులం రత్నాంచితం సర్వతః
పూర్వం త్వాత్మభువా వినిర్మిత మిదం రామోత్తమాంగే పునః
న్యస్తం మంత్రివరై స్తదా యదధిపై ర్మన్వాదిభి స్తు క్రమా
త్పూర్వై శ్చాఽపి ధృతం బభౌ న శిరసా రాజ్యాభిషేకోత్సవే.
3౫

ఆతప్రతం తు సౌమిత్రి శ్శత్రుఘ్నో వ్యజనం తథా
సౌరిస్తు వాలవ్యజనం హనుమా న్పాదుకే శుభే
విభీషణోఽపరం శ్వేతం వ్యజనం వాలినందనః
తాంబూలపాత్రం జగ్రాహ భరత స్తు తదా పునః
బ్రహ్మానందరసే మగ్న స్సాంజలిః పార్శ్వత స్థితః. 3౬–3౭

పశ్చాచ్చోదిత ఏవ దేవవిభునా వాయు స్తదా కాంచనీం
మాలాం తాం మణిశోభితాం సురుచిరాం శ్రీరాఘవాయాఽద
దాత్, గంధర్వాస్తు జగు స్తదాఽంబరతలే తద్దేవ వేశ్యా
స్తదా, నృత్యం చక్రు రథాఽమరా స్సుమచయం దివ్యం
వవర్షు స్తదా 3౮

భూమి స్సస్యవతీ ద్రుమా శ్చ ఫలినః పుష్పాణి సౌగంధ్యత
స్సంశోభీని బభూవు రుత్తమగుణే రామేఽభిషిక్తే సతి
తత్కాలే రఘునందనో యుత మహాధేనూ స్సహస్రం వృషాణ్
త్రింశత్కోటిహిరణ్యమప్యథ దదౌ పూర్వం ద్విజేభ్య స్తు సః.
3౯

చేతను శ్రీరామచంద్రమూర్తి కభిషేకముచేసిరి. రామచంద్రమూర్తిని పార్శ్వములయందు సీతాలక్ష్మణభరతశత్రుఘ్నులును హనుమంతుడును పరివారములుగా నుండిరి.

౬౫ ఈ సమయమున, పూర్వము బ్రహ్మచే నిర్మించబడి మనువు మొదలునాటివరకుగల సూర్యవంశపు పూర్వరాజులచే పట్టాభిషేక సమయమున తమ శిరస్సుచే ధరింపబడుచు వచ్చుచున్న రత్నకిరీటమును శ్రీరామచంద్రమూర్తియొక్క శిరస్సునందు మంత్రులు తీసికొని వచ్చి పెట్టిరి.

౬౬-౬౭ ఈ సమయమున లక్ష్మణుడు బంగరుగొడుగును, శత్రుఘ్నుడు చామరమును, సుగ్రీవుడు వాలవ్యజనమును, హనుమంతుడు పాదుకలను, విభీషణుడు తెల్లని వింజామరమును, అంగదుడు తాంబూలపాత్రమును ధరించి యచట నిల్వబడియుండిరి. భరతుడు చేతులు జోడించి బ్రహ్మానందరసమున నిమగ్నుడైయుండెను.

౬౮ పిదప దేవేంద్రుడు వాయుదేవునిచే నొక రత్నహారమును బంపగా, వాయుదేవుడా హారమును దెచ్చి శ్రీరామచంద్రమూర్తికంఠమునం దుంచెను. ఆ సమయమున దేవగంధర్వులు గగనమున గానము చేయుచుండిరి. అప్సరసలు నృత్యము చేయుచుండిరి, దేవతలు పుష్పవర్షమును గురిపించుచుండిరి.

౬౯ ఇట్లు రామచంద్రమూర్తి పట్టాభిషిక్తుడు కాగా భూమి సస్యవంతమయ్యెను. వృక్షములు పుష్పములచే ఫలములచే నొప్పుచుండెను. పుష్పములు సుగంధము గలవి యయ్యెను. ఆ సమయమున శ్రీరామచంద్రమూర్తి పదివేల గోవులను, వెయ్యివృషభములను, ముప్పదికోట్ల రామమాడలను (ఆ కాలపు బంగరునాణెములను) బ్రాహ్మణులకు దానముచేసెను.

తత్కాలే౽ంబరవాసినాం దివిషదాం మధ్యే౽జపుత్రస్థితః
పుత్రం రాఘవ మన్వవేక్ష్య తు తదా రాజ్యాభిషిక్తం పునః
ప్రాహైవం రఘునందనం రఘుపతే! ధన్యో౽హ మద్య ధ్రువమ్
య త్పశ్యా మ్యభిషిక్త మద్య తనయం త్వాం రాఘవా౽హం
పునః. ౪౦॥

ఇత్యుక్త్వా రఘునందనేన నితరాం నత్యాదిభి ర్మానితో
దేవై స్సాక మగా త్తతో దశరథ స్స్వర్గం విమానేన సః
పశ్చా త్తద్రఘునందనోపి సకలై స్సన్మానిత స్సర్వథా
నానోపాయనపాణిభి ర్నృపతిభిః పౌరై స్తథా బంధుభిః. ౪౧॥

పశ్చా దాశిష మేత్య భూమిసుతయా సాకం ద్విజేభ్య స్తతో
నత్వోత్థాయ తదాంగదాయ తు దదౌ తన్నామభూషాయుగం
సౌవర్ణం మణివజ్ర భూషిత మథోభూమ్యాత్మజాయై పున
శ్చక్రప్రేషిత హేమరత్నవిలస న్మాలాం దదౌ సస్మితః ౪౨॥

జ్ఞాత్వా భూమిసుతా తదాశయ మరం తాం వాయుసూనో
ర్గళే, ప్రీత్యా న్యస్తవతీ బభూవ హనుమాం స్తత్రత్యరత్నా
న్యరం, ఏకైకం ప్రతిగృహ్య చాద్మదశనై ర్భింద న్నిరీ
క్ష్యా౽థ త, ద్దూరే పాతయతిస్మ తస్య చరితం
దృష్ట్వా౽హాసం స్తే౽ఖిలాః. ౪౩॥

కిమర్థమేవం క్రియతే త్వయా కపే పృష్ట స్తదైవం సదసి
స్థితై ర్జనైః, మరుత్సుతో ప్యాహ చ రామనామవిహీన మేత
న్న మయా ధృతం స్యాత్. ౪౪॥

౪౦౫ ఆసమయమున గగనమార్గమున విమానములయందున్న దేవతలమధ్యను దశరథుడుకూడ నుండెను. ఆ దశరథుడు కుమారుని పట్టాభిషేక మును జూచి సంతోషించి రామచంద్రమూర్తి నుద్దేశించి యిటులఁ బలికెను. రామచంద్రా! పట్టాభిషిక్తుడయిన నిన్ను గన్నులతో నిపుడు చూచుటవలన నేనివుడు ధన్యాత్ముడనయితిని (అని పలికెను)

౪౧౫ ఇట్లు పలుకగా. రామచంద్రమూర్తియు దశరథునకు వందనమాచ రించి స్తుతింప, పిదప దశరథుడు దేవతలతో గూడ విమానముమీద స్వర్గమునకేగెను. పిమ్మట రామచంద్రమూర్తిని సామంతరాజులు, పౌరులు. బందుగులు మొదలగువారలు ధనకనకవస్తువాహనాదులచే సన్మానించిరి.

౪౨-౪౩౫ రామచంద్రమూర్తి బ్రాహ్మణులవలన ఆశీర్వాదమును బొంది లేచి వానరులకు నమస్కరించిన పిదప తనమిత్రులను సత్కరింప మొద లిడెను. మొదట అంగదునకు రత్నభూషితములగు బంగరు బాహు పురులను రెంటినిచ్చి సత్కరించెను. పిదప దేవేంద్రుడు వాయు దేవుని ద్వారా తనకుఁ బంపిన రత్నహారమును సీతకు సాభిప్రాయ ముగా నివ్వగా, ఆమె రామచంద్రమూర్తియొక్క అభిప్రాయమును దెలిసికొని వెంటనే యా రత్నహారమును హనుమంతుని కంఠము నందుంచెను. హనుమంతు డాహారమును మెడనుండి తీసి దానిలోని రత్నముల నొక్కొక్కరత్నమును దంతములతో గొరికి యిటు నటు లోపల పరీక్షించి చూచి యవతల బారవేయుచుండగా, అతని చేష్టనుజూచి సభ్యులందఱు పకపక నవ్వుచుండిరి.

౪౪౫ ఆ సభ్యులలో నొకడు లేచి హనుమంతుని నిటులఁ బ్రశ్నించెను. హనుమంతా! నీ కపిచేష్టలు పోనిచ్చితివి కావుకదా! ఏల నీవిటుల రత్నములను కొరికిపారవేయుచుంటివి? అని ప్రశ్నింప, రామనామము లోపల నున్నదేమో యని పరీక్షించిచూచితిని, లోపల రామనామము లేదు. రామనామములేని యీ రత్నమును ధరింపనిష్టములేక పార వేయుచుంటిననియెను.

రామనామవిహీనం హి తానకం దేహ మద్యతత్
కథం ధరసి చేత్యుక్తో హనుమా నాత్మన స్తదా
హృదయం తు నఖై శ్ఛిత్వా దర్శయామాస తా న్ప్రతి
రామనామాంచితం తస్య హృదయం వీక్ష్య తే జనాః
ప్రశశంసు స్తదాభ క్తిం మారుతే ర్బహుధా పునః
౪౫-౪౬-౪౭

తద్భ క్తే ర్ముదితో௨వద ద్రఘుపతి స్తం కాంక్షితం తే వరం
బ్రూహి త్వం తు దదా మ్యహం పవన జేత్యుక్తో మరున్నందనః
ప్రాహైవం రఘునందనం మమ మన స్త్వన్నామ సంకీర్తనాత్
తృ ప్తిం నోలభ తే తతో రఘుప తే దేహి త్వ మేకం వరమ్. ౪౮

యావ త్థాస్యతి తే కథా మహితలే తావ న్మదీయం విభో
దేహం తిష్ఠతు రామ! మే వర మిమం దేహీతి పృష్ట స్తతః
ప్రాహైవం రఘునందనః పవనజం తే௨భీష్టసిద్ధి ర్భవేత్
కల్పాంతే మమసన్నిధిం పవనజ! త్వం ప్రాప్స్యసే చ ధ్రువమ్.
౪౯

సీతా ప్రాహ మరుత్సుతంప్రతి వచో లోకే మరున్నందన
త్వన్మూ ర్తిం కిల పూజయంతి నితరాం భక్త్యా తు యే మానవాః
భూతప్రేతపిశాచవిఘ్నజభయం న శ్యేచ్ఛ తేషాం ధ్రువమ్
సర్వత్రాపిజయో భవే త్పవనజ త్వం పూజిత స్థాస్యసి. ౫౦

తత శ్శాఖామృగా స్స ర్వే రామచంద్రేణ సర్వథా
అమూల్యాభరణై ర్వస్త్రై ర్మానితా స్తే ముదం గతాః ౫౧

౪౫-౪౬-౪౭ ఓ హనుమంతా! నీ దేహములోపల రామనామము లేదుగదా! నీ దేహమును నీవెట్లు ధరించుచుంటివని ప్రశ్నింపగా, హనుమంతుడు తన వక్షస్థలమును గోళ్ళతోఁ జీల్చి యాసభికులకుఁ జూపింప, అతనిహృదయములోపల రామనామముతో నిండియుండెను. దానిని జూచి యందఱు నాశ్చర్యపడి యతని భక్తిని వేనోళ్ళ గొనియాడిరి.

౪౮ హనుమంతుని భక్తికి సంతోషించి రామచంద్రమూర్తి యిటుల హనుమంతునితోఁ బలికెను. హనుమంతా! నీ యభీష్టమయిన వరమును గోరుకొనుము నేనిచ్చెదనని చెప్ప, హనుమంతుడు రామచంద్రమూర్తితో నిటుల బలికెను. రామచంద్రా! నీ నామమును నేనెంత గీర్తించినను తృప్తిలేకుండనుండెను. కావున నాకొక వరము నిమ్ము. (అది యేదన)

౪౯ రామచంద్రా! నీకథ యెంతపర్యంతము భూమియందుండునో అంతపర్యంతము నాదేహముండునట్లు వరము నిమ్మని యడుగగా రామచంద్రమూర్తి సంతోషించి నీయభీష్టము సిద్ధించుగాక యని వరమిచ్చెను. హనుమంతా! నీవు కల్పాంతము వరకు దేహధారివై పిదప నా సాయుజ్యమును బొందగలవని చెప్పెను.

౫౦ పిదప సీతాదేవికూడా హనుమంతునకీ క్రిందివిధముగ వరములనిచ్చెను. వాయుపుత్రా! నీమూర్తిని భక్తితో నెవ్వరు పూజించెదరో వారలకు భూతప్రేత పిశాచాదులవలనగాని విఘ్నములవలనగాని భయముండకపోవును. ఇదియునుంగాక నిన్ను బూజించినవారలకు సర్వత్ర జయము చేకూరును. నీవు సర్వజనులచే బూజింపబడుచుండగలవు. (అని వరముల నిచ్చెను)

౫౧ పిదప రామచంద్రమూర్తి వానరుల కందఱకు వారివారికిఁ దగినట్లు వస్త్రాలంకారములనిచ్చి సన్మానింపగా వారలు మిక్కిల యానంద భరితులయిరి.

*శ్రీరామో౽థ విభీషణాయతు దదౌ మూలంధనం స్వాన్వయే
శ్రీరంగేశ్వర సంపుటం ప్రతిదినం సంపూజితం స్వాలయే
పూర్వైః పూర్వతమైశ్చ పూజితతమం చేక్ష్వాకు కష్టార్జితం
నత్వారాఘవ మాశు రాక్షసవరో ప్యాదాయ తుష్టావ తం॥ ౨

సుగ్రీవో రఘునందనం ప్రతివచః ప్రాహోచ దేవం ప్రభుమ్
జన్మన్యుత్తరకే తు దేహి భగవద్భక్తిం కళత్రం మమ
ఇత్యుక్తో రఘునందనో౽ర్కతనయం ప్రాహా౽న్యజన్మన్యలం
భర్త్రా మయ్యనురాగిణీ భవతు తే జాయా తు రాధాహ్వయా.
॥ ౩

---

* ఇదమత్రావధేయమ్

"విభీషణ ముపాగతం దశరథాత్మజ స్సద్విధీ స్స్వకీయకులసద్ధనం దిశతి భక్తహృన్మందిరః, నిధాయ నిజమస్తకే నిశిచరోపి రంగస్థలే నిధాయ సముపాగమ ద్బహుళమాత్రపీడార్దితః॥—తదోభయరఘురీస్థలే స్థిర మభూ ద్దశాస్యానుజో; విలోక్య నిజతద్ధనం హృది తతాప దుఃఖార్దితః, హరిం శరణ మీయివాన్ సపది రంగనాథో౽బ్రవీ, న్న తే౽స్తు శుగహం భవా న్కురు మదీయ పూజాం సదా, ఇతి॥

౫౨ * శ్రీరామచంద్రమూర్తి విభీషణున కేమి సత్కరింతునా యని యాలోచించి తమ వంశీకులకందరకు మూలధనముగా నున్నట్టియు తమ పూర్వులచేతను ప్రపూర్వులచేతను పూజింపబడుచు వచ్చుచున్నట్టియు, ఇక్ష్వాకుమహారాజు తపస్సుచేసి విష్ణుమూర్తిని సాక్షాత్కరించి యాయనయొక్క యనుగ్రహముచే సంపాదించి నట్టిదియు నగు రంగనాయకస్వామి సంపుటమును బూజించుకొనుచుండుమని విభీషణున కివ్వగా నతడు గ్రహించి రాముని స్తుతించెను.

౫౩-౫౮ ఆసమయమున సుగ్రీవుడు రామచంద్ర ప్రభువుతో నిట్లు బలికెను. రామచంద్రా! నాకొక వరము నిమ్ము. (అదియేదన) ఈజన్మములో నాకోరిక నెరవేరదుగాన, ఉత్తరజన్మమువందైనను నీ యందనురాగము భక్తియు గల భార్యను నాకు కలుగజేయుము. అని వేడగా నీకోరిక నాకు దెలియును గాన వచ్చెడి జన్మమున రాధ యను నీభార్య నాయందు ప్రేమానురాగములు భక్తియు

---

* విభీషణునకు రంగనాయక సంపుటము నిచ్చినట్లు మఱియొకచోట గూడ గన్పడును. (ఎట్లన) భక్తజనుల హృదయ పుండరీకముల యందు నివసించు శ్రీరామచంద్రమూర్తి విభీషణునియందు దయారసము గలవాడై తమ యిక్ష్వాకు వంశీకులకు కులధనముగా వచ్చుచున్న రంగనాయకస్వామి సంపుటమును విభీషణున కిచ్చినట్లును. ఆ సంపుటమును నెత్తిమీదను బెట్టుకొని లంకకు విభీషణుడు పోవుచుండగా, చోళదేశములో జేరిన శ్రీరంగము వద్దకు వెళ్ళుసరికి మూత్ర విసర్జనమునకు వెళ్ళ నవసరము కలుగగా, ఆదేవతార్చన సంపుటము నచటనుంచి మూత్రవిసర్జనముచేసి తిరిగివచ్చి విభీషణుడు లేవనెత్తగా నచటనుండి రంగనాయకస్వామి కదలనందున మిక్కిలి దుఃఖించుచు, అనేక విధముల స్తుతింపగా, రంగనాయకస్వామి ప్రత్యక్షమయి నాయనా నీవు దుఃఖింపక యిచ్చటికే వచ్చి ప్రతి దినము పూజించి వెళ్ళుమని చెప్పినట్లును, (రాక్షసుల కొక దినము మనుష్యుల కొక సంవత్సరము గాన) యిప్పటికి విభీషణుడు వచ్చి పూజించుచున్నాడని చెప్పబడినది.

తస్మాలా త్త్వం కృతార్థ స్స న్ముక్తిం ప్రాప్స్యసి మాశుచః
ఇతి రామోఽ ర్కజాయాఽ థ దదౌ వర మనుత్తమమ్. ౫౪

జాంబవా న్ప్రాహ రామం తం ప్రాంజలిః పురత స్స్థితః
వృద్ధోఽహ మైహికాపేక్షా నాస్తి మే రఘునందన
దేహి మే ముక్తి మీశ! త్వ మిత్యుక్తో రఘునందనః
ప్రాహ తం త్వన్మనస్సంస్థ మాశయం వేద్మ్యహం ధ్రువమ్
తస్మా త్త్వ మన్యజన్మాంతం పూజయ న్వస మాం తతః
తవ ముక్తిం ప్రదాస్యామి విచారం మాగమ స్సఖే.
౫౫-౫౬-౫౭

మకరధ్వజసంపాతిగుహానా మన్యదుర్లభాం
రామచంద్రో దదౌ భక్తిం వైష్ణవీం తా మచంచలామ్
సర్వేపి వానరా స్తత్ర తేన సంపూజితా ముదా
రామచంద్రం కృపాసాంద్రం తుష్టువు ర్బహుధా తదా
మహర్ష యోఽఖిలా స్సమ్య క్పూజితా స్తేన రాఘవం
తదా ప్రాంజలయ స్సర్వే తుష్టువు శ్చైవ ముత్తమమ్.
౫౮-౫౯-౬౦

గలది యగును. అందువలననే నీవుకూడఁ దరింపగలవు. ఇపుడు విచారపడకుమని పై విధముగ వరము నిచ్చెను. సుగ్రీవున కుండిన కోరిక యేమన) తన భార్యను రామచంద్రమూర్తికి కానుకగా నీయ వలెనని యుండెను. కాని రాము డేకపత్నీవ్రతస్థుడు గాన సంగీక రింపడని యుత్తరజన్మమున నైనను తన కోరిక దీర్చుమని కోరెనని తెలియ దగును.

౫౫-౫౬-౫౭ జాంబవంతుడు పిదప ప్రాంజలియై రామచంద్రమూర్తితో నిటులఁ బలికెను రామచంద్రా! నేను పెద్దవాడనైతిని. ఐహిక భోగములయం దిక నాకు లేదు. నాకు ముక్తిని దయచేయు మని ప్రార్థింపగా రామచంద్రమూర్తి జాంబవంతునితో నిటులఁ బలికెను. నేను రావణునితో యుద్ధము చేయు పుడు నీవు మన స్సులో నిట్లు తలంచితివి. (ఏమన) రావణుడు బాణముతో యుద్ధము చేయుచుండగా రామునిమీద గెలుపుబడితే రాము డేమి చేయగలడని తలంచిన నీతలంపు నాకు దెలిసినను. అందువలన నేను బాహుయుద్ధము చేయగలుగుదునో లేనో నీకు జూపించినగాని నేను నీకు ముక్తినివ్వను. వచ్చే జన్మమునకుదివరకు నీవు నన్ను బూజించుకొనుచుండుము. నీతో యుద్ధముచేసి నా దేహబలమును నీకు జూపి యపుడు ముక్తినిచ్చెదను విచారపడకు మనియెను.

౫౮-౫౯-౬౦ మకరధ్వజుడు, సంపాతి, గుహుడు, ఈ ముప్పురకును రామ చంద్రమూర్తి యచంచలమయిన వైష్ణవభక్తి ననుగ్రహించెను. వానరులందఱు నిట్లు రామచంద్రమూర్తిచేఁ బూజింపఁబడినవారలై పరమకృపాసాంద్రుడగు శ్రీరామచంద్రమూర్తిని బహు విధముల స్తుతించిరి. మహర్షులందఱును రామచంద్రమూర్తిచే సత్కరింపబడి ప్రాంజలులయి యుత్తమ శ్లోకుడగు శ్రీరామచంద్రునిఁ గ్రింది విధముగా స్తుతించిరి.

మిత్రం సూర్యసుతస్య భూరికరుణాపాత్రం పవిత్రం తథా
జానక్యాఖ్యకళత్ర మబ్జవిలసద్గాత్రం సునేత్రం స్తుమః
క్రవ్యాదాన్వయకాల మబ్జవిలసన్మందారమాలం తథా
రామం వాచి రసాల మాశ్రిత వచఃపాలం విశాలం గుణైః. ౬౧

సౌందర్యేణ గుణైర్వాపి రామచంద్రస్య సన్నిభః
త్రిలోక్యాం మృగ్యమాణోపి నాస్తి దేవోఽపరో ధ్రువమ్
ఏవం మహార్ఘయ స్తుత్వా రామచంద్రం తతఃపరం
స్వం స్వం స్థానం గతా స్తస్య కీర్తయంతో గుణాన్పునః. ౬౩
తత స్సర్వే సముత్థాయ రాఘవాహ్వానితా ద్రుతం
ఉపవిష్టా భోజనాయ రాఘవేణ సమం ముదా
అర్ధభుక్తాన్నపాత్రం తు రాఘవస్య మరుత్సుతః
స్వయ మాదాయ తద్భుక్తశేషాన్నం త దద న్ద్రుతం
సర్వేషాం కించి దాదాయ పాత్రేషు వ్యకిర న్ముదా. ౬౪-౬౫

త్వయా సమ్యక్కృతం చేతి స్తుత్వా తం మరుదాత్మజం
విభీషణముఖా స్సర్వే బుభుజు శ్చాదరేణ తత్. ౬౬

పుష్పకస్య దదా వాజ్ఞాం రాఘవో ధర్మవత్సలః
కుబేరం ప్రతి గచ్ఛ త్వ మిత్యుక్తం త ద్గతంద్రుతమ్
నిరీక్ష్య త త్కుబేరోపి ప్రాహ త ద్రామభక్తితః
యావ ద్రామో వసే న్మహ్యాం తావ త్త్వం చ తదంతికే

౬౧ సుగ్రీవ మిత్రుడును, కరుణాపాత్రుడును, పరమ పవిత్రుడును, సీతాకళత్రుడును, నీల మేఘగాత్రుడును, పద్మ నేత్రుడును, రాక్షస కులమునకు కాలుడును, సువర్ణమందారమాలుడును, వాక్యాన రసాల భూతుడును, గుణములచే విశాలుడు నగు శ్రీరామచంద్రమూర్తిని స్తుతించుచుంటిమి.

౬౨-౬౩ సౌందర్యమున గాని గుణములలోగాని శ్రీరామచంద్రమూర్తితో సమానుడగు మరియొకడు ముల్లోకములలో వెదుకబడినను లేడు. ఇట్లు మహర్షులు రామచంద్రమూర్తిని స్తుతించి యాయన యనుజ్ఞ నొంది రామచంద్రమూర్తి యొక్క గుణములను గూర్చియే చెప్పుకొనుచుం దమతమ తావులకేగిరి.

౬౪-౬౫ పిదప రామచంద్రమూర్తి సుగ్రీవాదివానరులందఱను భోజనమునకై యాహ్వానింపగా, వారలందఱును, శ్రీరామచంద్రమూర్తి యొక్క సహపఙ్క్తిని గూర్చుండి భోజనములు చేయుచుండిరి. రామచంద్రమూర్తి సగమన్నము భుజించిన పిదప హనుమంతుడు శ్రీరాముని భోజనపాత్రను లాగికొని రాముని యుచ్ఛిష్టాన్నమును దాను భుజించుటయే కాక శేషించిన యన్నమును సుగ్రీవవిభీషణాదుల పాత్రలలో జల్లెను.

౬౬ అప్పుడు విభీషణుడు మొదలగు వారలందఱును, హనుమంతా! నీవు మంచిపని చేసితివని యతనిని గొనియాడి శ్రీరాముని యుచ్ఛిష్టాన్నము నందఱును భక్తితో భుజించిరి.

౬౭-౬౮-౬౯ పిదప శ్రీరామచంద్రమూర్తి పుష్పకవిమానమునకు కుబేరుని దగ్గరకు బోవలసినదని యాజ్ఞ నిచ్చెను. వెంటనే పుష్పకము కుబేరునివద్ద కేగి శ్రీరామచంద్రమూర్తిపంపినట్లు చెప్పగా కుబేరుడు పుష్పకవిమానముతో నిటుల జెప్పెను. పుష్పకమా! రామచంద్రమూర్తి యెంతవరకు భూమియందు నివసించియుండునో, అంతదనుక నీవచట నుండి పిమ్మట నిచటకు రమ్మని చెప్పగా. వెంటనే విమానము రాముని సన్నిధికేగి కుబేరునిమాటలను జెప్పి యచటనే

స్థిత్వా తతః పరం శీఘ్రం మదంతిక ముపైహి చ
ఇత్యుక్తం పున రాగత్య తదంతికత లేఽవసత్. ౬౭-౬౮-౬౯

యౌవరాజ్యే తు భరత మభిషిక్తం తదాఽకరోత్
సౌమిత్రి శ్చ స్థితో రామసేవాతత్పరమానసః
శ్రీరామః పరమాత్మాపి లోకానా ముపదేశకృత్
ఆచర న్వివిధా న్ధర్మా న్గార్హస్థ్యసుఖభు క్తతః
ఏకాదశసహస్రాణి ధర్మేణాబ్దాని తు క్షితిం,
న్యాయేన పాలయామాస నాపి వ్యాధికృతం భయం
న వ్యాళజభయం వాపి రామరాజ్యే త్వభూ ద్ధ్రువం
నచాపి విధవా దృష్టా పుత్రశోకః పితు ర్నచ. ౭౦-౭౧-౭౨-౭౩

ఆత్మజా నివ రామోపి రరక్షాఽఖిలమానవాన్
ప్రజా శ్చ రాఘవం త్వాత్మపితరం దదృశు స్తదా
బంధుభి స్సీతయా సాక మయోధ్యాయాం రఘూత్తమః
సుఖ మాసీ త్తదా సర్వే రాఘవస్య కథా మిథః
కథయంతోఽవస న్సర్వం జగ ద్రామమయం హ్యభూత్.
౭౪-౭౫

రామరాజ్యే తు పర్జన్యో కాలే కాలే వవర్ష సః
స్వధర్మనిరతా స్సర్వే నిత్యపుష్పా మహీరుహాః
తథా నిత్యఫలా స్సంస్థా స్సుఖస్పర్శ స్సమీరణః. ౭౬-౭౭

ఇదం రామాయణం కృత్స్నం యః పఠే చ్ఛృణుయా చ్చ యః
సర్వపాపవినిర్ముక్తో దుర్లభాం ముక్తి మేష్యతి. ౭౮

యుండెను. (ఈ విమానము బ్రహ్మదేవుడు మొదట కుబేరున కివ్వగా, రావణుడు కుబేరుని జయించి విమానమును హరించెనని తెలియదగును)

౨౦-౨౧-౨౨-౨౩ రామచంద్రమూర్తి యౌవరాజ్యమున భరతుని నభిషిక్తునిగాఁ జేసెను లక్ష్మణుడు సమీపాతిశ్వాసుడై యుండెను. శ్రీరామచంద్రమూర్తి పరమాత్ముడయినను నిర్వికారుడైనను మాయామానుషవేషము ధరించినందున లోకములకుఁ దన ప్రవర్తనచే నుపదేశము చేయుచు, సమస్త ధర్మముల నాచరించుచు గృహస్థ సౌఖ్యముల ననుభవించుచు పదకొండువేల సంవత్సరములు రాజ్యపాలనము చేసెను. రామరాజ్యకాలమున వ్యాధిభయము కాని, ఘాతుక మృగముల భయము కాని లేదు. మఱియు స్త్రీలలో వైధవ్యమును బొందినవారు కాని పుత్త్రదుఃఖముగల తండ్రి కాని లేరు.

౨౪-౨౫ రామచంద్రమూర్తియును ప్రజలనందఱను తన పుత్త్రులను వలెగా పాడుచుండెను. ప్రజలుకూడ శ్రీరామచంద్రమూర్తిని తమ తండ్రినిగాఁ జూచుకొనుచుండిరి. రామచంద్రమూర్తి సీతతోడను బంధువులతోడను సుఖముగా నుండెను. ప్రజలందఱును రామచంద్రమూర్తియొక్క కథలను జెప్పుకొనుచుండిరి. ఇంతయేల జగమంతా రామమయముగా నుండెను.

౨౬-౨౭ శ్రీరామచంద్రమూర్తి రాజ్యపాలనము చేయు కాలమున నెలకు మూడు వానలు కురియుచుండెను. అందఱును స్వధర్మనిరతులయి యుండిరి. వృక్షములు నిత్యపుష్పములు నిత్యఫలములు గలవియై యుండెను. వాయువు సుఖస్పర్శగలదియై వీచుచుండెను.

౨౮ ఈ రామాయణము నెవరు పఠించెదరో, ఎవరు వినియెదరో, వారలు సర్వపాప విముక్తులయి దుర్లభమయిన ముక్తినిగూడ పొందగలరు.

పుత్రార్థీ లభతే నూనం సుపుత్త్రం మనుజ స్తు సః
ధనార్థీ పుష్కలధనం ప్రాప్నుతే నాఽత్ర సంశయః
రాఘవస్యాఽభిషేకం తు శృణోతి మనుజ స్తు యః 28-30

పఠతాం శ్రుణ్వతాం చాఽపి రామాయణ మిదం పునః
సతతం రాఘవ స్తుష్ట స్సర్వాభీష్టాని దాస్యతి
కించ దాస్యతి దీర్ఘాయు ర్ముక్తిం చాప్యన్య దుర్లభామ్
శ్రవణా త్పఠనా త్సర్వే దేవా శ్చ పితర స్తథా
తుష్యంతి సతతం తస్య దాస్యంతి చ సుఖం భువి. 31-32

స్వ స్త్యస్తు క్షితిమండలే జనిమతాం న్యాయేన భూపాలకో
భూమిం పాలయతా చ్ఛుభంతు భవతా ద్గోబ్రాహ్మణేభ్య
స్సదా, లోకా శ్చాపి భవంతు సౌఖ్యసహితాః కాలేఽం
బుదో వర్షతా, ద్భూమి స్సస్యవతీ తథాఽస్తు భవతా
ద్దేశోప్యయం నిర్భయః 33

అహం బాలచాపల్యతో రామచంద్ర! త్వదీయే కథాబ్ధా
వనంతే ప్రవిష్టః, ధ్రువం మందబుద్ధి స్త్వహం త్వత్క
టాక్షా, త్పరం పార మద్యా గమం తే నమోఽస్తు. 34

స్తోతుం త్వాం నహి రాఘవాఽహ మభవం శేష స్సహస్రాననో
గాతుం వా చరితం ప్రభో తవ నచాఽభూవం సురర్షి స్త్వహమ్
నిర్దుష్టం చరితం విధాతు మపివా తేఽహం న వల్మీకజో
దోషస్స్యాద్యది మత్కృతౌ రఘుపతే క్షంతవ్యఏవ త్వయా. 35

ఆశ్చర్య రామాయణే యుద్ధకాండే
త్రయోవింశ స్సర్గ స్సమాప్తః.

౭౯-౮౦ పుత్రార్థియయి రామచంద్రపట్టాభిషేకమును వినినచో సుపుత్రుని బొందుదురు. ధనార్థియై వినినచో పుష్కలమయిన యైశ్వర్యమును బొందగలరు. ఇందునకు సందియము లేదు.

౮౧-౮౨ ఈ రామాయణమును పఠించినవారలయందునను, వినినవారలయందునను రామచంద్రమూర్తి ప్రసన్నుడై వారలకు సమస్తమయిన యభీష్టముల నివ్వగలడు. దీర్ఘాయువును, అంత్యకాలమున దుర్లభమయిన ముక్తినిగూడ నివ్వగలడు. ఇదియునుంగాక ఈ రామాయణమును పఠించుటవలనను శ్రవణముచేయుటవలనను పితృదేవతలు కూడ సంతోషించి సుఖమును గలుగజేయుదురు.

౮౩ భూమియందలి ప్రజలకు శుభముగలుగుగాక, రాజులు న్యాయముగా భూమిని బరిపాలించెదరుగాక. గోబ్రాహ్మణులకు శుభము కలుగుగాక, లోకములన్నియు సుఖవంతములయి యుండుగాక, నెలకు మూడు వానలు గురియుగాక, భూమి సస్యసమృద్ధిగలదియగుగాక; దేశము క్షోభరహితమయి యుండుగాక!

౮౪ రామచంద్రా! మందబుద్ధిగల నేను బాలచాపల్యముచే నపారమైన నీ కథాసముద్రమునఁ బ్రవేశించి దరిగానకయుండ నెట్లో నిప్పటికి నీ కటాక్షవీక్షణముచే నొడ్డునకు జేరగలిగితిని. ఇట్లు దరిజేర్చిన నీకు నమస్కారము తప్ప వేరొండు చేయజాలను.

౮౫ రామచంద్రా! నిన్ను స్తుతించుటకు నేను సహస్రముఖములుగల శేషుడనుగాను, నీ గుణములను గానముచేయుటకును నేను నారదుడను గాను, ప్రభూ! నీ చరిత్రను నిర్దుష్టముగా వ్రాయుటకైనను నేను వాల్మీకిని గాను, అందువలన నీయందలి భక్తిచే నేను వ్రాసినచరిత్రమునందు దోషము లుండినను వానిని నీవు మన్నింపవలయును.

ఆశ్చర్యరామాయణమున యుద్ధకాండమున
ఇరువది మూడవసర్గ సమాప్తము.

ఇతి శ్రీ రామచంద్రచరణకమల సేవాసమాసాదిత కవితా
విలాసేన రామాయణ కేసరీత్యాదిబిరుదాంకితేన విశ్వా
మిత్ర గోత్రజేన లక్ష్మావఝుల వంశముక్తాఫలేన సుబ్బ
మాంబాజానే సుబ్రహ్మణ్యసిద్ధాంతిన స్తనయేన
వేంకటకృష్ణశాస్త్రిణా విరచితే ఆశ్చర్యరామాయణే
యుద్ధకాండ స్సమాప్తః
శ్రీ భద్రాచల రామార్పణమస్తు.

---

మంగళం

మంగళం కోసలేంద్రాయ మహనీయగుణాత్మనే
చక్రవర్తితనూజాయ సార్వభౌమాయ మంగళమ్.
శ్రీరామచంద్ర శ్శ్రితపారిజాత స్సమస్త కల్యాణ గుణాభిరామః
సీతాముఖాంభోరుహచంచరీకో నిరంతరం మంగళమాతనోతు.

ఫలశ్రుతిః

వధం రాక్షసరాజస్య రావణస్య మహాత్మనః
శ్రుత్వా నరః పాపబంధా న్ముచ్యతే జన్మకోటిజాత్
భరద్వాజాశ్రమం ప్రాప్య వవందే నియతో మునిం
ఇత్యాదిశ్రుణ్వతాం సర్గాణాం యావ త్పట్టాభిషేచనం
సర్వకార్యాణి సిధ్యంతి పాపరాశి శ్చ నశ్యతి
సాంగం రామాయణఫలం విందత్యేవ నసంశయః
పట్టాభిషేచనం శ్రుత్వా రాఘవస్య మహాత్మనః
రాఘవస్య ప్రసాదేన మోక్షరాజ్యేఽభిషిచ్యతే॥ ఇతి.

## గద్య

ఇట్లు శ్రీరామచంద్ర చరణకమల సేవాసమాసాదిత కవితా విలాసుడును,
రామాయణకేసరీత్యాది బిరుదాంకితుడును, లక్కాపర్ఘుల వంశ
ముక్తాఫలభూతుడును, సుబ్బమాంబా సుబ్రహ్మణ్య
సిద్ధాంతి తనూజుడునగు వేంకటకృష్ణశాస్త్రిచే
రచింపబడిన ఆశ్చర్యరామాయణమున
యుద్ధకాండము సమాప్తము.
ఇది శ్రీ భద్రాచల రామార్పణ మగుగాక!

---

## మంగళము

కోసలదేశ ప్రభువును, మహనీయగుణ గరిష్ఠుడును, దశరథచక్రవర్తి తనూజుడును, సార్వభౌముడును నగు శ్రీరామచంద్ర ప్రభువునకు మంగళ మగుగాక!

ఆశ్రితపారిజాతుడును సమస్త కళ్యాణగుణాబ్ధి రాముడును సీతాముఖకమల భృంగమును నగు శ్రీరామచంద్రమూర్తి నిరంతరము మంగళము కలుగజేయుగాక.

## ఫలశ్రుతి

రావణవధను వినినవారలు కోటి జన్మార్జితములయిన పాపములనుండి విముక్తులగుదురు. శ్రీరామచంద్రమూర్తి భరద్వాజాశ్రమమునకు వచ్చినది మొదలు పట్టాభిషేకాంతమగు నీకథను వినినవారలకు సర్వ కార్యములు సిద్ధించును. పాపములన్నియు నశించును. సాంగముగా రామాయణమును వినిన ఫలము పొందుదురు. పట్టాభిషేకమును వినినవారలు శ్రీరామచంద్రుని ప్రసాదమున మోక్షరాజ్యమున నభిషిక్తులగుదురు- అని.



# తప్పొప్పుల పట్టిక



| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 3 | 7 | సముత్పతాత | సముత్పపాత |
| 4 | 1 | నందన్ | నందనో |
| | 2 | మన్క | మశ్లోక |
| | 4 | స్త్వోతు | స్తోతుం |
| 5 | 1ం | గాంమచంద | రామచంద్ర |
| | 14 | నుండగా | చుండగా |
| 15 | | చంద | చంద్ర |
| 7 | 18 | దధమురు | దధముడు |
| 8 | 15 | రిపుజయు | రిపుజయం |
| 9 | 14 | దుఃఖింపః | దుఃఖింప |
| 11 | 5 | దుఃఖ | దుఃఖ |
| 12 | 14 | స్త్రీయస్త్రీ | స్త్రీయస్త్రే |
| 15 | 14 | పెద్ధపెద్ధ | పెద్దపెద్ద |
| 19 | 24 | టుల : | టుల : |
| 24 | 2 | వనానా | వనాన్య |
| 25 | 25 | మహాత్మ్యము | మాహాత్మ్యము |
| 26 | 18 | ఘ్రాంతా | ఘ్ఛ్రాంతా |
| 28 | 9 | పృథ్పృథ | పృథక్పృథ |
| 29 | 14 | ముక్కిలి | మిక్కిలి |
| 32 | 8 | యధాః | యథా |
| 34 | 15 | డౌత్య | దౌత్య |
| 35 | 10 | రాపణు | రావణు |
| 45 | 13 | యూడుట | యుండుట |
| 51 | 9 | ౨-౮౨౯ | ౨౮-౨౯ |
| 59 | 17 | తెచ్చివి | తెచ్చితివి |

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 64 | 12 | అగ్రపృష్టా | అగ్రపృష్ణా |
| 66 | 9 | భా్త్ర | భ్రాత |
| 77 | 16 | సంగీకరిప | సంగీకరింప |
| 79 | 18 | గామపంద్ర | రామచంద్ర |
| 93 | 2 | మోక్షము | మోహాము |
| 96 | 7 | మితిప్రోక్త్వా | మితీత్యుక్త్వా |
| 99 | 6 | భగవతుని | భగవంతుని |
| | 15 | యదుగముని | యదుగని |
| | 21 | సన్యమన | ర సన్యమన |
| 100 | 11 | ఠFఠ | ఠF4 |
| 103 | 13 | సుగీవుడు | సు గీవుడు |
| | 23 | భాత | భ్రాత |
| 104 | 4 | పక | పం |
| 105 | 17 | బంపఙడి | బంపబడి |
| | 24 | నిశ్రతు | నీశ్రతు |
| 115 | 1 | వ్రమును | వ్రతమును |
| 116 | 20 | సంభతి | సంభవతి |
| 129 | 16 | భూశాణా | భూషణా |
| 130 | 6 | యామ | సుయా |
| 133 | 18 | విదప | పిదప |
| 139 | 19 | యనుగహా | యనుగ్రహా |
| 142 | 4 | స్తసంభా | స్తసంభా |
| 145 | 28 | సమయమును | సమయమున |
| 146 | 18 | ప్రజల | ప్రజ్వల |
| 152 | 8 | న్యబధ్యతి | త్వబధ్యతి |
| 155 | 21 | విభీషణునని | విభీషణున |
| 157 | 13 | సముదపు | సముద్రపు |
| 159 | 4 | చోట | చోట్ల |

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 160 | 11 | గంద | గంధ |
| 162 | 18 | తాళ్చర్యం | దాళ్చర్యం |
| 179 | 8 | నడచినన్ | నడచినవో |
| 184 | 17 | దృష్టచే | దృష్టంచే |
| 185 | 4 | సైన్యము | సైన్యము |
| | 28 | సారణులు | సారణులు |
| 189 | 8 | నశిప | నశింప |
| | 8 | చంద | చంద్ర |
| | 12 | మాత | మాత్రము |
| | 18 | యంతయం | యంత్రయం |
| 190 | 18 | దశానస | దశానన |
| 192 | 2 | తమం | తనుం |
| | 3 | రాబాల్యే | బాల్యే |
| | 18 | వృదం | వృద్ధం |
| 197 | 5 | సోదద | సోదరుడ |
| | 21 | యతి | యత్ర |
| | 23 | చేసిందున | చేసినందున |
| 201 | 7 | ధేరి | దేరి |
| 202 | 4 | తిష్ఠంతు | తిష్ఠంతు |
| 204 | 10 | ప్రపహాస్తం | ప్రహస్తం |
| 205 | 3 | సమయన | సమయాన |
| 206 | ' | ర్ధత్వా | ర్గత్వా |
| 209 | 20 | సాఖ్యాను | సాక్యాను |
| 213 | 18 | అద | అపద |
| | 25 | రేచుచు | రేగుచు |
| 215 | 12 | మెదల | మొదల |
| 221 | 11 | చంద | చంద్ర |
| 224 | 18 | 2.ంగద | 2.ంగదం |

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 225 | 1 | సముద | సముద్ర |
| 226 | 8 | మూల్య | మాల్య |
| 228 | 14 | దళగ్రీవం | దశగ్రీవః |
| 238 | 22 | మంతుల | మంత్రుల |
| 287 | 9 | బయోజన | ప్రయోజన |
| 288 | 7 | మహిజా | మహీజా |
| 289 | 8 | కాలముమ | కాలమ |
| | 17 | చంద | చంద్ర |
| 241 | 13 | వినవని | వినని |
| 244 | 10 | దుద్ధాం | రుద్ధాం |
| | 18 | ఉసునా | ఉసురా |
| 245 | 4 | మాతము | మాత్రము |
| 255 | 6 | వంకరి | వంకర |
| 260 | 14 | సంప్రాస్తౌ | సంప్రాప్తౌ |
| 261 | 19 | చంద | చంద్ర |
| | 20 | సగతి | సంగతి |
| | 21 | నాశయించిన | నాశ్రయించిన |
| 263 | 3 | పుతమిత | పుత్రమిత్ర |
| 264 | 7 | సంస్థతా | సంస్థితా |
| | 8 | సుమా | మమా |
| 265 | 25 | నిపెట్టి | గనిపెట్టి |
| 269 | 11 | క్షుద | క్షుద్ర |
| | 15 | విలువ | నిలువ |
| | 23 | సైన్య | సైన్య |
| 270 | 6 | గృహోత్వాఽఽఘ | గృహోత్వాఽఽశు |
| 274 | 17 | చర్యయైన | చర్యయైవ |
| | 18 | పోదశ | పోడశ |
| 286 | 9 | సంజ్ఞాంతుం | సంజ్ఞాంతు |

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 290 | 12 | కారర్య | కార్యం |
| 295 | 5 | యాశమ | యాశ్రమ |
| 301 | 16 | బయులుదేరి | బయలుదేర |
| 304 | 9 | పాతాళాధిబ | పాతాళాధిప |
| 306 | 15 | మనురా | మసురా |
| 315 | 24 | బయదేరి | బయలుదేరి |
| 327 | 17 | వెళ్పి | వెళ్ళి |
| 328 | 7 | భవారద్ధ్మ | భవాద్ధర్మ |
| 330 | 6 | స్ణానే | స్థానే |
| 337 | 10 | గతానవో | గతాసవో |
| 333 | 21 | పపిదప | పిదప |
| 338 | 9 | పున | పునః |
| | 11 | చిన్న | ఛిన్న |
| 344 | 18 | తుష్ణో | తుష్టో |
| 357 | 18 | చెప్పి | చెప్ప |
| 380 | 8 | ఘాన | ఆఘాన |
| 389 | 20 | విక్తులము మయితిమి | వియుక్తులమయితిః |
| 392 | 4 | మచ్యా | మద్యా |
| 409 | 18 | తావుద్ధ | తావుల |
| | 19 | యుక్త | యుద్ధ |
| 423 | 18 | మూరి | మూర్తి |
| 425 | 2 | లక్ష్మణులను | లక్ష్మణులకు |
| | 18 | వంటను | నందటను |
| 426 | 2 | వీక్షితం | వీక్షితుం |
| | 8 | సంశ్లాఘ్యావా | సంశ్లాఘ్యాహి |
| 432 | 10 | స్వశ్లాఘ్యవ | స్వంశ్లాఘ్యవ |
| 433 | 17 | జయలు | బయలు |